# చతుర

అక్టోబర్ 2001
రూ.7/-




అక్కినపల్లి సుబ్బారావు

# అంచుకీ అంచుకీ మధ్య

# చతురప్రపంచం

## ఉత్తమ ఏడుపుమొహం

'కాదేదీ కవితకనర్హం' అన్న మాట ఎంత ప్రాచుర్యం పొందిందంటే బహుశా అప్పటి నుంచేనేమో మనదేశంలో ముఖ్యంగా తెలుగులో కవిత్వాలు, కథలు, నవలలు పుంఖానుపుంఖాలుగా వెలువడటం మొదలుపెట్టాయి. శ్రీశ్రీగారు చెప్పిన కాదేదీ కవితకనర్హం అనే మాటని కథకి, నవలకి కూడా అన్వయించుకున్నారులేండి. సరే ఇప్పుడు మనం వాటిజోలికి వెళ్లద్దులెండి.

ఇక్కడ ముఖ్య విషయమేమిటంటే కర్ణాటకలోని గజేంద్ర ఘడలో ఓ యువకమండలి ఉంది. దాని పేరు స్పందన. వారేం చేశారంటే 'కాదేదీ పోటీలకనర్హం' అని తీర్మానించి బెస్ట్ ఏడుపు మొహానికి బహుమతి ఇవ్వాలని సంకల్పించారు. అంటే ఏడుపులో పోటీలన్నమాట.

హోలీ పండుగనాడు ఫలానచోట ఏడుపు పోటీలు నిర్వహిస్తున్నామని ప్రకటించడం ఆలస్యం, పోటీ వివరాలు తెలుసుకునేందుకు స్పందన ముందు జనం బారులు తీరారుట.

ఆ ఏడవడమేమైనా పెద్ద కష్టమా! రోజూ ఇళ్లల్లో చేసే పనేగా! అదేదో పోటీలో ఏడిస్తే బహుమతైనా వస్తుందని వీరి అభిప్రాయమట.

పెరిగే ధరల్లో, ప్రస్తుత పరిస్థితుల్లో అదీ ఇదీ కాకపోతే, మనకన్నా పక్కవాడో, ఎదురింటివాడో ఎదిగిపోతున్నాడని ఊహించుకుంటే పొర్లుకుంటూ ఏడుపు రాదుటండీ అని వ్యాఖ్యానించాడట ఓ పోటీదారుడు.

సరే. అనుకున్నరోజు రానే వచ్చింది. ఏడుపు మొహాలన్నీ సమావేశమై స్వరాలు శృతిచేసుకున్నాయి. రెడీ స్టార్ట్ అనగానే ఒక్కొక్కళ్ళూ నెత్తీ, నోరూ కొట్టుకుంటూ లబలబా ఏడవడం మొదలెట్టారు. కొంద రైతే కిందపడి దొర్లుతూ, గుండెలు బాదుకుని కడివెడు కన్నీరు కార్చేశారట. మరి




పోటీపెట్టాక ఉత్తమ ఏడుపు మొహాన్ని ఎన్నుకోవాలిగా ఆ విధంగా విశ్వనాథ్ రాథోడ్‌ని బెస్ట్ శోకమూర్తిగా నిర్ణయించారు ప్రదర్శన నిర్వాహకులు.

ఇక్కడ ఇంకో విషయముంది. వీళ్ళే పనిలో పనిగా ఏడుస్తూ పాటలు పాడటం అనే మరో పోటీని కూడా నిర్వహించారు. ఆ విభాగంలో అత్యంత శోకతప్త హృద



చతుర... 3

యంతో రాగాలాపన చేసిన 'గూగి' ఫస్టన నిలిచాడు. వీళ్ళ ధోరణి చూస్తుంటే గిచ్చుకోవడం, రక్కుకోవడం జుట్టుపీక్కోవడంలో కూడా పోటీలు పెట్టేస్తారన్పిస్తోంది కదూ! ఏమో 'కాదేదీ పోటీకనర్హం'

## కుక్కగారి ఆధ్యాత్మిక చింతన

'ఏజన్మలో చేసుకున్న పాపమో ఈ జన్మలో అనుభవిస్తున్నాం' మనం తరచూ వినే వాక్యమిది. అందుకే పెద్దవాళ్లయ్యాక తమ దృష్టిని విషయకర్మల నుంచి ఆధ్యాత్మిక దిశకు మళ్ళించి కొంచెం పుణ్యం గట్టుకుందామని ప్రయత్నిస్తుంటారు. ఇలా మనుష్యులనుకోవడంలో ఎలాంటి విడ్డూరం లేదుగాని ఓ కుక్క అనుకునేసరికి అది విచిత్రమై కూర్చుంది.

సరే ఇంతకీ విషయమేంటంటే అనగనగా




ఓ కుక్క. ఓ కుక్క అంటే ఎలా? పేరుండాలిగా! అయితే ఇదిగో దాని పేరు ప్రీతి.

ప్రీతి ప్రతి ఆదివారం ఉదయం అయిదు గంటలకి నిద్రలేచి దాదాపు 26 కిలోమీటర్ల దూరంలో ఉన్న చర్చికి వెళ్ళి అక్కడ జరిగే ప్రార్థనల్లో పాల్గొంటుంది.

పోర్చుగీసులో సోబ్రడో నగరానికి చెందిన ప్రీతి గత మూడు సంవత్సరాలుగా ప్రతి ఆదివారం ఇలా చర్చికి హాజరవుతోంది. ఆదివారం సంగతి ఎలా తెలుస్తుందో గాని ఖచ్చితంగా ఉదయం అయిదింటికల్లా నిద్రలేచేసి ఇక నడక మొదలెడుతుంది. ఎర్నిసిండిలో ఉన్న చర్చి చేరేసరికి ఏడున్నర ప్రార్థన సమయం అవుతుంది. ఆ ప్రార్థనకు హాజరయ్యే ప్రీతి మిగతావారేం చేస్తే తానుకూడా అదే చేస్తుంది. అంటే వాళ్ళు కూర్చుంటే కూర్చుంటుంది, నిలబడితే నిలబడుతుంది.

ప్రార్థన ముగిసినవెంటనే నడుచుకుంటూ ఇంటికెళ్ళిపోతుంది. ప్రీతి వెంట ఎవ్వరూ ఉండరు. ఒక్కత్తే వచ్చి ఒక్కత్తే వెళ్ళిపోతుంది. ఎప్పుడైనా ఆమె ఇంటివైపు వెళ్లేవారెవరైనా లిఫ్ట్ ఇస్తానంటే మాత్రం చక్కగా, బుద్ధిగా కారు ఎక్కి కూర్చుంటుంది. అన్నట్టు ఇక్కడ మరో విషయం ఉంది. రమ్మన్నారు కదా అని అందరి కార్లో ఎక్కదు. తనకు బాగా తెలిసిన వాళ్ళయితేనే కారు ఎక్కుతుంది లేదా నడక ఆరోగ్యానికి ఎంతో మంచిదనుకుంటూ నడుచుకుంటూ వెళ్ళిపోతుంది. కొత్తగా చర్చికి వచ్చేవారు ప్రీతిని చూసి ఆశ్చర్యపోతున్నా అస్సలు పట్టించుకోదు. ఇంతకీ ప్రీతి జీసస్‌ని ఏమని ప్రార్థిస్తోందో?




# ఇక బెకబెకలు వినిపించవేమో!?

ప్రపంచవ్యాప్తంగా రోజురోజుకూ కప్పల సంఖ్య తగ్గిపోతుండటం పర్యావరణ పరిరక్షకులకు ఆందోళన కల్గిస్తోంది. ఇందుకు ప్రధాన కారణం వాతావరణ కాలుష్యం. ఆమ్లవర్షాలు కురవడం, కొలనులు, చెరువుల సంఖ్య తగ్గిపోతుండడం వంటివి కూడా కారణాలుగా చెప్పచ్చు. అయితే కప్పల చర్మానికి ఇన్‌ఫెక్షన్ కల్గిస్తున్న ఓ పరాన్నజీవిని పనామాలోని శాస్త్రవేత్తల బృందం కనుగొన్నారు. మరణించిన కప్పలన్నీ ఈ పరాన్నజీవి పాలిట పడినవేనని వీరు ధృవీకరించారు.

అయితే ఇది పనామాలో ఆగలేదు. అదే పరాన్నజీవి ఆస్ట్రేలియాలో కూడా దర్శనమిచ్చి శాస్త్రవేత్తలను నిర్ఘాంతపరిచింది. 'నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హెల్త్'కు చెందిన డి. ఎర్లీగ్రీన్, సదరన్ ఇల్లినాయిస్ యూనివర్సిటీకి చెందిన కరేన్‌లిప్స్‌తో మరికొందరు ఆస్ట్రేలియా శాస్త్రవేత్తలు కప్పలను చంపేస్తున్న పారసైట్‌ని అక్వాటిక్ చైట్రిడ్ ఫంగస్ జాతికి చెందినది అని గుర్తించారు. దీనికింకా పేరుపెట్టాల్సి ఉండగా వేరే పేరు కూడా ఎందుకు 'ఫ్రాగ్ కిల్లర్ ఫంగై' అని పెట్టేస్తే సరి అని శాస్త్రవేత్తల చమత్కారం.

ఈ ఫంగస్ నీటిలోను, మట్టిలోను జీవిస్తూ అప్పుడప్పుడు మొక్కలపైన దాడి జరుపుతుందే తప్ప వెన్నెముకగల జంతువుల జోలికి వెళ్ళదు. కానీ పర్యావరణంలో వస్తున్న మార్పులవల్లనే ఈ విపరీత పరిణామాలన్నీ చోటుచేసుకుంటున్నాయి. ఆస్ట్రేలియా, మధ్యఅమెరికా ఇంకా మరికొన్ని ప్రదేశాలకు సంబంధించి దాదాపు ముప్పై కప్పజాతులు ఈ ఫంగస్‌కి ఎఫెక్ట్ అయినట్టు పరిశోధనలో రూఢీ అయ్యింది.

కప్పలు చర్మంద్వారా శ్వాసిస్తాయి. ఈ ఫంగస్ కప్పల చర్మంమీద దాడిచేసి వాటికి ఊపిరాడకుండా చేయడంద్వారా కప్పల మరణానికి కారణమవుతోందని శాస్త్రవేత్తలు అంటున్నారు. ఫంగస్ దాడి మూలంగా కప్పల శరీరంలో నీటిశాతం తగ్గిపోయి క్రమంగా డీహైడ్రేట్ కూడా అయిపోతూండవచ్చుని వీరి అభిప్రాయం. ఫంగస్ కలిగించే సఫకేషన్ డీహైడ్రేషన్ మూలంగా కప్పలజాతి నానాటికీ అంతరించిపోతోందని, ఇప్పటికైనా నివారణ చర్యలు చేపట్టకపోతే కప్పల బెకబెకలిక విన్పించకపోవచ్చని శాస్త్రవేత్తలు ఆందోళన చెందుతున్నారు.

★



# 'రాలనిపువ్వు' పై సమీక్షలు

ఆగస్ట్ 'చతుర' లో ప్రచురితమైన ఎన్. ప్రభాకరరెడ్డి రచన 'రాలనిపువ్వు' పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## బలమైన ఊతం

(మొదటి బహుమతి రూ.100/- పొందిన సమీక్ష)

మంచి నవలలు రాక తెలుగు సాహితీ వనంలో కరువు నెలకొన్న తరుణంలో ఆగస్టు మాసంలో శ్రావణమేఘాలు వర్షించినప్పటి తొలకరి జల్లులా వచ్చింది రాలనిపువ్వు నవల. రచయిత ప్రభాకరరెడ్డిగారు ఆద్యంతం మంచి శైలితో ఆసక్తికర కథనంతో రాశారు. అన్నిటికీ మించి చెడు వ్యక్తులున్న చోట జరిగే సంఘటనల్ని మొక్కవోని ఆత్మవిశ్వాసంతో గంగావతి అనే శ్రామికురాలు, మురళి అనే జర్నలిస్టు ఎలా ఎదుర్కొన్నారో చక్కగా చిత్రించారు. తద్వారా ఒక ఆదర్శ సమాజాన్ని ఎంత బాగా రూపొందించవచ్చో తెలియజెప్పిన ఉత్తమ నవల రాలనిపువ్వు!

కూలిపని చేసుకునే గంగావతి తన మానాన్ని కాపాడుకోవాలనుకుని, కామాంధుల ఒత్తిడికి తట్టుకుని చివరిదాకా నిలిచి విజయం సాధించడం ప్రశంసనీయంగా ఉంది. ప్రస్తుత సమాజంలో అన్యాయాలకి,





అఘాయిత్యాలకి బలయిపోతున్న మహిళలకి ఈ పాత్ర ఒక బలమైన ఊతంగా ఉదాహరణగా నిలుస్తుంది.

గంగావతికి వెన్నుదన్నుగా నిలిచిన జర్నలిస్టు మురళి కూడా ప్రలోభాలకి లొంగిపోక తాను మనసా వాచా విశ్వసించిన ఆదర్శాల్ని కడ వరకూ ఎంత చక్కగా నిలబెట్టుకున్నదీ అర్థం అవుతుంది. ముఖ్యంగా తాను ప్రలోభాలకి, ప్రమాదాలకి గురయ్యే అవకాశం ఉన్న సంఘటనల్లో వివేచనతో ఆలోచించి సమాజశ్రేయస్సే జర్నలిస్టుకుండాల్సిన అంతిమ లక్ష్యమన్న వాస్తవాన్ని ఉన్నత ప్రవర్తన ద్వారా మరోమారు చాటి చెప్పాడు.

ఇదేరీతిని పమాజంలోని ప్రతి వ్యక్తీ ముఖ్యంగా ఉన్నత పదవుల్లో వారూ, కీలక బాధ్యతలు నిర్వహించే పత్రికలు, మీడియా, పోలీసుశాఖ, న్యాయవ్యవస్థ తదితరులు కూడా అలవరుచుకుంటే, ఒక్క క్షణం ఆలోచిస్తే ప్రస్తుతం భ్రష్టు పట్టిపోతున్న మన సమాజం తిరిగి బాగుపడే అవకాశం ఉంది.

బలహీనమైన ఈ వ్యవస్థలో ఐ.ఎ.ఎస్. చదివిన ఉన్నతాధికారి (ఇ.వో) ఎంత ఛండాలంగా ఆషాఢభూతిలా నటించగలడో ఒక సంఘటనలో తెలిపినా ఇదే వ్యవస్థ వేళ్లు బలంగా ఉన్నప్పుడు నాగరాజులాంటి కామాంధులు సైతం బాధ్యతగల పౌరుల్లా ఎలా నడుచుకోవచ్చో క్లైమాక్స్‌లో మనకి బాగా తెలియచెప్పారు. ఈ నవల్లోని మరో వైచిత్రి సమాజంలోని ప్రతివ్యక్తీ అంతర్ముఖంగా మంచి వాడేనని రౌడీపాత్ర రాంపాదరెడ్డిద్వారా చెప్పటం! మురళిని చంపే ముందు అతనంటే తనకి తల్లీతండ్రీకన్నా ఎంత ఎక్కువ ఇష్టమో చెప్పినా స్వార్థానికి, కరుడుగట్టిన హింసకి లోనయిపోయి ఎంత నీచంగా ప్రవర్తించేదీ, నేరస్థులుగా మిగిలిపోతున్నదీ కళ్లముందుంచారు. కుతంత్రాలకి జర్నలిస్టు మురళి బలయిపోయినా బలమైన అతని వ్యక్తిత్వం, ఉన్నత ఆదర్శం మాత్రం మరణించక అవే విత్తులుగా సమసమాజమనే వృక్షం పాదుకుని దానికే పువ్వై పూస్తుంది. అంతేకాక ఆ పువ్వు చిరకాలం సుగంధ పరిమళాల్ని వెదజల్లుతూ ఎప్పటికీ 'రాలనిపువ్వు'గా మిగిలిపోతుందని నవల చదివిన ప్రతివారికీ అనిపిస్తుంది.

**–వారణాసి రామకృష్ణ**
హైద్రాబాద్-500062

# ప్రయోగం

*(రెండవ బహుమతి రూ.75/- పొందిన సమీక్ష)*

'రాలనిపువ్వు' ఒక విభిన్న కథాంశంతో సామాజిక స్పృహనూ, ఆలోచనలనూ స్పృశిస్తూ సాగింది. వ్యవస్థ మొత్తంలో అంతర్భాగమైపోయిన అవినీతినీ, చిన్నచిన్న జీవితాలను అలముకున్న అంధకారాన్నీ, వారికి మిగులుతున్న అణచివేతనూ, నిస్సహాయతనూ, సాక్షాత్తూ దేవుడే దిగివచ్చినా సరిదిద్దలేని కలుషిత సమాజ స్వరూపాన్నీ బాగా ప్రతిబింబిస్తూ కథ చెప్పబడింది. కొన్ని కోణాలనుంచి అయినా ఇది ఒక సామాజిక ప్రయోగం అని చెప్పవచ్చును. వివక్షకూ, అణచివేతకూ గురయ్యేవారికి ఇది ఒక మంచి స్ఫూర్తి. ఎటువంటి కష్టాలనైనా ఎదుర్కొని జీవితం ముందుకు సాగించమనే ఆత్మవిశ్వాసాన్నీ, మార్గ దర్శకతనూ దీని ద్వారా పొందవచ్చును. మంచి మార్పు కోసం అందరూ ఐకమత్యంగానూ, పట్టుదలతోనూ కృషి చేయాలి. రాబోయే తరాల సంక్షేమం కోసం ఇప్పటి తరం త్యాగాలు చేయాలి. సందేశం తెలిసినదే అయినా మరోసారి పాత కాలానికీ, కొత్త మార్పులకూ ఒక సరికొత్త సమన్వయంగా రూపకల్పన జరిగింది.

**–వరదా కామేశ్వరరావు**
హైదరాబాద్-500076

# ఆదర్శవంతం

*(మూడవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

'రాలనిపువ్వు' ప్రతి సమస్యకూ పరిష్కారం తప్పక వుండి తీరుతుందనీ, ఐకమత్యం యొక్క బలం ఎంతో గొప్పదనీ, ప్రతి మహిళాభ్యుదయ మజిలీ వెనుక ఒక పురుషుడుంటాడన్న గొప్ప సత్యాన్ని తెల్పిన తీరు ప్రశంసనీయం. గంగావతి అనే పువ్వు కాంట్రాక్టర్ల వేధింపులనెడి పెనుగాలులకు వంగకుండా నిలిచిన సాహసాన్ని చిత్రించే ఈ నవలకు రాలనిపువ్వు నామధేయం తగినదే! నవలలోని మురళి పాత్రద్వారా రిపోర్టర్స్ ప్రాధమిక సూత్రం మొదలుకొని ఆ వృత్తిలోని ఒడిదుడుకులను, విలేకరులు పత్రికలో వార్తల ప్రచురణకై పడే ప్రయాసలు వంటి మాకు తెలియని మరెన్నో విషయాలు తెల్సుకోగలిగాం! గతంలో పత్రికలను ఒకే లక్ష్యంకోసం ప్రజల మంచికోరుతూ నడిపేవారు. కానీ నేడు పత్రికల్ని వ్యాపారం కోసమే నడుపుతున్నారు అన్న వాస్తవాన్ని రచయిత మురళి పాత్ర ఆలోచనల ద్వారా పాఠకులకు తెల్పిన తీరు ఆసక్తికరంగా ఉంది. మనసును, మనిషిని మార్చేశక్తి ఒక్క డబ్బుకే వుంది అని అంటారు కానీ ఇది పూర్తిగా నిజంకాదని మురళి, గంగావతి పాత్రలద్వారా తెల్సింది.

ధైర్యానికి మారు పేరైన గంగావతి భర్తతో 'కాంట్రాక్టర్లు నన్ను శరీరసుఖం కోసం వేధిస్తున్నారు' అని చెప్పినపుడు భర్త అన్న మాటలు చదవడానికి ఎబ్బెట్టుగా, సత్యదూరంగా వున్నాయి. ఎంత నిరుపేద అయినప్పటికీ భార్యతో అంత నీచంగా మాట్లాడడుగాక మాట్లాడడు.

గంగావతి, మురళిల వృత్తుల్లో తేడా ఉన్నప్పటికీ వారి విశిష్టమైన, విలక్షణమైన, పరులకోసం ప్రాణాలను సైతం ధారపోసే వ్యక్తిత్వం నేటి యువతకు ఆదర్శప్రాయం అనడంలో సందేహంలేదు.

మురళి జీవకోనలో రాత్రి ఉండి ఆ ఊరి వాళ్ల ఇళ్లు దగ్ధం కాకుండా కాపాడి, రాంపాదరెడ్డి మనిషిని హతమార్చిన విషయాలు రాంపాదరెడ్డికి ఎలా తెల్సాయన్న విషయాన్ని పాఠకులకు వివరించడంలో రచయిత విఫలమయ్యారనే చెప్పాలి.

నవల ముగింపులో మురళి తన లక్ష్యాన్ని చేరకముందే రాంపాదరెడ్డి మనుషుల చేతిలో బలికావడం బాగోలేదు. ఇలా ముగించకుండా ఉంటే నవలకు మరింత వన్నె చేకూరును అని నేను అనుకుంటున్నాను.

ఏదిఏమైనా యువతకు ఆదర్శవంతమైన వస్తువుని ఎన్నుకొని నవలగా అందించిన రచయితకు మా ధన్యవాదాలు.

—అమ్మిన వెంకటఅమ్మిరాజు

పేరూరు-507136

# కొన్ని తేడాలు

*(నాలుగవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

ప్రభాకరరెడ్డిగారి 'రాలనిపువ్వు' నవల, ఆయన రచనా శైలికూడా బాగున్నాయి. విలేకరి వృత్తిని గురించిన వివరాలను, ఆ వృత్తిలో ఎదురయ్యే వాస్తవాలను ప్రతిబింబించే విధంగా చిత్రణలున్నాయి. ప్రైవేటీకరణ గురించి కూడా వివరంగానే చెప్పారుగానీ నవలకు రాలనిపువ్వు అనే పేరు మాత్రం సరిపోయే విధంగా లేదు.

నవల మొత్తం మురళి గురించే ప్రస్తావన ఎక్కువగా ఉందిగానీ పేరునుబట్టి రాలనిపువ్వు గంగావతికి సంబంధించింది. మరి గంగావతి పాత్ర ఓ భాగం వరకు మాత్రమే ఉండి చివరలో మురళి చనిపోకపోయినట్లయితే బాగుండేది. పేరు కూడా సరిపోయేది.

మురళి సారా ప్యాకెట్ల తతంగం జరిగే

నాలుగు అంతస్థుల భవనంలోకి వెళ్లిపోవడం కాకతాళీయంగా జరిగినట్లుంది. అంత పెద్ద వ్యవహారం జరిగే చోటుకు సాధారణంగా ఇలా వెళ్లి అలా రావటం వాస్తవానికి దూరంగా వుంది. పేరు మోసిన విలేకరిని ఎవరూ గుర్తించకపోవటం ఎలా జరుగుతుంది. రాంపాదరెడ్డి పెద్ద గూండా అయినా అతను మురళిని వాస్తవంగా గౌరవిస్తున్నట్లుగా వుంది. అంత విరుద్ధంగా వార్తలు రాసి నష్టం తెచ్చిన మురళిని ఏమీ చేయకుండా వుండటం వాస్తవంగా లేదు. అందరికీ వ్యతిరేకంగా వార్తలు రాసే మురళికి చివరికి తప్ప మధ్యలో ఎలాంటి ఇబ్బందులు, తగాదాలు, కొట్లడాలు లేవు. జీవకోనలో రాంనారాయణ చేసిన హత్యను అంతతేలిగ్గా తప్పించుకునేలా మురళి చేయటం సినిమాలాగ వుంది. యశోద, గంగావతులు కలిసి బెల్లం వండే దగ్గర అక్కడి పనివారు జిల్లేడు ఆకుల్లో భోంచేస్తారని రాశారు. కాని జిల్లేడు పాలు తాగితే చనిపోతారు. అక్కడ మరో ఆకు పేరు వాడితే బాగుండేది. గంగావతికి ఎదురయ్యే ఇబ్బందులు ఒకే తీరుగా వున్నాయి. భూలోకడు గంగావతికి చివరలో సర్దుకుపోవాలని చెప్పకుండా వుంటే బాగుండేది.

–యన్.ఫణీకుమార్‌రాజు
నాగిరెడ్డిపేట్-503108

## అత్యాచార దర్పణం

*(ఐదవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

'రాలనిపువ్వు' ఈనాటి సమాజంలోని అత్యాచారాలకు ఒక దర్పణమనే చెప్పాలి. ఈ నవలలో మురళిపాత్ర చిరస్మరణీయం. అతని చిత్త శుద్ధినీ, ఏ అత్యాచారాన్నయినా ఆద్యంతం క్షుణ్ణంగా పరిశీలించి తన కలం బలంతో అచ్చుకెక్కించి బహిరంగ పరిచే ధైర్యసాహసాలు, ఏ విషయమైనా కూలంకషంగా పరిశీలించి మరీ ఒక నిర్ణయానికి వచ్చే అతని విచక్షణాజ్ఞానం ఇదంతా చక్కగా చిత్రించారు రచయిత. మురళి పాత్ర మూలంగా ఈనాటి యువకుల కర్తవ్యమేమిటన్నది సూచించారు. అటు రాజకీయ నాయకులకు అతనంటే హడల్... ఇటు కార్మిక వర్గంలో అతనికున్న పలుకుబడి... అతని పట్ల వాళ్లకున్న భయభక్తులు... మొత్తానికి రిపోర్టర్ మురళి పాత్ర బాగుంది.

సంఘంలో చాటుగా జరుగుచున్న ఎన్నో అత్యాచారాల్ని బహిర్గతం చేయడమేగాక దానికి పరిష్కారంగా పేద కూలీలకు ఒక కొత్త పథకాన్ని సృష్టించి జీవనోపాధి కల్గించాడు. సంఘంలో పెద్ద మనుషులమంటూ చెలామణి అయ్యేవారందరూ సమస్యలను వేలెత్తి చూపడమేగాని దాని పరిష్కారానికి పూనుకోరు. ఆ దృష్టితో చూస్తే మురళి నిజంగానే ఒక ప్రాక్టికల్ జెంటిల్ మాన్. జీవితంలో ఒకటి కోల్పోతే మరొకటి లభిస్తుందంటారు. అలాగే కార్మికులు మురళిని కోల్పోయినా అతని లక్ష్యం నెరవేరింది. ఆ లక్ష్యసాధనే భవిష్యత్తులో గంగావతిలాంటి పువ్వులను రాలనివ్వకుండా నిలబెడుతుంది.

రాజకీయ నాయకులు, కార్మిక నాయకులు చేసే అవినీతి పనులు ఎలాటివో రచయిత కన్నులకు కట్టినట్లు చిత్రించారు.

మొత్తానికి ఈ నవల ఈనాటి సమాజానికి, ముఖ్యంగా యువతరానికి ఒక చుక్కాని అంటే అతిశయోక్తి కాదేమో! సంఘానికి కనువిప్పు కలిగించే ఇలాంటి నవలలు ఈనాటి ప్రజానీకానికి ఎంతైనా అవసరం.

–సుముఖి రాఘవన్
చెన్నై-600020

★



# చతుర

సంపుటి 24

సంచిక : 9

అక్టోబర్ : 2001

285వ సంచిక

"నాన్నా! ఇప్పుడు మనకున్న కాలం వృథాపరిస్తే తరువాత అది కావాలన్నా తిరిగిరాదు" అని తండ్రితో అన్నప్పుడు అతని వయస్సు 13 సంవత్సరాలు. అనాథశరణాలయంనుంచి అయిదేళ్ళ వయసులో ఆ కుర్రాణ్ణి తెచ్చి పెంచి, విద్యాబుద్ధులు చెప్పించాడాయన. పెళ్లి అనే బంధంలో ఇరుక్కోకపోయినా, పుత్రబంధాన్ని పెంచుకుని అతడితో గడపడానికి అమెరికా వచ్చాడు, ఆ వృద్ధ బ్రహ్మచారి.

అందకుండా అతివేగంగా పరుగెత్తే పాశ్చాత్య జీవనప్రవాహంలో ఉక్కిరి బిక్కిరి అవబోయిన వాతావరణంలో సేదదీర్చే అనుబంధాలూ... ఎదురయ్యాయతనికి. అయినా అన్నిటినీ వదులుకుని తిరిగి తను పుట్టిన గడ్డకు పయనమయిన ఆయన ఎదుర్కొన్న అనుభూతులూ, అనుభవాలూ ఎలాంటివి?

ప్రాచ్య, పాశ్చాత్య సంస్కృతీ, సంప్రదాయాలతోపాటు సమకాలీన సామాజిక స్థితిగతులకు సాక్షర విశ్లేషణ **అక్కినపల్లి సుబ్బారావు** రచన **"అంచుకీ అంచుకీ మధ్య"** ఈ నెల 'చతుర' సమగ్ర నవల.



## అంచుకీ అంచుకీ మధ్య

-అక్కినపల్లి సుబ్బారావు

'నా'లుగు జంబో విమానాలలోంచి బైట పడిన రెండువేలమంది ప్రయాణీకుల ఇమ్మిగ్రేషన్ పత్రాలు కేవలం ఇరవై ఐదు నిమిషాలలో తనిఖీ చేసేశారే!' అని ఆశ్చర్యపడుతూ సామాన్లు రాబోయే బేగేజి కెరోసిల్ వేపు నడిచాడు రమణయ్య. కెరోసిల్ మూడుమీద ఎయిర్ ఇండియా విమానం లోంచి దిగిన సామానులు వస్తాయన్న ప్రకటన బోర్డ్‌చూసి ట్రాలీతో కన్వేయర్ బెల్ట్‌కి ఇరవై అడుగుల దూరంలో ఆగాడు రమణయ్య. ఒకే ప్రాంగణంలో దాదాపు రెండు వేల ప్రజలున్నా లోపల నెలకొన్న ఉష్ణోగ్రతలో మార్పు రాకుండా దాదాపు డెబ్బై రెండు డిగ్రీల ఫారెన్‌హీట్ దగ్గర నిశ్చలంగా ఉండడంతో హాయిగా అనిపించింది రమణయ్యకి. చటుక్కున ఆలోచన ఇరవై గంటలక్రితంకి పరిగెత్తింది. రాత్రి తొమ్మిది గంటలకి టేక్సీ దిగి న్యూఢిల్లీ ఇందిరా గాంధీ ఎయిర్‌పోర్ట్‌లోనికి ప్రవేశించినా లోపల కూడా వేడిగానే ఉంది. బైట గాలిలో తేమ, ట్రాలీకోసం అటూఇటూ పరుగులు పెట్టడంతో చమట పట్టడం మొదలైంది. కౌంటర్ దగ్గర పడికాపులు కాచిన నలభై నిమిషాలలో క్యూలో తను నాల్గవవాడ యినా, తన అవకాశం వచ్చేలోగా పక్కనుంచి ఐదుగురి సామాన్లని చెక్‌చేశాడు కౌంటర్ వ్యక్తి. వానాకాలంలో హిమాచలప్రదేశ్ కొండలమీదనుంచి కిందకి పరిగెత్తే నీటిప్రవాహంలా, శరీర ఉపరిభాగంనుంచి కిందికి చమట జారుతుంటే ఇబ్బంది అనిపించి,

"ఏమండీ, ఎయిర్ కండిషనర్స్ సరిగ్గా పనిచేయడంలేదా? " అనడిగాడు రమణయ్య ఒక యూనిఫారం ధరించిన ఎయిర్‌పోర్ట్ అధికారిని.

"ఏమో, ఎవరికి తెలుసు? అంతగా కంప్లయింట్ చేయాలని ఉంటే మేనేజర్‌ని సంప్రదించండి" అంటూ ఒక విచిత్రమైన చూపొకటి తనమీద విసిరి వెళ్ళాడు.

'ఇది ప్రతీరోజూ జరిగే తంతే. నువ్వు చవటవి కాబట్టి అలాంటి ప్రశ్న వేశావు' అన్న నిరసన, చులకన భావాలు ఆ చూపులో కనిపించాయి. ఎయిర్‌పోర్ట్‌లో రకరకాల యూనిఫారం వేసుకుని పనిలేకుండా తిరిగే వందలమందిలో ఏ ఒక్కరినైనా ఎయిర్‌పోర్ట్‌లో పనివైఖరి గురించి ఏ ప్రశ్న వేసినా, 'క్షణక్షణం' సినిమాలోలా 'నాకు తెలియదు' అన్న సమాధానం అందరూ కలిసి కూడబలుక్కున్నట్లు వాళ్ళ పెదిమలనుంచి వెలువడుతుంది. ఎయిర్‌పోర్ట్ అధికారిని చూడకుండానే తను ట్రాన్సిట్ లాంజ్‌లోనికి ప్రవేశించాడు. ట్రాన్సిట్ లాంజ్‌లో ఉష్ణోగ్రత తక్కువగా ఉండడంతో సోఫాలో చతికిలపడిన పదిహేను నిమిషాలలో చమట పట్టడం ఆగి శరీరంమీదున్న చమట ఆరడం మొదలయింది. మరో పదిహేను నిమిషాలు గడిచే సరికి బట్టలు పొడిఅయ్యాయి.

"లండన్ వెళ్ళే ఎయిర్ ఇండియా విమానంలోకి ప్రయాణీకులని ఆహ్వానిస్తున్నాం. ప్రయాణీకులని ఒక వరుసక్రమంలో పిలుస్తాం. ముందు బిజినెస్ క్లాస్ ప్రయాణీకులు, చిన్నపిల్లలతో ఉన్న ప్రయాణీకులు మాత్రమే ఇప్పుడు రండి. వాళ్ళు అయ్యాక విమానం వెనుకభాగంలో ఉన్న ఏభైనుంచి నలభైరెండు వరుసల నెంబర్లు ఉన్న ప్రయాణీకులు రండి. మిగతా ప్రయాణీకులు వాళ్ళ వరుసనెంబర్ల పిలుపు వచ్చేంతవరకు నిరీక్షించండి" అన్న ఎనౌన్స్‌మెంట్ వినవచ్చింది.

"మీ సీట్ నెంబర్ ఎంత? " అనడిగాడు సోఫాలో పక్కన కూర్చున్న సఫారీ సూట్ వ్యక్తి.

"ఇరవై ఎనిమిది 'ఎఫ్', మీది? " అని తిరిగి ప్రశ్నించాడు తను.

"ముప్పయి మూడు డి" అన్నాడు అతను ధరించిన రోలెక్స్ వాచీవేపు అసహనంగా చూస్తూ.

ఒకనిమిషం గడిచేలోగా సఫారీ సూటు వ్యక్తి వాచీవేపు మూడుసార్లు చూస్తే తను ఆశ్చర్యపడుతున్నాడు.

"ముందరగా వెళ్ళకపోతే సామాను పెట్టుకోవడానికి జాగా ఉండదు" అంటూ బరువుగా అనిపిస్తున్న చిన్న సూట్‌కేస్‌ని లాగుకుంటూ బోర్డింగ్ గేటువేపు వెళ్ళాడు.

సామాన్లు పెట్టుకోవడానికి జాగా ఉండక పోవడానికి ఇదేమీ విశాఖపట్నం- విజయవాడ పాసింజర్ రైలుబండి కాదుకదా! అయినా నెంబర్ రాకుండా ఇలా ఎందుకు పరుగెత్తడం? గేటుదగ్గర అటకాయిస్తారు అనుకుంటుంటే ఆ సఫారీ సూటు నాగరికుడు క్యూలో ఉన్న మనుష్యులని దాటుకుంటూ, బోర్డింగ్ పాస్ చెక్ చేస్తున్న అధికారులతో చేతులు కలిపి, లోపలికి చొచ్చుకుపోయాడు. షాక్ తిన్నాడు తను. సూటూ బూటూ వేసుకున్న ఇలాంటివాళ్ళే ఇంగిత జ్ఞానం లేకుండా ప్రవర్తిస్తే అది చూసిన సామాన్య ప్రయాణీకునికి అది ఏం చెబుతుంది? అని తను ఆలోచిస్తుంటే, తన వరుస నెంబర్ లోపలికి ప్రవేశించవచ్చని ఎనౌన్స్ చేశారు.

విమానంలోనికి ప్రవేశించి సీటులో సర్దుకున్న అరగంటకి శరీరపు తడి పూర్తిగా ఆరింది. శబ్దం చేస్తూ కన్వేయర్ బెల్ట్‌మీద సామాన్లు రావడం మొదలవగానే ఆలోచనలు తెగాయి. ఢిల్లీలో తనతో మాటలాడిన సఫారీ సూట్‌వాలా, తన ట్రాలీని కన్వేయర్ బెల్ట్‌ని స్పృశించేలా నిలబెట్టి చాలా జాగాని ఆక్రమించి ఇతరులకి అడ్డుగా నిలబడి అందరికీ ఇబ్బందిని కలుగచేస్తున్నాడు. న్యూయార్క్‌లో అన్నిరకాల మనుష్యులు, అతి భిన్నంగా ప్రవర్తించే జనం ముమ్మరంగా ఉంటారన్నదానికి తార్కాణంగా, ఇతర ప్రజలు సఫారీసూటు వ్యక్తి గురించి పట్టించుకోకుండా కన్వేయర్ బెల్ట్‌మీద కనిపించిన తమ సామాన్లని ఒడుపుగా లాగుకుని కస్టమ్స్‌వేపు సాగిపోతున్నారు. కన్వేయర్ బెల్ట్‌మీద వస్తున్న తన సూట్‌కేస్‌ని లాగుకుని, తోపుడు ట్రాలీలో ఉంచి కస్టమ్స్ వేపు ట్రాలీని మళ్ళించాడు రమణయ్య.

ఆరడుగులు పైచిలుకు ఎత్తు, నూట ఎనభై పౌన్ల బరువు, నీలంరంగు యూనిఫారం వేసుకున్న కస్టమ్స్ అధికారి, "ఎనీథింగ్ టు డిక్లేర్?" అన్న ప్రశ్నవిని రమణయ్య తడపడ్డాడు. నోటమాట ఊడిపడక తల అడ్డంగా ఊపాడు.

"ఈ కాలంలో మీ దేశంలో సమృద్ధిగా మంచి మామిడిపళ్ళు పండుతాయి కదూ?" అంటూ కస్టమ్స్ అధికారి రమణయ్యని సంభాషణలోకి దించాడు.

ఇతను నాతో మామిడిపళ్ళ గురించి అడుగుతున్నాడేమిటి? కొంపతీసి అలమండలో దొరికే బంగినపల్లి కిలోగ్రామ్ ఎంత ఖరీదు? అనడుగుతాడేమిటి అని సందేహపడ్డాడు. హాలులో సౌకర్యమైన ఎయిర్ కండిషన్ ఉష్ణోగ్రత ఉన్నా, రమణయ్య నుదుట లీలగా చమటపట్టడం మొదలైంది.

"పళ్ళు, విత్తనాలు, మొక్కలు, డ్రగ్స్‌లాంటివి పై దేశాలనుంచి ఈ దేశంలోనికి తీసుకురావడం నేరం. అలా చేస్తే ఇరవై అయిదువేల డాలర్ల జరిమానా, క్వారంటీన్, అప్పుడప్పుడు జెయిల్ అన్నది మీకు తెలిసే ఉంటుంది" అంటూ రమణయ్య కళ్ళలోకి, కోర్టులో ప్రాసిక్యూటర్ తీక్షణంగా ముద్దాయి కళ్ళలోకి చూసినట్లు చూశాడు కస్టమ్స్ అధికారి.

"అలాంటివేవీ నా దగ్గరలేవు" అన్నాడు రమణయ్య ఎండిపోయిన గొంతుని అదుపులోకి తెచ్చుకుంటూ.

"యు కెన్ గో" అన్నాడు కస్టమ్స్ అధికారి.

నుదుటపట్టిన చమటని చేతిరుమాలుతో తుడుచుకుని, సామాన్ల ట్రాలీని తోస్తూ గ్రీన్ ఛానల్ గేట్‌లోంచి బైటికి వచ్చాడు రమణయ్య.

"ఎనీథింగ్ టు డిక్లేర్?" అని తన వెన

కాల నిలబడ్డ వ్యక్తిని కస్టమ్స్ ఆఫీసర్ వేసిన ప్రశ్న మరోసారి రమణయ్య చెవులని తాకింది. మృదుత్వంలో కఠినత్వం రంగ రించి ఉన్న ప్రశ్నది. ఎదుటివ్యక్తిని అగౌర వపరచకుండా దృఢంగా వేసిన ప్రశ్నది. నేరస్తులని కుదపగలిగే బలం ఉన్న ప్రశ్నది. సూట్ కేస్‌లో ఏ రకమైన నిషిద్ధ పదార్థాలేమీ లేకపోయినా తనకి కంగారు. అది చూసే ఆ అధికారికి తనమీద అను మానం కలిగి తనని ప్రశ్నించాడు. ఛ... చిన్నప్పటినుంచీ తనంతే! చిన్నప్పుడు సైకిల్ తొక్కేరోజుల్లో ముందరలైటు, వెనక మడ్‌గా ర్డ్‌కి ఎర్రబిళ్ళ, బ్రేకులు సరిగ్గా ఉన్నా సరైన పద్ధతిలో రోడ్డుమీద సైకిల్ తొక్కుతున్న ప్పుడు పోలీసు కనిపించగానే తనకి ఒణుకు పుట్టుకొచ్చేది. సరైన టికెట్ కొని రైలు ఎక్కినా టికెట్ అని టికెట్ కలక్టర్ దగ్గరకి వచ్చినపుడు తనకి కంగారుపుట్టేది. ఎందుకో భయం. అతను టికెట్ తిరిగి ఇచ్చాకే మనస్సు స్థిమితపడేది. ఏ తప్పూ చేయకపో యినా ప్రతి సామాన్య విషయానికీ స్పందించి గిల్టీఫీలింగ్ పెంచుకుని నడిచిన జీవితం తనది అనుకుంటూ బైట నిరీక్షి స్తున్న జనంవేపు ధనరాజ్ కోసం చూశాడు.

నలుపురంగు మనుష్యులు, తెలుపు రంగు వాళ్ళు, రవ్వంత చప్పిముక్కుతో ఉన్న హిస్పా నిక్స్, భారతీయులు, అరబ్బులు, జపాన్ దేశస్థులు, చైనీయులు వగైరాలు కలగాపుల గంగా వివిధరకాల దుస్తులతో నిలబడి ఉన్నవాళ్ళలో ధనరాజ్ మొహం కనబడ లేదు.

"నేను ఏ కారణం చేతనయినా ఆలస్యమై ఎయిర్‌పోర్ట్‌లో ఎదురుగా కనిపించకపోతే నువ్వు మెక్ డోనాల్డ్ ఫాస్ట్ ఫుడ్ జాయింట్ దగ్గర నిరీక్షించు నాన్నా. అది నీకు సుల భంగా కనిపిస్తుంది" అన్న ధనరాజ్ హెచ్చ రిక జ్ఞాపకానికి వచ్చి మెక్ డోనాల్డ్ రెస్టారెం ట్‌కోసం అటూఇటూ చూశాడు. ఎర్రని నియాన్ బల్బులతో నూరడుగుల దూరంలో మెక్ డోనాల్డ్ రెస్టారెంట్ కన్పించగానే ట్రాలీని దాని దిశలో మళ్ళించాడు రమ ణయ్య. ట్రాలీకి ఉన్న మూడుచక్రాలు వేరు వేరు దిశలలో వెళ్తూండడంతో ట్రాలీ అటూ ఇటూ ఊగిసలాడుతూ మెక్ డోనాల్డ్ రెస్టా రెంట్ చేరేసరికి ఇరవై నిమిషాలు గడి చాయి. రెస్టారెంట్‌లో చాలా కోలాహలం ఉంది. తిండి ఆర్డర్ ఇవ్వడానికి క్యూలో నిల బడ్డ ప్రజానీకాల ఆర్డర్ తీసుకుంటూ మైక్‌లో ఆర్డర్ చదువుతుంటే లోపల చక చకా పదార్థాలని పేకెట్లలో ఉంచినవాటిని ఇంకో వ్యక్తి తీసుకువచ్చి ఖాతాదారునికి అందిస్తున్నాడు. విశాఖపట్నం సాయి పార్ల ర్‌లో, ముందు నిలుచున్న వ్యక్తుల భుజాల మీదనుంచి, చంకలమధ్యనుంచి తిండి పదా ర్థాలకి ప్రయాసపడినట్లు కాకుండా ఆర్డర్ తయారవగానే నెంబర్ పిలుస్తోంది ఒక పూబోడి. ఆ ఆర్డర్‌కి సంబంధించిన వ్యక్తి మాత్రమే ముందరకి వెళ్ళి పదార్థాల ప్లేటుని అందుకుంటున్నాడు.

"నాకంటే వెనకాల వచ్చినతనికి పెసరెట్, ఉప్మా ఇచ్చావు. నా ఆర్డర్ ఇంకా ఇవ్వవే మిటి? కాస్త బిజినెస్ రాగానే వీళ్ళకి మన మంటే ఖాతరేలేదండీ" అంటూ పక్కవా ళ్ళతో అరవడంకానీ, ఇతర గొడవలు కానీ లేకుండా చకచకా పదార్థాల సరఫరా జరు గుతోంది. పదార్థాలని తిన్నాక, చెత్తని చెత్తకుండీలలో గిరవాటేస్తుంటే, ప్రతి పదిని మిషాలకి నిండిన ఆ చెత్తని నీట్‌గా కట్టి తీసుకుపోతుంటే, టేబిళ్ళమీద సామాన్లని సర్ది శుభ్రంచేస్తోంది ఇంకో ముద్దబంతి. ఒకరో, ఇద్దరో తప్ప మిగతా పనివాళ్ళ వయస్సులు ఇరవై ఏళ్ళకి లోపే ఉన్నాయి.

సలసల కాగుతున్న నూనెలో పొడవుగా, సన్నగా తరిగిన బంగాళాదుంప ముక్కలు పడగానే చుయ్‌మన్న శబ్దం, వెన్వెంటనే వచ్చిన వాసన రమణయ్య మొహాన్ని చాలా సార్లు తాకింది. అరగంట గడిచినా ధన రాజ్ జాడలేదు.

"ఎయిర్ ఇండియాలో దిగిన ప్రయాణీకుడు రమణయ్య శంకర్ యునైటెడ్ ఎయిర్‌లైన్స్ కౌంటర్‌కి రావాలని కోరుతున్నాం" అంటూ రెండుసార్లు ఎనౌన్స్‌మెంట్ వినగానే రమణయ్యలో చైతన్యం వచ్చింది. ట్రాలీని తోసుకుంటూ దగ్గరగా కనిపించిన అమెరికన్ ఎయిర్‌లైన్స్ కౌంటర్ దగ్గరకి వెళ్లి, "యునైటెడ్ ఎయిర్‌లైన్స్ కౌంటర్ ఎక్కడ ఉందో చెప్పగలరా?" అనడిగాడు రమణయ్య. బిగుతైన యూనిఫారం వేసుకుని కౌంటర్లో కూర్చుని చేతులు ఊపుకుంటూ ఆ నల్లపిల్ల చెప్పింది సగమే అర్థమైంది రమణయ్యకి. ఉత్తరదిశగా కాస్త దూరంనడిచి తరువాత పడమటకి మళ్ళమన్నట్లు అర్థం చేసుకుని ఉత్తరదిశ ఎటో తెలియక ట్రాలీని ఒకవేపు తోస్తుంటే, చప్పట్లు కొట్టి ఏ దిశలో వెళ్ళాలో ఆ నల్లపిల్ల చేతితో చూపించింది.

"ఐ యామ్ రమణయ్య శంకర్. నన్ను ఈ కౌంటర్‌కి రమ్మనమన్న ఎనౌన్స్‌మెంట్ విని వచ్చాను" అంటూ ఊపిరి పీల్చుకున్నాడు రమణయ్య.

"మీరు ఇక్కడకి రావడానికి చాలా సమయం తీసుకున్నారు. మేం మీ గురించి గంటనుంచీ ఎనౌన్స్‌మెంట్ చేస్తూనే ఉన్నాం. బహుశా మీరు విని ఉండకపోవచ్చు న్యూయార్క్ ఎయిర్‌పోర్ట్ సౌండ్ సిస్టమ్ బాగాలేక, మాటలు సరిగ్గా వినిపించవన్న కంప్లయింట్ ఉంది. సారీ... శాన్‌ఫ్రాన్సిస్కో వెళ్ళే ఫ్లైట్ వెళ్ళిపోయింది" అంది కౌంటర్‌లో కూర్చున్న బంగారుతీగ.

"మీరు ఏమంటున్నారో నాకేమీ అర్థమవడంలేదు. నేను శాన్‌ఫ్రాన్సిస్కో వెళ్ళడమేమిటి?" అనడిగాడు రమణయ్య ఆశ్చర్యపడుతూ.

"యు హేవ్ ఎనీ ఎలక్ట్రానిక్ టికెట్. మీరు, మీ ఐడెంటిఫికేషన్ ఏమైనా చూపిస్తే మిమ్మల్ని తరువాత ఫ్లైట్‌లో శాన్‌ఫ్రాన్సిస్కో పంపే ఏర్పాటుచేస్తాను. యు హేవ్ ఎ మెసేజ్ ఫ్రమ్ మిస్టర్ ధనరాజ్" అంటూ టూకీగా పరిస్థితి వివరించ ప్రయత్నంచేసింది. ధనరాజ్ న్యూయార్క్ ఎయిర్‌పోర్ట్‌కి రావడంలేదని, తను శాన్‌ఫ్రాన్సిస్కో వెళ్ళాల్సి ఉంటుందని లీలగా అర్థమయింది. బెరుకుగా, కోటులోంచి పాస్‌పోర్ట్ తీసి అందించాడు రమణయ్య.

"ఇదేమిటి, ఇంటిపేరు మీ పేరు తిరగపడిందే! అయినా ఏమీ ఇబ్బందిలేదు. ఎనీ బేగ్స్ టు చెకిన్?" అనడిగింది కౌంటర్ బంగారతీగ రోజీ.

"యస్, వన్" అంటూ ట్రాలీలో ఉన్న సూట్‌కేస్‌ని ముందరకి తోశాడు.

"గేట్‌నంబర్ ఇరవై ఎనిమిది. సీట్‌నెంబర్ పధ్నాలుగు బి. ఇంకొక అరగంటలో శాన్‌ఫ్రాన్సిస్కో విమానం బయలుదేరుతుంది. హేవ్ ఎ నైస్ జర్నీ" అంటూ బోర్డింగ్ పాస్ ఇచ్చి దానిమీద రాసి ఉన్న అంకెలని వివరించింది రోజీ.

"ఈ ఫ్లైట్ శాన్‌ఫ్రాన్సిస్కో ఎన్నిగంటలుకి చేరుతుందో చెప్పగలరా?" అనడిగాడు రమణయ్య గొంతు పెగల్చుకుని.

"లోకల్ టైంలో సాయంకాలం ఏడుగంటల ముప్ఫయి నిమిషాలకి చేరుతుంది. ఎనీథింగ్ ఎల్స్?" అంటూ చిరునవ్వుల వర్షం కురిపించింది రోజీ.

"థాంక్యూ" అని చేతివాచీ వేపుచూస్తూ ఇరవై ఎనిమిది గేటువేపు ట్రాలీని నెట్టడం మొదలుపెట్టాడు రమణయ్య. సాయంకాలం దాదాపు ఆరుగంటలయింది. సెప్టెంబర్ మాసం సూర్యుడు చవకరకం ఎరుపురంగు బట్ట ఉతికితే కారిన నీళ్ళరంగుతో ప్రకాశిస్తున్నాడు. ఎస్కెలేటర్ దగ్గర ట్రాలీని వదిలాక, చేతిసంచీతో నడక కష్టంగా ఉంది ఏభై తొమ్మిదేళ్ళ రమణయ్యకి. రెండేళ్ళక్రితం వచ్చినప్పుడు ఇలా అనిపించలేదు. వయస్సుతోపాటు కండరాలలో పటుత్వం కూడా తగ్గుతుందని తెలిసినా అది ఇంత త్వరగా దిగజారుతుందని తను ఊహించలేదు.

బరువుకుతోడు కొత్తగా ముడుకులలో వస్తున్న నొప్పి బైటపడుతుంటే శరీరం మొరాయించడం మొదలుపెట్టింది. మోస్తున్న సంచీని కిందుంచి, ఇరవై ఎని మిది గేటు ఎక్కడుందో? అని అటూఇటూ చూశాడు అంతా. అటూఇటూ గేట్లు వర సలో ఉన్నాయి. దగ్గరగా ఉన్న నాల్గవ గేట్ చూడగానే, ఇంకా పన్నెండుగేట్లు దాటాలని గ్రహించి నీరసం పెరిగింది. మెల్లిగా చేతిసంచీని భుజాన వేసుకుని నడక పునఃప్రారంభించాడు రమణయ్య. చల్లని ఎయిర్‌కండిషన్డ్ విమానంలో కూర్చుంటే కానీ నీరసం తగ్గలేదు.

★ ★ ★

ప్రయాణీకులు డిన్నర్ తినడం ముగించాక, వీడియోమీద ఆవాల్టి వార్తల ప్రసారం మొదలయింది. వార్తలలో మొదటి అంశంగా అమెరికా ఉత్తర, పడమటి ప్రాంతాలలో చెట్లు, అరణ్యాలు తగలపడిపోవడం చూపిస్తున్నారు. దాదాపు ఆరు లక్షల ఎకరాలలో ఉన్న పెద్దా, చిన్నా చెట్లు పూర్తిగా భస్మమయ్యాయని, మంటల్ని ఆర్పడానికి చేస్తున్న ప్రయత్నంలో నలుగురు ఫైర్ ఫైటర్లు చనిపోయారని ప్రకటించారు. విమానాలలోంచి నీళ్ళు ఒలకపోయడం, మంటలకి దగ్గరగా ఉన్న ఇళ్ళలో నివశిస్తున్న ప్రజలని ఎలా సురక్షిత ప్రాంతాలకు తరలిస్తున్నారో వివరిస్తూ, వానలు కురవడానికి ఇంకా రెండు నెలల వ్యవధి ఉందని, అంతవరకూ ఈ మంటల్ని అదుపులోకి తెచ్చే అవకాశం తక్కువని ప్రకటించింది. అమెరికా, యూరప్ దేశాలనుంచి సహాయం అర్థించడం, నూరు అడుగుల ఎత్తుకిపైనే ఉన్న పచ్చనిచెట్లు తీవ్రమైన మంటలకి ఎండిన తాటిరేకులు కాలినట్లు కాలడం చూస్తుంటే ఆశ్చర్యమేసింది రమణయ్యకి. ఇంకా రెండునెలలవరకూ ఈ ఎర్రని జ్వాలలు విజృంభించితే ఎన్ని లక్షల ఎకరాల వృక్షసంపద నాశనమౌతుందో! ఆ దరిదాపులలో ఉన్న ఎన్ని ఇళ్ళు ధ్వంసం అవుతాయో అనుకుంటుంటే, "ఇప్పుడు స్కూళ్ళు మూసి ఉన్నాయి కాబట్టి నిరాశ్రయులకి స్కూళ్ళలో తాత్కాలికంగా వసతి కల్పించాం. ప్రైవేట్ సంస్థలు వాళ్ళకి అవసరమైన సహాయం అందజేస్తున్నారు. మంటలు తగ్గాక ఈ ప్రజలందరికీ తక్కువ వడ్డీతో రుణాలను ప్రభుత్వం అందించేలా చూస్తుంది. అయితే వాళ్ళు తిరిగి తమ జీవితాలని మామూలుగా సాఫీగా నడిపించుకోడానికి చాలాకాలం పడుతుంది" అంటూ రిపోర్టర్ తన కథని ముగించాడు.

"ఇళ్లు కాలిపోతే ప్రభుత్వం తిరిగి ఇళ్లు కట్టించి ఇవ్వదా?" అనడిగేడు రమణయ్య పక్కన కూర్చుని ఉన్న తోటి ప్రయాణీకుని.

"ప్రభుత్వం ఎందుకు ఇళ్లు కట్టించి ఇవ్వాలి? ప్రభుత్వం ఇళ్లని కాల్చేసిందా?" అని తిరుగు ప్రశ్న వేశాడు పక్కన కూర్చున్న అమెరికన్ ప్రయాణీకుడు.

"ప్రజలని కష్టాలలో ఆదుకొనకపోతే ప్రభుత్వం ఎందుకు?" అని రెట్టించాడు రమణయ్య ఉద్రేకంతో. ఒకానొక రోజుల్లో చిన్నపుడు గుడ్డిగా నమ్మిన కమ్యూనిస్ట్ సిద్ధాంతాలు గబుక్కున బైటికి వచ్చాయి. ఒక్క క్షణం హైదరాబాదు గొడవలలో డబ్బు ఇస్తే రాళ్లు రువ్వడానికి సిద్ధంగా ఉన్న వ్యక్తికి ఊగిన ఆవేశంలా, ఒళ్లంతా వేడెక్కింది రమణయ్యకి.

"ఇతర దేశాల గురించి నాకు అట్టే తెలియదు. కానీ ఇక్కడ ప్రభుత్వం ఇలాంటి వాటిల్లో తామరాకుమీద నీటిబొట్టులా వ్యవహరిస్తుంది. కొండలమీద, అరణ్యాలలో ఇళ్లు కట్టుకోమని ప్రభుత్వం సలహా ఇవ్వలేదు, ఇవ్వదు, ఇవ్వకూడదు. ఆ నిర్ణయం ఇళ్లు కట్టుకున్న వ్యక్తులది. ఇన్సూరెన్స్ తీసుకున్న ఇళ్లు కాలిపోతే ఇన్సూరెన్స్ కంపెనీ డబ్బు ఇవ్వాలి, ఇస్తుంది. మధ్య ప్రభుత్వం ఎందుకు కలగజేసుకోవాలి?

పని కట్టుకుని అనవసరంగా ప్రభుత్వం

ఆ ఇళ్లని కాల్చేస్తే పరిహారం అడగడంలో అర్థం ఉంది. కానీ ఇది ప్రకృతి ప్రళయతాండవం వలన జరుగుతోంది. దానికి ప్రభుత్వం బాధ్యతలేదు. ఎక్కడో, ఎవరో తమ ఆనందంకోసం ప్రమాదమైన ప్రదేశాలలో ఇళ్లు కట్టుకుని అవి ఇప్పుడు కాలిపోతే ఇతరులు చెల్లించే పన్నుల డబ్బు వీళ్లకి ఎందుకు వెళ్లాలి? వాళ్ల బాధ వాళ్లే పడాలి" అన్నాడు అమెరికన్ చిరునవ్వుతో.

"ఏమిటో వివరించలేకుండా ఉన్నాను కాని మీ వాదనలో ఏదో లోపం ఉంది" అన్నాడు రమణయ్య నీరసంగా.

"ఉందేమో అది మీరు చెప్పాలి" అన్నాడు చెరగని చిరునవ్వుతో అమెరికన్.

ఆలోచనలో పడ్డాడు రమణయ్య. అమెరికన్ వెలిబుచ్చిన వాదనలో ఉన్న వెలితిని చూపించాలన్న బలీయమైన కోర్కె క్షణక్షణమూ పెరుగుతూ రమణయ్య మెదడుని కొరకసాగింది. ఇండియాలో గతంలో జరిగిన సంఘటనలని నెమరు వేసుకోవడం మొదలుపెట్టాడు. మొదట- ఈమధ్యనే హైదరాబాదు నగరంలో నగరశివార్లలో అధిక వర్షపాతం వలన వచ్చిన వరదలు జ్ఞాపకానికి వచ్చాయి. అప్పుడు ప్రభుత్వం తన దగ్గర ఉన్న వనరులన్నింటినీ రంగంలోకి దింపింది. అయినప్పటికీ,

"ప్రభుత్వం నుంచి మాకు ఏమీ సహాయం రాలేదు" అంటూ మురికి కాలవకి పక్కన పల్లపు ప్రాంతంలో అక్రమంగా కట్టుకున్న ఇళ్లలోంచి అరుస్తోంది ఒక స్త్రీ. కారాకిళ్లీ నములుతూ, తుపుక్కున ఉమ్మి, టెలివిజన్ కెమేరా వేపు చూస్తూ అరుస్తూ చేతులు ఊపుతోంది. హద్దులు, ఆనవాళ్లు తెలియకుండా కాలవలోంచి నీళ్లు రోడ్లమీద పారుతున్నాయి.

"పది గంటలయి ఇలా డాబాలమీద వరదకి భయపడి మేం ఉండిపోయాం, మాకు ప్రభుత్వం ఆహారం సరఫరా చేయలేదు" అంటూ ఒక సగం తడిసిన సఫారీ సూటు వ్యక్తి టెలివిజన్ కెమేరావైపు చూస్తూ మాట్లాడడం జ్ఞాపకానికి వచ్చింది రమణయ్యకి.

అవును సహాయం అందక వాళ్లు అలా ఆక్రోశిస్తున్నారు అని తన మనసు వాళ్లని అలా టెలివిజన్‌లో చూసి బాధపడిన మాట నిజం. కానీ అమెరికన్ అన్నట్లు అసలు ప్రభుత్వం ఎందుకు సహాయం చేయాలి? అక్రమంగా కట్టిన ఇళ్లలో ఉన్న వ్యక్తులు ఆదాయపు పన్ను చెల్లించరు, బహుశా ప్రతీ రోజూ కొనుక్కొనే వస్తువుల మీద సేల్స్ టాక్స్ చెల్లిస్తారేమో. కానీ ఆ సేల్స్ టాక్స్ ప్రభుత్వానికి కట్టకుండా దుకాణదారుడు గుటకాయస్వాహా చేస్తాడే! ఈ అక్రమంగా కట్టుకున్న ఇళ్లలో ప్రజలు చాలామంది ఏవేవో కారణాలు చూపించి ఓట్లని ఆశగాపెట్టి ప్రతీచోటా ప్రత్యేక సదుపాయాలు కావాలంటారు. లోపాయికారీగా కొందరు విద్యుత్ చౌర్యం చేస్తారు. ఇలాంటి ప్రజ వరదనీటి ప్రభావానికి గురి అయితే ప్రభుత్వం ఎందుకు పరిహారం చెల్లించాలి? పూజలు చేసి వరుణదేవుని అనుగ్రహం పొందనందుకా? ఆ ఒక్క కారణమూ వదిలేస్తే మానవతా దృష్టితోతప్ప ఇంకెందుకు సహాయం అందివ్వాలి? ' అనిపించింది రమణయ్యకి. అయినా ఉద్రేకము చల్లారలేదు.

"ప్రభుత్వం ప్రజలని కష్టాలలో ఆదుకోవాలి. మొన్న మాదేశంలో ఏం జరిగిందో తెలుసా? నే నివశించే రాష్ట్రంలో రైతులు పత్తి పంట వేశారు. సరైన కాలంలో వానలు రాకో, పురుగుపట్టో పంట నాశనం అయింది. విదేశీ కంపెనీలు బజారులో అమ్ముతున్న విత్తనాలు సరైనవికావని, ప్రభుత్వం వాటిమీద నిఘా ఉంచి మంచి విత్తనాలే అమ్మేలా చూడలేదని అభియోగం. విత్తనాలు కొనుక్కోవడానికి, ఎరువులు వాడడానికి బాంక్‌ల దగ్గర తెచ్చిన అప్పులు పెరిగి, అవి తీర్చలేక కొందరు రైతులు ఆత్మహత్య చేసుకున్నారు. అసెం

బ్లీలో దుమారం రేగింది. ప్రభుత్వం ఈ హత్యలు చేయించింది అన్నారు ఒకరు. ప్రభుత్వం చనిపోయిన వ్యక్తి కుటుంబానికి లక్ష రూపాయల చొప్పున సహాయం అంది చ్చింది. చనిపోయిన రైతులు బాంక్‌కి ఉన్న అప్పుల సంగతి ఏమయిందో నాకు తెలి యదు. కానీ చూశారా ప్రభుత్వం కష్టాలలో ఎలా ఆదుకుందో" అన్నాడు రమణయ్య గర్వంగా.

ఎనభై కేజీల శరీరంతో బీర్ బాగా తాగగా తాగగా పెరిగిన పీపాలాంటి పొట్ట ఊగేలా ఫెడీఫెడీమని నవ్వేడు ఆ అమెరి కన్. రమణయ్యకి రెండు భయాలు కలి గాయి. ఆ పొట్ట ఊడివచ్చి తన మీద పడి పోతుందేమోనని ఒకటి, అతని చేతిలో ఉన్న బీర్‌కేన్‌లోంచి బీర్ ఒలుకుతుందేమో నని రెండవది.

"క్షమించాలి, ఈమధ్య కాలంలో ఇంతగా నవ్వుతెప్పించే జోక్ నాకు జ్ఞాపకంలేదు. నాకు తెలియక అడుగుతాను, ప్రభుత్వం కొరడా ఝుళిపించి పత్తి పండించమని రైతు లని బలవంతపెట్టిందా? రైతు తన పొలంలో పంట వేయడానికి ప్రభుత్వానికి ఏమిటి సంబంధం? మీ దేశంలో ఎవరైనా సరదాకి పేంట్‌కి నిప్పంటించుకుని చని పోతే పరిహారం ప్రభుత్వం ఇస్తుందేమిటి?" అంటూ తిరిగి నవ్వు అందుకున్నాడు అమె రికన్.

అమెరికన్‌ని చూస్తుంటే ఒళ్లు మండు తోంది రమణయ్యకి. ఒక ప్రైవేట్ బస్ ఎక్కడనుంచో షిర్డీ దేవాలయానికి వెళ్తూ ఏక్సిడెంట్ అయి ప్రజలు చనిపోతే వాళ్లకి ప్రభుత్వం పరిహారం ఇచ్చిందన్న సంగతి జ్ఞాపకానికి వచ్చినా ఆ ఊసు ఎత్తలేదు రమ ణయ్య. మా రాష్ట్రంలో విద్యుత్ ధరలు పెరి గాయని ప్రజలు చేసిన ప్రదర్శనలో కొందరు దుండగులు రాళ్లు రువ్వి గాయప రుస్తుంటే పోలీసులు కాల్పులు సాగించారని




పర్యవసానంగా కొందరు మరణించగా ఆ కాల్పులలో చనిపోయిన వాళ్లకి ఐదు లక్షలు పరిహారం ఇవ్వాలని కొందరు శాసన సభ్యులు బల్లగుద్ది అడిగారన్న సంగతి చెప్పి ప్రభుత్వం ప్రజలకి ఎలా సాయపడుతుందో వివరిద్దామనుకున్నాడు. కానీ ఈ అమెరిక న్‌కి ఇండియా ప్రజల గురించి ఇండియన్ ఆలోచనల గురించి చెప్పినా అర్థమవదని ఆ ప్రయత్నం విరమించాడు రమణయ్య.

"ఈత నేర్పేటప్పుడు ఈత నేర్చుకునే వ్యక్తి ఈత వచ్చిన వ్యక్తి చేతులు వదలకుండా గట్టిగా కదలకుండా పట్టుకుని ఉంటే అత నికి ఈత ఎప్పటికీ రాదు. అథవా వచ్చినా చాలాకాలం పడుతుంది. ప్రతీ విషయానికీ ప్రభుత్వం ఆదుకోవడం అలాంటిదే. మీ ప్రశ్నలబట్టి మీరు ఈ దేశంలో నివశించడం లేదని తేటతెల్లమవుతోంది. అమెరికా సంద ర్శించడం ఇది మీకు మొదటిసారా? ఈమ ధ్యన ఇండియానుంచి చాలామంది మంచి కంప్యూటర్ ఇంజనీర్లు ఈ దేశం వచ్చి పని చేస్తున్నారు" అన్నాడు అమెరికన్ బీర్‌కేన్‌ని సొంతం ఎత్తి పెట్టి దానిలో ఉన్న సగం బీరుని ఒక్కసారి గడగడా తాగుతూ.

"ఇది రెండవసారి, రెండేళ్లక్రితం ఒకసారి వచ్చాను" అన్నాడు రమణయ్య.

పది నిమిషాలలో పక్క సీట్లో కూర్చున్న అమెరికన్ గురకపెట్టడం మొదలుపెట్టాడు. పడమటికి ఎగురుతున్న విమానం కృంగు తున్న సూర్యుడిని చూస్తూ కాస్సేపు పరిగె త్తాక ఆకాశంలో వెలుతురు కాస్త తగ్గింది. శాన్‌ఫ్రాన్సిస్కోలో విమానం సాయంకాలం ఏడు గంటల ముప్ఫయి నిమిషాలకి దిగినా గేట్‌లోంచి బైటకి వచ్చేసరికి ఎనిమిది గంట లయింది. గేటు ఎదురుగా నిలుచున్న ధన రాజ్‌ని చూడగానే కొండంత బలం వచ్చింది రమణయ్యకి. గత నాలుగు రోజులుగా ఇక్కడ పని చేస్తున్నాను. మరి కొన్నాళ్లు ఇక్కడ ఉండాల్సి వస్తుంది. నాకు హోటల్లో ఒక మంచి గది కేటాయించారు. వండుకో వడానికి వసతి ఉంది. నా పని ఇక్కడ

ముగిసేక ఇద్దరమూ కలిసి న్యూజెర్సీ వెళ్లి పోదాం" అంటూ రమణయ్య చేతిలో ఉన్న బాగ్ అందుకున్నాడు ధనరాజ్.

"న్యూజెర్సీ అయితేనేం, శాన్‌ఫ్రాన్సిస్కో అయితేనేం? నీతో గడపడానికి కదా నేవ చ్చింది? ఏమీ ఫరవాలేదు. నిజానికి కేలిఫోర్నియా అంటే నాకు ఇష్టం" అంటూ ధనరాజ్‌తో బాగ్ తీసుకోవడానికి మెట్లు దిగాడు రమణయ్య.



"నా ఆఫీసు ఐదున్నరకల్లా ముగుస్తుంది. మీరు శాన్‌ఫ్రాన్సిస్కోలో నాలుగు గంటలకి బయలుదేరే రైలు పట్టుకుంటే శాంతాక్లారా వచ్చేసరికి ఐదు నలభై అవుతుంది. నేను స్టేషన్ దగ్గర నిరీక్షిస్తుంటాను. ఒకవేళ ఆలస్యం అయితే నాకు ఫోన్ చెయ్యండి" అంటూ ఫోన్ నెంబర్ ఇచ్చి రమణయ్యని కేల్‌ట్రెయిన్ ఎక్కించేడు ధనరాజ్. తెచ్చుకున్న న్యూస్‌పేపర్ చదవడం పూర్తయేక చిన్న కునుకు తీసేసరికి శాన్‌ఫ్రాన్సిస్కోలో నాల్గవ వీధిలో ఆగింది కేల్‌ట్రెయిన్.

శాన్‌ఫ్రాన్సిస్కో చూడడానికి రమణయ్య రావడం ఇది రెండవసారి. కేల్‌ట్రెయిన్ దిగగానే ఎదురుగా శాన్‌ఫ్రాన్సిస్కో పట్టణంలో చెప్పుకోదగ్గ మార్పులేమీ కనిపించలేదు. రైలు స్టేషన్ అలాగే ఉంది, లైట్లు ఎక్కువగా అమర్చినట్లు తెలుస్తోంది. రైలులోంచి జనాభా కిందకి దిగగానే బిలబిలా రోడ్డువైపు కదలివెళ్తున్నా ఏ ఒక్కరూ ఇంకో వ్యక్తిని తోయడంకాని తాకడం కాని చేయడంలేదు. స్టేషన్‌లోకానీ స్టేషన్ గేట్ల దగ్గర కాని తనిఖీ చేయడానికి రైల్వే సిబ్బందిలేదు, రెండేళ్లలో రైలు ఛార్జీలు ముప్పయి శాతం పెరిగాయి. క్రితంసారి తను ఈ రైలు ఎక్కినపుడు రైలులో ప్రయాణం చేస్తున్న సంఖ్యకి, ఈనాడు రైలులో ప్రయాణం చేసిన సంఖ్యకి చాలాతేడా ఉంది. దారిలో ఒకటో రెండో కొత్త రైలు స్టేషన్‌లు తయారవుతున్నాయి. ఎక్కువయిన ప్రయాణీకుల సంఖ్య దృష్ట్యా రైల్వే సిబ్బంది పెరిగింది. దారిలో స్టేషన్ ప్లాట్‌ఫారం మీద రైలు దిగుతున్న ప్రయాణీకులని గమనిస్తే వాళ్లలో పెద్ద శాతం హిందూదేశస్థులదే అని సులభంగా అంచనావేయవచ్చు. తొందరపడకుండా రైలు స్టేషన్‌లోంచి బైటికి వచ్చి నాల్గవ వీధిలోకి మళ్లాడు రమణయ్య. ట్రెయిన్ స్టేషన్‌కి దగ్గరగా రోడ్డుమీద చెత్త గాలికి పరిగెడుతూ కాళ్లని తాకగానే ఆశ్చర్యమేసింది. రోడ్లు దాటేటప్పుడు పచ్చలైటు కోసం ఆగి వెళ్తున్న రమణయ్య అక్కడక్కడ లైట్ల సంగతి పట్టించుకోకుండా రోడ్లు దాటుతున్న ప్రజ, దూసుకు పరిగెడ్తూ హారన్ కొడ్తున్న కార్లు కనిపించగా రమణయ్యకి ఆశ్చర్యం ఇంకా ఎక్కువయింది. విశాఖపట్నం, హైదరాబాదులలో ఉన్న పేవ్‌మెంట్స్ అంత అధ్వాన్నం కాకపోయినా గతుకులు, ప్లాస్టిక్ గాజుసీసాలు, అక్కడక్కడా ఉచ్చకంపు శాన్‌ఫ్రాన్సిస్కోలో మార్పుని రైలు స్టేషన్ దగ్గర చూపించింది. రెండు బ్లాకులు నడిచి రోడ్డు ఓవర్‌పాస్ కింద నడుస్తుంటే పేవ్‌మెంట్ మీద దుప్పటి కప్పుకుని నిద్రపోతూ కొందరు, చిరిగిన దుస్తులలో చెత్త సంచీలో సామా

న్లతో సిగరెట్ తాగుతూ కొందరు కనిపించారు. ఒకరిద్దరు కాలిబాటమీద టెంట్ వేసుకుని స్థిరనివాసం ఏర్పరుచుకున్న. వాళ్లని చూసి వాళ్ల ఆకారాలు అందరికంటే రవ్వంత భిన్నంగా కనిపిస్తే భయపడుతూ బెరుకుగా ముందరకి సాగాడు రమణయ్య.

అమెరికాలో సహనం ఎక్కువగా ఉన్న రాష్ట్రాలలో కేలిఫోర్నియాకి అగ్రతాంబూలం ఇస్తారు అందరూ. కేలిఫోర్నియాకి ప్రపంచంలో ఉన్న అన్ని దేశాలనుంచి వలసవచ్చిన వాళ్లలో చైనీయులు, హిస్పానిక్స్ ఎక్కువయినా ఇతరదేశాలనుంచి వచ్చినవాళ్లు ఉండడంతో కేలిఫోర్నియాలో అన్ని దేశాల నాగరికతలు కనిపిస్తాయి. వ్యక్తి స్వాతంత్ర్యం ముఖ్యం అమెరికాలో, అయితే అది అతిపరమ ముఖ్యమైనది కాలిఫోర్నియా రాష్ట్రంలో. ఒకరు ఇతరుల సంగతి పట్టించుకోరు. ఎవరి పరుగు, ఆరాటం, ఆవేదన, ఆరాధన, బాధ, ఆనందం వాళ్ళదే. చాలాకాలంగా ఇతర రాష్ట్రాలలో స్థిరపడిన వాళ్ళు కాలిఫోర్నియా రావడానికి ఇష్టపడతారు. దానికి ముఖ్య కారణాలు ఉద్యోగ అవకాశాలు, అనుకూలమైన వాతావరణం. ఉత్తర కోస్తాప్రదేశంలో ఉష్ణోగ్రత సంవత్సరమంతా ఇరవై, ఇరవై ఎనిమిది డిగ్రీల సెంటీగ్రేడ్‌లో ఉన్నా పసిఫిక్ మహాసముద్రంనుంచి వచ్చే గాలి దానికి జతయి వాతావరణాన్ని హాయిగా ఉంచుతుంది. వాతావరణం అంత అనుకూలంగా ఉండబట్టే కాబోలు రోడ్లమీద నివశించే ప్రజల సంఖ్య కూడా చాలా ఎక్కువ అనుకుంటూ ఎదురుగా 'స్టార్‌బక్స్' కాఫీ రెస్టారెంట్ లోంచి ముక్కుపుటాలని అదరకొడుతున్న కాఫీవాసన రాగానే లోపలికి నడిచేడు రమణయ్య.

కాఫీ కోసం క్యూలో నిలబడి చుట్టూ గమనించసాగాడు రమణయ్య. నాలుగైదు గుండ్రటి బల్లలమీద కాఫీ కప్పులు ఉంచి నిలబడి కాఫీ తాగుతున్నారు కొందరు. రోడ్డుని ఆనుకుని ఉన్న గాజు అద్దాల గోడ దగ్గరగా కూర్చోవడానికి వీలుగా ఒక అరడజను స్టూల్స్ ఉన్నాయి. తెరచి ఉన్న నాలుగు కౌంటర్లకి నాలుగు క్యూలు కదులుతుంటే ఒక క్యూలో నిలబడిన రమణయ్య కౌంటర్‌లో ఆర్డర్లు తీసుకుంటున్న వ్యక్తిని గమనించాడు. వేసుకున్న యూనిఫారంలో మొహం శుభ్రంగా ఉంది. జుత్తు గట్టిగా కట్టి, వెనకకి కట్టిన రబ్బర్ బేండ్ దాటి పిలక వేలాడుతోంది. రెండు చెవులకి ఏడో, ఎనిమిదో చిల్లులు వాటిలో దుద్దులు, కమ్మలు, పోగులు.

"మొగాళ్లకి దుద్దులేమిటి?" అన్న ప్రశ్న ఒక్కక్షణం తలెత్తినా, ఆ కౌంటర్ వ్యక్తిని చూసేక,

"ఏం ఎందుకుండకూడదు?" అన్న సమాధానం వెన్వెంటనే. స్ఫురించింది రమణయ్యకి. ఆడవాళ్ళు, మగవాళ్లు, పిన్నా, పెద్దా ఎలాంటి దుస్తులు ధరించాలో, అలంకరించుకోవాలో, అలంకరించుకోకూడదో పరోక్షంగా సమాజం నిర్ణయిస్తుంది ఇండియాలో. ఆ ఆనవాయితీలని పట్టించుకోకుండా ఎక్కడో వేలలో ఒక స్త్రీ లేదా పురుషుడు సమాజ నిబంధనలని ధిక్కరిస్తే, కొన్నాళ్లు సమాజం వాళ్ళని ఇబ్బంది పెట్టి, సూటిపోటీ మాటలతో నొప్పించి, ఆమెని లేదా అతనిని మార్చి తమ ధోరణికి తీసుకురావడానికి ప్రయత్నం చేస్తుంది. కాని విఫలమైతే విసుగేసి, కసిని కడుపులో దాచుకుని అవకాశంకోసం ఎదురుచూస్తుంది. సమాజంలో చాలామంది పిరికివాళ్ళు, అసమర్థులు ఉంటారు, వాళ్ళ ఊహలు పిరికివే. ఒంటరిగా ధైర్యవంతుల్ని ఎదుర్కోలేక, సంఘటితమై సమర్థుడిని, ధైర్యవంతుడిని తమలాగే పిరికిగా తయారుచేయడానికి ప్రయత్నించి నీరసపరుస్తారు. దాని కోసం నరనరాల్లో కుళ్లు పట్టిన సాంప్రదాయాన్ని ఆయుధంగా ఉపయోగిస్తారు.

"మొగవాడికి దుద్దులేమిటండీ? ఈ పిలకలేమిటండీ? ఇంటా వంటా లేదు. అనా





దిగా వస్తున్న రీతి, రివాజులని మంట కలి పేస్తున్నారండీ, వెధవకాలం, పోయేకాలం" అంటూ సాగతీస్తూ ఉక్రోషాన్ని వెళ్ళకక్కు తారు కొందరు.

"నీ ప్రవర్తన ఇలా ఉంటే, మున్ముందు నీ కుటుంబ సభ్యులు ఇబ్బందులపాలవుతారు. నీ సంగతే చూసుకుంటున్నావు, మా సంగతి ఏమిటి? మా గురించి ఆలోచించవా? " అంటూ నిరంతరంగా సమాజంలో ఉన్న పిరికివాళ్ళ ప్రశ్నల పరంపర ధాటికి తట్టుకో లేక తమ పిల్లలని తామే బలిచేసుకుంటారు కొందరు తల్లితండ్రులు. 'ఇండియాలో వ్యక్తి స్వాతంత్రం కేవలం గూండాలకే' అనుకుం టుంటే.

"వాట్ కెన్ ఐ డు ఫర్ యు టుడే" అన డిగాడు చెవిపోగుల చిన్నవాడు.

"కాఫీ"

"ఏ సువాసన, బ్రెజిల్, కీన్యా...? "

"బ్రెజిలియన్"

"బిగ్, రెగ్యులర్ ఆర్ షార్ట్? "

"షార్ట్"

"దానిమీద చాక్‌లెట్ వేసేదా? "

"వద్దు"

"క్రీమ్ కలుపుకోవడానికి ఖాళీవదిలేదా? "

"యస్"

"అంతేనా? ఇంకేమైనా కావాలా? స్కోన్, బిస్కోటే? "

ఎదురుగా చాలా తిండి పదార్థాలు, టిఫిన్లు, కేక్‌లులాంటివి ఉన్నా కౌంటర్ వ్యక్తి వేస్తున్న ప్రశ్నల జోరుకి భయపడి ఆర్డర్ ఇవ్వడానికి తను చాలా సమయం తీసుకుంటున్నానేమోనని అనుమానపడి,

"నో, థాంక్స్" అన్నాడు రమణయ్య.

"డాలర్ తర్టీ ఫైవ్" అంటూ డబ్బు అందుకుని ఒక పేపర్ కప్పులో ఇంకొక పేపరు కప్పు, దానిచుట్టూ ఒక కార్డ్ బోర్డ్ రింగ్ అమర్చి, అరనిమిషంలో కాఫీ అంది చ్చాడు. పంచదార, పాలు దానికి జతచే సినా, పొగలుకక్కుతూ ఫిల్టర్ కాఫీకన్నా స్ట్రాంగ్‌గా ఉన్న ఆ కాఫీ ఓ గుక్కెడు తాగ గానే, కెఫీన్ విద్యుత్ ప్రవాహంలా శరీరం లోనికి ప్రవేశించి, హుషారుని పుట్టించింది రమణయ్యకి. గాజుగోడకి ఆనుకుని ఉన్న కుర్చీలో కూర్చుని కాఫీ చప్పరిస్తూ రోడ్డు మీద నడుస్తున్న ప్రజానీకాన్ని గమనించసా గాడు రమణయ్య. కాల్ ట్రెయిన్ రైలు స్టేషన్ దగ్గర ఉన్నట్లు కాకుండా రోడ్డుమీద వాహనాలు పద్ధతిలో నడుస్తున్నాయి. వన్‌వే ట్రాఫిక్‌లో ఎదురుగా వాహనాలు రావడంకాని, చెవులు చిల్లులుపడేలా హారన్ మోగించడం కాని లేకుండా సాఫీగా వెళ్తోంది ట్రాఫిక్. పేవ్‌మెంట్ మీద ఓ మోస్తరు వేగంతో నడుస్తుంటే రోడ్లు దాటేటప్పుడు వాళ్ళకి అన్నీ గ్రీన్ లైట్లే రావడం చూసి 'ఓహోహో' అనుకున్నాడు రమణయ్య.

"థాంక్యూ! థాంక్యూ" అంటూ రెండుసార్లు కౌంటర్ చెవిపోగుల చక్రవర్తి మాటలు విన గానే అటువేపు చూశాడు. కాఫీలు అందుకు న్నాక కస్టమర్లు కౌంటర్ వ్యక్తికి టిప్ ఒక డబ్బాలో వేస్తున్నారు. సర్వీస్ బాగుంటే ఇరవై శాతం, బాగుండకపోతే పదిశాతం టిప్ అమెరికన్లు ఇస్తారని విన్నాడు రమణయ్య. 'అరె! నేను టిప్ ఇవ్వలేదే' అనుకుని గిల్టీగా ఫీలయ్యాడు.

"ఇతను నాకు ఏం మహా సర్వీస్ అంది చ్చాడు టిప్ ఇవ్వడానికి? , ఇదొక రకమైన ముష్టి, దోపిడి" అనుకుంటూ తృప్తిపడ్డాడు రమణయ్య. కాని ఆ టిప్ ఇమ్మని కౌంటర్ వ్యక్తి అడుగలేదు, టిప్ ఇచ్చినా, ఇవ్వకపో యినా సర్వీస్ ఒకేలా అందచేస్తున్నాడని, దానికి, ముష్టికి చాలా తేడా ఉందని అర్థం చేసుకున్నాడు రమణయ్య. బార్‌లలో, రెస్టా రెంట్‌లలో వెయిటర్స్‌గా పనిచేసే వాళ్ల జీతాలు తక్కువని, వాళ్ళు ఆర్థికంగా దిగువ తరగతికి చెందుతారనీ, వీళ్లలో చాలా శాతం టీనేజర్లు ఉంటారని, వాళ్ళకి ఈవి ధంగా ధనసహాయం చేయడానికి టిప్

ఇవ్వడం మొదలుపెట్టారు. ఎవరో చెప్పినది జ్ఞాపకానికి వచ్చింది రమణయ్యకి. కాఫీ తాగడం పూర్తిచేసి, బైటకి వెళ్ళబోతూ, రెండు క్వార్టర్లక్కడి టిప్స్ డబ్బాలో పడవేసాడు రమణయ్య. "థాంక్యూ వెరీమచ్" అన్నాడు చెవిపోగుల సుందరాంగుడు.

"యు ఆర్ వెల్‌కమ్" అంటూ బైటకి నడిచాడు. తను ఒక క్వార్టర్ టిప్ వేస్తే సరిపోయేదే, కాని ఆ కౌంటర్ వ్యక్తి సౌమ్యంగా, ఓపికగా ఎన్నో ప్రశ్నలు వేసి ఏఏ రకాలు ఉన్నాయో వివరించిన ధోరణి జ్ఞాపకానికి వచ్చి, 'హి డిసర్వ్‌డ్ ఇట్' అనుకున్నాడు తృప్తిగా. కాఫీ కప్పుని చెత్తకుండీలో పడేసి రోడ్డుమీదకి వచ్చాడు.

ఉదయం పది గంటలయింది. సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. దగ్గరలో ఉన్న పసిఫిక్ సముద్రంనుంచి వస్తున్న చల్లగాలి ఉష్ణోగ్రతని ఇరవై డిగ్రీల . సెంటీగ్రేడ్‌లో ఉంచడంతో చలివేయగా కోటు బటన్లు పెట్టుకుని నడక వేగంపెంచి మార్కెట్ వీధి దరిదాపులలోనికి వచ్చాడు. ఒక నాలుగు రోడ్ల కూడలిలో ఒక పోలీసు అధికారి ఒక కారుని నిలిపి దాని డ్రైవర్‌కి జరిమానా వేస్తుంటే వాళ్ళ గురించి పట్టించుకోకుండా ఎవరి మానాన వాళ్ళు నడుచుకుంటూ వెళ్తున్నారు. రమణయ్య వాళ్ళ దగ్గర కాస్సేపు తచ్చాడేడు.

"నేనేమీ తప్పుచేయలేదు" అంటున్న డ్రైవర్ మాట వినిపించుకోకుండా,

"ట్రాఫిక్ సిగ్నల్ లైటు మారుతుంటే చూసుకోకుండా పెడస్ట్రియన్ దగ్గరగా దాదాపు అతనిని స్పృశించేలా ప్రమాదానికి దగ్గరగా కారు నడపడం నేరం. రెండువందల అరవై ఒక్క డాలర్లు ఫైన్. కోర్టులో వాదించుకో. ఇదిగో నా ఎడ్రసు, నెంబర్" అంటూ జర్మానా కాగితాన్ని అందిచ్చి 'హేవ్ ఎ నైస్‌డే' అని రేబాన్ కళ్ళద్దాలని సరిచేసుకుని మోటారుసైకిల్ మీద మాయమయ్యాడు పోలీసాఫీసర్.

"నా బొంద, ఇంకేం నైస్‌డే" అనుకుంటూ కారుని కదిపింది జర్మానా అందుకున్న స్త్రీ. రోడ్డుమీద నడిచే వ్యక్తికి దగ్గరగా కారు నడిపినందుకు రెండు వందల అరవై ఒక్క డాలర్ల ఫైనా? అంటే పదమూడు వేల రూపాయలు! ఇదెక్కడి విచిత్రం? విశాఖపట్నం జగదాంబ సెంటర్‌లో కాని, గుంటూరు బ్రాడీపేట సెంటర్‌లో కాని, హైదరాబాద్ ఆబిడ్స్ కూడలిలోకాని రోడ్డు పక్కన నిలబడితే ఆటో రిక్షాలు, స్కూటర్లు, కార్లు, నడుస్తున్న ప్రజలని ముద్దుపెట్టుకుంటూ వెళతాయ్! అప్పుడప్పుడు పక్కకి నెడతాయి, కాని ఎవ్వరూ పట్టించుకోరు.

"ఈ బద్మాష్‌లు అలా ఎక్కడ పడితే అక్కడ ఊడిపడతారు, ఈ ఆటోరిక్షాల వలనే రోడ్లుమీద అనర్థం అంతా, వాటిని బేన్‌చేయాలి" అన్నాడు ఢిల్లీలో సర్దార్జీ టేక్సీ డ్రైవర్. అతని దృష్టిలో తనకి ఇబ్బంది కలిగిస్తున్న ఆటోలు రోడ్డుమీద నడవకూడదు. తను అడ్డదిడ్డంగా కారు నడుపుతున్న సంగతి అతనికి తెలియదు. అథవా తెలిసినా దానిలో ఏమీ తప్పు లేదనుకుంటాడు.

"ఏ స్కూటర్‌వాలే మచ్ఛర్ కా మాఫిక్, జీనా బహుత్ ముష్కిల్ కర్‌దియా" అన్నాడు ఒక ఆటోరిక్షా డ్రైవర్ స్కూటర్ నడుపుతున్న వ్యక్తిని నిరసిస్తూ. అతని దృష్టిలో రోడ్లమీద ఏక్సిడెంట్‌కి కారణం స్కూటర్లు.

"గురూ ఈ సైకిల్ వెధవలు ఉన్నారు చూసేవా, వాళ్ళు యమడేంజరస్ ఫెలోస్. చటుక్కున, బెల్లైనా కొట్టకుండా మలుపులు తిరిగేస్తారు. సైకిళ్లని నిషేధిస్తే కాని మన రోడ్ల ప్రోబ్లెమ్ సాల్వ్ అవదు" అన్నాడు స్నేహితుడు సాయి తన స్కూటర్‌ని కార్లు, ఆటోరిక్షాల మధ్యనున్న ఖాళీ జాగాలలోంచి ఇరికించి ముందరకి తీసుకువెళ్తూ.

"అసలు ఇదంతా పెరిగిపోయిన జనాభా వలనేనండీ. పంది పిల్లల్ని ఈనేసినట్లు కనేస్తున్నారు ప్రజలు! ఎక్కడ చూసినా పిల్లలే!





ప్రపంచం బాగుపడాలంటే జనాభా సగం చచ్చిపోవాలి" అన్నాడు అమెరికాలో స్థిరని వాసం ఏర్పరుచుకున్న భారతీయుడు ఇండియా వచ్చి, తల్లితండ్రులు ఇంకా బతికి ఉండడం చూసి ఆశ్చర్యపడుతూ. అయితే ఆ సదరు వ్యక్తికీ పిల్లలు ఉన్నారని, పిల్లల్ని ఈ లోకంలోనికి తీసుకురావడానికి తనకి ఎంత హక్కు ఉందో, అంతే హక్కు ఇతరు లకి కూడా ఉంటుందన్న నగ్నసత్యం రుచిం చదు. ఆ సంగతే ఎవరో గుర్తుచేస్తే 'నిజమే నేను తప్పు చేసాను, నా తప్పు చూసి ఇత రులు నేర్చుకోవచ్చు కదా' అన్నాడు తనకొ క్కడికే ఆ తప్పు చేయగలిగే హక్కు ఉన్నట్లు.

మన పని అయిపోవాలి, మనకి ఏమాత్రం ఇబ్బంది కలగకూడదు. ఏదైనా ఇబ్బందికరమైన సన్నివేశం ఎదురయితే, దానికి కారణం కేవలం ఎదుటి వ్యక్తే, అందుకే ఎదుటి వ్యక్తి సర్దుకుపోవాలి. అంతేకాని తను కూడా ఆ సమస్యకి కొంత కారణభూతుడనని ఒప్పుకోడు.

మనమీద మనకి ఉన్న నమ్మకం, కంటికి అర్థంలేని పొరనికడుతుంది.

శబ్దం చేసుకుంటూ రోడ్డుమీద దూసుకువ స్తున్న ఫైర్ ఇంజన్ల శబ్దం రమణయ్యని ఆలోచనలలోంచి మేల్కొలిపింది. రోడ్డుమీద పరిగెడుతున్న వాహనాలు అన్నీ పక్కకి తప్పుకుని ఫైర్ ఇంజన్లు వెళ్ళడానికి చోటుచే సాయి. దాదాపు పది సెకన్ల తరువాత రోడ్డుమీద వాహనాల రాకపోకలు మామూ లయేయి. రమణయ్య తన నడక కొనసా గిస్తూ యూనియన్ పార్క్‌లోనికి ప్రవేశిం చేడు. క్రితంసారి వచ్చినపుడు యూనియన్ పార్క్ తనకి ఎంతో నచ్చింది. ఇనుపబల్లల మీద బద్ధకంగా ప్రజలు కూర్చుని పేపరు చదువుకోవడమో, కునుకు తీయడమో, లేక తిరుగుతున్న వందల పావురాలకి తిండి విసరడమో ఏది కావాలంటే అది చేస్తూ కనిపిస్తారు. ఒకరకమైన స్తబ్దత, 'లోకం ఎలా పోతేనేం' అన్న ధోరణి ఆ పార్క్ వాతావరణం ప్రతిబింబింపచేస్తుంది.

లంచ్ సమయానికి పార్క్ కిటకిటలాడు తోంది. స్నేహితుడో/ స్నేహితురాలో, భార్యో/భర్తో తెలిసిన వ్యక్తి కోసం నిరీక్షించి వాళ్ళు రాగానే లంచ్ కలిసి తింటూ, వాళ్ళచుట్టూ తిరుగుతున్న పావురాలకి రవ్వంత తిండిపడేస్తుంటే గెంతుకుంటూ ఆనందపడుతూ అవి ఆహారాన్ని తింటు న్నాయి. ఒక స్త్రీ చేతిలో పావురాలకి ఆహారం ఉంచి, గుప్పిడి విప్పగా పావురాలు ఆమె చేతిమీద, భుజంమీద వాలి ఆ గింజల్ని అందుకుంటున్నాయి.

తైలసంస్కారం లేకుండా ఆహారం కోసం చెత్తకుండీలలో పదార్థాలు దొరుకుతాయేమో నని వెతుకుతున్న మనుష్యులని చూడగానే రమణయ్యకి విచారం ముంచుకువచ్చి, లేచి నిలబడి నడక మొదలుపెట్టాడు. వాచీ వేపు చూస్తే దాదాపు రెండు గంటలు చూపి స్తోంది. తను ఇంకా లంచ్ తినలేదని జ్ఞాపకం వచ్చి రోడ్డుమీద అమ్ముతున్న పళ్ళ దుకాణంలో ఒక ఏపిల్, ఒక అరటిపండు కొనుక్కుని లంచ్ అయిందనిపించి ఎదు రుగా బోర్డర్స్ పుస్తకాల దుకాణం కనిపిస్తే దానిలో దూరాడు.

అంత పెద్ద పుస్తకాల దుకాణాన్ని, అంత కుదురుగా, పొందికగా, అందంగా అమర్చి ఉన్న పుస్తకాల షాపుని చూడగానే ఆశ్చర్యం అవధులు దాటింది రమణయ్యకి. న్యూస్‌పే పర్లు, మేగజైన్లు, విభిన్న టాపిక్‌లమీద పుస్త కాలని చూడగానే మతిపోయింది. ఒక మూలగా కాఫీ దుకాణం. ఏ పుస్తకం కావా లంటే దానిని తెచ్చుకుని, కాఫీ తాగుతూ, పుస్తకం చదువుకోవచ్చు. కొందరు కొన్ని గంటలయి అక్కడే ఉన్నట్టుగా కన్పించింది రమణయ్యకి. ఎవ్వరూ ఎవ్వరి గురించీ పట్టించుకోవడంలేదు. చాలా కాలంనుంచీ వెతుకుతున్న నవల కనపడగానే దానిని చదవనారంభించాడు రమణయ్య. కాస్సేపు

దానిలో నిమగ్నమయేక చేతివాచీ వేపు చూస్తే మూడుగంటల నలభై నిమిషాలు చూపిస్తోంది. పుస్తకాన్ని అక్కడే వదిలి కిందకి దిగాడు రమణయ్య.

సాయంకాలం నాలుగు గంటల రైలుకి అందుకోవాలని తొందరగా అడుగులు వేస్తున్నాడు రమణయ్య. ఉదయం తీక్షణంగా ఉన్న సూర్యుడు పలాయన మంత్రం పఠించి మేఘాల వెనుక తల దాచుకుని ఉండడంతో ఉష్ణోగ్రత బహుశా పధ్నాలుగు, పదిహేను డిగ్రీలకి దిగిందేమో అనుకుంటుండగా రివ్వున ఒక గాలి కెరటం వచ్చి రమణయ్యని తాకింది. పొడిగా ఉన్న రోడ్డు మీద అక్కడక్కడా పేరుకుపోయిన దుమ్ము, చిల్లర కాగితాలు. మీదకి లేచి కళ్ళు మూసుకునేలోగా కొన్ని ఇసుక కణాలు రమణయ్య కనుపాపలమీద పడ్డాయి. కళ్ళు నులుముకున్నా కంటిలోనికి చేరిన ఇసుక బైటకి రానడంతో ఇబ్బందిగా చూస్తూ, రోడ్డు దాటుతూ కేల్ట్రెయిన్ రైలుస్టేషన్ దిశగా నడక కొనసాగిస్తూ హోల్సయే వీధి దాటి బ్రిడ్జి కిందకి చేరేటప్పటికి రివ్వున వీస్తున్న చలికెరటాలు రమణయ్యని వణికిస్తున్నాయి. కాలిబాటమీద ఉదయం చూసిన ప్రజ బాగా పల్చపడింది. కొన్ని పెద్ద పట్టణాలలో రోడ్లమీద నివశించే ప్రజలు అందరూ అడుక్కుని తినేవాళ్ళుకారని, అయితే వాళ్ళకి వచ్చే ఆదాయంతో పెద్ద పట్టణాలలో పనిచేసే చోటుకి దగ్గరలో, అద్దె ఇచ్చుకునే స్థోమత లేక, ఇంకేఉపాయం లేక అలా రోడ్లమీద ఉంటారని ధనరాజ్ చెప్పినది జ్ఞాపకానికి వచ్చింది.

"మరి కాలకృత్యాలు ఎక్కడ తీర్చుకుంటారు? " అనడిగాడు తను.

పెద్దపెద్ద బస్‌స్టేషన్లలో, రైలుస్టేషన్లలో, తిండి ప్రదేశాలలో ఉన్న వసతులని వాడుకుంటారు. మరీ బలీయమైన కారణం లేకపోతే తప్ప వీళ్ళని ఆ వసతులు వాడకుండా నిషేధించరని చెప్పాడు ధనరాజ్. ఇక్కడ పేవ్‌మెంట్‌మీద జనాభా తక్కువగా ఉండడానికి కారణం వాళ్ళు పనులకి వెళ్లడమా అని ఆలోచిస్తూ నడక కొనసాగించాడు రమణయ్య. కంటిలో పడిన ఇసుక ఒక మూలకి చేరకుండా ఇంకా రెప్పలనే అంటిపెట్టుకుని రెప్పవేసినప్పుడల్లా మంటని రేకెత్తిస్తోంది.

ఒక్కసారి మేఘాలమధ్యనుంచి సూర్యుడు బైటకి వచ్చి ఎండని అందరికీ పంచిపెట్టడం మొదలుపెట్టాడు. కాంక్రీట్ బ్రిడ్జ్ స్థంభాన్ని ఆనుకుని చొక్కాని ఊడతీసి ఎండ కాచుకుంటున్నాడు ఒకతను. అతని వయస్సు బహుశా ఏభై-ఏభైఐదు మధ్య ఉండవచ్చు ఆ మనిషి రమణయ్య కళ్ళని ఆకట్టుకోవడానికి కారణం, అతని శరీరంమీద కందిగింజ కంటె కాస్త పెద్ద మచ్చలు. మొహంమీద ఆరో ఏడో ఉన్నా, అమ్మవారు వచ్చినట్లు ఒంటినిండా మచ్చలే, పుళ్ళమచ్చలే!

'ఈ ఎయిడ్స్ పేషెంట్లని ఇలా రోడ్లమీద ఉండనివ్వకూడదు. ప్రభుత్వం ఏం చేస్తోంది? ' అంటూ గొణుక్కుంటూ రమణయ్యని దాటి వెళ్లిన ఒక ముసలి జంట అనడం వినిపించి, ఎండలో శరీరాన్ని ఆరబెట్టుకుంటున్న వ్యక్తికి ఎయిడ్స్ వ్యాధి అని అర్థమయింది రమణయ్యకి.

"అవును, ఇలా రోడ్లమీద రోగగ్రస్థులని వదిలేస్తే వ్యాధి ఇతరులకి సోకదూ? " అనుకుంటుండగా "ఎయిడ్స్ వ్యాధి అంటువ్యాధి కాదని ప్రభ్వుతం ఉధృతంగా టెలివిజన్ మీద, రేడియోలమీద, పోస్టర్లు పంచిపెట్టి, డాక్యుమెంటరీలు రిలీజ్ చేసి ప్రజలని హెచ్చరిస్తున్న విషయం జ్ఞాపకానికి వచ్చింది. ఎయిడ్స్ వ్యాధి ఎంతమందికి ఉందో నిర్ధారణగా తెలియకపోయినా ఒక ఐదు నుండి పది లక్షల ప్రజలకి ఉందని కొందరు అంటారు. దాని గురించి బాగా ప్రచారం చేస్తోంది ప్రభుత్వం. ఇండియాలో ముప్ఫయిఐదు మిలియన్ల ఎయిడ్స్ పేషెంట్లు ఉన్నారు. కాని సామాన్య మాన




వునికి దాని గురించి ఏం తెలుసు? ఎయిడ్స్ వ్యాధికి మందులేదని, వ్యాధి ముదరకుండా ఉండడానికి మందులు ఉన్నాయని, కాని అవి సామాన్య పౌరునికి అందుబాటులో లేవని అడపాతడపా ఇక్కడ టెలివిజన్‌మీద చర్చలు జరుగుతూనే ఉన్నాయి. ఇన్సూరెన్స్ కంపెనీలు, ఎయిడ్స్ వ్యాధి ముదరకుండా చూడడానికి అవసరమయ్యే మందుల ఖర్చులు భరించమంటున్నాయి. అలాంటప్పుడు ఉండడానికి ఇల్లేలేని, ఇన్సూరెన్స్‌లేని ఈ రోడ్డుమీద జనాభాలో ఏ ఒక్కరినీ డాక్టరు చూడడు, హాస్పిటల్ దరిదాపులలోనికి రానివ్వరు. ఎంత దారుణం!

అమెరికాలో దుముకుతూ హుషారుగా ఉండేవానిదే బతుకు, జారిపడిన వాని గురించి పట్టించుకోరు! రమణయ్యకి గుండె లోంచి ఒణుకు పుట్టుకువచ్చింది. తాత్కాలికంగా ఈ దేశం సందర్శించడానికి వచ్చిన తనకి మెడికల్ ఇన్సూరెన్స్ లేదు. పెర్మనెంట్‌గా ఈ దేశంలో ఉండిపోగలిగి, ధనరాజ్ మీద తను పూర్తిగా ఆధారపడినపుడు, ధనరాజ్ తండ్రిగా అతని ఇన్సూరెన్స్ పనికివస్తుంది. ఆలోపుగా తను వ్యాధి గ్రస్తుడయితే ఇన్సూరెన్సే లేక డాక్టర్లకు, హాస్పిటల్స్‌కి అయ్యే విపరీతమైన ఖర్చు ధనరాజ్ భరించాల్సి ఉంటుంది. అమ్మో! గుండెలో సన్నని మంటలాంటిది మొదలైంది రమణయ్యకి. నడక ఆపి నాలుగు సార్లు ఊపిరి బలంగా పీల్చి, సేదతీరేక, మంట తగ్గినట్లనిపించింది. మరో ఐదు నిమిషాలలో కేల్ ట్రెయిన్ స్టేషన్‌కి చేరాడు. నాలుగు గంటల రైలు బయలుదేరడానికి సిద్ధంగా ఉంది. గబగబా పరిగెత్తినట్లు రెండు అంగలువేసి, రైలు ఆఖరి పెట్టిలోనికి దూరడమేమిటి రైలు కదిలింది. రద్దీగా ఉన్న మొదటి ఐదు పెట్టెలను దాటుకుంటూ ఆరవ ఖాళీ పెట్టెలో సర్దుకున్నాడు రమణయ్య. ఒక పెట్టెలోంచి ఇంకో పెట్టెలోనికి వెళ్తుంటే, లోపలి ప్రయాణీకులని చూస్తే, అది ఆంధ్రప్రదేశ్‌లో రత్నాచల్ ఎక్స్‌ప్రెస్‌లా అనిపించింది. పెట్టెలనిండా ఏషియన్లే. ముఖ్యంగా హిందూ దేశస్థులే. తెలుగు, అరవం, హిందీ, పంజాబీ భాషలు వినిపిస్తుంటే ఆశ్చర్యంవేసింది. పురుషులే ఎక్కువగా ఉన్నా, స్త్రీలు కూడా భుజాన్ని సంచీవేసుకుని, కంప్యూటర్‌కి సంబంధించిన సంభాషణలో నిమగ్నులయి ఉన్నారు. చాలామంది ఉత్సాహంగా కనిపించినా కొందరు దిగాలుగా ఉన్నవాళ్ళని కూడా చూశాడు రమణయ్య.

దూరంగా ఒక సీటులో కూర్చున్న ఒక అబ్బాయి, అమ్మాయి ఒకరి ప్రక్క ఇంకొకరు కూర్చుని కళ్ళలోనికి కళ్ళుపెట్టి చూస్తూ ఏదో తెగ కులాసాగా మాట్లాడుకుంటుంటే, వాళ్ళు దేని గురించి మాటలాడుకుంటున్నారబ్బా? ఆఫీసు విషయాలా? రాజకీయాలా? లేక ప్రేమ వ్యవహారమా? అంటూ రమణయ్య మెదడు ఆలోచించడం మొదలుపెట్టింది. కాని వెన్వెంటనే "నీ అగనంపూడి సంస్కారపు బుద్ధిపోనిచ్చుకున్నావు కాదు" అంటూ మెదడు దెప్పిపొడవడంతో, సిగ్గుపడుతూ ఆలోచనల్ని కట్టి, మొహాన్ని గాజు కిటికీ వేపుకి మళ్ళించి బైటకి చూడనారంభించేడు. ఆలోచనలు ఆగగానే, కంటిలో ఇసుక ఇబ్బంది విజృంభించగా, 'ఏమైంది కళ్ళకి?' అనుకుంటూ కళ్ళు మూసుకున్నాడు.

ధనరాజ్‌తో కారులో ఇంటికి చేరి బాత్రూం అద్దంలో చూసుకుంటే, రెండు కళ్ళూ పండిన టొమాటో రంగులో కనిపించేసరికి భయంపట్టుకుంది. కంటి కొలకులలో తెల్లని పుసులు చూడగానే కళ్ళ కలక లాంటిదని అర్థం చేసుకున్నాడు. సాయంకాలం ఏడుకావస్తోంది. "ఇప్పుడే వస్తానని" అరగంట క్రితం వెళ్ళిన ధనరాజ్ ఇంకా రాలేదు. మొహం కడుక్కుని దగ్గరగా ఉన్న ఫార్మసీ దుకాణానికి వెళ్ళి అక్కడ కౌంటర్‌లో పని చేస్తున్న ఇండియన్‌ని సహాయం కోరితే, "ఇది కంజక్టివైటిస్, డాక్టర్ ప్రిస్క్రి

ప్షన్ లేనిదే మందు ఇవ్వకూడదు. మీకు ఇన్సూరెన్స్ ఉంటే మీ డాక్టర్‌కి ఫోన్ చేసి మందు అడగండి. ఆయన మాకు ఫోన్ చేస్తారు, అప్పుడు మేము మందు ఇస్తాం" అన్నాడు. ఇన్సూరెన్స్ లేదని చెప్పగా, "కళ్ళు శుభ్రంచేయడానికి ఈ డ్రాప్స్ వాడండి, బైట ఎండలో తిరగకండి. నాలుగు ఐదు రోజులలో అదే మెల్లిగా తగ్గిపోతుంది" అంటూ కంటి డ్రాప్స్ చూపించాడు.

రెండు బాటిల్స్ నాలుగు రోజులు వాడేక కళ్ళు మామూలయ్యాయి. ఇన్సూరెన్స్ లేకుండా ఆ మందు ఖరీదు ముప్ఫయి డాలర్లని కౌంటర్ వ్యక్తి చెప్పినది జ్ఞాపకానికి వచ్చి, ధనరాజ్ తనకి తెలిసిన ఇండియన్ డాక్టర్ సహాయంతో ప్రిస్క్రిప్షన్ సంపాదిస్తానన్నా రమణయ్య ఒప్పుకోలేదు.



ఉదయం ఆరున్నరకి ఆఫీసుకంటూ బయలుదేరే ధనరాజ్ సాయంకాలం ఏడయితే కాని గదికి చేరడు. ఉదయమే నిద్ర లేచే అలవాటున్న రమణయ్య కాలకృత్యాలు తొందరగా ముగించడంతో రోజంతా ఏం చేయాలి? అన్న ప్రశ్న ప్రతీ రోజూ తలెత్తుతుంది. బ్రేక్‌ఫాస్ట్‌చేసి గదిలో అటూ ఇటూ తిరిగి, మధ్యాహ్నం అంతా గడపడం చాలా కష్టంగా ఉంది. ప్రతీరోజూ న్యూస్‌పేపరు కొని క్షుణ్ణంగా చదివినా ఒక గంట కంటే ఎక్కువ పట్టదు. పేపరునిండా ఫలానా వ్యక్తి ఇంకోవ్యక్తి మీద అయిన దానికి, కాని దానికి దావా వెయ్యడం, కేసు కోర్టులో కొన్నాళ్ళు సాగిన తరువాత ఒక మిలియన్ డాలర్లు పరిహారం ఇవ్వవలసిందని జ్యూరీ తీర్పు ఇవ్వడం, ఎక్కడ పడితే అక్కడ చూసి పేపరు చదవాలంటే ఆసక్తి ఉండడం లేదు రమణయ్యకి.

ఇన్సూరెన్స్! ఇన్సూరెన్స్! ప్రతీదానికీ ఈ దేశంలో ఇన్సూరెన్స్ అవసరం లేకపోతే జీవితం సాగదు, అనుకుంటుంటే శాన్‌ఫ్రాన్సిస్కో దగ్గర కనిపించిన ఎయిడ్స్ వ్యాధిగ్రస్థుడు జ్ఞాపకానికి వచ్చి మనస్సు మూలిగింది. ఇంకేం చేయడానికీ పాలుపోక టెలివిజన్ ఆన్ చేశాడు. దేశంలో కంప్యూటర్ ఉద్యోగాలకోసం వీసా నెంబర్లు పెంచడం మంచిదని కొందరు, మంచిది కాదని కొందరు వాదించుకోవడం కాస్సేపు విన్నాడు. అమెరికా దేశానికి మంచి కాకపోతే అనవసరంగా వీసా నెంబరు ఎందుకు పెంచుతారు? అమెరికాకి మంచిదైనా కాకపోయినా ఇండియానుంచి వస్తున్న కంప్యూటర్ పట్టభద్రులకి అది బాగా సహాయం చేస్తోంది. గత నాలుగైదేళ్లలో దాదాపు మూడు లక్షల మంది ఇండియానుంచి వచ్చారని అంచనా! అమెరికాకి వచ్చిన వాళ్ళని వదిలేస్తే ఇండియాలో ఉద్యోగ అవకాశాలు పెరిగేయా? తగ్గేయా? అమెరికాకి రాకుండా ఇండియాలో ఉన్న ఇంజనీర్లకి, ఇతర సాంకేతిక నిపుణులకి ఇప్పుడు పరిస్థితి ఎలా ఉంది? అని ఆలోచిస్తుంటే చీకటిపడింది.

"నాన్నా, నీకు బాగా బోర్ కొట్టిందా?" అంటూ ధనరాజ్ కంప్యూటర్ సూట్‌కేస్ మోసుకుంటూ లోపలికి వచ్చాడు.

"ఫరవాలేదు. బాగానే మేనేజ్ చేస్తున్నాను" అన్నాడు రమణయ్య.

"నేను ఒక వారం సెలవు తీసుకుందామనుకుంటున్నాను. కారులో తిరుగుతూ దగ్గరగా ఉన్న ప్రదేశాలు చూద్దాం. తిరిగి వచ్చాక ఒకవారం రోజులు కేంప్, అప్పటితో ఇక్కడ పని అయిపోతుంది. మనం న్యూజెర్సీ వెళ్ళవచ్చు స్నానం చేసి వస్తాను" అంటూ తువ్వాలుతో బాత్రూంలోనికి ప్రవేశించాడు ధనరాజ్.

"ఏమిటోయ్ ఈ పరుగులు? నిలకడగా ఒకచోట ఉండే ఉద్యోగాలు ఉండవా?" అనడిగాడు రమణయ్య స్నానం చేసివచ్చి ఎదురుగా సోఫాలో కూర్చుంటున్న ధనరాజ్ ని.

"లేకేం ఉంటాయి. కానీ వాటిలో ఒక రకమైన యాంత్రికత ఉంది. ఛాలెంజ్ తక్కువ. నన్ను నా కంపెనీ ఇతర కంపెనీలకి కన్సల్టెంట్ గా పంపుతుంది. వాళ్ళ సమస్య సాల్వ్ చేశాక, నన్ను ఇంకొకచోటుకి పంపుతుంది. అక్కడ ఇంకోరకమైన కొత్త సమస్య. నెలనెలకీ కంపెనీలకి నన్ను పంపడం వలన నాకు మంచి విభిన్నమైన అనుభవం వస్తోంది. పని తొందరగా నేర్చుకోవాలంటే ఇదే మార్గం. అదీకాక జీతాలు ఎక్కువ" అంటూ టెలివిజన్ ఆన్ చేశాడు ధనరాజ్. ఛేనల్స్ మారుస్తూ అమెరికన్ ఫుట్ బాల్ నడుస్తున్న ఛేనల్ దగ్గర ఆగి, "న్యూయార్క్ జయంట్స్ కి, ఫార్టీనైనర్స్ కి మధ్య జరిగే మేచ్ చాలా రసవత్తరంగా ఉంటుంది. రంజిత, నేను ఒకసారి ఫుట్ బాల్ మేచ్ చూశాం" అంటూ సోఫాలో సర్దుకుని, ఆట చూడడంలో నిమగ్నుడయేడు ధనరాజ్. పది నిమిషాలు గడిచేసరికి ఆ ఆట అర్థమవక బోరుకొట్టడంతో ఎదురుగా టీపాయ్ మీదున్న రీడర్స్ డైజెస్ట్ అందుకున్నాడు రమణయ్య. అరగంట గడిచింది. ఫుట్ బాల్ ఆటలో లీనమైన ధనరాజ్ ని చూస్తుంటే దాదాపు పదిహేనేళ్ళక్రితం జరిగిన సంఘటన మదిలో మెదిలింది. అప్పుడు ధనరాజ్ వయస్సు పదమూడు కాబోలు. ఆదివారం ఉదయం పదిగంటలకి తను పేపరు చదవడంలో లీనమయి ధనరాజ్ ఉనికిని పట్టించుకోలేదు. కాస్సేపు గడిచేక,

"నాన్నా, నువ్వు అలా పేపరులో తల దూర్చుకుంటే నా మాటేమిటి? రా కేరమ్స్ ఆడదాం" అన్నాడు ధనరాజ్.

"అలాగే ఆడదాం, ముందు ఈ పేపరు చదవడం పూర్తిచేయనీ" అన్నాడు తను ధనరాజ్ ని, బుజ్జగిస్తూ.

"నాన్నా ఇప్పుడు మనకున్నకాలం వృథాపరిస్తే, తరువాత అది కావాలన్నా తిరిగి రాదు" అన్నాడు పదమూడేళ్ళ ధనరాజ్. అవాక్కయ్యాడు తను, ఒక్కసారి ధనరాజ్ చేయి అందుకుని,

"మంచి మాటన్నావు. నువ్వు అన్న ఈ మాట నాకు చాలాకాలం జ్ఞాపకం ఉంటుంది" అన్నాడు రమణయ్య తృప్తిగా, ఆనందంగా. ఒక గంటసేపు కేరమ్స్ ఆడుకున్నారు ఇద్దరూ ఆరోజు. పదమూడేళ్ళ వయస్సులోనే అంత పరిణితి చెందిన ధనరాజ్ కి, పదిహేనేళ్ళు గడిచాక ఆనాటి సంఘటన జ్ఞాపకం ఉందా? తనకు సమవయస్సు వాళ్ళు ఉన్నా, పుత్రునితో తండ్రి కాలం గడపాలని వివరించిన ధనరాజ్ కి, దేశంకాని దేశం వచ్చి పగలంతా ఇంటిలో ఒంటరిగా ఉన్న తనతో టైమ్ గడపాలన్న సంగతి తట్టదా? లేక ఫుట్ బాల్ మేచ్ మళ్ళీ తిరిగి రాదన్న భావనా? గదిలో ధనరాజ్ ఎదురుగా ఉన్నా, టెలివిజన్ పెద్ద శబ్దంతో నడుస్తున్నా రమణయ్యలో ఒంటరితనం కమ్ముకోనారంభించింది. మెల్లిగా లేచి చెప్పులు వేసుకుని తలుపు తెరచుకుని బైటకి వెళ్తున్న తనని ధనరాజ్ గమనించలేదు.

అక్టోబర్ మాసం చల్లని గాలి కాళ్ళ వేళ్ళని తాకగానే శరీరం ఒక్కసారి కుంచించుకుంది. బైటవేసుకున్న స్వెట్టర్ లోంచి చలి లోపలికి వచ్చి వెచ్చని రమణయ్య శరీరం మీద చలి కాచుకోవడం మొదలుపెట్టింది. దాదాపు నలభైఐదు నిమిషాలు తిరిగి గదికి

వచ్చేసరికి, ఫుట్ బాల్ ఆట ముగిసింది.

"అదేమిటి నాన్నా చెప్పాపెట్టకుండా వెళ్ళావు, రా అన్నం తిందాం" అన్నాడు ధనరాజ్.

"నువ్వు సీరియస్‌గా ఫుట్ బాల్ చూస్తుంటే, నిన్ను అనవసరంగా డిస్టర్బ్ చేయడమెందుకని" అంటూ రమణయ్య నసిగాడు.

"నాన్నా చేతికి గ్లవ్స్, కాళ్ళకి మేజోళ్ళు, జోడు వేసుకోకుండా బయటకు వెళ్తే తరువాత అవి తెగ బాధపెడతాయి" అంటూ నొచ్చుకున్నాడు ధనరాజ్.

"నాన్నా చాలా రోజులనుంచి నీకు రాద్దామనుకున్నా, నువ్వు ఎలా అర్థంచేసుకుంటావో ఊహించలేక ఇన్నాళ్లూ రాయలేదు. ఇది చాలా పాత విషయం, గతం. ఉద్యోగస్తుల కోసం, ఉద్యోగాల కోసం ఇక్కడ అడపాదడపా జరిగే ఫెయిర్‌లో రంజితని కలిసేను. కంపెనీలలో ఖాళీలు ఉంటే ఒక బల్లలాంటిది వేసుకుని కంపెనీ ప్రతినిధులు కూర్చుంటారు. కంపెనీ గురించి వాకబుచేయడానికి వచ్చిన అభ్యర్థులతో ముచ్చటిస్తూ, మొదటి ఇంటర్వ్యూ లాంటివి పూర్తిచేస్తారు. రెండు గంటలపాటు అటూఇటూ తిరుగుతున్నపుడు, ఫుల్ సూట్‌డ్రెస్‌లో చలాకీగా తిరుగుతున్న రంజితతో పరిచయం అయింది. ఢిల్లీలో కంప్యూటర్ సైన్స్ డిగ్రీ పుచ్చుకుని రంజిత అమెరికావచ్చి అప్పటికి రెండు సంవత్సరాలయింది. కంపెనీలో పనిచేస్తున్న ఇతర స్నేహితులు, స్నేహితురాళ్లతో కలిసి ఉంటున్న రంజిత చాలా ధైర్యవంతురాలు, చురుకైనది. మధ్యాహ్నం లంచ్ కలిసి తిన్నాం, పరిచయం మొదలైంది. ఆ తరువాత వీలుదొరికినపుడు సినిమాలు కలిసి చూడడం, ప్రదేశాలకి కలిసి వెళ్ళడం ఎక్కువయ్యాక రిజిస్టర్ పెళ్ళి చేసుకున్నాం.

ఆరు నెలలు ఆనందంగా గడిచాయి" అంటూ ఆగి, శూన్యంలోనికి చూస్తూ మెల్లిగా తిరిగి అందుకున్నాడు ధనరాజ్. "రంజిత పంజాబీ రాష్ట్రానికి చెందిన మాంసాహారి, నేను శాకాహారిని. అయినా ఆ భేదాలు మాకు ఇబ్బందిని కలిగించలేదు. కాని రోజులు ఒక్కలా ఉండవు కదా! రంజిత పనిచేస్తున్న కంపెనీ తన నూజెర్సీ ఆఫీసు మూసేసి, డల్లాస్‌లో ఆఫీసు తెరవడంతో ఇబ్బందులు మొదలయ్యాయి. న్యూజెర్సీలో నేను, రంజిత పని చేస్తున్నపుడు ఇల్లు కొన్నాను. ఇల్లు కొన్న ఆరు నెలల వ్యవధిలోనే రంజిత డల్లాస్‌కి మారింది. అమెరికాలో ఇళ్లు దాదాపు ఎనభైశాతం బ్యాంక్ నుంచి అప్పుగా కొంటారు. ప్రతీనెలా అప్పు తీర్చడానికి డబ్బు కట్టాలి. ఇద్దరూ పనిచేస్తుంటే ట్యాక్స్ ఎక్కువగా కట్టకుండా ఆదా చేయాలంటే, ఇల్లు కొనడం ఒక మార్గం. మరీ ఎక్కువ ఆలోచించకుండా కాస్త ఖరీదైన ఇల్లు కొనడం మేం చేసిన తప్పు. ఇద్దరమూ వేరువేరుగా నివశించడంతో ఖర్చులు పెరిగాయి. ఇల్లు అమ్మేద్దామంటే చాలా నష్టం భరించాల్సి వస్తుందని తెలిసింది. ఆ రోజుల్లో నేను ఒక డాట్‌కామ్ కంపెనీకి పని చేసేవాడిని, పనిలో ఒత్తిడి ఎక్కువ. వారాంతాల్లో న్యూజెర్సీ వచ్చిన రంజితతో కూడా కాలం గడపడానికి కూడా వీలవనంత పని. ఒకసారి డల్లాస్ నుంచి న్యూజెర్సీ వచ్చి వెళ్లడానికి దాదాపు నాలుగు వందల డాలర్ల ఖర్చు. డబ్బుకి ఇబ్బంది పెరగడంతో రంజిత న్యూజెర్సీ వచ్చి వెళ్ళడం తక్కువయింది. ఆరునెలలు అలా గడిచాయి. ఒకసారి రంజితను చూడడానికి డల్లాస్ వెళ్తే, ఆమె కొత్తగా కనిపించింది. అపరిచిత వ్యక్తిని చూసినట్లనిపించింది.

"హలో, నేను జ్ఞాపకం ఉన్నానా? " అంది ఇల్లు చేరగానే. పరాచికంగా ఆ మాట అన్నా, దానిలో ఉన్న వ్యంగ్యం నన్ను విచలితుని చేసింది. రెండు రోజులు గడిపి నూజెర్సీ రాబోతుంటే.

"నువ్వు అక్కడ నేను ఇక్కడ ఏమీ బాగులేదు. నేను మా కంపెనీ టైగే ప్రెసిడెం





ట్‌తో మాట్లాడాను. బతిమిలాడేను. న్యూజెర్సీ దరిదాపులలో వాళ్ళకి ఏమీ ప్రోజెక్ట్స్ లేవుట. ఇహ రెండు మార్గాలున్నాయి. ఒకటి, నేను ఈ ఉద్యోగం మానేయాలి. తప్పితే నువ్వు ఇక్కడకి రావాలి. నా కెరియర్ దృష్ట్యా ఈ ఉద్యోగం మానడం జరగనిపని. అందుచేత నువ్వు ఇక్కడకి రావడం గురించి ఆలోచించు" అంది.

అవాక్కయ్యాను. కాస్సేపటిలో తేరుకుని, "న్యూజెర్సీలో ఇల్లు అమ్మే ప్రయత్నం చేసినా సరిఅయిన ధర రావడంలేదు. డల్లాస్‌లో నాకు సరిపడే నచ్చిన ఉద్యోగం కనిపించడం లేదు, అయినా ప్రయత్నిస్తాను" అన్నాను.

"చేసేదేదో త్వరగా చెయ్యి. నాలో ఉన్న సహనం త్వరితంగా ఇంకిపోతోంది. అంత కన్నా వివరంగా, ఖండితంగా నేను ఏమీ చెప్పలేను" అంది రంజిత.

రంజిత నాకు దూరమయిందని, మా మధ్య దూరం ప్రతిక్షణమూ పెరిగిందని రెండు నెలల తరువాత ఆమె దగ్గరనుంచి వచ్చిన ఉత్తరం తెలియచెప్పింది. తనతో ఆఫీసులో పనిచేసే వ్యక్తి పరిచయమయ్యాడని తనంటే ఆసక్తి కనబరుస్తున్నాడని, జీవితంలో తను ఒక కూడలి దగ్గర ఉన్నానని, ఎలాంటి ఘలుపుకి తిరుగుతానో చెప్పలేనని రాసింది. అదే సమయంలో నేపనిచేసే డాట్‌కామ్ కంపెనీ మూతపడింది. తీరని ఆవేదన, డిప్రెషన్. రంజితను కలుద్దామనుకునేంతలో రంజిత లాయర్ దగ్గరనుంచి విడాకులు కోరుతూ నోటీసు వచ్చింది. నేను ఒంటరినయ్యాను. క్రితంసారి నువ్వు అమెరికా వచ్చినప్పటికే రంజిత నాకు దూరమయింది. కేవలం రెండు సంవత్సరాలు మాత్రమే. అందులో చాలా భాగం విడివిడిగా, వివాహితులుగా ఉన్నాం. అందుచేత రంజితతో విడిపోయినా, ఆ షాక్‌నుంచి త్వరగానే కోలుకున్నాను" అంటూ ముగించాడు ధనరాజ్. రమణయ్య బైటకి ఏమీ ఆందోళన వ్యక్తపరచలేదు.

రమణయ్య స్వతహాగా మితభాషి. తన మనస్సులో ఉన్నది వ్యక్తపరచడు బైటకి. కాని అతని స్వాధీనంలో లేకుండా మొహంలో విచారం కానవచ్చింది. రంజిత, ధనరాజ్ లు విడాకులు తీసుకోవడం ఎంతవరకు సమంజసం? ఇద్దరూ జీవితాన్ని పంచుకోవడానికి నిశ్చయించుకున్నప్పుడు రాజీలు తప్పవుకదా! ఈ ఉదంతంలో ధనరాజ్ తప్పు ఎంత? రంజిత తప్పు పాలు ఎంత? లేక ఇదంతా కేవలం పరిస్థితుల ప్రభావమా? దీనినే "విధి" అని భగవంతుని లీలగా వదిలేయవచ్చా? యవ్వనంలో ఉన్న రంజిత అటుకీ ఇటుకీ చెందకుండా రోజులు వెళ్ళదీస్తున్న ధనరాజ్‌ని ఎంత కాలం నమ్మగలదు? రోజులు మారేలా చేస్తానని నడుంకట్టి మార్పుకోసం ప్రయత్నించని ధనరాజ్ మీద ఆశ ఎన్నాళ్ళు నిలపగలదు? అందుచేత రంజితని తప్పు పట్టలేం. ఆర్థిక ఇబ్బందులు, ఉద్యోగం పోవడం ధనరాజ్‌కి వచ్చిన ఇబ్బందులు. అదీకాక ప్రయత్నం చేసినా డల్లాస్‌లో ఉద్యోగం దొరకలేదు. అంటే నష్టానికి ఇల్లు అమ్మి, ఉద్యోగం లేకుండా రంజితమీద పూర్తిగా ఆధారపడడానికి డల్లాస్ వెళ్ళివుండాలి. అది అలా ఉంచినా, కెరియర్ ముఖ్యమంటూ డల్లాస్ వెళ్ళిన రంజిత కెరియర్ కంటే ధనరాజ్ కెరియర్ తక్కువ ముఖ్యమా? అందుచేత ధనరాజ్‌నీ తప్పు పట్టలేం. ఇది తన తప్పుడు ఊహే కావచ్చు

"ఇంకోదారి లేదు, అందుచేత సర్దుకుపోవాలి!" అన్న ఊహ అమెరికాలో అతితక్కువగా కనిపిస్తుంది.

'సర్దుకుపోవడం' గత్యంతరం లేనప్పుడు జరిగితే, అది 'సర్దుకుపోవడమా?' తనే ఇష్టపడి తిరిగీ సహచరునికోసం, కుటుంబంకోసం సర్దుకుపోవడం తను హర్షిస్తాడు. కాని తప్పనిసరి అయి అది జరిగితే అది

బానిసగా జీవితం ఎన్నుకోవడం. తను దానిని సమర్థించడు. కాని పరిస్థితి తనది కాదు. ఏది తప్పు? ఏది ఒప్పు? అన్న ప్రశ్న అడిగే అర్హత తనకి లేదు. అది జరిగి రెండేళ్ళయింది. ధనరాజ్ మళ్ళీ ప్రేమలో పడ్డాడా? తిరిగి పెళ్లిచేసుకున్నాడా? పెళ్లిచే సుకుని ఉంటే తనతో చెప్పేవాడుకదా అను కుంటుంటే, క్రితంసారి పెళ్లిచేసుకున్నప్పుడు తనకి చెప్పలేదు అన్నది జ్ఞాపకానికి వచ్చింది. ప్రేమలోపడి పెళ్లి చేసుకుని కొన్నాళ్లు కాపురంచేసి తరువాత విడాకులు పుచ్చుకున్నాక తిరిగి కొత్త వ్యక్తితో పడడం సాధ్యమా? ఈ దేశంలోనే ఎందుకు ఇలా జరుగుతోంది? ఇండియాలో ఇవి ఎందుకు సామాన్యం కావు? పిల్లలు తమంతట తాము ధైర్యంగా నిర్ణయాలు తీసుకోవడం ఈ దేశంలో జరిగినట్లు ఇండియాలో ఎందుకు జరగదు? ! అనుకుంటుంటే పరమ శివం తన కూతురు కర్నాటక రాష్ట్రంనుంచి వచ్చి అమెరికాలో పనిచేస్తున్న కుర్రవాడిని ఈమధ్యే పెళ్ళిచేసుకుందని చెప్పినప్పుడు అతని జేవురించిన మొహం జ్ఞాపకానికి వచ్చింది.

మొదటిసారి ధనరాజ్‌ని చూడటానికి అమెరికాకి వస్తూ ఢిల్లీలో పరమశివం ఇంట బసచేశాడు.

"ఒరే రామం, నువ్వు ఎన్నయినా చెప్పు. అమెరికా వెళ్ళిన మన పిల్లలకి దూరదృష్టి లేదురా. నువ్వు వెళ్తున్నావుగా, మా అమ్మా యిని ఒకకంట కనిపెట్టి చూస్తూవుండు" అన్నాడు పరమశివం తన కూతురి గురించి ప్రస్తావిస్తూ.

"ఏం జరిగిందేమిటి? " అనడిగాడు తను.

కాలుస్తున్న పైప్ నోట్లోంచి తీసి కింద వుంచి, "రాహుల్" అంటూ సింహగర్జన చేశాడు పరమశివం. పరిగెత్తుకుంటూ వచ్చిన రాహుల్‌తో,

"ఆ పైప్ శుభ్రంచేశాక మేడమీద గదిలో పొగాకు ఉంది తీసుకురా" అంటూ హుకుం జారీచేశాడు.

రాహుల్ పరమశివం చేతిలో ఉన్న పైప్ అందుకుని గబగబా అడుగులు వేసి మేడ మెట్లు ఎక్కుతుంటే,

"ఆ పొగాకేదో ఇక్కడే ఉంచుకుంటే బాగుంటుందేమో. ఈ చిన్నపనికి దాదాపు అరవైఏళ్ళ దరిదాపులలో ఉన్న అతనిని పిల వడమేమిటి? " అనడిగాడు తను.

"ఈ వెధవలకి పనీపాటా ఏమీలేదు. ఔట్ హౌస్‌లో అప్పనంగా నివశిస్తున్నందుకు ఆ మాత్రం పనిచేయించుకోకపోతే ఎలా? "

"ఔట్ హౌస్‌లో ఉండనిచ్చినందుకు రాహుల్ నీకు అత్యవసరమయితే పనిచే యడం సరే. కాని అవసరం లేని పనిక ల్పించి అతనిచేత ఆ పనిచేయిస్తున్నావేమో" అన్నాడు తను. తనవేపు విచిత్రంగా చూశాడు పరమశివం.

"ఆడా-మగా, ధనవంతుడు-బీదవాడు, తెలి వైనవాడు-తెలివి లేనివాడు, పనిచేయించుకు నేవాడు- పనిచేసేవాడు, యజమాని-నౌకరు ఎట్ సెటరా రెండు తెగలుగా విభజన చేస్తాం. రాహుల్ అలా అవడానికి వాడి కర్మ అను, ఇంకేమైనా అను. కాని వాడు పనిచేసేవాడయ్యాడు. వాడిచేత పనిచేయిం చుకోవడంలో తప్పులేదు. అయినా వాడి గురించి చర్చ ఏమిటి? మా అమ్మాయి అనిత గురించేగా మనం మాట్లాడుతోంది. ఇక్కడనుంచి అక్కడికి వెళ్ళి రెండు సంవత్స రాలయింది, అప్పుడు రెండు ఉద్యోగాలు మార్చింది. పని బాగుండదని ఒకసారి, కొత్త కంపెనీ ముందు ముందు వృద్ధిలోనికి వచ్చే ఆస్కారం ఉందని ఇంకోసారి కార ణాలు చెప్పింది. ఐ డోంట్ లైకిట్! ఇలా త్వరత్వరగా కంపెనీలని మార్చితే, పని సరిగ్గా చేతకాక కంపెనీలు మారుస్తోందను కుంటారు. వీళ్ళకి ఏమీ తెలియదు" అన్నాడు పరమశివం.

"నీకు ఆ కంపెనీల గురించి ఏమైనా తెలుసా? ఏమో, ఆమె చెప్పిన దాంట్లో





నిజం ఉందేమో" అన్నాడతను.

మరోసారి అదే విచిత్రమైన చూపు తన వేపు చూశాడు పరమశివం.

"పెద్దవాళ్ళం మనకంటే ఈ కుర్రసన్నాసులకి ఏం తెలుస్తుంది రామం? అనుభవం నేర్పిన పాఠం మనది. అది తప్పు అవడానికి ఆస్కారమే లేదు. వాళ్ళకి ఆ సంగతి అర్థమైచావదు. నువ్వు ఒకసారి అనితతో ఈ సంగతి చెప్పు" అన్నాడు పరమశివం.

నోట మాట పెగలలేదు తనకి.

మౌనం అంగీకారంగా తీసుకుని పైపులో దట్టించిన పొగాకుని లైటర్‌తో వెలిగించి గుప్‌గుప్‌మని పొగని బైటకి వదిలాడు పరమశివం.

రమణయ్య మెదడు గతంలోనికి దౌడుతీసింది. ఇంజనీరింగ్ చదివేరోజుల్లో పరమశివం చదువులో అంతంతమాత్రమే. కాని ఇంగ్లీషు నవలలు తెగచదివేవాడు. డిక్షనరీని చెదపురుగు తినేసినట్లు తినేసేవాడు. అతని ఇంగ్లీషు పాండిత్యం ఎంత ఉందో అంచనా వేయకపోయినా తను పెద్ద పండితుడనని ప్రదర్శించడానికి తెగ తహతహ లాడేవాడు. ఇంగ్లీషు పేపర్లు రాసి ఐ.ఏ.ఎస్. అవుదామని అతని సంకల్పం. రెండవసారి చేసిన ప్రయత్నం ఫలించి అతనికి సెంట్రల్ సర్వీసెస్‌లో ఉద్యోగాన్నిచ్చింది. తనకే అంతా తెలుసుననుకునే అతనికి ఆ ఉద్యోగం అతికినట్లు సరిపోయింది. రెండు ఇంగ్లీషు పేపర్లు. అదీ మొదట్లోనే బాగా రాయడం తప్ప ఇంకే ఇతర క్వాలిఫికేషన్లు అక్కర్లేకుండా కాలంతోపాటు అధికారం పెరగడంతో వందిమాగధుల అవసరానికి మించిన పొగడ్తలకి అలవాటయి, అహం అనే మొక్క మహావృక్షమైంది.

"రాహుల్... ఆ గదిలో అగ్గిపెట్టి ఉంది పట్టుకురా" అని అరిచాడు పరమశివం. తుళ్ళిపడి వాస్తవంలోకి వచ్చాడు తను.

పరిగెత్తుకుంటూ అగ్గిపెట్టె అందిచ్చాడు రాహుల్.

"మరో కప్పు కాఫీ, వేడిగా ఉండాలి త్వరగా తీసుకురా" అంటూ మరో హుకుం జారీచేసి పైప్ వెలిగించాడు పరమశివం. "రామం, నువ్వు చెబితే నమ్మవు. డిపార్ట్‌మెంట్‌లో ఒక్కడికీ ఓం అంటే ఢం రాదు. తెలుసా?" అంటూ పైప్‌లోంచి పొగ బైటకి వదిలాడు పరమశివం.

జీవితంలో పరమశివంది ఒక్కటే దృక్పథం. తనకి అందరూ సహాయం చేయాలి. అది వాళ్ళపని. తను ఇతరులకి పని సహాయం చేయనవసరంలేదు. "ఐ డిసర్వ్ ఇట్. అది రాసిపెట్టి ఉంది" అనుకుంటాడు. అదే ప్రదర్శిస్తాడు. చరిత్రలో హిట్లర్ ప్రజలని తను చాలా గొప్పవాడినని, తను చెప్పినదే కరక్టైనదని పదేపదే చెప్పి, వందిమాగధులచేతచెప్పించి ప్రజలని నమ్మించినట్లు, పరమశివం తను చక్రవర్తి లాంటివాడినని చెప్పుకుంటుంటే పరమశివం భార్య మీనాక్షికి కాలంతోపాటు క్రమేణా అది నమ్మకం కింద మారింది. పరమశివం చెప్పిందే వేదం ఆమెకి ఇప్పుడు.

"నువ్వు స్నానంచేసి వచ్చేయ్. బ్రేక్‌ఫాస్ట్ చేద్దాం" అని, "రాహుల్ బాత్రూంలో అన్నీ అమర్చేవా?" అనడిగాడు పరమశివం.

పరమశివం ఆఫీసుకి వెళ్ళాక రాత్రి ప్రయాణానికి సూట్‌కేస్ సర్దుకుంటుంటే, "మీరు చికాగోమీదుగా వెళ్తారట. కంచి నుంచి తెప్పించిన ఈ చీర మా అమ్మాయి ఎయిర్‌పోర్ట్‌కి వచ్చినప్పుడు ఆమెకి అందచెయ్యండి" అంటూ ఒక చిన్న ప్యాకెట్ అందిచ్చింది. ప్యాకెట్ అందుకుని దానిని సూట్‌కేస్‌లో సర్దాడు తను.

చికాగో ఎయిర్‌పోర్ట్‌లో ప్లేన్‌దిగి కొత్త ఫ్లైట్‌కి గేట్ మారి ఆఖరిక్షణంవరకూ ఎదురుచూసినా పరమశివం కూతురు అనిత కనిపించలేదు. నాలుగురోజులు గడిచాక అనితకి పోస్ట్‌లో ఆ ప్యాకెట్ పంపించాడు. దరిమిలా, "అంకుల్ నేను అనితని. మీరు తీసుకువచ్చిన ప్యాకెట్ అందింది. థాంక్స్

పోస్టల్ ఖర్చులు మీ చేతికి పడ్డాయి. మా అమ్మకి చాలాసార్లు చెప్పాను. నాకు ఏమీ పంపవద్దని. అయినా వినదు, వాళ్ళ ధోరణి వాళ్ళదే" అంది అనిత ఫోన్‌లో పరమ శివం, మీనాక్షిలు బాగున్నారని చెప్పాక,

"ఉద్యోగాలని తొందరగా మారుస్తున్నా వని అలా చేసేటప్పుడు బాగా ఆలోచించి చేయాలని మీ నాన్న నీకు చెప్పమన్నారు" అన్నాడు తను.

"అంకుల్ వాళ్ళకి ఇక్కడ ఉద్యోగ వాతా వరణం పరిస్థితుల గురించి ఏమీ తెలి యదు. వాళ్ళకి తెలిసినది ఆ కాకానగర్, లోడీ రోడ్, ఆఫీసులో పనిచేసే కింద ఉద్యో గుల సలహాలు. తాము చదువుకున్నకా లంలో ఇండియాలో ఉన్న జ్ఞానాన్ని వాడి తమకే అంతా తెలుసునన్నట్టు, ఇక్కడ నేను ఏంచేయాలో, ఎలా మసలుకోవాలో సలహా ఇస్తారు. వాళ్ళ సలహా ప్రకారం నడిస్తే, నేను ఒకే ఉద్యోగంలో ఎదుగూ బొదుగూ లేకుండా ఉండిపోతాను. తతిమ్మా ప్రపంచం కళ్ళు విప్పేసరికి చాలా ముందరికి వెళ్ళిపోయి ఉంటుంది" అంటూ కుండబ ద్దలు కొట్టింది అనిత.

ఖండించడానికి ఏమీలేక మౌనంగా ఉండి పోయాడు. కాస్సేపు ఆగి, "తల్లితండ్రులు పిల్లల క్షేమం, జీవితంలో అభివృద్ధినే కాంక్షి స్తారు. వాళ్ళు చెప్పినది నీ చెడుకోసం కాదు కదా? " అన్నాడు రమణయ్య.

"మీరు ఈ దేశంలో మూడు నాలుగు నెలలు గడపడానికి వచ్చారు. మీరే చూస్తారు ఇక్కడ ఆలోచనాసరళిని. మీరన్నది నిజమే కాదనను. పిల్లలు వాళ్ళ దృష్టిలో తాము చెప్పినట్లే నడుచుకుంటూ పెరిగి, తాము ఎంపికచేసిన కుర్రవాడిని కులం, మతం, సాంప్రదాయం తమకి నచ్చాక పెళ్లి చేసుకుంటే ఆ వ్యక్తికి కూతురి బాధ్యత అప్పచెప్పి తాతముత్తాతలనుంచి వస్తున్న ఆచారంలాగే ఓ ఇద్దరు పిల్లల్ని కని, వాళ్ళని తల్లిదండ్రులు పిల్లల్ని పెంచి నట్లే పెంచాలి. చాలామందికి ఇదే తప్ప ఇంకేరకమైన జీవనం ఉంటుందన్న ఊహ రానివ్వరు. తల్లిదండ్రులు తమ కలలని పిల్లలద్వారా తీర్చుకుందామని ప్రయత్ని స్తారు. అంతే" అంది రవ్వంత విచారంతో. ఒక్కసారి పరమశివం జ్ఞాపకానికి వచ్చాడు. అతని ఆలోచనలకి పూర్తిగా విరుద్ధమైన ఆలోచనలున్న ఈ కూతురు!

"పిల్లల్ని పెళ్లి చేసుకోమంటూ బలవంత పెట్టలేదుగా! తల్లిదండ్రులు నాలుగైదు సంబంధాలు తెచ్చి వాటిలో నీకు నచ్చినదా నిని ఎన్నుకోమంటారు. అది నీకు ఎన్నుకో వడానికి అవకాశం ఇచ్చినట్టు కాదా? "

పకపకా నవ్వింది అనిత.

"మీరు బజారుకి కూరలకోసం వెళతారు. అక్కడ కుళ్ళిన దొండకాయలు, పుచ్చిన వంకాయలు, గిడసబారిన బెండకాయలు చూపించి వీటిలో ఏదో ఒకటి ఎన్నుకో మంటే అది తనకి నచ్చిన కూర ఎలా అవు తుంది".

"అయితే పెద్దలు చెప్పినవన్నీ ఇలాంటివే నంటావా? "

"పిల్లలు బాగుపడాలని తల్లిదండ్రులు కాంక్షించడంలో తప్పులేదు. కానీ వాళ్ళ ఆలో చనలే సరి అయినవని మంకుపట్టి, వాటిని ఆచరించకపోతే తమకి విలువ ఇవ్వటంలేదని వాపోతే ఇబ్బంది. మన అనుభవాల్ని బట్టి నిర్ణయించిన మంచి ఎదుట వ్యక్తి అనుభ వాన్ని బట్టి నిర్ణయించుకున్న మంచి ఒక్కటే అవనవసరంలేదన్న సత్యం చాలామంది జీర్ణిం చుకోలేరు" అంటూ తరం తరం మధ్యనున్న ఆలోచనాసరళిలో తేడా వివరించింది అనిత.

"మంచి, చెడు విచక్షణ తెలిసినదానివి నీకు సలహా అనవసరం" అంటూ నవ్వుతూ ఫోన్ ఉంచాడు.

పరమశివం అభిప్రాయాలు, తనవీ ఎప్పుడూ ఎదురెదురువి. నాలుగేళ్లు కలిసి తిరిగినందువలన పరిచయం బాగా పెరిగిన మాట నిజమైనా, తమ ఇద్దరి మధ్య




# రచయితలకు మనవి



- ★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకథలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు. గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.
- ★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**
- ★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**
- ★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటు తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.
- ★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.
- ★ **ప్రతి నవలకు అందజేసే రు: 3000/– పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

**ఎడిటర్:**

# చతుర

**'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.**




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై చతుర నమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు నకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షల కు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రను మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

అక్టోబర్ చతుర నవల అంచుకీ అంచుకీ మధ్య ............

సమీక్షకుని పేరు: ..........................................

చిరునామా: ..........................................

..........................................

..........................................

..........................................

స్నేహం చిగురించడానికే నాలుగేళ్లు పట్టింది. కాని కొందరితో స్నేహం అరటి పిలకలా చకచకా పెరుగుతుంది. ఒకటే రకమైన ఉద్దేశాలు ఉన్న ఇద్దరి మధ్య స్నేహం పెరగడంలో ఆశ్చర్యం లేదు. కాని ఒకరి గురించి ఇంకొకరికి నిజమైన గౌరవం వున్నప్పుడే ఆ ఇద్దరి మధ్య స్నేహం చాలా బలపడుతుంది. అలాంటి స్నేహం అంత సులభం కాదు అనుకుంటుంటే కవిత జ్ఞాపకానికి వచ్చింది.

కవితని చూసి రెండేళ్ళుపైనే అయింది. కాని కవిత జ్ఞాపకాలు చాలా తాజాగా మెదడులో నాటుకుని ఉన్నాయి. ఆరోజు రెండేళ్లక్రితం తనకి బాగా జ్ఞాపకం!

"నా పేరు కవిత, మీరు ఇక్కడకి కొత్తగా వచ్చినట్లున్నారు" అంటూ లాన్‌కి నీళ్లు పెడుతున్న తనని పలకరించింది.

ఎవరూ లేరనుకుంటూ పరాకుగా ఉన్న తను ఉలిక్కిపడ్డాడు. తేరుకుని, "నా పేరు రమణయ్య, నేను వచ్చి నాలుగురోజులయింది. మిమ్మల్ని కలుసుకున్నందుకు ఆనందంగా ఉంది" అన్నాడు తన పెగలని గొంతుకని అదుపులోనికి తెచ్చుకుంటూ.

చిరునవ్వు నవ్వింది కవిత. గాఢమైన ఇటుకరంగు షల్వార్ కమీజ్ డ్రెస్‌లో ఉదయపు ఎండ ఆమె మొహంమీద పడుతుంటే సగం కుంచించుకుని చూస్తున్న కళ్లు ఆప్యాయతని వెదజల్లాయి. పల్చని నల్లటిజుత్తు, గడ్డం చివర రవ్వంత కొనతేరడం వదిలేస్తే గుండ్రటి మొహం. సన్ననిమెడ, కుదురైన ఉపరిభాగం, సామాన్యమైన పొడవు, ఎక్సర్‌సైజు చేస్తుంది కాబోలు ఎక్కడా కొవ్వు కనిపించని బలమైన శరీరం.

ఆమెని అంతగా గమనించడం సభ్యత కాదని తెలిసినా ఆమెవేపే చూస్తుంటే "ఎక్స్‌క్యూజ్ మి, టెలిఫోన్ మోగుతోంది" అంటూ కారుతున్న నీళ్లపైపుని వదిలి లోపలికి పరిగెత్తింది కవిత.

ఆమె ఉచ్చరించిన వాక్యంలో ఉన్న మృదుత్వం, రమణయ్యకి ఒక వింత ఆనందాన్ని కలుగచేసింది. కర్ణేంద్రియాలని, సుతారంగా, సుత్తిమెత్తగా తాకిన ఆమె మాటలు తీపి తిన్నాక నోటిలో వదిలిన తీయదనంలా, చెవులలో ఆమె ఉచ్ఛారణ మెత్తగా నాట్యం చేస్తోంది. ఆదివారం ఉదయం ప్రకృతికి ఆకలి ఎక్కువగా ఉంది కాబోలు, కవిత ఆనవాళ్లని మిగల్చకుండా తినేసింది.

ఏమీ తోచకుండా రెండు నిమిషాలు గడిచేసరికి కాళ్ళకి తగిలిన చెమ్మ తనని వాస్తవంలోకి తీసుకువచ్చింది. చేతితో పట్టుకున్న పైప్‌లోంచి నీళ్లు నిరంతరంగా తన కాళ్ళమీద చిందాక పక్కని ఉన్న పచ్చికమీదపడి భూమిలోనికి ఇంకకుండా నిలుచుండిపోయాయి. ఏటవాలుగా పడుతున్న సూర్యకిరణాలు గడ్డిని, గడ్డిమీదున్న నీటిబిందువులని గిలిగింత పెట్టగా అవి పగలపడుతూ నవ్వినట్లు మెరుస్తున్నాయి. పదినిమిషాల క్రితం తనతో ఒక స్త్రీ తన పేరు కవితని చెబుతూ పలకరించడం నిజమేనా? అన్న అనుమానం వచ్చి చెయ్యి గిల్లుకున్నాడు. చురుక్‌మంది చర్మం. అదే కవితని చూడడం మొదటిసారి. ఆమె వదిలి వెళ్ళిన పైప్‌లోంచి నీళ్లు జలపాతంలా కారుతుంటే కవిత తిరిగివస్తుందని మరో ఐదు నిమిషాలు ఆగాడు. కానీ కవిత జాడలేదు. నీళ్ళధార ప్రభావంవలన ఒక చిన్న చెరువులా ఆమె ప్రాంగణంలో నిలిచిపోవడంతో ఇంటిలోనికి వెళ్ళబోతూ కవిత వదిలిన పైప్‌వాల్వ్‌ని కట్టేసి లోపలికి నడిచాడు.

ధనరాజ్ ఇంటిలో లేకపోవడంతో ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది. కాఫీ కాచుకుని కిచెన్‌లో డైనింగ్ టేబిల్ దగ్గర కూర్చుంటే బైట ప్రపంచం, పక్క ఇంటి లాన్ స్పష్టంగా కనిపిస్తోంది. కాఫీ తాగడం పూర్తవుతుంటే కవిత పెరటిలోనికి వచ్చి నీళ్ళు కారకుండా పైప్ కట్టేసి ఉండడం గమనించి ధనరాజ్ ఇంటివేపు ఒక చూపు విసిరి లోపలికి వెళ్ళి

పోయింది. బైటకి వెళ్ళి కవితని పలకరించా లని ఉన్నా, "నాన్నా ఈ దేశంలో ఎవరూ ఎవరినీ పనికట్టుకుని వెళ్లి సంభాషణలోనికి దింపరు. ఏవో పొడిపొడి మాటలు. ఎవరి బ్రతుకులు వాళ్లవి. జ్ఞాపకం ఉంచుకో" అన్న ధనరాజ్ హెచ్చరిక జ్ఞాపకానికి వచ్చి ఆ ప్రయత్నాన్ని విరమించాడు. పగలంతా పరాకుగా గడిచింది.



ఉదయం నడకకి అలవాటుపడ్డ తను యధాప్రకారం ఐదుగంటల నలభై నిమిషా లకి ఇంటికి తాళంవేసి సౌత్ స్ట్రీట్ లో నడక మొదలుపెట్టి మెయిన్ స్ట్రీట్ ట్రాఫిక్ లైటు దగ్గర ఆగి, గ్రీన్‌సైన్ కనిపించాక రోడ్డు దాటి పెద్ద లేక్‌ని సమీపించాడు. ఇంకా భూగర్భంలోంచి బైట పడకపోయినా రాజకీ యనాయకుని ఆగమనానికి ముందర ఉత్ప న్నమయ్యే కోలాహలంలా బాలభానుడు తన రాకకి నాందిగా ఆకాశంలోనికి ఎరుపు ఛాయని వెదజల్లడం మొదలుపెట్టాడు. లేక్ మీద పెరుగుతున్న వెలుతురులో పక్షులు ఉత్సాహంగా ఎగురుతూ ఆహారం కోసం తిరగడం మొదలుపెట్టాయి. అస్తవ్యస్తంగా, అర్థమవ్వకుండా చిన్నపిల్లవాడు వేస్తున్న రంగులా మేఘాలలోంచి ఎరుపురంగు క్రమేణా పెరిగి, తళుక్కుమంటూ సూర్యకిర ణాలు రమణయ్యని తాకాయి. పండిన ఎరుపు జాంపండు రంగు ఆపాదించుకుని పది నిమిషాలలో తన ప్రతాపాన్ని ప్రదర్శిం చడం మొదలుపెట్టాడు. అంతవరకు సూర్యుడిని అదిమివుంచిన సముద్రం ఓడిపోగానే, నీలంరంగు వున్న ఆకాశం దాసోహం అంటూ రంగు మార్చింది. పూర్తిగా ఉదయించిన తీక్షణ సూర్యకిరణా లని భరించలేక లేచి నిలబడి ఇండియా ఎవెన్యూలోకి మలుపుతిరిగి రోడ్డుకి ఎడమ వేపు ఉన్న కాలిబాటమీద నడుస్తుంటే ఎదు రుగా జాగింగ్ చేస్తూ వస్తున్న స్త్రీని గుద్దేసి నంతపని అయింది. ఆ స్త్రీ తనని లాఘ వంగా తప్పించుకుని ముందరకి సాగింది. అమెరికాలో నడిచేటప్పుడు, పరిగెత్తేటప్పుడు మనం వెళ్తున్న దిశలో కుడివైపు బాటని వాడతారన్న ధనరాజ్ వాక్యం జ్ఞాపకానికి వచ్చి రోడ్డుదాటి కుడివైపు కాలిబాటమీద నిలబడి కనుమరుగవుతున్న జాగింగ్ స్త్రీ వేపు చూశాడు. వేసుకున్న డ్రెస్‌లో స్పష్టంగా కనిపించకపోయినా ఆ వ్యక్తి భారతీయ స్త్రీ అన్న అనుమానం కలిగింది. అదృష్టవ శాత్తూ ఏక్సిడెంట్ అవలేదు. కాని అయి వుంటే ఆమెకి ఎంత దెబ్బ తగిలేదో! అను కుని ఇల్లుచేరి కుర్చీలో కూర్చుని ఊపిరి పీల్చుకున్నాడు.

ధనరాజ్ రావడానికి ఇంకా వారంరో జులు వ్యవధి ఉంది. ఒంటరితనంలో ఇబ్బంది మొదటిసారిగా తనకు తెలియవ చ్చింది. ఏభైఎనిమిదేళ్ళ ఇండియా జీవితంలో ఒంటరితనం ఎప్పుడూ బాధపెట్టలేదు. సంభాషణకు ఎవరూ లేక ఛానెల్స్ మారుస్తూ టెలివిజన్ చూస్తూ వుంటే సాయంకాలం అవడానికి కొన్ని యుగాలు పట్టినట్టనిపించింది తనకి.

సాయంకాలం ఐదయ్యేసరికి ఆకాశం కారు నల్లగా మేఘావృతమై సన్నని జల్లు ఆరంభమైంది. అరగంట గడిచేసరికి గాలి,

ఉరుముల ఉధృతం ఎక్కువై దగ్గరే పిడుగు పడినట్లు శబ్దం వినిపించింది. టెలివిజన్ మీద అలారంలాంటి శబ్దంతో 'ఈ దిగువ ఉదహరించిన కౌంటీలలో టోర్నిడో భూమి మీద వాలే అవకాశం ఉంది. పడుతుందని కాదు పడే అవకాశం ఉంది. గాజుకిటికీలకి దగ్గరగా నిలబడకండి, బైటకి పరిగెత్తకండి. ఇంటిలో బేస్‌మెంట్ ఉంటే దానిలోనికి వెళ్లి కాని, బేస్‌మెంట్ లేకపోతే బాత్రూంలో కాని దాక్కొనండి. టెలివిజన్‌మీద విరామం లేకుండా ఏం జరగబోతోందీ ప్రకటన నిరంతరంగా వెలువడుతుంది' అంటూ ప్రకటించారు.

అరె! ఇండియాలో వాన కురిసినా, పెద్దగా గాలి వీచినా, పిడుగులు పడుతున్నా ఎలక్ట్రిసిటీ తీసేస్తారు. కాని ఇక్కడ అలా లేదే! ఎలక్ట్రిక్ సప్లయ్ తీసేస్తే ఇలా ప్రకటన చేసి ప్రజలని హెచ్చరించడం ఎలా సాధ్యం? అవాంతరం గడిచిందో లేదో ఎలా తెలుస్తుంది? వరదలలో మునిగిపోయేకా? బీభత్సం అంతా సమసిపోయేకా? మన దేశంనుంచి రాజకీయనాయకులు మొహమాటపెట్టి బలవంతంగా తెచ్చుకున్న ఆహ్వానాలని ఉపయోగించి తంబలుతంబలుగా ఈ దేశం వచ్చి బంధుమిత్రులని సందర్శించి విస్కీలు, బ్రాందీలు తాగి, బంగారం, ఎలక్ట్రానిక్ పరికరాలు కొనుక్కొని, కస్టమ్స్ డ్యూటీ కట్టకుండా ఇంటికి సామాన్లు చేరవేయడం తప్ప ఏ రకమైన బాధ్యతా లేనట్లుంటారు. ప్రజల పన్నుల ధరని ఖర్చుపెట్టినందుకు సామాన్య మానవునికి ఏంజరుగుతోంది? ఇక్కడ ఉన్న ఆనవాయితీలని, ప్రజల ఇబ్బంది తగ్గించే మార్గాలని ఇండియాలో ప్రవేశపెట్టడానికి ఎందుకు ప్రయత్నం చేయరు? వ్యక్తిగతంగా తాము బాగుపడడం తప్ప సమాజం గురించి ఎవరికి కావాలి? అంటూ ఆక్రోశించింది తన మనసు.

ఉన్నట్టుండి ఆకాశంమీద నల్లని మబ్బులు మాయమై వెలుతురు తన్నుకరావడం, టోర్నిడో బెడద తీరిందని టెలివిజన్ మీద ప్రకటన ఒకేసారి జరిగాయి.

తలుపు తెరచుకుని తను బైటకి వచ్చాడు. అతిసన్నని వానజల్లు కురుస్తోంది. బైటకి చేయిచాపి నీటిజల్లు ఆనందాన్ని అనుభవిస్తున్న కవిత తను బైటకి వచ్చినప్పుడు తలుపు చేసిన శబ్దం విని, "హలో" అంది చేయి ఊపుతూ. ఒక్కసారి కవిత చేతికి ఉన్న గాజులు శబ్దం చేశాయి. తిరిగి చేయి ఊపేడు తను. ఆకాశంమీదనుంచి పడుతున్న నీటి తుంపరలని దోసిళ్ళతో పట్టుకునే బృహత్కార్యంలో నిమగ్నురాలయి ఉంది కవిత. మధ్యనున్న స్తంభం అడ్డుగా ఉండడంతో కవిత స్పష్టంగా కనిపించడం లేదు. కాని ఆమె చాచిన చేతులు మాత్రం కనిపిస్తున్నాయి. దోసిళ్లతో నీళ్లు చాలా సమయంనుంచి పడ్తోంది కాబోలు, వాన ధార చూరునుంచి పడ్తుంటే చిందుతున్న నీటి తుంపర ఆమె జుత్తుమీద విశ్రమించి ఉంది. దూరంనుంచి ఆమె వయస్సు ఎంత ఉంటుందో ఊహించినా సాధ్యం కాలేదు. కాస్సేపు నిలబడి, శబ్దం చేయకుండా తలుపు తెరచుకుని ఇంట్లో చేరాడు తను.

టెలివిజన్ ఆన్‌చేసి దానివేపు చూడప్రయత్నించినా, చూపు దానిమీద ఉన్నా ఏదో వెలితి. శూన్యంలోనికి చూస్తూ పొంకంలేని ఆలోచనలు ఒక తీరుగా సాగడంలేదు. ఒంటరితనం! ఏభైఎనిమిదేళ్ల జీవితంలో ఎప్పుడూ బాధపెట్టని ఒంటరితనం కాలనాగులా బుసలుకొట్టి తనని తెగబాధపెట్టింది ఆరోజు!

రాత్రి నత్తనడకలా నడిచింది.

ఆకాశమంతా మబ్బుపట్టి వెలుతురు తక్కువగా ఉండడంతో తెల్లవారుజామున నిద్రలోనికి ఒరిగిన తనకి ఉదయపు నడక సాధ్యపడలేదు. బద్ధకంగా కాలకృత్యాలు ముగించినా గడియారం ఎనిమిదన్నర మాత్రమే చూపించింది. పగలంతా ఏంచే

యాలి? అన్న ప్రశ్న ఎప్పటిలాగే పెద్ద పర్వతంలా ముందర నిలుచుంది.

పరమశివంకి ఉత్తరం రాస్తే?' అన్న ఊహ రాగానే కాగితం, పెన్‌తో డైనింగ్ టేబిల్ వద్ద కూర్చుని ఉత్తరం రాయడం మొదలుపెట్టాడు. "డియర్ పరమశివం నేను కులాసాగా ఉన్నాను. నువ్వు బాగున్నా వని ఆశిస్తాను" అని రెండు పంక్తులు రాయగానే రాయడానికి ఏమీ స్ఫురించక పెన్ మూసి ఆలోచనలో పడ్డాడు. కొందరికి ఆలోచించడానికి ఏమీ తట్టదు. చాలామం దికి ఆలోచన అంటే భయం. మరికొందర్ని ఆలోచన వదలదు. తను ఆ రెండవకోవకి చెందినవ్యక్తి. యాంత్రికంగా మైక్రోవేవ్ ఓవె న్‌లో కాఫీ కాచుకుని ఒక గుక్క తాగగానే వెగటు పుట్టి కాఫీ కప్పుని సింక్‌లో పడే శాడు. మంచి కాఫీ కోసం తహతహ లాడు తుంటే, 'మాల్‌లో మంచి స్ట్రాంగ్ కాఫీ దొరుకుతుంది' అన్న ధనరాజ్ మాట జ్ఞాప కానికి వచ్చి హుషారుగా బట్టలు మార్చు కుని తలుపు తాళంవేసి బస్‌స్టాప్‌వేపు నడి చాడు. ఐదు నిమిషాలలో మందంగా శబ్దం చేయకుండా బస్ తనముందు నిలుచుంది. బస్ ఎక్కబోయేముందు, డ్రైవర్ పక్కన ఉన్న మెషీన్‌లో ఒక డాలర్‌ని వేసి సీటులో చతికిలబడ్డాడు. తను కాకుండా బస్సులో ప్రయాణీకులు ఐదుగురు మాత్రమే ఉన్నారు. నలుగురు నలుపురంగు, ఒక తెలుపురంగు వ్యక్తులు ఎవరి ఆలోచనల్లో వాళ్ళు ఉన్నారు. రోడ్డమీద పశువులు, రిక్షాలు, ఆటోరిక్షాలు, ఎద్దుబండ్లు లేకపోవ డంతో సడన్‌బ్రేక్‌లు లేకుండా గంటకి ముప్ఫయిఐదు మైళ్ల వేగంతో పరిగెడుతున్న బస్ కూర్చున్న ప్రయాణీకులని ఎత్తి కుదేయ డంలేదు. ఒక బస్‌స్టాప్‌లో తోపుడు బండీలో వ్యక్తిని చూసి బస్ ఆగింది. డ్రైవ ర్‌కి ఎదురుగా, అతని కుడిచేతివేపు తలు పులు తెరుచుకున్నాయి. భూమిలోనికి కర్ణుడి రథం ఒరిగినట్లు డ్రైవర్ బస్‌ని కుడి వైపుకి వంచి మూడు అడుగుల వెడల్పుతో ఉన్న ఒక స్టీల్ ప్లేట్‌ని పేవ్‌మెంట్ మీదకి రామాయణంలో ఎవరో రాక్షసుడు నాలిక చాచినట్లు వారధిలా దించాడు. తోపుడు బండీలో ఉన్న వ్యక్తి ఆ ప్లేట్ మీదకి రాగానే ఒక మీటనొక్కి ఆ వ్యక్తిని ప్లేట్‌తో సహా లోపలికి లాగాడు. బస్‌డ్రైవర్ లోపలికి ప్రవే శించిన వ్యక్తిని, వికలాంగులకి కేటాయించ బడిన వ్యక్తులకి నిర్దేశించిన ప్రదేశానికి తోసుకుంటూ తీసుకెళ్లి అతనికి సేఫ్టీబెల్ట్‌లు బిగించాక స్టీల్ ప్లేట్‌ని ఉపసంహరించుకు న్నాడు. బస్ తిరిగి బయలుదేరింది. ఇదంతా పూర్తవడానికి మహాఅయితే ఒకటి న్నర నిమిషం పట్టి ఉంటుంది. ఆ పని చేస్తు న్నప్పుడు డ్రైవర్ మొహంలో ఏ రకమైన విసుగూ కనిపించలేదు తనకి. కాస్సేప య్యాక ఆ తోపుడుబండి వ్యక్తిని అతని స్టాప్‌లో దించేటప్పుడూ ఏమాత్రమూ నిరన సకాని, విసుగుకాని డ్రైవర్ ప్రదర్శించడం తను చూడలేదు.

నమ్రతా ఎలా వచ్చిందో వీళ్ళకి ఈ నమ్రత. లోపల భావాలు ఎలా ఉన్నా బైటకి కనిపించకుండా ఉండే గంభీరత.

"కర్మానుసారే బుద్ధి" అంటూ తెగ వల్లి స్తారు కొందరు. ప్రతీదానికీ "కర్మ" ఊతప దాన్ని తోకలా తగిలిస్తారు. ఇక్కడ పిల్లలకి ఇంటిలో తల్లిదండ్రులు, స్కూళ్లలో మాస్టర్లు చిన్నప్పటినుంచీ నమ్రత నేర్పుతారు. తన చుట్టూ ఉన్న సమాజం బాగుపడాలంటే వ్యక్తి ఆలోచించాలి, అదే నేర్పుతారు ఇక్కడ. తనని ఎవరైనా కసిరితే విరుచుకు పడేవ్యక్తి, ఎదుట వ్యక్తిని కసరడానికి సంకో చిస్తాడు. తాను ఎదుటి వ్యక్తికంటే ఉన్నతు డనని, తన కాలం ఎదుటివ్యక్తి కాలంకన్నా విలువైనదన్న అభిప్రాయాలు కొన్ని దేశా లలో ఉన్నట్లు ఇక్కడ తనకి కనపడలేదు. ఉందేమో! కాని తనకి అలాంటి అనుభవం ఎప్పుడూ అవలేదు. అందరూ ఒకలాంటి వ్యక్తులే. అందరి కాలం విలువైనదే అన్న




ధోరణి ప్రదర్శనమవుతుంది అనుకుంటూం డగా మాల్ ముఖ్యద్వారానికి ఎదురుగా బస్ ఆగింది. గడియారం పదిగంటల ముప్పయి నిమిషాలు చూపిస్తోంది. తను, మిగిలిన నలుగురు ప్రయాణీకులు బస్ దిగారు. ఆ దిగిన నలుగురిలో ఒకవ్యక్తి దృష్టి లేనివాడని గమనించాడు తను. ప్రయాణీకులలో ఒకవ్యక్తి చురుకుగా మాల్ద్వారం తలుపు తెరచి ఉంచాడు. లోపలికి ప్రవేశించిన దృష్టిలేని వ్యక్తి, "థాంక్యూ గాడ్ బ్లస్యు" అన్నాడు. తనకి ఒళ్లు పులకరించింది. భయంవలనో, ఇంకే కారణాలవలనో మనకంటే బలవం తుని, సంఘంలో పరపతి ఉన్న వ్యక్తిని గౌరవించడం సాధారణం. ఏ కోణంలోంచి చూసినా బలహీనుడనిపించే వ్యక్తిని గౌర వించడం మనిషి సామాజికధర్మం, మాన వతా లక్షణం. కాని ఎందుకో ఆ క్షణంలో ఇండియా గురించి ఆలోచించడానికి మన స్కరించక ఆలోచనల్ని దులిపి మాల్ లోప లికి ప్రవేశించాడు. మాల్ లోపల కొందరు జాగింగ్ చేస్తున్నారు. మొదటిసారి తను ఈ సన్నివేశం చూసినప్పుడు "మీరు జాగింగ్ లోపల ఎందుకు చేస్తున్నారు, బైటకి వెళ్ళి చెయ్యవచ్చుగా?" అనడిగితే, "బైట కార్లు, టాక్సీలు వదిలిన కాలుష్యం గాలి పీల్చేకన్నా లోపలి గాలి మంచిది. ఊపిరితిత్తులకు హాని తక్కువ. బైట వాతా వరణం చల్లపడినప్పుడు జాగింగ్ కష్టం, ముఖ్యంగా వయసుమళ్లిన వాళ్ళకి" అని వివరించాడు ఒక అమెరికన్.

మాల్లో దుకాణాలు మెల్లిగా కళ్లు విప్పు తున్నాయి. యూనిఫారం వేసుకున్న ఆడా, మగా హుందాగా మాల్ మధ్యని ఉన్న జాగాలో నడుస్తూ అన్నీ సరిగ్గా ఉన్నాయో, లేవోనని అటూ ఇటూ పరికిస్తున్నారు. మాల్ ద్వారానికి దగ్గరగా ఉన్న కాఫీ దుకా ణాలలో డికాక్షన్ తయారవుతుంటే వెలువ డిన కాఫీ వాసన ముక్కుపుటాలకి తాకగానే తనకి నోరూరి, కాళ్లు యాంత్రికంగా కాఫీ దుకాణంవేపు దారితీశాయి. కాఫీ దుకా ణంలో బోర్డ్మీద ఏయే రకాల కాఫీ లభ్య మవుతుందో, ఏయే దేశాలనుంచి కాఫీ గింజలు వచ్చాయో రాసి వుంది. కెన్యా, కొలంబియా, బ్రెజిల్, వెనిజులా, ఘన, ఇథి యోపియా దేశాల పేర్లు ఉన్నాయి.

"వాటీజ్ యువర్ ప్లెషర్ టుడే" అనడి గింది కౌంటర్ని మేనేజ్ చేస్తున్న విద్యు ల్లత.

"వాట్ డూ యూ రికమెండ్?" అని తను తిరుగుప్రశ్న వేశాడు ఏది మంచిదో తెలియక.

"ఎవరి టేస్ట్ వారిది, మీ టేస్ట్ ఏమిటో నాకు తెలియదుకదా! ఈ రోజుల్లో మా దుకాణానికి కాఫీకి వచ్చిన కస్టమర్లలో ఎక్కు వమంది బ్రెజిలియన్ కాఫీ తాగుతున్నారు. అది మీకు నచ్చుతుందో లేదో నేచెప్పలేను" అంది చాపం విరిచిన కనుబొమల్ని కదు పుతూ.

"ఒకకప్పు బ్రెజిలియన్ కాఫీ" అన్నాడు తను.

"ఒక కప్పు కాఫీ అయితే డాలర్మీద ఇర వైసెంట్లు. డాలర్మీద డెబ్బయి సెంట్స్ ఇస్తే మీ కప్పుని ఎన్నిసార్లయినా నింపుకో వచ్చు" అంటూ కాఫీ కప్పు చూపించింది కౌంటర్పిల్ల.

"ఒక కప్పు చాలు. అంతకన్నా ఎక్కువ కాఫీ ఒకేసారి తాగితే కడుపులో మంటపుడు తుంది" అంటూ డాలర్ ఇరవైసెంట్లు అంది చ్చాడు. గ్లాసునిండా ఆవిర్లు కక్కుతున్న డికా క్షన్ని అందుకుంటుంటే,

"క్రీమ్, పంచదార అక్కడ ఉన్నాయి. ఎంజాయ్ యువర్ కాఫీ" అంటూ చిరు నవ్వు విసిరింది సంపెంగ మొగ్గలా వున్న సొగసులాడి. డికాక్షన్లో క్రీమ్, పంచదార కలుపుకుని కాఫీ కప్పుతో మూలగా ఉన్న సీట్లో కూర్చుని కాఫీ చప్పరించడం మొదలు పెట్టాడు. వేడి కాఫీడికాక్షన్కి చల్లని క్రీమ్

కలిపినా సెగలు పూర్తిగా తగ్గలేదు. గ్లాసుడు కాఫీ తాగడం ముగించేసరికి పది నిమిషాలు గడిచాయి. శరీరంలో ప్రవేశించిన కెఫీన్ కలిగించిన ఉత్సాహంతో లేవబోతుంటే,

"వన్ టాల్ మోకో విత్ ఏ షాట్ ఆఫ్ చాక్‌లెట్" అన్న స్త్రీ ఉచ్చారణ విని తలెత్తి కౌంటర్‌దిశగా తలతిప్పాడు తను. నుదుటని పట్టీ, జాగింగ్ యూనిఫారం వేసుకున్న స్త్రీ కౌంటర్‌లో డబ్బు అందిస్తోంది. ఒక పెద్ద గ్లాసునిండా మోకో అందుకని "థాంక్స్" అంటూ వెనుతిరిగింది.

"ఎవరీ వ్యక్తి? " అని ఆలోచనలో పడబోతున్న తనకి అతిమృదువుగా, మెత్తగా రబ్బర్‌గాజులు గుద్దుకుంటే... చేసీచేయని శబ్దంలా బైటకి వినిపించిన ఆ రెండక్షరాలు శబ్దేంద్రియాలని తాకగానే

ఆనందంతో ఒళ్ళంతా మేల్కొని ఆమె కవితని తెలియచెప్పింది. రిమోట్‌కంట్రోల్‌తో స్విచ్ నొక్కినట్లు నిలుచున్న తను మళ్ళీ చిత్తరువల్లే ఆమెవేపు చూస్తూ ఉండిపోయాడు.

"హమ్" అంటూ ప్రత్యేక ఆసక్తి లేకుండా తనవేపు చూసి బైటకి వెళ్ళబోతూ తనని ఆనవాలు కట్టి కాబోలు "హల్లో" అంటూ దగ్గరికి వచ్చింది. చమట ఆరిపోతున్న ఆమె చామనఛాయ శరీరం ఒక వింత వాసనని వెదజల్లింది. వివరించలేని వాసనది. చమట వాసన అన్నా చమట మనుష్యులన్నా తనకి పరమ అసహ్యం. కాని కవిత వదులుతున్న వాసన తనని ఏమాత్రం ఇబ్బంది పెట్టలేదు, సరికదా ఆ వాసనని ఇంద్రియాలు ఇంకా కావాలన్నాయి. రెండు రోజులుగా మనస్సులో చోటుచేసుకున్న మబ్బుతెర, నిర్లిప్తత సడన్‌గా పటాపంచలయ్యాయి.

"థాంక్స్" అంది ఎదురుగా నిలబడి కరచాలనానికి చేయిచాచి. తను చేతిని యాంత్రికంగా బైటకి చాచాడు. అదే ఉచ్చారణ, అదే లయతో కూడిన పలుకులు. రెండోసారి దగ్గరగా వినపడేసరికి ఆనందం రెండింతలయింది. తెలివి తెచ్చుకుని, "ఎందుకు? " అనడిగాడు.

"ఆదివారం ఉదయం పైప్‌లోంచి నీళ్ళు కారుతుంటే వాల్వ్ కట్టేసినందుకు. లేకపోతే అక్కడ ఒక పెద్ద చెరువు వెలిసివుండేది. దగ్గరగా ఉన్న ఇళ్ళలోంచి ప్రజలు వచ్చి గాలాలువేసి చేపలు పట్టేవారు" అంది కిసుక్కున నవ్వుతూ. కవిత తన చేతిని వెనక్కి తీసుకుంది. కవిత వేసిన జోక్ అర్థమవడానికి ఒక నిమిషం పట్టింది. అలవాటులేని నాగరికత! గబుక్కున ఏం చెప్పాలో తెలియక ఇండియాలో చాలామంది చెప్పే సమాధానం, "దానిదేముంది? " అని మాత్రం అనగలిగాడు. ఆమెతోపాటు బైటకి నడిచాడు తను. "మీరు తొందరలో ఉన్నారా? లేకపోతే ఇక్కడ కాస్సేపు కూర్చుందాం" అంటూ మాల్ కారిడార్‌లో ఉన్న కర్రబెంచీమీద కూర్చుంది. తను ఆమె పక్కనే ఆసీనుడయ్యాడు. మాల్‌లో సందడి మెల్లిగా పెరగనారంభించింది. లోపల అంతా లైట్లమయం. బైట వాతావరణం పగలా? రాత్రా? అని తెలియకుండా లోపల కాంతివంతంగా ఉంది. పక్కని కూర్చున్న కవితవేపు చూడడానికి తనకి సంకోచం, అయినా సభ్యతని ఆవలకి నెట్టి ఇంకోసారి ఆమెని గమనించాడు తను. చామనచాయలో తెలుపు కలిసిన శరీరపు రంగు. తలమీద అడ్డంగా ఉంచిన హెడ్ బేండ్, పలచని జుత్తుని అణిచి ఇంకా పలచన చేసింది. బొడ్డున దోపివున్న రుమాలుని తీసి మొహాన్ని, కంఠభాగాన్ని, చెవుల వెనుక ప్రదేశాన్ని తుడుచుకుని తలకి పెట్టుకున్న హెడ్‌బేండ్‌ని తీసి తలని విదిలించింది. సినిమాలలో ఎడ్వర్‌టైజ్‌మెంట్‌లలో దృశ్యం జ్ఞాపకానికి రాగా సంభ్రమంగా ఆమెవేపు చూశాడు తను. ఆనందంతో గుండెదడ ఎక్కువయింది. జూకాలు కాని

దుద్దులు కాని లేని బోసిచెవులు, చెవికిందుగా వెనక కనిపిస్తున్న వీపు చూడగానే కవిత అంత నీట్‌గా ఉన్న వ్యక్తిని గతంలో తను ఎప్పుడూ చూడలేదనిపించింది. తన చూపులు ఆమెని తీక్షణంగా తాకాయో ఏమో కాని ఎడమచేతితో కంఠ వెనుకభాగాన్ని రుద్దుకుంది కవిత. అప్పుడు కవిత వీపుకి కుడివైపు కందిగింజంత ఎర్రని పుట్టుమచ్చ కంటికి ఆనగా,

'వీపుమీద కుడివైపు పుట్టుమచ్చ ఉంటే చాలా అదృష్టం అంటారు' అనుకున్నాడు తను. కాని అసంకల్పితంగా ఆ మాటలు బయటికి వెలువడ్డాయని కవిత నవ్విన నవ్వుని బట్టి తెలిసింది.

పేలవమైన నవ్వు! నిరాశని కప్పిపుచ్చుకుంటూ మొహంమీదకి తెచ్చిపెట్టుకుని పులుముకున్న నవ్వది! కవిత ఏమీ మాట్లాడకపోవడంతో తన తొందరపాటు గ్రహించి,

"అయామ్ సారీ, అనుకోకుండా వెలువడిన పలుకులవి" అన్నాడు తను.

"డోంట్ వర్రీ, మీరు తరచూ మాల్‌కి వస్తుంటారా?" అంటూ టాపిక్ మార్చింది కవిత.

"నేను మాల్‌కి రావడం ఇది మూడవ సారి. మీకు ఇది కొట్టినపిండి కాబోలు" అన్నాడు తను.

"ఎక్సర్‌సైజ్ అంటే నాకు చాలా ఇష్టం. బైట వాతావరణం అనుకూలంగా లేకపోతే మాల్‌లో జాగింగ్‌కి వస్తాను" అంది కవిత. మెల్లిగా ఇద్దరూ కబుర్లలో పడ్డారు.

మద్రాస్ ఐ.ఐ.టిలో కెమిస్ట్రీ విభాగంలో తను ఒక ప్రొఫెసర్‌నని, నాలుగు నెలలు సెలవుమీద ధనరాజ్‌తో గడపడానికి వచ్చానని తను చెప్పినా, కవిత తన విషయం ఏమీ ప్రస్తావించలేదు. అరగంట గడిచాక కవిత నిలబడి కాఫీ కప్పుని చెత్తకుండీలో గిరవాటేసి "వెళ్దామా?" అనడిగింది. తను ఏం చెప్పాలో తెలియక సతమతమవుతుంటే, "రండి నేను ఇంటికే వెళ్తున్నాను. మీకు అభ్యంతరం లేకపోతే మీ ఇంటి దగ్గర డ్రాప్ చేస్తాను" అంది కవిత.

"మీకు అనవసరమైన శ్రమ. ఇక్కడ నుంచి బస్ తిన్నగా ఇంటికి వుంది" అన్నాడు తను.

"మరేం ఫర్వాలేదు. బస్‌కన్నా కారు బాగుంటుంది. లేక మీకు నాతో ప్రయాణం ఇబ్బందికరమా?" అనడిగింది నవ్వుతూ.

"అబ్బెబ్బే" అంటూ ఆమెని అనుసరించాడు తను. పార్కింగ్ లాండ్‌లో టొయోటా కేమ్రీ కారు తలుపు తెరచి డ్రైవర్ సీటులో చతికిలపడింది. పాసింజర్ సీటులో కూర్చున్న తనతో "సీట్ బెల్ట్ పెట్టుకోండి. అది ఇక్కడ రూల్" అంటూ కారు స్టార్ట్ చేయబోయింది. తను లాగినా సీటు బెల్ట్ బయటకి సగమే వస్తుంటే తన దగ్గరగా జరిగిన కవిత సీట్ బెల్ట్‌ని సొంతం ఒక్కసారి లాగి బెల్ట్‌హుక్‌కి తగిలిస్తుంటే ఆమె శరీరంనుంచి ఆరిన చమట వాసన మళ్ళీ ముక్కుపుటాలని తాకింది. అది ఆనందాన్ని రేకెత్తిస్తుంటే కారు గేర్‌ని మార్చి దానిని రోడ్డుమీదకి మళ్ళించింది కవిత. కారులో ఉన్న సి.డి. ప్లేయర్‌లో ఐదు నిమిషాలు పాటలు విన్నాక,

"ఈ సి.డి. తీసేసి కొత్త సి.డి. ఏదైనా పెట్టరా?" అంది. తనకి ఎదురుగా ఉన్న గ్లవ్ కంపార్ట్‌మెంట్‌లోంచి ఒక సి.డి. ఎంపికచేసి దానిని పెడదామని ప్రయత్నిస్తుంటే వీలవలేదు. కవిత తనవేపు జరిగి కొత్త సి.డి.ని లోపలికి నెట్టి వాల్యూమ్ తగ్గించింది. సి.డి.లోంచి పాటలు వినిపించడం మొదలవగానే "అరె! ఉన్న అన్ని సి.డి.లలో ఇదే నాకు చాలా ఇష్టం" అంటుంటే కవిత మొహంమీద వెలిగిన నవ్వు చూసి రవ్వంత ఆశ్చర్యపడ్డాడు. ఆ వెలుగు, ఒక్కసారి పువ్వులని వెదజల్లుతూ వెలుతురుని విరజిమ్మిన చిచ్చుబుడ్డీలా ఉంది.

"పక్క ఇంటిలో ఉన్నా రాజ్‌తో పరిచ



యమే అవలేదు. దానికి చాలా మట్టుకు నేనే కారణం అనుకోండి. రాజ్ మీకు ఎలా తెలుసు?" అనడిగింది కవిత. రైలు ప్రయాణాలలో, బస్సులలో ప్రయాణం చేసేటప్పుడు, "ఆమె నీ కూతురా? అతను మీ అబ్బాయా? మీరు ఏంచేస్తుంటారు? మీ కులం ఏమిటి?" లాంటి ఇబ్బందికరమైన ప్రశ్నలకి, కవిత వేసిన ప్రశ్నలకి ఎంత తేడా! నమ్రత! సభ్యత! ఇతరులకి ఇబ్బంది కలగకుండా ఎంత జాగ్రత్త! కవిత ఎంత జాగ్రత్తగా తనని ఇరకాటంలో పెట్టకుండా ఆ ప్రశ్న వేసింది! అనుకుని,

"ధనరాజ్ నా కొడుకు" అన్నాడు తను.

"నిజం?" అంటూ ఆశ్చర్యంతో కళ్లు పెద్దవి చేసింది. కవిత కళ్లలో ఏమీ ప్రత్యేకత లేదనుకున్న తన నమ్మకం తప్పని గ్రహించాడు తను. విప్పారిన ఆ కళ్లలో ద్యోతకమైన ప్రశ్నల భావపరంపర తనని ఆశ్చర్యంలో ముంచెత్తింది. కనురెప్ప వేయకుండా, విప్పారి విచ్చుకున్న అందమైన ఆ మొహం దృశ్యం తిరిగి లభ్యమవదేమోనన్న భయంతో ఆర్తిగా ఆమెవేపే చూస్తుంటే, "ఏమిటి అలా చిత్తరువు అయిపోయారు" అంటూ కిసుక్కున నవ్వింది.

"నిజమే, ధనరాజ్ నా దత్తపుత్రుడు" అంటూ వివరించగా, మరోసారి ఆశ్చర్యంగా మొహం పెట్టింది కవిత. పది నిమిషాలలో ఇంటిముందు కారు దిగడంతో "థాంక్స్" అంటూ కారు దిగాడు తను.

"యు ఆర్ వెల్‌కమ్" అంటూ మందహాసం చేసి కారుని తన గ్యారేజ్‌లోనికి తీసుకెళ్లింది. మూసుకుంటున్న గ్యారేజ్ కవిత కారు ఆనవాళ్ళని మెల్లిగా కప్పేస్తుంటే, ఇంటితాళం తీయగా ఎదురుగా గడియారం పన్నెండు గంటలు చూపించింది. ఏంచేయాలో స్ఫురించక తను సోఫాలో చతికిలపడ్డాడు.

ఒంటరిగా ఉన్న ఇంటిలో నిశ్శబ్దం తాండవిస్తోంది. ఒంటరితనం తనని ఎప్పుడూ ఇబ్బంది పెట్టలేదు. నిజానికి తను ఒంటరితనాన్ని కాంక్షిస్తాడు. కాని ఈమధ్య తన దృక్పథంలో ఏదో మార్పు వచ్చింది. ఉదయం కాఫీ తప్ప ఇంకేమీ తినలేదని గుర్తుకు వచ్చినా లేచి ఏదో ఒకటి తయారు చేసుకుని తినాలనిపించక అలాగే సోఫాకి అంటుకుపోయాడు తను. కాస్సేపయ్యాక, "ఈ ఒంటరితనాన్ని పారద్రోలాలంటే లేచి ఏదో ఒకటి చేయాలి, కానీ ఏమిటి? బోస్టన్‌లో ఉన్న స్నేహితునితో టెలిఫోన్‌లో మాట్లాడవచ్చు కానీ అతనిని అనవసరంగా డిస్టర్బ్ చేస్తానేమో! అదీకాక ఫోన్ చేయడం ఖర్చుతో కూడినపని. టెలివిజన్ చూస్తే? చూడవచ్చు కాని దానినుంచి రిలీఫ్ కేవలం తాత్కాలికం" అనుకుంటూ పరిపరివిధాల ఆలోచించాడు తను ఆనాడు. అంతకుముందు అరగంటక్రితం కారులో కవిత వదిలి వెళ్ళిన విషయం జ్ఞాపకానికి వచ్చినా ఆమెతో పిచ్చాపాటి వేస్తే బాగుంటుందనిపించినా అది అసందర్భమైన ఆలోచన అని మనస్సు హెచ్చరించగా, నిస్త్రాణగా సోఫాలోంచి లేచి టెలివిజన్ రిమోట్ అందుకుని టెలివిజన్ ఆన్ చేశాడు తను. రోజంతా కుంటుతూ నడిచింది.

మర్నాడు ఉదయం ఎప్పటిలాగే నడకకి వెళ్ళి తిరిగివస్తుంటే జాగింగ్ చేస్తూ కవిత ఎదురుపడి, "అయిపోయిందా మీ నడక? మీరు తొందరగా లేస్తారు కాబోలు. మీరు నడకేగాని జాగింగ్, జిమ్‌కి వెళ్ళడంలాంటివి చేయరా? కావాలంటే మీరు నాతో జిమ్‌కి రావచ్చు" అంటూ నిలబడ్డచోటే గెంతుతోంది. నుదుట పట్టిన చెమటని పీల్చడానికి వేసుకున్న హెడ్‌బేండ్‌కి ఇంకా చమట అంటలేదు.

"అవును నాకు తొందరగా తెలివి వస్తుంది. ఒకరోజు నీతో జిమ్‌కి వస్తాను" అన్నాడు తను.

"మళ్ళీ కలుద్దాం" అంటూ లేక్‌వేపు జాగింగ్ కొనసాగించింది కవిత. పెరిగిన




ఉత్సాహంతో గబగబా అడుగులు వేస్తూ ఇల్లు చేరుకున్నాడు తను. మైక్రోవేవ్‌తో తయారుచేసుకున్న కాఫీ పరధ్యానంగా తాగుతుంటే అది చేదుగా ఉందా? లేదా ? అన్నదే తెలియడంలేదు. న్యూస్ పేపర్ అందుకుని శూన్యంలోనికి చూస్తూ పేపరు తిప్పాడు తను. మరోసారి కవిత జ్ఞాపకానికి వచ్చింది. ఆమెతో జిమ్‌కి వస్తానని చెప్పింది జ్ఞాపకానికి వచ్చి ఆశ్చర్యపడ్డాడు, తనకి జిమ్ ఏమిటి? అనిపించింది అప్పుడు.

కవితని చూసి రెండేళ్ళయింది అనుకుంటూ ప్రస్తుతం లోనికి వచ్చాడు రమణయ్య. పక్కఇంటిలో ఉన్న కవితలాంటి వ్యక్తితో పరిచయం అవుతుందని, అది బలపడుతుందని తను ఏనాడూ ఊహించనైనా ఊహించలేదు. అనుకుంటుంటే బాత్రూమ్ తలుపు తెరచుకుంటూ ధనరాజ్ గది లోపలికి ప్రవేశించాడు. బ్యాగ్ సోఫాలో ఉంచి కోటు వేసుకుంటూ, "నాన్నా మనం నాకు తెలిసిన వ్యక్తి ఇంటికి సాయంకాలం డిన్నర్‌కి వెళ్ళబోతున్నాం. అతని పేరు రాజశేఖర్. కొత్త ఇల్లు కొన్న సందర్భంగా అతను ఈ పార్టీ ఇస్తున్నాడు. పార్టీకి ఆహ్వానితులందరూ సాఫ్ట్‌వేర్ విభాగంలో పనిచేస్తున్న వాళ్ళే. వయస్సు ముప్ఫయిలోపే. నువ్వు ఐ.ఐ.టి లో పనిచేశావు కాబట్టి నీకు తెలిసిన పాత విద్యార్థులు ఎవరైనా పార్టీలో కనిపించవచ్చు అథవా ఎవరూ కనిపించకపోయినా మీ తరంకి, మా తరంకి ఉన్న ఊహలలో, ఆలోచనలలో ఉన్న తేడా అక్కడకి వస్తే నువ్వు గమనించవచ్చు ఇద్దరమూ వస్తున్నామని అతనికి చెప్పాను. రావడానికి నీకు అభ్యంతరం ఉండదనే అనుకుంటాను. ఇక్కడ ఒక్కరూ హోటల్లో ఉండి ఏంచేస్తారు? " అన్నాడు ధనరాజ్.

రమణయ్య ఏమీ సమాధానమివ్వకుండా సంశయిస్తుంటే, "చెప్పడం మరచిపోయాను. పార్టీకి రవళి కూడా వస్తుంది" అన్నాడు.

"రవళి ఎవరోయ్? " అనడిగాడు రమణయ్య.

"ఈమధ్యనే పరిచయం అయింది. ఒక రోజు లంచ్‌కి ఒంటరిగా శిల్పా రెస్టారెంట్‌కి వెళ్ళాను. లంచ్ సమయంలో అక్కడ అంతా కిక్కిరిసి ఉంటుంది. ఇద్దరు కూర్చునే టేబిల్ మీద నేఒక్కడినే ఉండడంతో వెయిటర్ వచ్చి, "మీకు అభ్యంతరం లేకపోతే ఆమె ఇక్కడ కూర్చుంటారు" అన్నాడు ఆమెని ఎదురుగా కూర్చోపెడుతూ. అదే రవళిని మొదటిసారి చూడడం. ఆమె కేరళ రాష్ట్రానికి చెందినది. భలే చలాకీగా మాట్లాడుతుంది. పరిచయం అయింది. తరువాత రెండు మూడుసార్లు కలిసి భోజనం చేశాం" అంటూ అంతకుమించి చెప్పడానికి ఏమీ లేదన్నట్లు ఆగాడు ధనరాజ్. రమణయ్యకి ఏం చెప్పాలో తెలియక మౌనంగా ఉండిపోయాడు. ఇదే మనదేశంలో అయితే "ఆ పిల్లని నాకు పరిచయం చేయడంలో ఉద్దేశమేమిటి? ఆ పిల్ల తల్లిదండ్రులు ఎక్కడ ఉన్నారు? కుటుంబ సాంప్రదాయాలు ఎలాంటివి? ఆమె ఏం చేస్తోంది? ఒంటరిగా ఉంటోందా? " లాంటి సవాలక్ష ప్రశ్నలు అందరూ వేసేవారేమో. తనూ అడిగేవాడేమో! కాని అలాంటి ప్రశ్నలు వేయడానికి ధనరాజ్ తనకి అవకాశం ఇవ్వలేదు. ఒకవేళ అలాంటి అవకాశం కలిగినా, తననితాను నిగ్రహించుకునేవాడు. ధనరాజ్ రవళిని తనకి కేవలం పరిచయం చేయబోతున్నాడు అంతే! తనకి ఆ వార్తని చెబుతున్నాడు.

ఇతర విషయాలు ఏదైనా వుంటే తనతో చెప్పాలనుకుంటే తనే చెబుతాడు మెల్లిగా. అవన్నీ ధనరాజ్ వ్యవహారాలు, వాటితో తనకి సంబంధం లేదని అనుకున్నాడు రమణయ్య.

"సాయంకాలం ఆరుగంటలకి వస్తాను, తయారుగా ఉండు నాన్నా వెంటనే బయలుదేరుదాం" అంటూ రోజూకన్నా తొందరగా



ఆఫీసుకి బయలుదేరాడు ధనరాజ్.

ధనరాజ్ వెళ్ళిన పదిహేను నిమిషాలకి బాత్రూంలోనికి ప్రవేశించి వేడినీళ్ళతో స్నానం చేయడం ఆరంభించాడు రమణయ్య. ఆవిర్లు కక్కుతున్న వేడినీటి పొగ గాజు అద్దాలమీద పడి అద్దానికి ఆవలివేపు ఏముందో కనిపించకుండా చేస్తోంది. నీళ్ళలో మునగడమంటే భయం ఉన్న రమణయ్యకి తలమీద నీళ్ళు పడకుండా వేడినీళ్లు మొహంమీదే చిందించుకున్నా ఉక్కిరి బిక్కిరి అవుతున్నాడు. అయినా మెదడులో ఆలోచనలు పరిగెడుతున్నాయి. వద్దనుకున్నా ఎంత ప్రయత్నించినా ధనరాజ్ మాటలు పదేపదే జ్ఞాపకానికి వస్తున్నాయి. ధనరాజ్ వయస్సు ఇరవైఎనిమిది. ఒకసారి పెళ్ళయి విడాకులు తీసుకుని అట్టే కాలమవ్వలేదు. ఇప్పుడు ధనరాజ్ రవళి అంటే ఆసక్తి కనపరుస్తున్నాడు.

"ఐ లవ్ రంజిత" అన్నాడు గతంలో ఒకసారి తను, రంజిత కలిసి ఉన్న వివాహ కాలం గురించి సంభాషణ వచ్చినప్పుడు. ప్రేమించిన రంజితని అంత త్వరలో మరచిపోయి, మళ్ళీ కొత్తగా రవళి ప్రేమలో పడ్డాడా? ప్రేమ మొక్కలకి అంటుకట్టడం లాంటిది. అంటు కట్టిన కొమ్మలకి వేళ్లు పెరగకుండా తీసేస్తే ఆ అంటు ఫలించదు. ఈ దేశంలో ఒకరి గురించి ఇంకొకరు సొంతం తెలుసుకోకుండా దగ్గరయి, పెళ్ళి చేసుకుంటే కాస్త విభేధాలు ఉత్పన్నమవగానే ఒకరికొకరు దూరం అవడం జరుగుతోందా? సమాజ బాధ లేకుండా ఎవరి మానాన వాళ్ళు బతకగలరు కాబట్టి కలిసి వుండడం ప్రాముఖ్యత తగ్గి, రాజీపడడం లేదా? అసలు రాజీపడడం అంటే ఏమిటి? అది కేవలం ఆ ఇద్దరి మధ్య ఉన్న సమస్యా? మద్రాసుల్లో ఐ.ఐ.టిలో తన ఇంటికి ఎదురుగా ఉన్న ఫ్లాట్‌లో రంగరాజన్, అతని భార్య ఉండేవారు. బాగా తాగి వచ్చి ప్రతీరోజూ భార్యని బాదేవాడు రంగరాజన్. ఆమె కూడా తిరగబడేది, అందరికీ వినిపించేలా తిట్లు లంఘించేది. ఉన్నట్టుండి రోడ్డు యాక్సిడెంట్‌లో అతను చనిపోతే ఆ దంపతులు సుఖంగా బతికేవారని, విభేధాలు వస్తే రాజీపడేవారని అందరూ అనుకున్నారు. ఓహో! రాజీకి ఇలాంటి అర్థం కూడా ఉందన్నమాట అనిపించింది తనకి. ఇంకేమార్గం లేక ఒక పంచన బతికి ఉన్నంతమాత్రాన అది రాజీ అవుతుందా? అంటూ ఆశ్చర్యపడ్డాడు తను ఆనాడు. ఈ దేశంలో భార్యకి భర్త భయపడితే చాలు, ఆమె కాని, గొడవ విన్న ఇతరులు కాని ఫోన్‌చేస్తే పోలీసులు వచ్చి భర్తని రిమాండ్‌లో పెట్టేస్తారు. రంగరాజన్ లాంటి వ్యక్తి ఈ దేశంలో అక్కడిలా ప్రవర్తిస్తే చాలాకాలం జైలుశిక్ష తప్పదు.

"ప్రేమ, వివాహం, రాజీ" అదృష్టవశాత్తూ లేక దురదృష్టవశాత్తూ తను ఆ దిశలో పయనించలేదు. అందుచేత దాని గురించి తనకి తెలిసినది చాలా తక్కువ. అనుకుంటుంటే హాలులో టెలిఫోన్ మోగింది. ఆలోచనలు పుటుక్కున తెగాయి. ఒళ్లు గబగబా తుడుచుకుంటూ బాత్రూమ్‌లోంచి బైటికి వచ్చి టేబిల్‌మీదున్న టెలిఫోన్ దగ్గరకి వచ్చేసరికి టెలిఫోన్ మోగడం నిలిచిపోయింది. ఒళ్ళంతా శుభ్రంగా తుడుచుకుని, బట్టలు వేసుకుని, రిఫ్రిజిరేటర్‌లో ఉన్న పళ్ల రసాన్ని గ్లాసులోనికి ఒంచుకుని టెలివిజన్ ఆన్ చేశాడు రమణయ్య.

యధాప్రకారం చాలా ఏళ్లుగా నడుస్తున్న సోప్ ఆపెరా సీరియల్స్ ప్రసారం అవుతుంటే కాస్సేపు చూశాడు. సీరియల్స్‌లో పనికి ఎవ్వరూ వెళ్తున్నట్లు కనిపించరు. ఏ పాత్రకీ బతుకు సాఫీగా వెళ్ళదు. వైవాహిక జీవితంలో ఏ రకమైన, ఏమాత్రమైనా అసంతృప్తి ఉద్భవించిందా అంతే! "నాకు అతను/ఆమె అంటే ప్రేమ చచ్చిపోయింది" అంటూ ముగింపుకి నాంది వాక్యంగా ఆరంభమై, రెండు రోజులలో కాపురం విచ్చి




న్నానికి దారితీస్తుంది. రెండు రోజుల క్రితమే "ఐ లవ్ యు" అంటే "ఐ లవ్ యూ" అంటూ టెలిఫోన్‌లో చుంబించుకోవడం సెల్‌ఫోన్‌లో "నేను నిన్నే ప్రేమిస్తున్నాను" అంటూ ఆఫీసుకి వెళ్తూ కార్లోంచి ఫోన్ చెయ్యడం అంతా ఏమవుతుందో రమణయ్యకి అంతుపట్టలేదు. వజ్రాల నెక్‌లెస్‌లు, ఐదువేళ్ళకి ఖరీదైన ఉంగరాలు, చేతికి రవ్వల బ్రేస్‌లెట్స్, ఎంత లేదన్నా రెండు మూడువందల డాలర్ల ఖరీదు చేసే డ్రెస్ వేసుకుని, 'నిన్ను ప్రేమిస్తున్నాను', 'నిన్ను ప్రేమిస్తున్నాను' అన్న వ్యక్తి, రెండు రోజుల తరువాత 'ఈ ప్రపంచంలో నిన్ను అసహ్యించినంత ఇంకెవర్నీ నేను అసహ్యించను' అనడం, గత నాలుగు రోజులుగా చూస్తున్న రమణయ్యకి విసుగేసి ఛానల్స్ మార్చినా ముఖ్యమైన ఛానల్స్‌లో సోప్ అపెరాలే కనిపించాయి. నిత్యం జరిగే లోకపుతీరుని ఇండియాలో నడుస్తున్న సీరియల్స్ ప్రతిబింబించినట్లు ఇక్కడ సోప్ అపెరాలు అమెరికన్ వాస్తవిక జీవితాల్ని ప్రతిబింపచేయవు అనుకుని టెలివిజన్ కట్టేశాడు రమణయ్య. నిజానికి వాస్తవికతని ప్రదర్శించే సీరియల్స్ నడిపితే వాటిని ఎవరైనా చూస్తారా? ఆ కాస్సేపైనా ఎస్కేపిస్ట్ ప్రపంచంలోనికి వెళ్ళకుండా ఏమిటీ హింస? అని వాటిని చూడడం మానేస్తారు కాబోలు. ఏదిఏమైనా ప్రసారం చేసే వ్యక్తులకికానీ, చూసే ప్రేక్షకులకి కాని 'నిజం' చూసే ఓపికలేని మాట ఖాయం అనుకున్నాడు రమణయ్య. అయితే అమెరికన్ సోప్ అపెరాలలో అరుపులు, పెడబొబ్బలు, పెద్ద పెద్ద ఉచిత సలహాలు, హింస లేకపోవడం రవ్వంత తృప్తిని కలిగించింది రమణయ్యకి.

★ ★ ★

శాంటాక్లారా కౌంటీలో ఉన్న రాజశేఖర్ ఇల్లు ధనరాజ్ హోటలు ఉన్న ప్రదేశానికి దాదాపు నలభైమైళ్ల దూరంలో ఉంది. ధనరాజ్ అరగంట ఆలస్యంగా ఇల్లు చేరడంతో ఆరుగంటలకి బదులుగా ఆరున్నరయింది బయలుదేరేసరికి. ఆఫీసునుంచి ఇళ్ళకి మళ్ళే రద్దీ తగ్గినా ఫ్రీవేలనిండా కార్లు పేరుకుని ఉన్నాయి. కార్లు కదిలి, ఆగి కదిలి గంటకి నాలుగుమైళ్ల వేగంతో జరుగుతుంటే ధనరాజ్ విసుక్కుంటూ చేతి వాచీవైపు పదే పదే చూస్తున్నాడు. బహుశా రవళిని కలవడం ఆలస్యమవుతుందన్న బాధ అతనికి విసుగుదలనిపించిందేమో! గతంలో ధనరాజ్ చాలా శాంతంగా మసలేవాడు. అమెరికా వచ్చి ఉద్యోగంలో చేరిన దగ్గరనుంచి అతనిలో అసహనం మెల్లిగా పెరిగింది.

"ఎవరో డొక్కు కారులో హైవేమీదకి వచ్చివుంటాడు. అది ఆగిపోయి ఉంటుంది. అందుకే ఈ ట్రాఫిక్ జామ్" అన్నాడు ధనరాజ్. వాస్తవంగా ఏం జరిగిందో తెలియకుండా ఊహించి అంత దుడుకుగా కసురుకోవడం మంచిది కాదని చెబ్దామనిపించినా రమణయ్య ఏమీ మాట్లాడలేదు.

"సాయంకాలం ఈ హైవేమీదకి రావడం నాదే పొరపాటు, ఇంకా ఆఫీసు ట్రాఫిక్ వుంది" అంటూ గబుక్కుని తొందరగా కార్లు నడుస్తున్న లేన్‌లోనికి జొరపడ్డాడు. 'హమ్మయ్య' అనుకుంటూ వేగంగా కారుని ఒక ఫర్లాంగ్ నడిపేసరికి ముందరున్న కార్లు నిలిచిపోవడంతో ధనరాజ్ కారు కూడా నత్తనడకలా కదిలివెళ్తోంది. ధనరాజ్ వదిలిన లేన్‌లో కార్లు తొందరగా వెళ్ళడం చూసి, 'షిట్' అంటూ తన విసుగుని మరోసారి ప్రదర్శించాడు ధనరాజ్. ఇరవైనిమిషాలు తాబేలు నడకలా కదిలిన ట్రాఫిక్ వేగం పుంజుకుని ముందరకి పరిగెడ్తున్నాయి. హైవేమీద ఎక్కడా పాడయిపోయిన కారు కనిపించలేదు రమణయ్యకి. ధనరాజ్ కారువేగం గంటకి డెబ్బయిఐదు మైళ్ల వేగానికి పెంచడంతో సాయంకాలం ఏడున్నర గంటలకి రాజశేఖర్ ఇల్లు చేరాడు. రాజశేఖర్ ఇంటి దగ్గరగా రోడ్డు మీద కార్లు ఖాళీ లేకుండా పార్కుచేసి

ఉంటే ధనరాజ్ కారుని రాజశేఖర్ ఇంటికి కాస్త దూరంలో నిలిపాక రమణయ్య, ధనరాజ్ రాజశేఖర్ ఇంటిని సమీపించారు. బయటకి తెలియకపోయినా రాజశేఖర్ ఇంటిలో కోలాహలంగా ఉంది. ధనరాజ్ చెప్పినట్లు ఆహ్వానితులు అందరూ ముప్పయి సంవత్సరాల వయస్సు లోపువాళ్లే. వాళ్ళని చూస్తుంటే ఆనందం, దానితోపాటు రవ్వంత ఈర్ష్య కలిగింది రమణయ్యకి. రాజశేఖర్‌కి తండ్రిని పరిచయం చేసి స్నేహితులతో కబుర్లలో పడ్డాడు ధనరాజ్. స్నేహితుల దగ్గరకి వెళ్ళబోయే ముందు "నాన్నా నే చెప్పినది జ్ఞాపకం ఉందికదూ? అక్కర్లేని ప్రశ్నలు వేయకు" అని హెచ్చరించాడు.

రాజశేఖర్, హరిణి దాదాపు ఒకే వయస్సు కలవారని, ఒకేసారి అమెరికా వచ్చిన ఆ ఇద్దరు పనిచేసే కంపెనీ ఒకటవడంతో ఇద్దరి మధ్యా పరిచయం పెరిగాక ఇష్టపడి పెళ్లిచేసుకున్నారని హరిణి తల్లిదండ్రులు కర్నాటక రాష్ట్రానికి చెందినవారని చెప్పాడు. డాట్‌కామ్ కంపెనీలో పనిచేస్తున్న ఇద్దరికీ కలిపి సంవత్సరానికి లక్షా అరవైవేల డాలర్లు జీతమే కాకుండా ప్రతీ సంవత్సరం కంపెనీ కొంత స్టాక్‌ని ముట్టచెబుతుంది. వీళ్లు పని చేసే డాట్‌కామ్ పని ఇంకొక పెద్ద కంపెనీకి ఉపయోగపడ్తోందని, ఒకటి రెండు నెలలలో ఆ పెద్ద కంపెనీ వీళ్ళు పనిచేసే కంపెనీని కొనేస్తుందని, అప్పుడు వీళ్ళ దగ్గర ఉన్న స్టాక్ ఆకాశానికి చేరుతుందని ఆశిస్తున్నారట. ఆ స్టాక్ అమ్మేసుకుంటే ఇల్లు దాదాపు తమ స్వంతమైపోతుందని, ఉన్న డబ్బు అంతా బ్యాంక్‌కి తీసుకెళ్ళి మిగతా డబ్బు అప్పుగా తీసుకువచ్చి ఇంటిని కొన్నారని చెప్పాడు. ఇల్లు ఖరీదు ఆరులక్షల డాలర్లని ధనరాజ్ చెప్పినప్పుడు తను నోరు వెళ్ళబెట్టాడు. ఇల్లు కొన్న సందర్భంగా పార్టీ ఇస్తున్నారని వివరణ ముగించాడు ధనరాజ్.

రాజశేఖర్ ఇంటిలోనికి ప్రవేశించాక చుట్టూ పరికిస్తే మూడు బెడ్రూమ్‌లు, ఒక హాలు, కిచెన్, ఇరవై అయిదు అడుగుల జాగా వెనకాతల తప్ప ఇంకేమీ కనిపించ లేదు. ఇంత చిన్న ఇల్లు ఖరీదు ఆరులక్షల డాలర్లా? అంటే దాదాపు మూడు కోట్ల రూపాయలు. హైదరాబాదులో ఒక కోటి రూపాయలకి ధర పలికే ఇళ్లని జ్ఞాపకానికి తెచ్చుకున్నాడు రమణయ్య.

అతిథులందరూ ఉత్సాహంగా మాట్లాడుతున్నారు. ఇల్లు కొనగానే సరికాదు, ఇంటిలో హంగులు అన్నీ అమర్చుకోవాలికదా? ఏమంటారు? అంటూ రాజశేఖర్ వేసిన ప్రశ్నకి తలా ఒక సలహా ఇస్తున్నారు. మంచి సోఫాసెట్ పదిపన్నెండువేల డాలర్లకి వస్తుంది, లెదర్ మాత్రమే కొనండి. ఈ టైనల్ కొంటే ఇట్టే చిరిగిపోతాయి. డైనింగ్ టేబిల్ ఎనిమిది కుర్చీలున్నది, మంచి రోజ్ ఉడ్‌ది ఒక కేటలాగ్‌లో చూశాను. దాని ఖరీదు పదివేలడాలర్లు..." అంటూ అతిథులు రాజశేఖర్‌కి ఇస్తున్న సలహాలు రమణయ్య చెవిన పడుతున్నాయి. డాలర్లని దాదాపు యాభై పెట్టి హెచ్చవేసి చూస్తే ఆరు లక్షలు సోఫా, ఐదు లక్షల డైనింగ్‌టేబిల్ అయ్యబాబోయ్! ఇంతేసి డబ్బే? కూర్చోవడానికి సౌకర్యంగా ఉండే సోఫా, డైనింగ్‌టేబిల్ కొనుక్కోక ఎందుకీ అనవసరపు ఖర్చు? అనిపించింది రమణయ్యకి.

"అయ్యా రాజశేఖర్‌గారూ! మంచిల్లు కొన్నారు. దానికి సరిపడే లెవెల్‌లోనే ఫర్నిచర్ మేచింగ్‌గా ఉండాలి. ఇక్కడ అనవసరంగా కక్కుర్తి పడకండి, తరువాత విచారిస్తారు" అంటూ ఇంకో అతిథి సలహా ఇవ్వడంతో ఆ ఆలోచనలకి స్వస్తి చెప్పి సమావేశమైన ఆహ్వానితులని గమనించసాగారు రమణయ్య.

"మిమ్మల్ని ఐ.ఐ.టి. క్యాంపస్‌లో చూశాను. నేనూ మద్రాసు ఐ.ఐ.టినుంచి డిగ్రీ తీసుకున్నవాడినే. కంప్యూటర్ సైన్స్

చదివాను” అంటూ తననితాను పరిచయం చేసుకున్నాడు ఒక యువకుడు. అతనివేపు చూస్తూ అతనిని జ్ఞాపకం తెచ్చుకో ప్రయత్నించినా ఆనవాళ్లు తెలియలేదు.

“ఏ సంవత్సరంలో డిగ్రీ పుచ్చుకున్నారు? ” అంటూ అందరూ వేసే చచ్చు ప్రశ్న వేశాడు రమణయ్య.

“పంథొమ్మిదివందల తొంభై ఏడులో” అని ఇంకో అతిథి అతనిని పలకరించడంతో రమణయ్య, మళ్ళీ ఒంటరివాడయ్యాడు. పక్కగదిలో టెలివిజన్ నడుస్తుంటే దాని ఎదురుగా కూర్చుని చూడనారంభించాడు. టెలివిజన్‌లోంచి శబ్దం తక్కువగా ఉండడంతో మధ్య హాలులో కూర్చున్న వ్యక్తుల మధ్య సంభాషణ స్పష్టంగా వినపడుతోంది. కొంచెం ఒంగిచూస్తే సోఫాలో కూర్చున్న మనుషులు కనపడుతున్నారు. రమణయ్యకి ఒక పట్టాన పేర్లు గుర్తుండి చావవు. ధనరాజ్, రాజశేఖర్ కాకుండా నలుగురు ఉన్నారు. పాల్, చక్రపాణి, కేల్కర్ పేర్లు జ్ఞాపకం ఉన్నా నాల్గవవ్యక్తి పేరు ఎంత ప్రయత్నించినా రమణయ్యకి జ్ఞాపకం రావడంలేదు. పీలగా ఉన్న వ్యక్తి, అతని పేరు కేల్కర్ కాబోలు. మిగతావాళ్ళంతా బీర్ పట్టిస్తున్నారు. ఒక రౌండ్ పూర్తయ్యేసరికి ఎనిమిదయింది.

“ఏమిటి గంగాధరంగారూ ఇంత ఆలస్యం? ” అంటూ కొత్త వ్యక్తిని ఆహ్వానించాడు రాజశేఖర్.

“రాజు వెడలె రవితేజములదరగా” అన్నట్లుగా హుందాగా గంగాధరం హాలులోనికి నడిచి సోఫాలో ఆసీనుడయ్యాడు. గంగాధరం ఇండియాలో ఫుట్‌బాల్ గోఠీ వేసుకునే బనియన్‌ని జీన్స్ ప్యాంట్ లోపలికి దోపి, మంచి నిగారింపులో ఉన్నా అతని కళ్లు మాత్రం ఎర్రగా ఉన్నాయి. అతని వయస్సు బహుశా ముప్పయిఐదు ఉండవచ్చు అనుకున్నాడు రమణయ్య. సంభాషణ తిరిగి ఊపు అందుకుంది.

“ఏమిటి కళ్లు అంత ఎర్రగా ఉన్నాయి? ” అనడిగాడు పీలగా ఉన్న వ్యక్తి.

“రాత్రి వేగస్ వెళ్ళి ఉదయం ఫ్లైట్‌లో దిగి తిన్నగా అక్కణ్ణుంచే ఆఫీసుకి వెళ్ళాను. ఆఫీసునుంచి ఇక్కడికి వస్తున్నాను” అన్నాడు గంగాధరం.

“ఆయనకేమిటండీ, వాళ్ళ కంపెనీ షేర్ ధర ఎనభైనుంచి తొంభైకి ఒక్కరోజు పాకింది. అంతా కనకమయమే” అన్నాడు పాల్.

“రాత్రి లాస్‌వేగస్‌లో బ్లాక్‌జాక్ ఆడితే నాలుగువేల డాలర్లు పోయాయి. కమ్ ఈజీ గో ఈజీ” అంటూ రాజశేఖర్ తెచ్చిన బీరుసీసా అందుకున్నాడు గంగాధరం.

“నాలుగువేల డాలర్లు అంటే ఏమాత్రం లెండి! ఈమధ్యని మీరు ప్రతీ శనివారం వెంకటేశ్వరస్వామి గుడికి వెళ్ళినట్లు ఠంచనుగా ప్రతీవారం వేగస్ సందర్శించివస్తున్నారు” అన్నాడు చక్రపాణి.

“స్టాక్ పదిపాయింట్లు మీదకి వెళ్ళగానే సరదాగా సెలబ్రేట్ చేయడానికి ఒక ట్రిప్ వేస్తాం. మా గ్రూప్‌లో నలుగురూ కలిసి తరచూ వెళ్ళడంతో అందరు ఎయిర్‌హోస్టెస్‌లకి కూడా ఈ సంగతి అర్థమైంది” అన్నాడు గంగాధరం రవ్వంత డాంబికంగా నవ్వుతూ.

“గురువుగారూ, స్టాక్ మీదకి వెళ్తుంటే ఎప్పటికప్పుడు అమ్మేస్తున్నారా? లేక అలాగే ఉంచుకుంటున్నారా? జాగ్రత్త” అన్నాడు కేల్కర్. కేల్కర్‌ని చూస్తుంటే షేక్స్‌పియర్ డ్రామా జూలియస్ సీజర్‌లో కేసియస్ పాత్ర జ్ఞాపకానికి వచ్చింది రమణయ్యకి.

“మీకు ఏమైనా పిచ్చా? చూస్తూ ఉండండి మా కంపెనీ స్టాక్ రెండింతలయిపోతుంది. ఇప్పటికైనా మించిపోయింది ఏమీలేదు. నే చెబుతున్నాగా. కొన్ని షేర్లు కొనిపడేయండి” అన్నాడు గంగాధరం.

మూడు గుక్కల్లో బీర్‌సీసాని సొంతం

ఖాళీచేసేసి దానిని చెత్తడబ్బాలో ఉంచుతూ, "బీర్‌లో ఏముంది మజా? విస్కీ ఐస్ క్యూబ్‌మీద నుంచి పోసి, ఐస్ కరుగుతుంటే ఆ చల్లని ద్రవం గొంతులోనికి వెళ్ళి వేడి పుట్టిస్తుంటే అది మజా, డు యు హేవ్ విస్కీ రాజశేఖర్?" అనడిగాడు గంగాధరం.

రాజశేఖర్ రిఫ్రిజరేటర్‌లోంచి ఐస్ ముక్కలు తీసి దానిమీద విస్కీపోసి గంగాధరంకి అందించాడు గ్లాసు.

"అయ్యో, మీదని మీ జుత్తు పలచబడుతోంది. తెల్లని మాడు కనిపిస్తోంది. షాంపూ వాడకండి. శ్రేష్ఠమైన కుంకుడు కాయపొడి ఇండియన్ షాపులో దొరుకుతుంది. అది ఉపయోగించండి" అన్నాడు చక్రపాణి.

"గంగాధరంగారికేమిటండీ, జుత్తు అంతా ఊడిపోయినా ఏమీ ఫరవాలేదు. స్టాక్ ఐదుపాయింట్లు మీదకి వెళ్తే చాలు. కొత్త జుత్తుని మొలిపించుకోవచ్చు ఈ దేశంలో" అన్నాడు రాజశేఖర్. అందరూ నవ్వుకున్నారు. హరిణి వచ్చి ఇంకో పది నిమిషాలలో ఆహారపదార్థాలు టేబిల్‌మీదకి చేరుతాయని, భోజనానికి రమ్మనమని చెప్పి లోపలికి వెళ్ళింది. ఆ పదినిమిషాల వ్యవధిలో రెండు రౌండ్లు విస్కీ ముగించి, మూడవ రౌండ్‌కి వచ్చాడు గంగాధరం. అందరూ ప్లేట్లలో పదార్థాలని వేసుకుని తినడం మొదలుపెట్టారు. రమణయ్య మోతాదుగా రెండు చపాతీలు, బంగాళదుంపలకూర, కాస్త పులిహోర వేసుకుని చపాతీని కూరలో ముంచుతుండగా,, "నాన్నా ఈమె రవళి, హి ఈజ్ మై ఫాదర్" అంటూ పరిచయం చేశాడు. సుమారు ఐదడుగుల ఆరంగుళాల పొడవు, పొడవాటి మొహం, వెలుతురులో మేకప్పుతో వింతగా మెరుస్తోంది రవళి మొహం. నీలంరంగు జీన్స్, ఆదేరంగు బనియన్, నీలంరంగు వేసిన గోళ్లు, అంతా నీలంగా ఉంది.





"ధనరాజ్ మీ గురించి చెప్పాడు" అన్నాడు రమణయ్య.

"ఏం చెప్పాడో అదంతా నమ్మకండి" అంటూ చిలిపిగా ధనరాజ్‌వేపు క్రీగంట చూసింది రవళి.

"రవీ మీ కంపెనీ కొత్తగా ఎవరినైనా నెట్‌వర్క్ విభాగంలో రిక్రూట్ చేస్తోందా?" అంటూ హరిణి అక్కడికి రావడంతో రవళితో సంభాషణ తెగింది. తిరిగి చపాతీని బంగాళాదుంపల కూరలోనికి ముంచాడు రమణయ్య. అన్నివేపులనుంచి సంభాషణ రమణయ్య చెవులని తాకుతోంది. సంభాషణ పూర్తిగా అర్థమవడంలేదు. ప్రత్యేకంగా చూస్తే తప్ప ఎవరు ఏం మాట్లాతున్నారో తెలియడంలేదు.

"గురువుగారూ, మనం వెధవపని చేశాం. నిన్న కంప్యూటర్‌లో డాట్‌కామ్ కంపెనీ పేర్లు ఏమున్నాయో చూశాను. గురు.కామ్, గుడ్.కామ్, లావణ్య.కామ్ ఒకటేమిటి ఈ పేర్లని ముందరగా పేటెంట్‌గా కొనేసుకుని వెధవది సంవత్సరానికి అరవై-డెబ్బై డాలర్లు కట్టి ఆ షేర్లని వందలకి, వేలకి విక్రయించి డబ్బు చేసుకున్నారు. మనమూ ఉన్నాం. ఎందుకు? ఈ డోమైన్స్ కొనుక్కోకుండా అవకాశాన్ని చేజేతులా జారవిడిచాం. రిస్క్ లేని చవకపని అది" అన్నాడు కేల్కర్.

కేల్కర్ నిజానికి ఎలాంటి గుణగణాలున్నవాడో తెలియదు కాని ధైర్యంలేని ఆశ లావు పీక సన్నంలాటి వ్యక్తా? అనిపించింది రమణయ్యకి. ఈ దేశంలోని ఎవ్వరి గురించి ఎవ్వరూ ఊహించుకుని ఆధారాలులేని అభిప్రాయాలని ఏర్పరచుకోకూడదని చెబుతారు. తాను ఆ తప్పే చేయబోయాడు అనుకుంటూ పరధ్యానంగా చపాతీని కూరలోనికి ముంచబోయాడు. కూర చేతికి రాకపోతే తెలివితెచ్చుకుని చూస్తే ప్లేటులో కూర నిండుకుంది. టేబిల్‌మీదున్న కూరని, మరికాస్త పులిహోర, పెరుగు వడ్డించుకుని తిరిగి ఇతరులు ఏం మాట్లాడుకుంటున్నారో వింటూ తినడం ప్రారంభించాడు రమ

ణయ్య. గంగాధరం చిరునవ్వు నవ్వడం గమనించాడు రమణయ్య.

"గంగాధరంగారి దగ్గర ఐదు డోమైన్లు ఉన్నాయట. వాటిని అమ్మేశారా? ఉంచేరా? " అనడిగాడు కేల్కర్.

ఆ ప్రశ్నకి సమాధానంకోసం అందరూ గంగాధరంవేపు చూశారు. గ్లాసులో ఉన్న విస్కీ సాంతం తాగేసి, ఐస్‌ముక్కల్ని కదిలేలా గ్లాసుని కదిల్చి రాజశేఖర్‌కి దానిని అందిచ్చాడు గంగాధరం. రమణయ్యకి ఆశ్చర్యం పెరగనారంభించింది. ఈయన ఇల్లు వదిలేలోగా ఎంత తాగుతాడో అనుకున్నాడు. గంగాధరం కేల్కర్ ప్రశ్నకి సమాధానమీయకపోవడంతో "గంగాధరం గారూ... మీరు మీ కంపెనీ స్టాక్ సహాయంతో మార్జిన్ మీద స్టాక్ కొంటున్నారని విన్నాను. అలా చేస్తే లాభం చాలా ఎక్కువగా ఉంటుందట కదా? నిజమేనా? " అనడిగాడు.

కేల్కర్ ఏదో చెప్పబోతుంటే గంగాధరం గారు వారించి, "మార్జిన్‌అంటే దానికి ఒక బ్రోకర్ కావాలి. ఉదాహరణకి మీ స్టాక్‌ని ఒక బ్రోకర్ మేనేజ్ చేస్తున్నాడనుకోండి. అతని దగ్గర ప్రస్తుతం ఉన్న మీ స్టాక్ విలువ ముప్ఫయి వేల డాలర్లు అనుకుందాం. అది ఆ బ్రోకర్ దగ్గర ఉంది కాబట్టి, మీరు బ్రోకర్ దగ్గర అప్పు తీసుకోవచ్చు లెఖ్ఖలకోసం ఇరవైవేలు అతను మీకు ఇచ్చాడనుకుందాం. ఆ ఇరవై వేలలో మీరు బజారులో స్టాక్ కొనమంటారు. మీరు కొన్న స్టాక్ పాతిక వేలయితే బ్రోకర్ దగ్గర తీసుకున్న ఇరవై వేలు అతనికి ఇచ్చేసి, మీరు ఎంచక్కా ఆ ఐదువేలు జేబులో ఉంచుకుంటారు. మన చేతికి మన్ను అవకుండా ఐదువేలు లాభం. అఫ్‌కోర్స్, ఆ బ్రోకర్ తన కమీషన్ తను తీసుకుంటాడనుకోండి" అంటూ విస్కీ చప్పరించాడు గంగాధరం.

"గంగాధరంగారూ! మీరు ఏమీ తినకుండా డ్రింక్ తీసుకుంటున్నారు. ప్లేటులో పదార్థాలు వడ్డించుకోండి" అంటూ రాజశేఖర్ పళ్లెంలో పదార్థాలని అమర్చి గంగాధరంకి అందిచ్చాడు. అందరి మెదడులో డబ్బు ఎంత త్వరగా, ఎంత సులభంగా చేసుకోవాలా? అన్న ఊహ కదలాడుతోంది కాబోలు కాస్సేపు ఎవ్వరూ మాట్లాడలేదు.

ఇద్దరు-ముగ్గురు కలిసి గ్రూప్‌ల కింద సంభాషణ ఆరంభమైనా ఒకటే టాపిక్ నలుగుతోంది. డాట్‌కామ్ కంపెనీ, అమెరికన్ స్టాక్, ఖరీదైన ఇల్లు కొనడం, ఉద్యోగాలు మార్చి ఎక్కువ జీతం ఉన్న ఉద్యోగంలో చేరడం, స్టాక్ ఆప్షన్స్... మొదలైన విషయాలన్నీ వానపడితే కళ్ళు కాలవలోనికి కొట్టుకువచ్చే కొబ్బరి బొండాల్లా కొట్టుకొచ్చి తేలిఆడుతున్నాయి. ఏదో తహతహ! ఆకలితో ఉన్నవాడు తిండి కోసం పడే తహతహ కాదు! చటుక్కున రమణయ్యకి గతంలో చూసిన ఇంగ్లీషు సినిమా, 'మేడ్ మేడ్ వరల్డ్' జ్ఞాపకానికి వచ్చింది. ఆ సినిమాలో ఒక వ్యక్తి చనిపోతూ, తను చాలా డబ్బుని కేలిఫోర్నియా రాష్ట్రంలో రెండు చెట్లు ఇంగ్లీషు అక్షరం 'వి' లా కనిపించే చోట పాతిపెట్టానని చెప్పి కళ్లు మూస్తాడు. ఆ సంగతి విన్నాక ఆ ధనాన్ని చేజిక్కించుకోవాలని పరిగెడ్తూ పడే శ్రమ, ఆరాటం, ఆ ప్రదేశానికి తామే ముందర చేరాలన్న తహతహ జ్ఞాపకానికి వచ్చింది.

గంగాధరం మార్జిన్ గురించి వివరించేక, ఆ దారిలో వెళ్తే త్వరగా డబ్బు గడించవచ్చేమో! అన్న ఆలోచన, ఆదుర్దా అందరి మొహాల్లో ఉందా? అన్న అనుమానం రమణయ్యకి కలిగింది. "వీళ్ళందరూ బాగా సంపాదిస్తున్నారే, ఐదారేళ్లక్రితం తాము కలలో కూడా ఊహించని దశలో ఉన్న వ్యక్తులకి ఇంకా ఎందుకు ఈ తహతహ? " అనుకున్నాడు రమణయ్య.

ప్లేటులో వడ్డించుకున్న పదార్థాలు అయిపోవడంతో, పేపర్ ప్లేట్‌ని అమర్చిన

చెత్తకుండీలో పడేసి, నీళ్ళతో ఉన్న గ్లాసుని అందుకున్నాడు. భోజనం కానిచ్చి సోఫాలో కూర్చున్న అతిథులకి హరిణి, రవళిలు ఐస్ క్రీమ్ అందిస్తుంటే గంగాధరం స్టాక్‌ల గురించి వివరిస్తున్నాడు. అతని పక్కన టేబిల్ మీదున్న గ్లాసులో ద్రవం నిండు కుంది.

"గంగాధరంగారూ! మీ ఇల్లు కొనడం ఎప్పుడు పూర్తవుతుంది? మీరు ఉన్న ప్రాంతంలో ఇళ్ళు దొరకడంలేదని చదివేను" అన్నాడు పాల్.

"ఇంకో వారం రోజులలో ముగుస్తుంది. ఇల్లు అమ్ముతానని ప్రకటించిన ధరకంటే ఇంకో ఇరవై వేల డాలర్లు ఎక్కువ ముట్టచెబుతే కాని, ఆ ఇల్లు చిక్కలేదు" అంటూ ఖాళీ గ్లాసువేపు చూశాడు.

"అయితే హౌస్ వార్మింగ్ పార్టీ ఎప్పుడు? "

మా ఆవిడ ఇండియానుంచి తిరిగి వచ్చాక కాస్త ఫర్నిచర్ అదీ సమకూర్చుకున్నాక పిలుస్తాను" అన్నాడు గంగాధరం. గంగాధరం నోటినుంచి వెలువడుతున్న మాటలు తొట్రుపడుతున్నాయి. మాట్లాడుతున్నపుడు సామాన్యంగా ఉద్భవించే శబ్దం కన్నా కాస్త ఎక్కువగా శబ్దం వస్తోంది. కాసేపటికి పాల్, తరువాత చక్రపాణి రాజశేఖర్‌కి కృతజ్ఞతలు చెప్పి బైటకి వెళ్ళిపోయారు. ధనరాజ్ రవళితో ఏదో చర్చలో ఉన్నట్లు మాట్లాడుతున్నాడు.

"ఎలా ఉంది నాన్నా రవళి? ఆమె గురించి నీ ఉద్దేశ్యం ఏమిటి? " అనడిగాడు ధనరాజ్ పదకొండుగంటలకి కారు రోడ్డుమీదకి మళ్ళిస్తూ.

ధనరాజ్ నోట్లోంచి బీరు వాసన ధారాళంగా వస్తోంది.

"చాలా అందంగా ఉంది, అంతకన్నా ఏం చెప్పగలను? ఆమెతో ఒకే ఒక వాక్యం మాట్లాడాను" అన్నాడు రమణయ్య.

"షి ఈజ్ ఫెంటాస్టిక్" అది నీకే తెలుస్తుంది ఆమెతో పరిచయం పెరిగితే. తను కాలిఫోర్నియాలో చేస్తున్న ఉద్యోగం వదలి న్యూయార్క్‌లో వచ్చిన ఉద్యోగంలో చేరబోతోంది" అంటూ కారు వేగం పెంచాడు ధనరాజ్. రమణయ్య మౌనంగా రోడ్డు పక్కన చెట్లని గమనించసాగాడు. రెండు పాయలుగా చీలి ఉన్న రోడ్డుమధ్య లెఖ్ఖలేనన్ని గన్నేరుచెట్లు, వివిధ రంగుల గన్నేరు చెట్లు విరగబూసి ఉన్నాయి. గన్నేరు చెట్లు నీళ్ళాధారం తక్కువయినా బతికేయగలవు. కాలిఫోర్నియా ఉత్తర కోస్తాలో గాలిలో ఉన్న తేమతో రోడ్లమధ్య పాతిన గన్నేరు చెట్లు నవనవగా ఉన్నాయి. రోడ్లకిరువైపులా చెట్ల పొదలు వ్యాపించి ఉన్నాయి. కొంతమంది ఇళ్ళ ప్రాంగణంలో ఏపిల్, టేక్, కమలా చెట్లు కనిపించాయి. చెట్లు చాలా తక్కువ ఎత్తులో ఉన్నాయి. పది పన్నెండు అడుగుల ఎత్తులో ఉన్న కమలా చెట్లకి బత్తాయి చెట్లకి పూలు చూసి, 'కమలా చెట్లకి పూలు తనెప్పుడూ చూడలేదు' అనుకున్నాడు రమణయ్య. ట్రాఫిక్ ఆగి ఉండడంతో కారుని స్లో చేశాడు ధనరాజ్. తెరచి ఉన్న కిటికీలోంచి సన్నజాజుల సువాసన రాగా, ఆశ్చర్యపడుతుంటే,

"ఇక్కడ బత్తాయిచెట్ల పూల వాసన చాలా బాగుంటుంది కదూ నాన్నా? " అన్నాడు ధనరాజ్.

"అవునవును, బత్తాయి పూలు ఇలాంటి సువాసన వెదజల్లుతాయని ఇప్పుడే తెలుసుకున్నాను" అన్నాడు రమణయ్య.

"ఎలా ఉంది పార్టీ నాన్నా? ఉత్సాహంలో ఈనాటితరంకి మీ తరంకి ఉన్న తేడా గమనించావా? గంగాధరం మిలియన్ డాలర్లు పెట్టి ఇల్లు కొన్నాడు. ఆయన వయస్సు మహా అయితే ముప్ఫయి అయిదు. ఆ వయస్సు వచ్చేసరికి నేను ఎలా ఉంటానో!" అంటూ సీడీ ప్లేయర్ లోంచి వస్తున్న బీట్ మ్యూజిక్‌కి అనుగుణంగా స్టీరింగ్ వీల్ మీద తట్టనారంభిం





చాడు. ఒంటిలో ప్రవహిస్తున్న మద్యం ప్రభావం కాబోలు!

"మీ తరం మా తరంకంటే ఉత్సాహంగా ఉంది, అది తథ్యం. కాని మేం చిన్నప్పుడు మా గురించి, ఇప్పుడు మీ గురించి అనుకున్నట్లు అనుకునేవారం. ఈ మార్పు సహజమే. ఒకటి చెప్పు. గంగాధరం మిలియన్ డాలర్లు పెట్టి ఇల్లు కొంటే దానిలో బ్యాంక్ అప్పు ఎంత? ఇంకోటి, గంగాధరం మాటలు మద్యం తాగేక తొట్రుపడడం గమనించేవా? ఆ స్థితిలో ఆయన కారు నడిపి ఇంటికి వెళ్ళగలడా? ఈ వ్యవహారంలో మా తరం కంటే మీ యువతరం మరీ ఎక్కువ ఉత్సాహం చూపిస్తున్నారేమో? " అనడిగాడు రమణయ్య.

"డేడ్, కాస్సేపు కూర్చుని ఒక కప్పు కాఫీ తాగితే మామూలవుతాడు. ఈ దేశంలో డ్రైవింగ్ ఇండియాలోలా కాదుకదా! ఇహ మిలియన్ డాలర్ల ఇల్లు గురించి. ఒకటిన్నర, రెండు లక్షల డాలర్లు క్యాష్ పెట్టి ఉండవచ్చు మిగతాది బ్యాంక్ అప్పు ఇస్తుంది. గంగాధరం స్టాక్‌ని కుదువపెట్టి అప్పు తెచ్చినట్టున్నారు" అంటూ బీట్ మ్యూజిక్‌లో లీనమయ్యాడు ధనరాజ్.

ధనరాజ్‌లో ఆరేళ్లలో వచ్చిన మార్పు కొంత భయాన్ని రేకెత్తించింది రమణయ్యకి. మార్పు! అమెరికాలో మార్పు చాలా తొందరగా జరుగుతుంది. అది అందరికీ తెలిసిందే. ఇక్కడ జీవితం రోడ్డు మీద నాలుగు లేన్లు ఉంటే అన్నింటికన్నా ఎడమ పక్క లేన్‌లో కారు ప్రయాణంలాంటిది. ఆ లేన్‌లో ప్రయాణం చేస్తుంటే ఇతర కార్లని అధిగమించి ముందుకు పరిగెడతాయి. నిన్నటితరం నిదానంగా అన్నింటికన్నా కుడివైపు ఉన్న లేన్‌లో ప్రయాణం చేయడానికి ఇష్టపడితే, ఈవాల్టి తరం అన్నింటికన్నా వేగంగా పరిగెత్తే లేన్‌లో ప్రయాణం చేయడానికి ఇష్టపడతారు అనుకుంటూ కళ్ళు మూసుకున్నాడు రమణయ్య.

"డేడీ, పార్టీకి వచ్చినవాళ్ళలో గురుదత్ అని ఒక వ్యక్తిని పరిచయం చేశాను జ్ఞాపకం ఉందా? " అనడిగాడు ధనరాజ్.

రమణయ్య కళ్ళు తెరిచి "రాజూ నాకు పేర్లు గుర్తుండి చావవు. కేల్కర్, చక్రపాణి, పాల్ తప్ప ఇందాకటినుంచి ఆలోచిస్తున్నా అతని పేరు గుర్తురావడంలేదు. అతని పేరు గురుదత్తా? అవును, దత్, దత్ అని అందరూ సంభోదించడం విన్నాను" అన్నాడు.

"ఆ! అతనే అతను నిన్ను పలకరించాడు కూడాను. హెచ్ వీసా మీద రెండున్నర సంవత్సరాలక్రితం వచ్చాడు. ఈ దేశానికి వచ్చినపుడు అతని జీతం సంవత్సరానికి నలభై ఐదువేల డాలర్లు. ఈవేళ అతని జీతం ఎంతో తెలుసా? తొంభైఆరువేల డాలర్లు. ఇది ఎలా పెరిగిందో నీకు తెలుసా? ప్రతీ ఆరు నెలలకీ ఉద్యోగం మారేడు. మార్కెట్ అలా ఉంది డేడీ. పొయ్యి బాగా కాలుతున్నపుడే జొన్నపొత్తులు కాల్చుకోవాలి. లోయల్టీ, లోయల్టీ అనుకుని అదే కంపెనీని పట్టుకు దేవుళ్లాడితే 'ఎక్కడున్నావు గొంగళి? అనంటే అక్కడే ఉన్నాను'లా ఉంటుంది వ్యవహారం" అన్నాడు ధనరాజ్ మరికొంత బీరువాసనని బైటికి వదులుతూ.

"రెండేళ్ళలో అతని జీతం రెండింతలపైనే అయింది. కాని రాబోయే మూడు నాలుగేళ్లలో జీతం అంతే వేగంగా పెరగకపోతే అతనిలో నిస్పృహ ఆరంభమవదూ? " అని అడ్డుతగిలేడు రమణయ్య.

"నువ్వూ ఆ కేల్కర్ ఒకేలా ఆలోచిస్తున్నారు. భయం, ప్రతీదానికి భయం. దత్ తను ఉద్యోగం మారడానికి తయారుగా ఉన్నానని 'నెట్'మీద రెజ్యూమే పెడితే యునో పదిమంది ఒక్కరోజులో ఇంటర్వ్యూకి పిలిచారు"

"ఏమిటీ అతనిలాంటి క్వాలిఫికేషన్లు ఉన్నవాళ్లు ఈ దేశంలో చాలా తక్కువ

మంది ఉన్నారా? "

"డేడీ ఇది ఇన్ఫర్మేషన్ యుగం. ట్రాఫిక్ లైట్లు మేనేజ్ చేయడం దగ్గరనుంచి మన ఇష్టా యిష్టాలు ముందరగా కంప్యూటర్‌కి తెలియచేస్తే, టెలివిజన్‌మీద నడిచే ప్రోగ్రాంలు, సినిమాలు... వగైరా అన్నీ అదే ఎంపికచేసి మన కిష్టమైన వాటిని రికార్డ్‌చేసి ఉంచుతుంది. ఇంటికి రాగానే స్విచ్ నొక్కడమే. మన జీవితకాలం ఎలా వినియోగించాలో, జీవితం క్షణక్షణానికీ ఎంత సుగమం చేయవచ్చో ఆలోచించి, వాటిని సాధించడానికి ఈ డాట్ కంపెనీలు కృషిచేస్తున్నాయి. ఇదివరకు సేల్స్ ఎక్కడ ఉన్నాయో పేపరు చూస్తేకాని తెలిసేది కాదు. ఇప్పుడు ఒక డాట్‌కామ్ కంపెనీ, అమెరికాలో ఎక్కడెక్కడ సేల్స్, ఎలాంటి సేల్స్ ఉన్నాయో ఒక లిప్తపాటులో చెప్పేస్తుంది.

"ఇదంతా సామాన్య పౌరునికి అందుబాటులో ఉండేలా చూడడానికి వాళ్ళు ఎందుకు కష్టపడతారు? "

"సింపుల్ డేడ్ సింపుల్. ఎడ్వర్టయిజ్‌మెంట్ కంపెనీకి ఇలా పబ్లిసిటీ చవుక. పేపరు వాడకం తగ్గుతుంది. ఈ సేల్ ఎనౌన్స్‌మెంట్‌లో పనిచేసే వ్యక్తుల సంఖ్య తగ్గిస్తారు. అమెరికా ఇప్పుడు సర్వీసు విభాగంలో ఎక్కువ శ్రద్ధ చూపుతోంది. రాబోయే కాలంలో మై గుడ్‌నెస్ ఎక్కడకి వెళ్తామో, ఊహించలేనంత మార్పు రాబోతోంది"

"మనుషులు బైటకి వెళ్లకుండా, కష్టపడకుండా ఇంటిదగ్గరే స్విచ్ నొక్కితే, అన్నీ లభ్యమైతే, ఈ ఆదా చేసిన టైమ్ ఏం చేస్తారు? "

"ఇంకా త్వరగా పనులు, ఇంకా ఎఫీషియంట్‌గా పనులు చేసే కంప్యూటర్స్ తయారుచేయడానికి ఉపయోగిస్తారు. ఎక్కువ కాలం పిల్లలతో, భార్యలతో, సారీ భార్యతో గడుపుతారు, ఎంజాయ్ చేస్తారు. "

రమణయ్య ఆలోచనలో పడ్డాడు.

లెక్కలు చేయడానికి, ఆటలకి, సినిమాలు చూడడానికి రిజర్వేషన్లకి... ఒకటేమిటి అన్నింటికీ వాడుతున్న ప్రస్తుత కంప్యూటర్స్ చాలక ఇంకా త్వరితంగా చేసే కంప్యూటర్లని ఉత్పత్తిచేస్తే మనిషి నాలుగు గోడలమధ్య భార్య, పిల్లలతో గడుపుతూ ఉండిపోయే రోజులు వచ్చేస్తాయేమో అన్న భయం కలిగింది రమణయ్యకి. అలా అయితే అది మనిషిని ఎలాంటి మనస్థితికి లాక్కెళ్తుంది? విభిన్న వ్యక్తులతో కలిసి తిరిగినపుడే జీవితంలో ఆనందం.

తను, తన నాలుగుగోడలు, తన కుటుంబానికీ పరిమితమైతే, ఆ జీవితం గుంపుగా తిరిగే జంతువుల దశలోనికి మళ్ళిస్తుందేమో! తను నిన్నటి మనిషి! ఈనాటి నయాగరా జలపాతంలా, పరుగులుతీసే నీళ్ల ప్రవాహంలా తొందరపడుతూ పరిగెత్తడం చేతకాక తను విపరీతంగా ఆలోచిస్తున్నాడా? పురోగమనానికి తట్టుకోలేక 'పెసిమిస్ట్' మాటలు మాట్లాడుతున్నాడా? ఏమో కాలమే చెబుతుంది దానికి సమాధానాన్ని! అనుకుని ఆలోచనల్ని కప్పివేసాడు రమణయ్య.



ధనరాజ్, రమణయ్యలు శాన్‌ఫ్రాన్సిస్కో నుంచి న్యూజెర్సీ ఇంటికి వచ్చి రెండురోజు





లయింది. దాదాపు నెల రోజులుగా ఇంటిలో ఎవ్వరూ నివశించకపోవడంతో ఇల్లు, పెరడు అంతా గలీజుగా ఉంది. మోతాదుకి మించి పెరిగిన లాన్, దుబ్బులు, అస్తవ్యస్తంగా ఉన్న పూలమొక్కలు బైట వికృతంగా కనిపిస్తుంటే, తలుపులన్నీ వేయడంవలన ఇంటిలో గోడల మీద, కిటికీలమీద అంటుకుని ఉన్న మిల్ డ్యూ చీకాకుకలిగిస్తోంది. వచ్చిన మర్నాడు మాత్రం ఉండి, ఎలక్ట్రిసిటీ, ఫోన్ బిల్లులకి చెక్ లు పంపించి, మూడు రోజులు పనిమీద పై ఊరు వెళ్లాడు ధనరాజ్. ఉన్న రోజు ధనరాజ్, రమణయ్యలు ఇద్దరూ కష్టపడి కొంత శుభ్రంచేసినా పూర్తిగా శుభ్రం అవలేదు. గలీజుగా ఉన్న ఇల్లు అంటే రమణయ్యకి చిరాకు... ధనరాజ్ ఊరు వెళ్లిన మర్నాడు ఉదయమే లేచి, నడకకి వెళ్ళివచ్చి మిగిలిన కిటికీలు శుభ్రంచేయ మొదలుపెట్టాడు. కిటికీలోంచి బైటకి చూస్తే, ఎవరో పనివాళ్ళు కవిత ఉన్న ఇంటికి మరమ్మత్తులు చేస్తూ కనపడ్డారు. ధనరాజ్ తో కవిత గురించి ప్రస్తావించడం ఇష్టంలేక ఊరుకున్న రమణయ్యకి, "కవిత ఉందా? , ఇంటికి మరమ్మత్తులు తనే దగ్గర ఉండి చేయిస్తోందా? లేక కాంట్రాక్ట్ కి ఇచ్చిందా? " అనుకుని, కవిత కనిపిస్తే అడుగుదామని కిటికీ దగ్గరకి రోజులో పదిసార్లయినా వెళ్ళి చూసి, కవిత కనిపించక నిరాశతో తిరిగివచ్చాడు. ఆరోజు గడిచింది. ఇంటిలోపల శుభ్రంచేయడం దాదాపు పూర్తయింది. పక్క ఇంటిలో అలజడి ఏమీ కానరాలేదు. రాత్రి పదకొండు గంటలయినా పక్కమీద అటూ ఇటూ దొర్లుతున్న రమణయ్యకి నిద్రరావడంలేదు. నిద్రవచ్చే సూచనలేమీ కనిపించక, నిద్రమాత్ర వేసుకుని కళ్ళు మూసుకున్నాడు. ఎంతసేపు నిద్రపోయాడో తెలియదు. కాని పక్క ఇంటి ప్రాంగణంలో ఏదో అలికిడి అవడంతో చటుక్కున తెలివి వచ్చింది. లేచి లైటువేసి కిటికీ దగ్గరగా నిలబడి బైటకి దృష్టి సారించాడు. రెండు జాక్ రేబిట్స్ అటూ ఇటూ పరిగెడుతూ, ఉదయం పనిచేసిన వర్కర్లు వదిలిన డబ్బాలలో ఆహారం ఉందేమోనని వాటిని తోసి ఆహారం కోసం వెతుకుతున్నాయి. గోడ మీద గడియారం ఒంటిగంట చూపిస్తోంది. లైటు ఆర్పి మళ్లీ పరుపుమీదకి చేరినా నిద్ర రానని మొరాయించింది.

తనకి, నిద్రపట్టకపోవడానికి కారణమేమిటి? కవిత కనిపించకపోవడమా? ఇన్నాళ్లు లేని ఆరాటం ఈ వేళ ఎందుకు పెరిగింది? ఇక్కడే ఉంటుందనుకున్న కవిత కనిపించకపోగానే తన మెదడులో ఆలోచనలు పరిపరి విధాలుగా పోతున్నాయా? "కవిత ఎక్కడ ఉంటే తనకేమిటి? " అని తననితాను సముదాయించుకో ప్రయత్నించినా మనస్సు సమాధానపడలేదు. చిన్నచిన్న కునుకులతో తెల్లవారింది. యధాప్రకారం ఉదయమే లేచి నడకకి వెళ్ళి వచ్చి, కాఫీ తాగుతూ బైటకి చూస్తే అన్నివేపులా దుబ్బుగా పెరిగిన గడ్డి కనిపించింది. ఈ వేళ దాని పనిపట్టాలి, కానీ మంచి కాఫీ కడుపులో పడితే కాని హుషారు రాదని కాఫీకి మాల్ కి వెళ్ళడానికి బస్‌స్టాప్‌వేపు నడిచాడు రమణయ్య. మాల్ తెరవడానికి ఇంకా ఒక గంట వ్యవధి ఉందని మాల్ కి వెళ్ళేక కాని తెలియరాలేదు రమణయ్యకి. ఇంకే మార్గం లేక మాల్ కి దగ్గరగా ఉన్న రెస్టారెంట్ లో కాఫీ తాగి ఇంటికి తిరిగి వచ్చేసరికి పదకొండు గంటలయింది.

గరాజ్ లోంచి లాన్ మూవర్ తీసి రమణయ్య స్టార్ట్ చేయబోతే అది స్టార్ట్ కాలేదు. స్టార్టింగ్ కి అవసరమైన తాడు లాగి లాగి సత్తువంతా కరిగిపోగా మెట్లమీద చతికిలపడ్డాడు. మెల్లగా వీస్తున్న చల్లని గాలి రమణయ్యని తాకుతుంటే కాస్సేపటికి రమణయ్యలో తిరిగి ఉత్సాహం, బలం పుంజుకున్నాయి. బలంగా తాడు లాగేసరికి బద్ధకంగా లాన్‌మూవర్ స్టార్ట్ అయింది.



అమ్మయ్య అనుకుంటూ గడ్డి కోయడం మొదలుపెట్టాడు. ఏపుగా ఎదిగి, బలంగా ఉన్న గడ్డిని నరకలేక లాన్‌మూవర్ నాలు గైదుసార్లు ఆగినా, దాని కింద బ్లేడ్‌ని అంటుకున్న గడ్డిని తప్పించి, మళ్ళీ స్టార్ట్ చేస్తే లాన్ మూవర్ మొరాయించకుండా స్టార్ట్ అయింది. రెండు గంటల కాలంలో ఇంటిముందర, పక్కన ఉన్న గడ్డిని అంతా మలచగలిగాడు రమణయ్య. సూర్యుడు మీదకి వచ్చి తీక్షణంగా ప్రకాశిస్తూ ఉండడంతో లాన్‌మూవర్‌ని గెరాజ్‌లో దాచి ఉస్సురంటూ ఇంటిలోనికి వచ్చి సోఫాలో చతికిలపడ్డాడు. అలవాటులేని పని! అందులో రాత్రంతా సరిగ్గా నిద్రలేదేమో, అలసట మరీ ఎక్కువగా ఉంది. రిఫ్రిజిరేటర్‌లోంచి చపాతీలు, కూర మైక్రోవేవ్‌లో వేడి చేసుకుని తినేసరికి నిద్ర కమ్ముకువచ్చి సోఫాలోనే నిద్రపోయాడు రమణయ్య.

సాయంకాలం నాలుగు గంటలకి లేచి ఇంటి వెనకాల ఉన్న లాన్‌ని మెషీన్‌తో కట్‌చేశాడు ఇంటికి ముందర ఉన్న పొదలని కత్తెర పెట్టి తుంచాడు. అంతా పూర్తయేసరికి సాయంకాలం ఏడుగంటలయింది. పనిముట్లని దాచి టెలివిజన్ ఆన్ చేశాడు రమణయ్య. టెలివిజన్‌మీద బీర్ కమర్షియల్ నడుస్తోంది.

బీర్ కమర్షియల్‌లో ఒక మధ్యవయస్కుడు పగలంతా ఆఫీసు పనిచేశాక ఇంటికి వచ్చే దారిలో ఆగి జిమ్‌లో కాస్సేపు వ్యాయామం చేసి వచ్చి స్నానంచేసి తడితువ్వాలుతో బైటకి రాగానే ఫ్లాట్ తలుపు ఎవరో తడతారు. అలాగే వెళ్ళి తలుపు తెరుస్తాడు ఆ మధ్య వయస్కుడు రవ్వంత విసుగుతో. ఎదురుగా లేత కొబ్బరి గుజ్జు లాంటి చిన్నది ఐస్ ముక్కలు కారుతున్న రెండు బీరుసీసాలతో నిలబడి, “ఈ రెండింటిలో ఒకటి నువ్వు పంచుకోగలవేమోనని వచ్చాను” అంటుంది. బీర్‌సీసాలవేపు, అతని వేపు ఆప్యాయంగా చూస్తుంది. విసుగు పటాపంచలయి ఆమె చేతిలో ఉన్న ఒక బీర్‌సీసా అందుకుని, రెండవచేతితో ఆమెని దగ్గరకి లాగి, కాలితో తలుపుని తోసి, బీర్‌సీసాని ఆమెవేపు చూస్తూ నోటికి తగిలిస్తాడు.

ఏదో వ్యధ! ఎందుకో అవగాహనకి రాని వ్యధ! సన్నగా గుండెని కోస్తూ మండుతున్న వ్యధ! ఏం చేయాలో తెలియక అసంకల్పితంగా సోఫాలోంచి లేచి, ఎప్పుడూ తాగని రమణయ్య రిఫ్రిజిరేటర్‌లోంచి చల్లని బీర్ అందుకుని తాగడం మొదలుపెట్టాడు. చల్లని బీర్ పూర్తిగా అలసిన శరీరంలోనికి జొరపడి శరీరాన్ని చల్లపరిచి, మెదడుని చల్లపరచడం మొదలుపెట్టింది. బీర్ చేదుగా ఉందని కాని, మద్యం తాగడం ఏమిటి? అని కాని రమణయ్యకి అనిపించలేదు. ఆలోచనలనుంచి, అవగాహనకి అందని వ్యధనుంచి రిలీఫ్ కావాలి, అంతే. రెండవ బీర్‌కేన్ తాగేసరికి మెదడులో ఆలోచనలు సమసి, కళ్ళు మూతలుపడ్డాయి రమణయ్యకి.

రమణయ్య కళ్ళు విప్పేసరికి గడియారం ఉదయం ఏడు గంటలు చూపిస్తోంది. ఎదురుగా టెలివిజన్ ఇంకా నడుస్తోంది. తల బరువుగా అనిపిస్తే తలని పట్టుకుని ఏదో తప్పుచేశానన్న భావన మెదడునిండా అలుముకోవడంతో భారంగా లేచి బాత్రూంలో అద్దంలో చూసుకుంటే ప్రతిబింబం మొహం చాటేసినట్లనిపించింది. కళ్ళు మూసుకుని, పళ్ళు తోముకుని బైటకి వచ్చాడు రమణయ్య. కాఫీ కాచుకుని తాగాక తల బరువు కాస్త తగ్గినట్లనిపించింది.

తను తాగడానికి కారణమేమిటి? పగలంతా తోటలో పనిచేస్తున్నా, ఏదో పరధ్యానం ఎందుకు? లాంటి సమాధానం లేని ప్రశ్నలని మనస్సు దొలిచేస్తుంటే దాని బాధ తగ్గించుకోవడానికి తను మద్యం తాగాడు! ఛ! అని గిల్టీగా మద్యం తాగినందుకు ఫీలయినా, వెన్వెంటనే తను గిల్టీగా

ఎందుకు ఫీలవ్వాలి? అనిపించింది రమణయ్యకి. నిన్నటివరకు మద్యం తాగడాన్ని సమర్థించని తను, క్రితం రోజు మద్యం తాగాక దానిలో తప్పు కనిపించక, "దానిలో గిల్టీగా ఫీలవడానికి ఏముంది?" అని ప్రశ్నిస్తున్నాడు. ఎంత దారుణం! లోకంలో మద్యం తాగే వ్యక్తులు అందరూ ఇలాగే ఆలోచిస్తారా? తమని తాము సమర్థించుకోవడానికి సవాలక్ష అల్పకారణాలు కల్పించుకుంటారు కాబోలు, తనూ వాళ్ళలో ఒకలాంటివాడే! అనుకుని మథనపడుతూ పూలమొక్కల్ని తురమడానికి కత్తెరని అందుకుని పెరటివేపు నడిచాడు.

గుబురుగా పెరిగిన గులాబీ మొక్కలు, బోగన్ విల్లాలు, విస్తరించిన సన్నజాజులు, మల్లెమొక్కలని చూసి ఎక్కడ మొదలుపెట్టాలా? అని కాస్సేపు ఆలోచించి, పెరటి గుమ్మానికి ఆనుకుని ఉన్న గులాబీ మొక్క వేపు వంగి, కత్తెరతో చచ్చుపడిపోయిన కొమ్మల్ని కత్తిరించడానికి ఆయత్తమయాడు రమణయ్య.

ఎండకి ఎండి, వానకి తడిసి, గట్టి బారిన గులాబీ కొమ్మలు చేతిలో ఉన్న చిన్న కత్తెరకి లొంగడంలేదు. గులాబీ కొమ్మలకి ఉన్న వాడి ముళ్ళు వేళ్ళని స్టీల్‌లా స్పృశిస్తున్నాయి. ఒక తెగిన కొమ్మని బైటకి లాగుతుంటే ఒక వాడి గులాబీముల్లు రమణయ్య ఎడమచేయి చర్మానికి గుచ్చుకోగా, 'ఉస్' అని ఆక్రోశిస్తుంటే,

"గులాబీముళ్లు చాలా వాడిగా ఉంటాయి" అన్న మృదువైన మాటలు వినపడ్డాయి. తత్తరపాటుతో లేవబోతుంటే గుచ్చుకున్న ముల్లు చేతిమీద పెద్దగీత గీసింది. రమణయ్య ఎడమచేతినుంచి రక్తపు జీర పొడచూపడం మొదలయింది.

"నే చెప్పలేదా?" అంటూ నవ్వనారంభించింది కవిత. నవ్వుతున్న కవితని చూడగానే అరక్షణం ఒళ్ళు మండినా, ఆమె కనిపించిన ఆనందం ఆ మంటని వెంటనే ఆర్పేసింది.

"హలో, బాగున్నారా?" అంటూ నవ్వు ఆపుకుంటూ పలకరించింది కవిత, బండరాయిలా నిలుచుండిపోయిన రమణయ్యని చూస్తూ.

"బాగానే ఉన్నాను. దాదాపు రెండేళ్ళయిందా మనం కలిసి? మీలో ఏమాత్రమూ మార్పులేదు. అది ఎలా సంభవం? ఊరికి వెళ్లారా? ఏ ఊరికి వెళ్లారు? మీ ఇంటికి మరమ్మత్తులు జరుగుతున్నాయే?" అంటూ ఉత్సాహంగా ప్రశ్నల వర్షం కురిపించాడు రమణయ్య.

మొహంమీద ఎండపడుతుంటే చేతిని అడ్డుపెట్టుకుని "గులాబీలని, గులాబీ మొక్కల్ని జాగ్రత్తగా పట్టుకోవాలి. ముందు ఆ గులాబీ మొక్కని వదిలి నీళ్లతో ఆ ముల్లు చేసిన గాయాన్ని కడగండి. లేకపోతే తరువాత అవస్థపడతారు. నా దగ్గర టించర్ ఉంది తెస్తాను" అంటూ కిసుక్కున నవ్వుతూ ఇంటిలోనికి వెళ్ళింది కవిత. నైట్ డ్రస్‌లో ఇంటిలోనికి వెళ్తున్న కవితని గమనించాడు రమణయ్య. రెండేళ్ళక్రితం చూసిన కవితకి, ఈనాడు చూస్తున్న కవితకి తేడా ఏమీలేదు అనుకుంటూ గులాబీ ముళ్ళు చేసిన గాయాన్ని నీళ్ళతో కడిగాడు.

కవిత రాసిన టించర్ ఐయోడీన్ చర్మానికి తగలగానే గాయం దగ్గర మంట పుట్టడంతో అసంకల్పితంగా రమణయ్య చేయి కదిలింది. "మంట ఎక్కువగా పుడితేనే గాయం త్వరగా మానుతుంది" అంటూ టించర్ రాసిన పుల్లని చెత్తలోనికి విసిరింది. "ఇప్పుడు చెప్పండి, ఏ ఊరికి ఎప్పుడు వెళ్లారు?" అంటూ పాత ప్రశ్న తిరిగి వేశాడు.

ఊహే కావచ్చు, కాని కవిత మొహంలో అసంతృప్తిని చూసి రమణయ్య తిరిగి ప్రశ్నని రెట్టించలేదు. ఎప్పటిలాగే తన స్వంత విషయాల గురించి కవిత మాటలాడడానికి ఇష్టంలేదని చెప్పకుండా చెప్పింది.

"నా సంగతికేంగాని ఇండియా విష యాలు చెప్పండి" అంది కవిత తెచ్చిపెట్టు కున్న ఉత్సాహంతో.

రమణయ్య గులాబీ మొక్కలవేపు చూస్తుంటే, మీ గులాబీ మొక్కల సంరక్షణ తరువాత చేద్దాం. ముందు ఒక కాఫీ కడుపుల్లో పడాలి" అంటూ రమణయ్య వెనక రాగా, తన ఇంటిలోకి ప్రవేశించింది.

"మీకూ ఇంత కాఫీ పిచ్చి ఉందని నాకు తెలియదు" అంటూ వంటింటిలో కవిత కాఫీ కలుపుతుంటే సోఫాలో సర్దుకున్నాడు రమణయ్య. కాఫీ తాగుతూ కబుర్లలో పడ్డారు. గత రెండు సంవత్సరాలలో ఇండియాలో జరిగిన విశేషాలు, రంజిత, ధనరాజ్‌ల విడాకుల సంగతి, ధనరాజ్ రవళి అంటే చూపిస్తున్న ఉత్సాహం గురించి చెప్పాడు రమణయ్య.

"ఈ దేశంలో కలవడాలు, విడిపోవడం చాలా త్వరగా జరుగుతాయని వింటూంటాం, చూస్తాం. కాని మన దేశంనుంచి వచ్చినవారు కూడా ఆ దారంబటే పయనించే సంఖ్య ఎక్కువవుతోందని అనుమానం. ప్రేమ! ఒక విచిత్రమైన పదం ఈ దేశంలో" అంటూ ఆలోచనలో పడింది కవిత.

అరగంట గడిచేసరికి తనలో గత మూడు రోజులుగా నెలకొన్న స్తబ్దత, ఒంటరితనం గురించి చెబుతూ తను బీరు తాగిన సంగతి కూడా చెప్పాడు కవితకి. ఆమె దగ్గర ఏదీ దాచాలనిపించలేదు.

రమణయ్యవేపు విచిత్రంగా చూసింది కవిత. ఆ చూపుకి ఎలాంటి అర్థం చెప్పుకోవాలో అని ఆలోచిస్తుంటే, "ఇల్లు అమ్మకానికి పెట్టాను, అది అమ్ముడవగానే ఈ ఊరు వదిలి వెళ్ళిపోతాను" అంది కవిత అత్యంత మెల్లిగా.

అంతవరకూ ఉత్సాహంగా కబుర్లు చెబుతున్న రమణయ్య ఒక్కసారి నీళ్ళు కారిపోవడం చూసి, "జీవితం మనల్ని అనుకోకుండా మలుపులు తిప్పుతుంది. అప్పుడప్పుడు మనం కావాలనే మలుపులు తిరుగుతాం. ఈ దేశంలో మనం ఏది కావాలంటే అది చేయవచ్చు అంటారు. కాని కొందరికి ఒకే ఒక బాటలో పయనించే పరిస్థితే ఎదురవుతుంది. మీరు ఈ దేశంలో ఇంకా ఎన్నాళ్ళు ఉంటారు? " అనడిగింది.

"చెప్పలేను, బహుశా ఇంకా మూడు నెలలు ఉంటానేమో" అన్నాడు రమణయ్య నీరసంగా.

"స్నానం అదీ కానిచ్చి రండి. మనం ఈవేళ బైట తిండి తిందాం. ఐయామ్ బయింగ్ లంచ్ టు యు" అంటూ రమణయ్యకి చెప్పడానికి ఏమీలేదన్నట్లు లేచి నిలబడి అతను తాగిన కాఫీ కప్పుని అందుకుంది కవిత.

బాత్రూంలో ప్రవేశించి స్నానం చేస్తున్న రమణయ్యకి, కవిత వేదాంతధోరణి, దిగాలుగా మాటలాడడం ఏమీ అర్థమవలేదు. 'ఏమైంది కవితకి? ఆమె ఎందుకు అలాంటి నిర్ణయం తీసుకోవలసివచ్చింది? ఇష్టంలేని ఆ నిర్ణయాన్ని తీసుకోవలసిన గడ్డు పరిస్థితి ఏమిటి? ' అనుకుంటూ స్నానం చేయడంలో మునిగిపోయాడు రమణయ్య.

★ ★ ★

ఇక్కడకి పదిమైళ్ళ దూరంలో ఆలివ్‌గార్డెన్స్ అన్న ఇటాలియన్ రెస్టారెంట్ ఉంది. అక్కడకి చాలా సార్లు వెళ్లాను. నాకు అక్కడి పదార్థాలు ఇష్టం. మీకూ నచ్చుతుందనే అనుకుంటున్నాను. లంచ్ ఖర్చు నాదని చెప్పానుగా, మీరేమీ అభ్యంతరం చెప్పకండి" అంటూ కారుని రోడ్డుమీదకి మళ్ళించింది కవిత. పడమటగా వెళ్తున్న కారు ముందర అద్దంలోంచి సూర్యుడు తన తీవ్ర కిరణాలని జనంమీదకి విసురుతూ, కొన్నింటిని కవితమీదకి వదిలాడు. వాటి ధాటికి తట్టుకోలేక సన్‌షేడ్‌ని అడ్డుపెట్టుకున్నా ఎండలోపలికి వచ్చి ఆమెమీద పడు

తోంది. నలుపు రంగు కాని కళ్లని సగం కుంచిస్తూ కారుని లాఘవంగా హైవేమీద మౌనంగా నడుపుతోంది కవిత. పదిహేను నిమిషాలు కారు ప్రయాణంలో, రెస్టారెంట్ చేరేవరకు రమణయ్య ఏమీ మాటలాడ లేదు. ఆమె చెప్పిన విషయం గురించి ఆలోచిస్తుంటే రెస్టారెంట్ దగ్గర కారు నిలి పింది కవిత.

లంచ్ టేబిల్‌మీద కూర్చున్నాక ఇద్దరికీ వైన్ ఆర్డరిచ్చింది కవిత. "మద్యం నేను తాగను" అని చెబుదామనిపించినా, క్రితం రోజు తను బీరు తాగిన సంగతి ఆమెకు చెప్పానని జ్ఞాపకానికి వచ్చి సన్నగా నవ్వుకు న్నాడు.

"వైన్ సంగతేనా మీరు ఆలోచిస్తోంది? నిన్ననేగా మీరు తాగడం మొదలుపెట్టారు. అయినా వైన్ తాగుడులోకి రాదు ఫరవా లేదు. ఒక చిన్న గ్లాసుడు వైన్ ఆరోగ్యానికి మంచిది" అంది సన్నగా నవ్వుతూ. తన ఆలోచనలు కవిత చదివినందుకు ఆశ్చర్యం, సంతోషం కలిగాయి రమణయ్యకి. వెయిట రెస్ వచ్చి వైన్‌ని టేబిల్‌మీద ఉంచి "ఎంజాయ్ యువర్ డ్రింక్" అంటూ నిష్క్ర మించింది. కవిత వైన్‌తో నిండిన గ్లాసు అందుకుని రమణయ్య సందిగ్ధంలో ఉండడం చూసి "కమాన్, ఇది మన స్నేహానికి" అంటూ చేతిలోకి తీసుకుని రమణయ్య గ్లాసుకి తాకించింది. రమణ య్యలో చలనంలేదు. ఆశ్చర్యంగా కవితవేపు చూస్తున్నాడు. ఒక గుక్క వైన్ తాగి ఆలో చనలో పడిన కవితనే గమనిస్తున్నాడు. భృకుటి ముడతలుపడిన కవిత మొహం ఏదో ముఖ్యమైనది చెప్పడానికి ఆయత్తమ వుతోందని తెలియవస్తోంది.

"నాకు చికాగోలో ఉద్యోగం వచ్చింది. అక్కడ రాబోయే జీతం, ఇక్కడ వస్తున్న జీతానికి రెండింతలు. ఈ ఇల్లు కొని నాలు గేళ్లయింది. ఇప్పుడు చేస్తున్న మరమ్మ త్తులు పూర్తయ్యేక అమ్మకానికి పెడితే బాంక్‌కి ఉన్న అప్పు తీర్చేయగా ఎంత లేదన్నా ముప్ఫయివేల డాలర్లు లాభం వస్తుందిట. ఇక్కడ ఈమధ్య ఇళ్ల ధరలు పెరిగాయి. ఆ లాభం డబ్బు, నేచేయబోయే ఉద్యోగంలోంచి వచ్చే జీతం చికాగోలో ఉన్న నా భర్తకి కావాలి. మూడు నెలల క్రితం ఒక్కసారి ఆకస్మికంగా ఊడిపడి తను మారిపోయేనని ఇల్లు అమ్మి చికాగో వచ్చేయమని అర్థిస్తూ ఇంకా తను నా భర్తనే అన్న అంశాన్ని మాటల్లో దొర్లిం చాడు. ఆలోచించి నా నిర్ణయం తెలియప రుస్తానన్నాను. కొన్నాళ్లు ఇక్కడ నా దగ్గర ఉన్న మా అమ్మాయి, చికాగోకి నూరుమైళ్ల దూరంలో భర్తతో కాపురం చేస్తోంది. తన జీవితం తనది. అమెరికాలో భార్యాభర్తలు విడాకులకి వెళ్తే, పెళ్లయిన దగ్గర నుంచి విడిపోయేంతవరకు ఉన్న ఆస్తిని సమిష్టి ఆస్తిగా లెఖ్ఖలు వేసి సగం సగం పంచుకుం టారు. ప్రస్తుతం నా భర్తకి ఉన్నవి అప్పులే. విడాకులకి దారితీస్తే ఈ ఇంటిలో సగం, నా జీతంలో సగం నష్టపోతాను. ఇదంతా నా కష్టార్జితమని ఎంత మొత్తు కున్నా వినరు. ఆఖరికి పెన్షన్, ఇంటిలో సామాన్లు, కారు అన్నీ సగం సగం చేయా ల్సిందే. ఇప్పటి పరిస్థితులలో ఇతర మార్గాలు లేని నేను సరే అనకుండా ఉండ డానికి ప్రత్యేక కారణాలు ఏమీ కనిపించడం లేదు. ఎలాగో ఒకలాగ జీవితం నెట్టాలిగా" అంటూ తన వ్యక్తిగత వ్యవహారం గురించి చెప్పింది.

కవిత గురించి తెలిసిన విషయాలు ఒక్క సారి రమణయ్యని సంభ్రమంలో ముంచాయి.

"ఇంతవరకు మీ గురించి నాకు ఏమీ తెలియదు" అన్నాడు రమణయ్య.

వెయిటరెస్ వచ్చి సూప్ ఎదురుగా ఉంచి "మీ సూప్‌లో ఛీజ్ వేసేదా?" అంటూ పిచి కారీ గొట్టంలాంటిది బైటకి ఎత్తింది "వద్దు" అన్నారు ఇద్దరూ. "మీ సలాడ్ త్వరలో

వస్తుంది" అంటూ నిష్క్రమించింది. రమణయ్య మనసు మనసులో లేదు. కవితని చాలా ప్రశ్నించాలని ఉన్నా ఎలా ప్రశ్నించాలా? అసలు ప్రశ్నించవచ్చా? అనుకుంటూ మౌనంగా సూప్‌ని తాగుతున్నాడు.

"మీరు చికాగోలో ఏ కంపెనీలో పనిచేయబోతున్నారు? " అంటూ ఇబ్బంది కలిగించని ప్రశ్న వేశాడు రమణయ్య.

"అదొక పెద్దకథ. ఇండియా నుంచి సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లని తీసుకువచ్చి వాళ్లకి ఉద్యోగాలు వెతికి కమిషన్ తీసుకుని డబ్బు చేసుకునే కంపెనీ ఒకటి ఈమధ్యనే నా భర్త ఇంకొకరితో కలిపి మొదలుపెట్టారు. ఆ కంపెనీకి ఎక్కౌంట్లు వగైరా నేను చూడాలి. కంపెనీ లాభంలోంచి నా జీతం వస్తుంది. ఇలాంటి కంపెనీలు పెద్దపెద్ద పట్టణాలలో కుక్క గొడుగుల్లాగ మొలిచాయి" అంది కవిత.

ఆ ఉద్యోగం మంచిది కాదన్న అభిప్రాయం ఆమె మాటల్లో తెలియవచ్చింది రమణయ్యకి.

'ఉత్సాహంలేని ఉద్యోగానికి ఎందుకు వెళ్తున్నట్లు? ' అన్న ప్రశ్న వేయాలనిపించినా ఆ ప్రశ్నవేసే ధైర్యంలేక మౌనంగా సూప్‌ని చప్పరించాడు.

"ఇక్కడ హాయిగానే వెళ్తోంది. ఇది వదులుకుని వెళ్లాలంటే మనస్కరించడంలేదు. కాని తప్పదు. ఒంటరి బతుకులో హాయి ఉన్నా ఇబ్బందులు, ముఖ్యంగా ఏళ్లు పైబడుతుంటే ఎక్కడేకష్టమున్నా లేకపోయినా ఇష్టం కల్పించుకుని సాంప్రదాయపు బాటలో నడవవలసిందే" అంది కవిత.

"నాకు దీనిగురించి అంతగా తెలియదు" అన్నాడు రమణయ్య.

"మీరు ఒకటి చెప్పండి. మనుషులు ఒక వయసు వచ్చేక మారతారంటారా? లేక అవసరంబట్టి మారినట్లు ప్రవర్తిస్తారా" అనడిగింది కవిత.

గొంతుకలో పచ్చివెలక్కాయపడినట్లయింది రమణయ్యకి. తన నమ్మకాలు, అనుభవాలు తనవే కానీ అవి అందరికీ వర్తిస్తాయని తను గ్యారంటీగా చెప్పలేడు. అదీకాక ఈ ప్రశ్న కవిత జీవితానికి సంబంధించినది. తను నమ్మినది చెబితే అది ఆమె తీసుకోబోయే నిర్ణయానికి ప్రతిబంధకం అవ్వచ్చు. చికాగోలో ఉన్న ఆమె భర్త దగ్గరకి వెళ్లకూడదని వారించినట్లవుతుంది. కానీ ఒకరి గురించి ఇంకొకరు జంకులేకుండా నిష్పక్షపాతంగా తమ భావాలని వ్యక్తపరిచినపుడే ఇద్దరిమధ్య మంచి స్నేహం ఉన్నట్లు లెఖ్ఖ. వ్యక్తపరచలేకపోతే అది మంచి స్నేహంగా పరిగణనలోకి రాదు. కవిత మంచి స్నేహితురాలనే తను నమ్ముతున్నాడు. అయినప్పటికీ ఆమెకు కష్టం కలిగించే మాటలు తను నమ్మిన నిజాలయినా, కావాలని తను ఎప్పుడూ బైటకి వ్యక్తపరచలేడు, చెప్పడు. ఇది ఆమె జీవిత సమస్య అని కాస్సేపు ఆలోచించి

"కొంత వయసు వచ్చాక మనుషుల ఊహలు, నడవడి మారవు. కాని సహవాసం వలన కొంత మార్పు సంభవించవచ్చు. మార్పు ఉండదని ఖండితంగా చెప్పలేం" అన్నాడు రమణయ్య.

పకపకా నవ్వి గ్లాసులో ఉన్న వైన్‌ని సొంతం ఎత్తిపెట్టి తాగేసి "ఈ గోడమీద పిల్లి వ్యవహారం సలహాలు చాలా విన్నాను" అంటూ తిరిగి నవ్వు అందుకుంది.

రవ్వంత సిగ్గుపడుతూ కవితతో శృతి కలిపాడు రమణయ్య.

వెయిటరెస్ వచ్చి "ఇంకో బౌల్ సూపు కావాలా? " అనడిగితే కవిత కావాలని రమణయ్య వద్దని చెప్పగా అర నిమిషంలో సూప్, సాలడ్‌తో తిరిగి వచ్చింది. ఆలోచనల్లో ఎవరి మానాన వాళ్లు తిండి తినడం పూర్తి చేశారు.

"ఈ రోజు డిసర్ట్‌లు" అంటూ వెయిటరెస్ దండకం మొదలుపెడుతుంటే "ఒక టెర్రామీసు" అంది కవిత. కవితని క్షణంలో




ఆపాదమస్తకం పరిశీలిస్తూ "ష్యూర్" అంటూ వెయిటరెస్ తన పొడవాటి కాళ్లని ప్రదర్శిస్తూ చకచకా అడుగులు వేసుకుంటూ కిచెన్‌లోకి అదృశ్యమైంది.

"యవ్వనంలో రేపటి గురించి భయం ఉండదు. యవ్వనం మళ్లేక రేపటి గురించి చింత ఎక్కువ అవుతుంది. రేపటి గురించి ఆలోచన ఎంతదూరంగా ఉంచితే అంత మంచిది" అంది కవిత దూరంగా వెళ్తున్న వెయిటరెస్‌ని చూస్తూ.

"మీకు రేపటి గురించి భయం ఎప్పటికీ ఉండదు" అన్నాడు రమణయ్య.

"ఈజ్ దట్ సో?" అంది చిరునవ్వు చిందిస్తూ. వచ్చిన డిసర్ట్‌ని రెండు భాగాలు చేసి తనకంటూ కేటాయించుకున్న భాగంలో ఫోర్క్ గుచ్చి ఒక ముక్కని నోటిలో ఉంచుకుని కళ్లని ఇటూ అటూ తిప్పి అది ఎంత బాగుందో కళ్లతోనే వ్యక్త పరచింది కవిత.

రమణయ్య డిసర్ట్ తిని చాలా బాగుంది అన్నాడు.

బిల్, టిప్ డబ్బు అందిచ్చేక కారు పార్క్ చేసిన చోటకి ఎండలో నడిచి వెళ్లేలోపు కవిత మొహం కందిపోవడం చూసి "మీరు మరీ సుకుమార్లు, ఈ కాస్సేపటికే వడలిపోయారు" అన్నాడు.

నుదుటన పట్టిన చమటని టిష్యూ రూమాలుతో తుడుచుకుంటూ మరోసారి పరీక్షగా రమణయ్యవేపు చూసింది. రెండోసారి ఆ విచిత్రమైన చూపుకి అర్థం చెప్పుకోలేకపోయాడు రమణయ్య.

"రేపు ధనరాజ్ వస్తాడు. పూల మొక్కలు సరిచేయడం ఈవేళ అయిపోవాలి" అన్నాడు రమణయ్య కారులో సర్దుకుంటూ.

"నాకు చిన్నచిన్న పనులు రెండు మూడు ఉన్నాయి. ఎండ తీవ్రంగా ఉంది ఇప్పుడు. సాయంకాలం నాలుగు గంటలకి మొదలు పెడదాం, ఒక గంటలో పని పూర్తయిపోతుంది. కంగారు పడకండి" అంది కవిత.

సి.డి ప్లేయర్‌లోంచి 'మనం ఎక్కడో కలిసేం, అది ఎన్నాళ్లయిందో' అంటూ తాయిర్‌హుసేన్ గజల్ గతం గురించి జ్ఞాపకాలుని నెమరువేసుకుంటూ మార్దవంగా వినిపిస్తోంది.

"థాంక్స్ ఫర్ ది లంచ్" అంటూ కారు దిగాడు రమణయ్య.

"ఇట్స్ మై ప్లెజర్" అంటూ కారుని తన గరాజ్‌లోకి నడిపింది కవిత.



విచిత్రంగా గడిచింది ఈ రోజు. కవితతో లంచ్ తినడం ఇది మొదటిసారి కాకపోయినా ఈవేళ మొట్టమొదటిసారి కవిత తనకున్న ఊహల్ని, అనుమానాలని తనతో పంచుకుంది. సాయంకాలం తోటలో ఆమె సహాయం చేయడంతో చాలా ఆహ్లాదంగా గడిచింది. ధనరాజ్ కాని, ఇతర విషయాలు కాని మెదడులోకి జొరపడకుండా నిమిషాలు ఇట్టే పరిగెత్తాయి. కానీ ఇల్లు మరమ్మత్తులు పూర్తయినాక ఇల్లు అమ్మేసి న్యూజెర్సీకి దూరంగా చికాగోకి ఆమె భర్త దగ్గరకి వెళ్లిపోతుంది. తను ఇండియా వెళ్లిపోతాడు. ఎవరి దారి వారిది. తను మళ్లీ అమెరికా వచ్చినా కవిత

తిరిగి కనిపించదు. నిద్రలోకి ఒరిగేముందు ఆఖరి ఆలోచన కవిత గురించే వచ్చింది రమణయ్యకి.

★ ★ ★

"నాన్నా! నేనూ, రవళి రిజిస్ట్రార్ ఆఫీసులో పెళ్లి చేసుకుందామనుకుంటున్నాం. ఇంకో మూడు వారాలలో పెళ్లికి ఎప్పాయింట్ మెంట్ తీసుకున్నాను. బ్లడ్‌టెస్ట్ రిపోర్ట్ సరిగ్గా ఉంటే ఇంకేమీ అభ్యంతరం ఉండదు. పెళ్లయ్యేక ఒక వారంరోజులు సెలవు తీసుకుని అలా ఊర్లు తిరిగి వస్తాం. హనీమూన్‌నుంచి తిరిగి వచ్చాక రవళి న్యూయార్క్‌లో కొత్త ఉద్యోగంలో చేరుతుంది" అంటూ తన పెళ్లి విషయం చెప్పాడు ధనరాజ్.

మజ్జిగలో ఆవకాయ నంజుకుంటున్న రమణయ్యకు పొలమారింది. తరతరాలుగా జీర్ణించుకుపోయి జీన్స్‌లో ప్రవహిస్తున్న సాంప్రదాయం ఒక్కసారి మూలిగింది. తను పెంచి పెద్ద చేసిన కొడుకు తనతో సంప్రదించడం మాట అటుంచి కనీసం చెప్పనైనా చెప్పకుండా పెళ్లి చేసుకుని విడాకులు పుచ్చుకున్నాడు. ఇప్పుడు తిరిగి పెళ్లి చేసుకోబోతూ ఎదురుగా ఉన్నాను కాబట్టి కేవలం కాకతాళీయంగా "బజారుకి వెళ్లి కూరగాయలు తెచ్చుకుంటాను" అన్నంత సామాన్యంగా తన పెళ్లి విషయం చెబుతుంటే ఆశ్చర్యం వేసింది. పదమూడేళ్ల తరువాత తండ్రి కొడుకుని, తల్లి కూతురిని స్నేహితునిగా, స్నేహితురాలుగా చూడాలని ఒక సైకాలజిస్ట్ రాసినది చదివేడు. ఆరేళ్ల అమెరికా జీవితంలో ధనరాజ్ చాలా మారి కొత్త పంథాకి అలవాటు పడ్డాడు అనుకుంటూ, "ఎక్కడ ఉంది ఈ రిజిస్ట్రార్ ఆఫీసు? ఎవరెవరు వస్తారు? మనం వెళ్లి రవళి కుటుంబీకులని ఒకసారి కలవాలా? ఏమైనా మాటలాడాలా? " అనడిగేడు.

"రవళి పెళ్లి ఒకసారి పెళ్లయిన నాతో అవడం ఆమె తల్లితండ్రులకి పూర్తిగా ఆమోదకరంగాలేదు. బట్ హూకేర్స్? అందుచేత వాళ్లు వస్తారో రారో తెలియదు. ఇద్దరు స్నేహితులు వస్తున్నారు. నువ్వురా. రవళి తల్లితండ్రులకి ఈ పెళ్లి పూర్తిగా ఇష్టమైతే గుడిలో పెళ్లి ఏర్పాటు చేస్తారు కాబోలు" అన్నాడు ధనరాజ్ బుజాలెగరేస్తూ.

"నువ్వు కావాలంటే రావచ్చు అనకుండా, నువ్వురా" అని ధనరాజ్ అన్నందుకు రమణయ్య మనసు కాస్త తెరిపినపడింది.

"రవళికి ఒకసారి పెళ్లయి ఉంటే నీతో పెళ్లికి ఆమె తల్లితండ్రులకి అభ్యంతరం ఉండేదికాదా? " అనడిగాడు కొడుకుని.

"వాళ్లకి ఉండేది కాదేమో కాని నాకు ఉండేది. ఒకసారి పెళ్లయిన పిల్లని చేసుకోవడమా? కమాన్ డేడ్" అంటూ నవ్వేడు ధనరాజ్.

మౌనంగా ఉండిపోయాడు రమణయ్య. డిన్నర్ ప్లేటుని సింక్‌లో పడేస్తూ "డాడ్ నువ్వు గార్డెన్‌ని, లాన్‌ని బాగా సరిదిద్దుతున్నావు. పక్కింటావిడ ఆమె గార్డెన్ గురించి మంచి శ్రద్ధ తీసుకుంటుంది. ఆవిడ లాన్‌తో పోలిస్తే మన లాన్ చాలా ఘోరంగా ఉండేది. ఇప్పుడు మన లాన్ ఆమె లాన్‌కి పోటీగా బాగుంది. థాంక్స్ డాడ్" అంటూ ఆనందాన్ని వెలిబుచ్చాడు ధనరాజ్.

"నేను గార్డెన్‌ని బాగా ఉంచడానికి కారణం ఆమె సలహాలే. అప్పుడప్పుడు నేను ఏం చేయాలో విడమరచి చెబుతుంది. ఆవిడ చాలా మంచి వ్యక్తి" అన్నాడు రమణయ్య.

"డాడ్, బి కేర్‌ఫుల్, ఆమె ఒంటరి స్త్రీ" అంటూ నవ్వుకుంటూ టెలివిజన్ చూడడంలో లీనమయేడు ధనరాజ్.

నోరు ఎండిపోయింది రమణయ్యకి. ఈమధ్య ధనరాజ్ అప్పుడప్పుడు నాన్నకి బదులుగా డాడ్ అన్న పదాన్ని వాడడం మొదలుపెట్టాడు. అనుకుని టెలివిజన్ వేపు దృష్టి సారించాడు రమణయ్య. రెండు సంప




త్సరాల క్రితం అమెరికా వచ్చి ఉన్న నాలుగు నెలలూ చాలామట్టుకు ఇంటిపట్టునే గడిచాయి. దగ్గరగా ఉన్న నయాగరా జలపాతం, న్యూయార్క్ పట్టణం, వాషింగ్టన్ డి.సి. చూడడమే అతి కష్టమైంది. ధనరాజ్ ఉద్యోగరీత్యా అటూఇటూ తిరగడం, ఉద్యోగాలు మారడం వంటి అనిశ్చిత పరిస్థితులలో అంతకన్నా సాధ్యపడలేదు. కవితతో కాస్తంత పరిచయం పెరిగేక ఆమెకి తీరుబడిగా ఉన్నపుడు కబుర్లతో, టెలివిజన్ కలిసి చూడడంతో రోజులు గడిచిపోయాయి. అప్పుడప్పుడు కవిత తనని లైబ్రరీ దగ్గర వదిలి వెళ్తే పేపర్లు చదివి ఇంటికి చేరుకునేసరికి రోజు గడిచేది. ధనరాజ్ ఊరిలో లేనపుడు ఉదయం లేవగానే తెలిసిన కవిత మొహం బైట కనిపించి, రెండు నిమిషాలు మాట్లాడేసరికి బద్ధకం వదిలి హుషారు పుట్టుకువచ్చేది.

"వ్యాయామంకి, వయస్సుకి సంబంధం లేదు. ఎవరి సత్తువబట్టి వాళ్లు వ్యాయామం చేయవచ్చు. ఒక్కసారే ఎక్కువ చేయకూడదు అంతే" అంటూ తనని ఆరేడు సార్లు జిమ్‌కి తీసుకెళ్లింది. వ్యాయామం చేసి వచ్చినరోజు ఒళ్లు అంతా ఫ్రీగా అయినట్లనిపించేది. కవితతో పరిచయం అయిన మూడు నెలలలో ఆమె నుంచి చాలా నేర్చుకున్నాడు తను.

ఈమారు ఇండియా నుంచి వచ్చి దాదాపు ఆరు వారాలయింది. ఇంకో పది వారాలలో తను ఇండియా వెళ్లిపోతాడు. ఈ పది వారాలు గడిచేదెలా? మూడు వారాల్లో ధనరాజ్, రవళిల పెళ్లయేక హనీమూన్‌కి వెళ్లి తిరిగి వచ్చేసరికి నాలుగు వారాలు అవుతాయి. కొత్త దంపతులు ఏకాంతాన్ని అభిలషించడం సహజం. తను ఇంటిలో ఉంటే వాళ్లకి ఫ్రీడమ్ తగ్గిపోతుంది. ధనరాజ్ పెళ్లి సంగతి తనకి ముందరే తెలిస్తే తను దానికి అనుగుణంగా ఇండియాకి వెనక్కి వెళ్లే టిక్కట్ కొనుక్కునేవాడు. ఇప్పుడు ఏం చేయాలి? కవితని అడిగితే ఏదైనా సలహా ఇస్తుందేమో! తనతో ఇంజనీరింగ్ చదివిన గోపాల్ ఎప్పుడు ఇండియా వచ్చినా కలిసి, అమెరికా వస్తే తన దగ్గరకి రావడం మరచిపోవద్దని పదే పదే చెప్పేవాడు. తను కొన్నాళ్లకి అతని దగ్గరకి వెళ్లి రావచ్చు కానీ అది ఎలా సాధ్యం? తనకి ఎవరైనా సహాయం చేస్తే కాని అది సాధ్యంకాదు. క్రితంసారి గోపాల్ ఆరేళ్ల క్రితం ధనరాజ్ ఈ దేశం రాకముందు ఇండియా వచ్చి కలిసేడు. గోపాల్ పాత అడ్రసు తను తీసుకురాలేదు, ధనరాజ్‌ని తరువాత అడిగి గోపాల్ అడ్రసు ఆరా తీయవచ్చు అనుకుంటూ టెలివిజన్ చూడడంలో లీనమయిన ధనరాజ్ వేపుచూశాడు. ఆరేళ్ల అమెరికా జీవితంలో ఒళ్లు చేసేడు ధనరాజ్. శరీరానికి నిగారింపు వచ్చింది. శరీరాకృతితోపాటు ధనరాజ్ మానసిక దృక్పథంలో కూడా మార్పు కానవస్తోంది. దాదాపు ఇరవై రెండు, ఇరవై మూడేళ్ల క్రితం బొద్దుగా ముద్దుగా ఉన్న కుర్రవాడిని అనాథాశ్రమం నుంచి ఇంటికి తీసుకువచ్చి చదువు చెప్పించి అతనిని మంచి పౌరునిగా మలచడానికి తనకి అర్థమైనట్లు తన ప్రయత్నం తను చేశాడు. ధనరాజ్ తను ఆశించినట్లే పెరిగాడని నమ్మి ఆనందపడ్డాడు. స్కాలర్‌షిప్‌తో అమెరికా వెళ్లబోతున్నపుడు ధనరాజ్ మొహంలో కానవచ్చిన తృప్తి, కృతజ్ఞత చూసి తనకెంతో గర్వమేసింది. ఆనాటి ధనరాజ్‌కి ఈనాడు కనిపిస్తున్న ధనరాజ్‌కి పోలికలు తగ్గిపోయేయి. ఆ అనుమానాలకి ఇది అని చూపించడానికి తన దగ్గర సరైన ఆధారాలులేవు, కేవలం అనుమానాలే. అయితే ధనరాజ్ ఉచ్చరించిన కొన్ని వాక్యాలు తనని ఇబ్బంది పెడుతున్నాయి.

"ఒకసారి పెళ్లయిన పిల్లని చేసుకోవడమా డాడ్?" అన్నాడు ధనరాజ్. అంటే ధనరాజ్ రవళిని ప్రేమించడంలో ఆమె

గతంతో ప్రమేయం ఉందన్నమాట. రవళికి పెళ్లయి విడాకులు తీసుకుని ఉంటే ధనరాజ్ ఆమెని ప్రేమించేవాడుకాడని అనుకోవాలా? తను వివాహం చేసుకోవడానికి ఒకసారి పెళ్లయిన పిల్ల అర్హురాలు కాదనుకుంటే ఒకసారి పెళ్లి చేసుకున్న ధనరాజ్ రవళికి ఎలా అర్హుడు? లాజిక్ ఒకవైపే ఉంటుందా? ఇద్దరు అపరిచిత వ్యక్తుల మధ్య ప్రేమ అంకురించడానికి వాళ్ల గతం తోకాని ఇతర బాంధవ్యాలుకాని అడ్డు రావంటారే! ధనరాజ్‌కి సంబంధించినంత వరకు వ్యవహారం ఇంకోలా ఉంది. ధనరాజ్ ఊహలో పురుషునిపై ఆ నిబంధన అనవసరం అన్న నమ్మకమా? అమెరికన్లకి ఇలాంటి భేదాలు ఉన్నట్లు కనిపించదు. మరి ఆరేళ్లుగా ఇక్కడే నివశించి ఈ దేశ పద్ధతులని అనుసరిస్తున్న ధనరాజ్‌కి ఇండియాలో కొందరు ఆలోచించినట్లు ఎందుకు ఆ పట్టింపు? అదొక్కటేకాదు కవిత గురించి 'డాడ్ బి కేర్‌ఫుల్, ఒంటరిస్త్రీ' అనడంలో ధనరాజ్ సంకుచితత్వం బయటపడింది. కవిత ఒంటరిగా ఉండడానికి, లేక జంటగా ఉండడానికి, తోటలో తనకి ఇచ్చే సలహాకి ఏమిటి లంకె? ఒంటరి స్త్రీ వల విసురుతుందన్న ఛండాలపు ఆలోచనా? తనూ ఒంటరివాడేగా? లేక ఆ వాక్యం తనని పొరపాటు చేయవద్దనా? వెనుకబడిన జిల్లాలో బైట ఇంకేమీ ప్రపంచం చూడని వ్యక్తి దురుసుగా, అగౌరవంగా మాటలాడినట్లు ధనరాజ్ ఎలా మాట్లాడగలిగాడు? చాలామందిలాగే అతనివి కూడా బైట నాగరికపు ముసుగు ధరించినా ఒంట్లో పాతుకుపోయినవి పాత భావాలేనా? నా పెంపకంలో ఏదైనా లోపం ఉందా? పిల్లల్ని సరైన పౌరులుగా, వ్యక్తులుగా మలచగలిగే సమర్థత లేని వ్యక్తులు పిల్లల్ని దత్తత చేసుకోకూడదు. కానీ అది ముందరే ఎలా తెలుస్తుంది అని మథనపడుతుంటే ఐదారేళ్లక్రితం జరిగిన సంఘటన జ్ఞాపకానికి వచ్చింది.

పాత స్నేహితుడు, అతని భార్య, కూతురు చాలాకాలం తరువాత ఇండియా వచ్చిన సందర్భంగా తను విందుకి చాలా మందిని ఆహ్వానించాడు. అమెరికాలో ఉన్న ఫ్రీడమ్ గురించి, పిల్లలు చిన్నప్పటినుంచి స్వతంత్రంగా ఆలోచించడం గురించి స్నేహితుని భార్య తెగ చెబుతూ తన పిల్లలు ఎవరిని కావాలంటే వాళ్లని తమ జీవితభాగస్వామిగా ఎన్నుకునే హక్కు ఉందంటుంటే అంతా వింటున్న పదహారేళ్ల ఆమె కూతురు,

"మమ్మీ, అయితే నేను ఆఫ్రికన్ అమెరికన్‌ని పెళ్లి చేసుకోవచ్చు అన్నమాట" అంది.

"ఓవర్ మై డెడ్ బాడీ" అంది స్నేహితుని భార్య చటుక్కున.

ఇలాంటి విషయాలలో చాలామంది తాము పురోగమన వాదులమనుకున్నా బైటకి అలా ప్రదర్శించినా తమ ఆలోచనా ధోరణి పాతకాలాల ఆలోచనా ధోరణిలోనే ఉందని, అలాంటి పరీక్ష ఎదురయినపుడే తెలియవస్తుంది. గెంతి గోడదాటించే అవసరం వచ్చేంతవరకు ప్రతీ గాడిదా తను జింకననే భ్రమపడుతుంది. అందరూ అలాగే ఉంటారని కాదు కొందరు ఏమీ పట్టించుకోరు అనిపించింది అప్పుడు తనకి.

"ఏం డాడీ ఏదో ఆలోచనలోపడ్డారు?" అనడిగేడు ధనరాజ్ టెలివిజన్ ఛానల్ మారుస్తూ.

"నన్ను ఆలోచన బాధపెడ్తుంది. అయినప్పటికీ దేనికో ఒకదాని గురించి నా మెదడు ఎప్పుడూ ఆలోచిస్తూనే ఉంటుంది. నాకు నిద్ర కమ్ముకు వస్తోంది, గుడ్‌నైట్" అంటూ పడక గదిలోకి దారితీసేడు రమణయ్య. రమణయ్యకి తన ఆలోచనలు ధనరాజ్‌తో పంచుకోవడానికి ఏమాత్రం ఇష్టంలేదు.

"డాడీ, నేను ఉదయమే న్యూయార్క్ వెళతాను. సాయంకాలానికి కాని రాను. నా

గురించి నిరీక్షించకండి" అన్న ధనరాజ్ హెచ్చరిక రమణయ్యకి వినిపించింది.

★ ★ ★

ఉదయమే నడకకి వెళ్లి వస్తుంటే ధనరాజ్ కారు బయటకి తీసి గరాజ్ తలుపు మూయబోతున్నాడు.

"గుడ్‌మార్నింగ్ డాడీ, బై" అంటూ చేయి ఊపుతూ కారుని రోడ్డు మీదకి మళ్లించాడు. రమణయ్య చెయ్యి ఊపేడు. కాఫీ తాగి కాలకృత్యాలు ముగించి కవిత కనిపిస్తుందేమోనని రమణయ్య ఎదురు చూడసాగాడు. గంటలు గడుస్తున్నాయి. కవిత జాడలేదు. ఉదయం పది గంటలకి పేపరు అందుకుంటున్న కవితని చూసి

"కవితగారూ నాకు మీ సహాయం కావాలి" అంటూ బిగ్గరగా అరచినంత పని చేశాడు రమణయ్య. కవిత ఒక్కసారి గాభరా పడ్తూ, ఏమైందోనని రమణయ్య వేపు అడుగులు వేస్తుంటే

"స్నానం వగైరా ముగించి రండి" అన్నాడు రమణయ్య. అరగంటలో స్నానం చేసి తలుపు తట్టిన కవితని

"రండి, రండి" అంటూ ఆహ్వానించాడు రమణయ్య.

లోపలికి వచ్చి సోఫాలో హుందాగా కూర్చుని రమణయ్య వేపు ప్రశ్నార్థకంగా చూసింది. కడిగిన ముత్యంలా ఉన్న కవిత మొహాన్ని తాకాలనిపించింది. ఆ మాటే అనాలని ఉన్నా నిగ్రహించుకుని ఆమెవేపు తదేకంగా చూస్తుంటే "ఏమిటి మీకు కావలసిన సహాయం? " అనడుగుతూ మొహాన్ని సాంతం రమణయ్యవేపు తిప్పి దగ్గరగా జరిగింది. కవిత శరీరం నుంచి మైసూర్ శాండిల్ ఉడ్ వాసన నాశికాపుటాల్ని తాకగా.

"మీకు ఇక్కడ మైసూర్‌శాండిల్ ఉడ్ సబ్బు ఎలా దొరుకుతుంది? " అనడిగాడు.

"ఇదా మీకు కావలసిన సహాయం, అందుకోసమా నన్ను పిలిచారు? " అంటూ తెరలు తెరలుగా నవ్వుతోంది కవిత.

ముందర రోజు ధనరాజ్‌తో జరిగిన సంభాషణ చెప్పి "టెక్సాస్ రాష్ట్రంలో నాకున్న స్నేహితుని ఎడ్రసు, టెలిఫోన్ నెంబర్ మీరు ఇంటర్‌నెట్‌లో చూసి కనుక్కోవాలి. ఇక్కడ కంప్యూటర్‌లేదు" అన్నాడు.

"ఎందుకు? "

"రవళి ఇక్కడకి కాపురానికి వచ్చిన కొత్తలో నేను ఇక్కడ ఉంటే వాళ్లు ఫ్రీగా ఉండలేకపోవచ్చు అందుకు నాకు కొన్నాళ్లు టెక్సాస్ వెళదామని ఉంది" అంటూ గోపాల్ వివరాలు ఆమెకి చెప్పాడు.

"మా ఇంటికి రండి, మీరు పక్కన కూర్చుంటే వెతుకుదాం. అదేమీ కష్టమైన పనికాదు" అంది కవిత.

ఇద్దర్రూ లేచారు. "ఫిల్టర్‌వేసి వచ్చాను. డికాక్షన్ దిగితే ఆ పని కానిచ్చేక మీ పని ఆరంభిద్దాం" అంటూ కవిత వంటింటిలోకి వెళ్లింది.

హాలులో గోడలమీద పెయింటిగ్స్, వివిధ రకాలైన సీనరీలు, ఫొటోలు ఉన్నాయి. అవి కవితే వేసినవని దగ్గరగా వెళ్లిచూస్తే దానిమీదున్న సంతకం బట్టే తెలిసింది.

"చిన్నప్పటినుంచీ నాకు పెయింటింగ్ నేర్చుకోవాలన్న కోరిక ఉండేది. ఆ కోరిక అలా ఉంటూనే జీవితం గడిచిపోయింది. మీరు పెయింటర్ అని నాకు తెలియదు" అన్నాడు కాఫీ కప్పులతో తిరిగి వచ్చిన కవితతో.

"నేనేమీ పెయింటర్‌ని కాను, కొన్నాళ్ల క్రితం ఉద్యోగంలో చేరకముందు, ఏమీ తోచక పెయింటింగ్ చేసేదానిని. పెయింటింగ్ ఏ వయస్సులోనైనా నేర్చుకోవచ్చు. మీకు అభ్యంతరం లేకపోతే నేను ఎలా మొదలుపెట్టేనో మీకు చెబుతాను" అంది కవిత.

నిట్టూర్పు విడిచాడు రమణయ్య. కవిత

సమాధానంకోసం ఎదురు చూస్తుంటే "జీవిత సంధ్యలోకి అడుగుపెట్టబోతున్న నాకు పెయింటింగ్ నేర్చుకోవడం ఒక్కటే తక్కువ. మీరు చికాగో వెళ్లిపోతున్నారు, నేను టెక్సాస్‌కి వెళ్లి తిరిగి వచ్చి ఇండియాకి వెళ్తాను. పెయింటింగ్ నేర్చుకోవడం జరిగేపనికాదు. ముందర గోపాల్ ఎడ్రసు కనుక్కుందాం" అన్నాడు రమణయ్య.

"నేను చికాగో వెళ్లడం ఇంకా పూర్తిగా నిశ్చయమవలేదు. ఒకవేళ వెళ్లినా దానికి ఇంకా చాలా వ్యవధి ఉంది. మీరు తొందరగా టెక్సాస్‌కి పారిపోదామనుకుంటున్నారు" అంటూ సన్నగా నిట్టూర్చి కంప్యూటర్‌ని ఆన్ చేసింది. పది నిమిషాలలో గోపాల్ ఎడ్రసు, అతని టెలిఫోన్ నెంబర్లు దొరికాయి.

"మీరు వెళ్దామనే నిశ్చయించుకున్నారు కాబట్టి ఇంక ఆలస్యమెందుకు, ఆయనకి ఫోన్ చెయ్యండి" అంటూ ఫోన్‌ని రమణయ్యకి అందిచ్చింది. అరగంట గోపాల్‌తో మాటలాడేక రమణయ్య టెక్సాస్‌కి వెళ్లడం దాదాపు ఖాయమైంది. ప్రోగ్రాం ఖాయం చేస్తున్నప్పుడు గమనించకపోయినా ఫోన్ క్రింద ఉంచేక కవిత మొహంలో కళ తగ్గి దిగులు చోటుచేసుకోవడం చూసి ఆశ్చర్యపడ్డాడు రమణయ్య. ధనరాజ్, రవళిలకి తను అడ్డంగా ఉంటానేమోనని దానిని నివారించే మార్గ అన్వేషణలో కవిత గురించి తను ఆలోచించనేలేదు అనుకుంటూ "నేను టెక్సాస్ వెళ్లడం ధనరాజ్ ఇష్టంమీద ఆధారపడి ఉంటుంది. గోపాల్ తన ఎక్కౌంట్‌లో ఉన్న ట్రావెల్ మైళ్లు వాడి నాకు ఒక ఫ్రీ టిక్కట్టు పంపే ఏర్పాటు చేస్తున్నాడు. అయినప్పటికీ అది ధనరాజ్‌కి ఇష్టం కాకపోతే కేన్సిల్ అవుతుంది. అంటే నా ప్రయాణం కూడా ఇంకా ఆలోచన దశలోనే ఉంది" అన్నాడు రమణయ్య. కవిత ఏమీ మాటలాడలేదు.

"గోపాల్ ఉంటున్న ఊరికి ఎయిర్‌పోర్ట్ ఎనభై మైళ్ల దూరంలో ఉంది. విమానాశ్రయానికి వచ్చి నన్ను కలుస్తాడు" అన్నాడు రమణయ్య.

"ఈ దేశంలో రైళ్లలో మీరు ప్రయాణం చేయలేదు, ఎప్పుడైనా అవకాశం వస్తే ఆ అనుభవం ఎలా ఉంటుందో చూడండి. రాత్రి నాకు సరిగ్గా నిద్రపట్టలేదు. తలంతా దిమ్ముగా ఉంది. ఏ పనీ చేయాలనిపించడంలేదు" అంది కవిత.

"ఐ యామ్ సారీ, మీరు తలనొప్పితో బాధపడుతుంటే నేను మిమ్మల్ని ఇబ్బంది పెట్టేను. నేను వెళతాను. మీరు విశ్రాంతి తీసుకోండి" అంటూ లేవబోయాడు రమణయ్య.

"ఆ సంగతి చెప్పడం మిమ్మల్ని వెళ్లమని కాదు. మీకు అభ్యంతరం లేకపోతే కూర్చుని ఏవో కబుర్లు చెబుతారని" అంది కవిత. తన గతం గురించి, ఇతర విషయాల గురించి మాటలాడుతున్నా రోజంతా కవిత పరధ్యానంగా ఉండడం కనిపెట్టేడు రమణయ్య. సాయంకాలం కవిత చేసిన వంట తిని ఇంటికి వచ్చి ఆన్సరింగ్ మెషీన్ వేపు చూస్తే మెసేజెస్ ఏమీలేవు. ధనరాజ్ ఒకసారి ఫోన్ చేసి "ఎలా ఉన్నావు డాడీ?" అనడగలేదని గ్రహించి రమణయ్యకి రవ్వంత విచారం కలిగింది. సోఫాలో కూర్చుని టెలివిజన్ చూస్తూ నిద్రరాగానే అలాగే సోఫాలో నిద్రలోకి ఒరిగాడు.

మర్నాడు ఉదయమూ, మరుసటి రోజూ కవితతో ఒంటరిగా సంభాషణ వీలుపడలేదు. ఆమె ఇంటిలో పనివాళ్ల హడావుడి ఎక్కువగా ఉండడంతో ఏకాంతంగా పలకరిద్దామన్న కోరికని అణచిపెట్టుకున్నాడు రమణయ్య.

అయినా మాట్లాడడానికి ఏముంది




కనుక? అనుకున్నాడు రమణయ్య.



ఎందుకైనా మంచిదని ముందు రిజిస్ట్రార్ ఆఫీసులో సంతకాల పెళ్లి జరిగాక ధనరాజ్ రవళిల పెళ్లి గుడిలో హిందూ సాంప్రదాయం ప్రకారం జరిగింది. రిజిస్ట్రార్ ఆఫీసులో ఇద్దరూ సాక్షి సంతకాలు పెట్టేక గుడిలో పెళ్లి టూకీగా జరిపించాడు పురోహితుడు. ముందర రవళి తల్లితండ్రులు ధనరాజ్‌తో రవళి పెళ్లికి సుముఖత చూపకపోయినా ఆఖరి క్షణంలో మనస్సు మార్చుకుని తరలివచ్చి పెళ్లి జరిపించారు. వరుని తండ్రిగా రమణయ్య కేవలం ప్రేక్షకుడు మాత్రమే. తను దత్తత చేసుకోవడం వలన వరుని గోత్రం వగైరా తనవి ధనరాజ్‌కి పురోహితుడు పదేపదే వాడుతుంటే రమణయ్యకి నవ్వు వచ్చింది. దత్తత తీసుకుంటే రక్తసంబంధంలేని వ్యక్తికి వంశపారంపర్యంగా సంక్రమిస్తాయనుకుంటున్న కులం, గోత్రం ఆపాదింప పడతాయన్నమాట. ఇదెలా సాధ్యం? శాస్త్రం ప్రకారం మనిషి ఒక కులంలో పుడతాడంటారు పెద్దలు. మరి ఇది దానికి విరుద్ధంగా ఉందా? లేక తనకి అర్థమవక అలా ఆలోచిస్తున్నాడా? పిల్ల తండ్రి కాబోయే అల్లుని కాళ్లు కడిగి కన్యని దానం ఇస్తాడు. అసందర్భపు ఆలోచనేకాని స్త్రీ రెండవసారి పెళ్లి చేసుకుంటే ఆమెని కన్యగా ఉదహరించవచ్చా? ఎప్పుడో వందల సంవత్సరాలక్రితం జ్ఞానంలేని చిన్న పిల్లలకి పెళ్లిళ్లు చేసేటప్పుడు తల్లితండ్రులు నైతికంగా తామే ఆ పిల్ల బాధ్యత తీసుకుని అలా చేసేవారేమో? ఇప్పుడేమిటి ఒకవేళ రవళి తల్లితండ్రులు పెళ్లికి సుముఖంగా లేకపోతే పెళ్లికి రాలేకపోతే ఎవరైనా ఇతర దంపతులు కన్యాదాతలుగా వ్యవహరించవచ్చు మన సాంప్రదాయంలో కూడా ప్రతీ దానికి ఒక మారు పద్ధతి ఉంది అనుకుంటుంటే రవళి తండ్రి మర్నాడు సత్యనారాయణ వ్రతం చేయబోతున్నారని అందర్నీ రమ్మని ఆహ్వానించాడు. సత్యనారాయణ వ్రతం అనగానే రమణయ్యకి తన తండ్రి గుర్తుకు వచ్చాడు. ఆయన తన జీవితకాలంలో చీమ చిటుక్కుమన్నా సత్యనారాయణ వ్రతం చేసేవాడు. ఎంత లేదన్నా పాతిక ముప్ఫయిసార్లు యధావిధిగా ఆ తంతు ముగించేవాడు. అది చేసిన వారికి లేదా ఆ కథ విని ప్రసాదం తిన్నవారికి ఆయురారోగ్య అయిశ్వర్యములు, దీర్ఘాయుష్షు వగైరా కలుగుతాయని చెప్పి కథ ముగించి పురోహితుడు అక్షింతలు చల్లుతాడు. పాతికసార్లు వ్రతం జరిపించి చక్కెర వ్యాధితో బాధపడుతూ కూడా ప్రసాదం కళ్లకద్దుకుని తిని కేన్సర్ వ్యాధితో బికారిగా నలభై ఐదవ ఏట తన తండ్రి కన్నుమూశాడు. ఒకసారి తను ఒక పెద్దతో ఈ సంగతి మాటల్లో అంటే తనవేపు శివుడు తన మూడవ కన్ను విప్పి మండిపడినట్లు నిరసనగా చూస్తూ "ఆయన ఆ వ్రతాలు చేయబట్టే అంతవరకైనా బతికి ఉన్నాడు. లేకపోతే ఇంకెన్నో ఏళ్లు బాధపడేవాడు" అన్నాడు. 'ఇది నిజమా? మీకు తెలుసా?' అని తను అక్కడ నుంచి లేచివచ్చాడు. నమ్మకాలు ఎవరివి వారివి కాని వాటిని ఆయుధంగా ప్రయోగించి వాడుకో

వడం దారుణం!

రిజిస్టర్ పెళ్లి లేదా హిందూ సాంప్రదాయం ప్రకారం పెళ్లి రెండూ ఎందుకు చేశారో? ఏదో ఒకటి చాలుకదా? అన్నారు కూర్చున్న వ్యక్తులలో ఎవరో. ఎవ్వరూ సమాధానం చెప్పలేదు.

ప్రేమ ఇద్దరి మధ్య ఉత్పన్నమయ్యేది. వివాహం ఇద్దరిమధ్య జరిగేది, కాపురం ఇద్దరి మధ్య నడిచేది. వాళ్లిద్దరి జీవనసరళి, ఊహలు, నమ్మకాలు మీద ఆధారపడుతుంది. అది సఫలమో, విఫలమో వాళ్లిద్దరికే తెలుసు. సహజీవనం గురించి వాళ్లిద్దరే నిర్ణయించుకోవాలి. కేవలం చట్టం, సాంప్రదాయం పేరుతో నిలబడే చాలా కాపురాలు మేడిపండు లాంటివి. తనకి ఇలాంటి అభిప్రాయాలు ఉన్నాయని తెలిసిన కొందరికి తనంటే నిరసన జుగుప్స. బట్ ఐ డోంట్ కేర్ అనుకున్నాడు రమణయ్య.

"నాన్నా! నేనూ, రవళి వాళ్లింటికి వెళ్తున్నాం. నువ్వు మాతో వస్తావా? లేక ఇంటికి వెళ్తావా? నిన్ను ఇంటి దగ్గర వదిలేసే ఏర్పాటు చేస్తాను" అన్నాడు ధనరాజ్ రమణయ్య ఆలోచనలని చెదరకొడుతూ. పెళ్లి బట్టలలో ధనరాజ్, రవళిలు మెరిసిపోతున్నారు. అది చూసి ముచ్చటేసింది రమణయ్యకి.

"మన ఇల్లు రైలు స్టేషన్‌కి దగ్గరేకాబట్టి ఇక్కడకి దగ్గరగా ఉన్న రైలు స్టేషన్‌లో దింపేయమను, నేను ఇంటికి వెళ్లిపోగలను" అన్నాడు రమణయ్య

అరగంటలో రైలు స్టేషన్ దగ్గర రమణయ్యని ధనరాజ్ స్నేహితుడు వదిలి వెళ్లాడు. రాత్రి తొమ్మిదయ్యేసరికి ఇల్లుచేరి తాళం తీస్తూ పక్కింటివేపు చూశాడు. కర్టెన్లన్నీ దించి ఉన్నాయి. ఇంటిలో మందంగా వెలుతురు కనిపిస్తోంది. తాళం తీయడం ఆపి కవిత ఇంటివేపు నడిచి గుమ్మంమెట్లు ఎక్కి కాలింగ్‌బెల్ నొక్కాడు. అలికిడి వినపడలేదు మళ్లీ మరొక్కసారి కాలింగ్‌బెల్ బటన్ నొక్కాడు.

మందంగా తడబడుతున్న అడుగుల శబ్దం వచ్చాక తలుపు తెరచుకుంది.

ఒక చేతితో చెదిరిన జుత్తుని నొక్కుకుంటూ రెండవ చేతితో తెరచిన తలుపుని పట్టుకుని నిలుచుంది కవిత. గదిలో పైకప్పుమీద పడుతున్న వెలుతురు కవితలాగే సత్తువలేక నీరసంగా ఉంది.

"హలో" అని చిందరవందరగా ఉన్న కవితని చూసి "జ్వరమా? ఒంట్లో బాగాలేదా? ఏమిటలా ఉన్నారు?" అనడిగాడు రమణయ్య.

"రెండు రోజులు జ్వరం కాసి ఈ రోజు తగ్గుముఖం పట్టింది. ఇప్పుడు ఫరవాలేదు, రండి" అంది నీరసంగా. ముందర నడిచి వెళ్తున్న కవిత అడుగులలో బలంలేదు. రవ్వంత అటూ ఇటూ జోగుతోంది.

"జ్వరం అని నాకు తెలియపరిస్తే నేను వచ్చేవాడినిగా?" అంటూ రమణయ్య నొచ్చుకున్నాడు.

"మీ అబ్బాయి పెళ్లి ప్రయత్నాలలో బిజీగా మీరు తిరుగుతుంటే అదేదో సామెత చెప్పినట్లు మధ్య నా గొడవ ఏమిటని వద్దనుకున్నాను" అంది కవిత.

"మీరు విశ్రాంతి తీసుకోండి. రేపు వచ్చి చూస్తాను" అన్న రమణయ్యని వారిస్తూ "కాస్సేపు కూర్చోండి. పగలంతా నిజానికి రెండు రోజులనించి విశ్రాంతే తీసుకుంటున్నాను" అంది కవిత. రెండు రోజులు జ్వరం తరువాత కవిత చాలా శుష్కించిపోయినట్లనిపించింది. ఎత్తైన చెక్కిళ్లు, కళ్లు లోపలికి వెళ్లిపోవడంతో ఇంకా ఎత్తు ఎదిగినట్లనిపించేయి. చిట్లడానికి సిద్ధంగా ఉన్న పెదిమలు, నీరసంగా ఉన్న బోసికంఠం, వడలిన తోటకూర కాడల్లా నైట్‌డ్రెస్‌లోంచి బైటకి ఉన్న చేతుల్ని చూసి "మీరు బాగా చిక్కిపోయారు. ఈ రెండు రోజులూ మీరు ఏమైనా తిండి తిన్నారా? నాకు వంట





సరిగ్గా చేయడం రాదు. కాని మీరు తింటా నంటే ఏదో ఒకటి చేస్తాను. కనీసం చార యినా కాస్తాను" అని రమణయ్య లేవబో తుంటే,

"ఏమీవద్దు తిండి తినాలనిపించడంలేదు" అంటూ రమణయ్య చేయిపట్టుకుని ఆపబో యింది కవిత.

"మరేమీ ఫరవాలేదు ఏదో ఒకటి తినక పోతే ఇంకా నీరసపడిపోతారు" అంటూ వంటింటిలోకి నడిచి రిఫ్రిజిరేటర్ తలుపు తెరిచాడు. ఎదురుగా కనిపిస్తున్న టొమాటోలని, కొత్తిమీర, కరివేపాకులని బైటకి తీసి, టొమాటోలని కడిగి, తరగనా రంభించాడు. స్టవ్‌కి దగ్గరగా, డైనింగ్ టేబిల్ దగ్గర ఉన్న కుర్చీలలో ఒక కుర్చీని లాగి, కూర్చుని, వాలిపోతున్న కళ్ళని తెరచి ఉండడానికి విశ్వప్రయత్నం చేస్తూ, రమ ణయ్య వంట ప్రయత్నాన్ని గమనిస్తోంది కవిత. విదియనాడు చంద్రుడు భూమిమీద వదిలిన వెలుతురులా, నిస్ప్రాణంగా, తేజోవి హీనంగా కుర్చీలో కూర్చుని అవస్థపడుతున్న కవితతో, "మీరు పడుకోండి, ఐదు నిమిషా లలో వస్తాను" అన్నాడు రమణయ్య. ఏమీ అభ్యంతరం చెప్పకుండా కుర్చీలోంచి భారంగా లేచి నిలబడి, తడబడుతూ పరు పుమీదకి చేరింది. పదిహేను నిమిషాల తరువాత ఒక కప్పులో చారు, ఇంకో ప్లేటులో అన్నం పట్టుకుని, కవిత పడుకుని ఉన్న పరుపు దగ్గరికి రమణయ్య వచ్చి చూస్తే, కవిత కళ్ళు మూసుకుని ఉంది. మొహంమీద కాస్త భాగాన్ని చెయ్యి ఆక్ర మించి ఉంది.

నిద్రలోంచి లేపడమా వద్దా? జ్వరం ఎంత ఉందా?! అని ఆమె నుదుటిమీద అరచేతిని ఉంచి చూశాడు రమణయ్య. చేతికి ఆమె నుదురు వేడిగా తగిలినా, దానిలో తీవ్రతలేదు. కవిత కళ్ళు తెరచింది. "జ్వరం అట్టే లేదు. కానీ రాత్రిపూట అన్నం వద్దు. ఈ చారు తాగండి" అంటూ వేడిగా ఉన్న చారు కప్పుని అందిచ్చాడు. చారు ఒక గుక్క తాగగానే కవితకి పలమారింది. పలమారడం ఎక్కువగా ఉంటుంటే నోటిద గ్గర చేతిని ఉంచుకుని దగ్గుని కంట్రోల్ చేయప్రయత్నిస్తుంటే, చారు ఒలికిపోతుందే మోనని, కవిత చేతిలోంచి చారు కప్పు అందుకున్నాడు రమణయ్య. పలమారడంవ లన కవిత కళ్ళలో తిరిగిన నీళ్ళు కనిపిం చాయి రమణయ్యకు. కంటినీళ్ళని తుడుచు కుని చారు కప్పుని తిరిగి అందుకుంది కవిత. చారు అంతా తాగి "బాగుంది" అంటూ గోడకి దిండుని ఆన్చుకుని కూర్చుంది కవిత.

"ఒంటరి జీవితంలో ఇబ్బందులు చూస్తు న్నారా? మీరు వచ్చారు కాబట్టి ఈ చారు కాచి ఇచ్చారు. లేకపోతే నే బతికే ఉన్నానో, చచ్చానో చూసే మనిషేలేడు" అంది కవిత నీరసంగా.

"ఇబ్బందులు అనుకుంటే అన్నీ ఇబ్బం దులే. నేను కాకపోతే ఇంకెవరో వచ్చి సాయం చేసేవారు. లేదా హాస్పిటల్‌కి ఫోన్‌చేసి సహాయం పొందేవారు"

"మీరు ఎప్పుడైనా నర్సింగ్‌హోమ్‌కి వెళ్ళి అక్కడ శాశ్వతంగా ఉంటున్న ప్రజలని చూశారా? నర్సింగ్ హోమ్‌లో చేరే దశ ఎవ్వరికీ రాకూడదు బాబూ"

"వాటి సంగతి ఇప్పుడెందుకు? నేను మీకు ఏం సహాయం చేయగలనో చెప్పండి"

"మూడురోజులయింది బయట ప్రపం చాన్ని చూసి, మీకేమీ ఇతర ముఖ్యమైన పనులు లేకపోతే కాస్సేపు కూర్చుని కబుర్లు చెప్పండి" అంది కవిత.

"నాకు ముఖ్యమైనపనులు ఏమి ఉంటాయి? ధనరాజ్ పెళ్ళి మొదట గుడిలో, తరువాత రిజిస్ట్రార్ ఆఫీసులో రెండుసార్లు జరిగింది. రెండింటిలో నా పాత్ర దాదాపు సున్నా. అందుచేత ధన రాజ్ పెళ్ళి కబుర్లు ఏమీ వివరంగా చెప్ప డానికి లేవు. కబుర్లు కల్పించుకుని చెప్పడం

నాకు రాదు. మీరు ఏవైనా ప్రశ్నలు వేస్తే వాటికి సమాధానాలు ఇవ్వగలను. చొరవచేసుకుని మాటలాడడం నాకు రాదు" అన్నాడు రమణయ్య.

"ధనరాజ్‌ని దత్తత తెచ్చుకోవడంలో ఉద్దేశ్యమేమిటి?" అంటూ మొదటి ప్రశ్న వేసింది కవిత. రమణయ్యకి వెంటనే సమాధానం స్ఫురించక ఆలోచనలో పడ్డాడు.

"మీకు కొడుకు కావాలనుకుంటే వివాహమే చేసుకుని ఉండవచ్చు అఫ్‌కోర్స్, మగపిల్లవాడే కలుగుతాడని గ్యారంటీ లేదనుకోండి. అది కారణం కాకపోతే ఇంకేమిటి? అందరికీ పిల్లలు ఉన్నారని, మీకూ అందరిలాగే పిల్లలు ఉండాలని దత్తత తెచ్చుకున్నారా? లేక ఎవరికీ చెందకుండా పెరుగుతున్న వ్యక్తిని ఆదుకోవాలన్న ఆదర్శం మిమ్మల్ని దత్తతకి పురికొల్పిందా? ఏం ఆశించి దత్తత తీసుకున్నారు? వార్ధక్య దశలో మీ బాగోగులు చూస్తాడనా? కొంత మంది నమ్మినట్లు మిమ్మల్ని పున్నామన రకం నుంచి తప్పిస్తాడనా?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించింది కవిత.

రమణయ్యకి నోట మాట పెగలలేదు. సమాధానాల కోసం మెదడు తీవ్రంగా ఆలోచించి, గతంలోనికి పరిగెత్తింది.

చాలాకాలంక్రితం ఒకరోజు తిరుపతికి వెళ్ళి మద్రాసుకి తిరిగి వస్తున్నాడు. సాయంకాలం నాలుగు ఐదు గంటల సమయం కాబోలు. షాకర్లులేని ఆంధ్రప్రదేశ్ రోడ్డు రవాణాసంస్థ బస్ గతుకుల రోడ్లమీదనుంచి గంటకి నలభై- నలభైఐదు కిలోమీటర్ల వేగంతో పరిగెడుతూ ఆఖరి వరుసలో కూర్చున్న తనని నడుం విరిగిపోయేలా ఎత్తి కుదేస్తోంది. సాయంకాలం అవబోతున్నా ఎండ తీక్షణత ఇంకా తగ్గలేదు. దానికి తోడు గాలిలో తేమ ఎక్కువగా ఉండడంతో పరిగెడ్తున్న బస్‌లోనికి గాలి వస్తున్నా చమటపడుతోంది. రోడ్డుకి ఇరువైపులా చెట్లు వెనకాతల పాకలు, పెంకుటిళ్లు ఒకటిని ఆనుకుని ఇంకోటి కాక పోయినా, ఇళ్లు దగ్గరదగ్గరగా వెలసి ఉన్నాయి. ఉన్నట్టుండి, బస్ వెనకాల పెద్ద శబ్దం వినపడగా డ్రైవర్ బస్‌ని నిలుపుచేసి రోడ్డువారగా నడుపుతూ ఏమయిందా? అని పరిశీలించసాగేడు.

"ఏమయింది? ఏమయింది?" అంటూ ప్రశ్నిస్తున్న ప్రజానీకాన్ని పట్టించుకోకుండా టైర్లని గమనించి, "ఒరేయ్ కిష్టిగా, టైర్ మార్చాలి, సరంజామా దించు" అంటూ ప్రయాణంలో ఎమర్జన్సీలలో ఉపయోగపడతాడని బస్‌లో వస్తున్న క్లీనర్‌కి పని పురమాయించాడు డ్రైవర్.

ప్రయాణీకులలో కలకలం బయలుదేరింది.

"వెధవ ప్రభుత్వం! వెధవ ప్రభుత్వం! అంతా లంచగొండితనం. కొత్త టైర్లని బజార్లలో అమ్మేసి, అరిగిపోయిన టైర్లని తగిలిస్తారు. అవి ఇలా 'తుస్'మంటాయి. మనం ఇబ్బంది పడతాం. అయినా మన ఇబ్బందులు ఎవడికి కావాలి? వాళ్ళు బాగుపడడం ప్రధానం. ఒకసారి పబ్లిక్ ట్రాన్స్‌పోర్ట్ మినిష్టర్‌ని ఇలాంటి బస్‌లో ప్రయాణం చేయమనండి చూద్దాం. అప్పుడు తెలిసివస్తుంది. కాని అతను ఆపని చేయడే!" అన్నాడు ఒక ప్రయాణీకుడు జేబులోంచి చవకబారు సిగరెట్ పెట్టె తీసి, దాన్లో ఉన్న ఆఖరి సిగరెట్ వెలిగిస్తూ.

"ప్రయాణీకుడు అతి ముఖ్యమైన ఖాతాదారుడు" అంటూ పోస్టర్లు ఎక్కడపడితే అక్కడ పెడతారు. కానీ చూడండి, ఈ డ్రైవర్‌కి మనం బతికి ఉన్నామన్నది స్ఫురించడంలేదు. కనీసం మనతో ఒక్కమాట, ఎంత ఆలస్యం అవుతుందో అయినా చెప్పాలిగా? ఇదే అమెరికా అయితే..." అంటూ ఏదో చెప్పబోయాడు ఒక టై వేసుకున్న యువకుడు. అతని పక్కనే కింద ఉన్న నల్లని తోలుసంచి చూస్తే అతను మెడికల్ రిప్రజెంటేటివ్ అని చెప్పకుండానే తెలు





స్తోంది.

"బాబూ అమెరికా సంగతి ఉదాహరణగా చెప్పకు. వాళ్ళంటే నాకు పరమ అసహ్యం. వాళ్ళు ఇతరుల రక్తమాంసాలని పీల్చి బాగు పడే నరరూప రాక్షసులు. బలహీనులని ఉపయోగించుకునే తొత్తులు. బలం ఉన్న వాడిదే బతుకు అక్కడ. సామాన్యుడి గురించి పట్టించుకోని దగుల్బాజీలు. రష్యాలో అలాకాదు" అంటూ సిగరెట్ ని వెలిగించాడు మొదటివ్యక్తి. ఆ రోజుల్లో అమెరికాని తిట్టడం ఒక ఫేషన్! ఇద్దరూ వాదనకి దిగారు.

అరబ్బులమీద బాంబులువేసి రాజ్యాలని ఇజ్రాయిల్ ఆక్రమించుకుంటుంటే చేతులు కట్టుకుని వింత చూస్తోందని అమెరికాని తిడితే, నోరు విప్పడానికే వీలులేని దేశం రష్యా అని, నోరు విప్పితే సైబీరియాకి తీసు కెళ్ళి చంపేస్తారని రెండవ వ్యక్తి విరుచుకు పడ్డాడు. ఆగి ఉన్న బస్‌లో వాళ్ళ అరుపులు విని విసుగేసి, వాళ్ళ వాదనని భరించలేక బస్ దిగాడు తను. దినదిన సన్నివేశాలలో ప్రతీ సంఘటనకి ఇతర దేశాలతో పోల్చడ మెందుకు? దాని వలన మనకేమైనా ఉప యోగం ఉంటుందా? ఎందుకు వీళ్ళు ఇంత రాద్ధాంతం చేస్తారు? బస్‌టైర్ పంక్చర్ అయితే డ్రైవర్ కాళ్ళు చాపుకుని కూర్చో కుండా పని వెంటనే మొదలుపెట్టాడు కదా! కాస్త ఓపిక పట్టకపోతే ఎలా? అనుకున్నా డు తను.

బస్ డ్రైవర్ జాకీని వేసి పంక్చర్ అయిన టైర్ తీయడానికి ప్రయత్నించబోతూ, "ఒరేయ్, బస్‌లో ప్రయాణీకులని దిగమని చెప్పరా" అన్నాడు. క్లీనర్ బస్‌లో ప్రయాణీ కుల నందరినీ కిందకి దిగాలని చెప్పివ చ్చాడు. దూరంనుంచి తను అంతా గమని స్తూనే ఉన్నాడు. బాగా పింపిరి పట్టి రిమ్‌కి అంటుకుపోయి ఉన్న నట్లు ఊడిరావడం లేదు. క్లీనర్, డ్రైవర్ తమ బలమంతా వాడి వాటితో కుస్తీపడుతున్నారు. వాళ్ళ శరీరం నుంచి చమట ఉధృతంగా కారుతోంది.

నట్స్ రావని మొరాయించుకు కూర్చు న్నాయి. ఇరవై-ముప్ఫయి నిమిషాల తరు వాత

"ఇంకా ఎంతసేపండీ? " అంటూ డ్రైవర్ మీద ప్రజల దండయాత్ర మొదలయింది.

"మమ్మల్ని మద్రాసు వెళ్లే ఇంకో బస్‌లో ఎక్కించేయండి. తరువాత మెల్లిగా ఆ మార్పిడి చేసుకుందురుగాని" అన్నాడు ఒకడు.

"లాభంలేదు మాస్టారూ, ఇది ఆంధ్రాబస్. మద్రాస్ బస్ ఈ పేసింజర్లని ఎక్కించు కోదు. వాళ్ళకి మళ్ళీ టిక్కట్ డబ్బు కట్టా ల్సిందే" అంటూ అడ్డు తగిలేడు ఇంకోవ్యక్తి.

"ఏమండీ డ్రైవర్‌గారు. ఇది ఇప్పుడయేలా లేదు. మద్రాస్ వెళ్తున్న బస్‌ని ఆపి మమ్మల్ని ఎక్కించగలరేమో చూస్తారా? " అన్నాడు మల్లు పంచె, మల్లు లాల్చీ వేసు కున్న ఆసామీ తన చేతి గడియారం వేపు చూస్తూ. రాత్రికి ఆయనకి మద్రాస్‌లో ఏదో ముఖ్యమైన పని ఉన్నట్టుంది.

బస్ డ్రైవర్‌కి సహనం చచ్చిపోయింది కాబోలు. నట్స్ ఊడతీయడానికి వాడు తున్న ఇనుపకడ్డీ చేతితో అందుకుని, "మీరు నన్ను ఇలా విసిగించకుండా దూరంగా వెళ్ళండి. నాకు మిమ్మల్ని ఇంకో బస్ ఎక్కించే అర్హతలేదు. పింపిరి పట్టిన ఈ నట్స్ ఊడితేకాని టైర్ మార్పిడి అవదు. అదిగో, ఆ కనిపిస్తున్న ఊరిలో పింపిరి కర గడానికి ఏదైనా ఆయిల్ దొరుకుతుందేమో కనుక్కుని దొరికితే తీసుకువస్తాను. అంతా సవ్యంగా జరిగినా బస్ ప్రయాణానికి తయారవడానికి ఎంతలేదన్నా ఒక గంట అయినా పడ్తుంది. మీరు ఈ గంటలో ఏం చేస్తారో నాకు తెలియదు. నన్ను విసిగిస్తే నేను ఏ ప్రయత్నమూ చేయకుండా ఇక్కడే కూర్చుంటా. బస్ పాడయిందని కబురు పంపుతాను. స్పేర్ బస్ కోసం నిరీక్షిద్దాం" అంటూ దృఢంగా, తీక్షణంగా చెబుతూ



ప్రయాణీకులవేపొచ్చాడు.

అమెరికాని పొగిడే మెడికల్ రిప్రజెంటేటివ్, రష్యాని పొగిడిన అతని ప్రత్యర్థి, ఇతర అతిరథులు, మహారథులు భయంతో బిక్కచచ్చిపోయారు. అతని చుట్టూ ఉన్న జనం, చీమల పుట్టమీద రాయిపడితే చీమలు నలుదిశలా పరిగెత్తినట్లు డ్రైవర్‌కి దూరంగా జరిగారు.

"ఒరేయ్ కిష్టిగా, పనిముట్లు జాగ్రత్త" అంటూ హెచ్చరించి, దగ్గరగా కనిపిస్తున్న గ్రామంలాంటి పట్టణంవేపు నడిచాడు. ప్రయాణీకులు గుంపులు గుంపులుగా చేరి తిరిగి ప్రపంచ రాజకీయాలలో పడ్డారు. ఎవరికీ చెందని ఒంటరిగా ప్రయాణం చేస్తున్న తను ఏం చేయాలో తెలియక రోడ్డుమీద కనిపించిన కల్వర్ట్‌మీద కూర్చుని చిన్నచిన్న రాళ్ళని విసరసాగాడు. కాస్సేపటికి విసుగేసి నడక మొదలుపెట్టాడు. ఒక పావుమైలు నడిచాడేమో, దాహం మొదలయింది. ఓ మోస్తరు పెద్దసైజ్ మద్రాస్ టెర్రస్ ఉన్న ఇల్లు కనిపించగానే, దాహం తీర్చుకోవడానికి నీళ్ళు అడుగుదామని లోపలికి ప్రవేశించాడు. ఇంటిముందర ఏమీ అలికిడి లేకపోయినా వెనకాల భాగంనుంచి మాటలు వినిపిస్తుంటే, కనిపిస్తున్న సందులోంచి వెనక్కి వెళ్లాడు తను. ఇంటి వెనకాల ఉన్న పెరడులో దాదాపు పదిహేను ఇరవై మంది పిల్లలు, చిన్నవయస్సు ఉన్న వాళ్ళు తోట పనిచేస్తున్నారు. వాళ్ళకి దాదాపు ఏభైఏళ్ళు ఉన్న వ్యక్తి ఏం చేయాలో చెబుతూ, ఆగంతకుని చూసి ఆగాడు.

"క్షమించాలి. నే ప్రయాణం చేస్తున్న బస్ పాడయింది. డ్రైవర్ రిపేర్ చేస్తున్నాడు. దాహంవేసి మీ దగ్గర నీళ్ళు ఉంటాయని వచ్చాను" అన్నాడు తను.

"రండి... ఆ కుర్చీలో కూర్చోండి. రాజూ శుభ్రంగా చేతులు కడుక్కుని ఒక గ్లాసులో తాగడానికి నీళ్ళు పట్టుకురా" అన్నాడు.

"నా పేరు రమణయ్య, మద్రాసులో పని చేస్తాను" అని తనంటే "ఇదొక అనాథాశ్రమం. దీనిని నేను నడుపుతాను, నా పేరు దయానిధి" అంటూ తననితాను పరిచయం చేసుకున్నాడు. గుండ్రటి మొహం, సాధారణంగా ఉన్నా దయానిధి మొహంలో ఒకరకమైన శాంతి, తృప్తిని చూశాడు తను. చామనచాయ, బొద్దుగా ఉన్న ఆరేళ్ళ కుర్రవాడు, తోటలో చేస్తున్న పనివలన నుదుటన పట్టిన చెమట తుడుచుకున్నా పూర్తిగా పోని చమటతో ఎదురుగా నీళ్లగ్లాసుతో నిలుచున్నాడు.

"శుభ్రంగా కడిగి తెచ్చావా? " అనడిగాడు దయానిధి.

"బాగా కడిగే తెచ్చాను బాబాయ్" అన్నాడు రాజు.

"అందరూ నన్ను ఇక్కడ బాబాయ్ అనే పిలుస్తారు" అన్నాడు దయానిధి. చేతివేళ్ళు నీళ్ళకి, గ్లాసు అంచుకి తగలకుండా గ్లాసు కింద చేయి ఉంచినతీరు తనని ఆకర్షించింది. పరీక్షగా అతని వేపుచూసి, నీళ్ళ గ్లాసందుకుని, "నీపేరేమిటి బాబూ? " అనడిగాడు తను.

"రాజు" అన్నాడు ఆ కుర్రవాడు ముక్తసరిగా.

"నువ్వెళ్ళి ఆ కాకర కాయల్ని కోసుకురా" అంటూ దయానిధి చెప్పడంతో రాజు కాకర పాదువేపు వెళ్లాడు. దయానిధి తను చేస్తున్న పని గురించి, దానికయ్యే ఖర్చు ఇబ్బందులు వివరిస్తుంటే బస్ హారన్ వినిపించింది. తొందరగా లేచి నిలబడి, రోడ్డు మీదకి వెళ్ళబోతూ, "నేను వచ్చేవారం మిమ్మల్ని మళ్ళీ కలుస్తాను. మీతో పని ఉంది" అంటూ ఆశ్చర్యంగా తనవేపే చూస్తున్న దయానిధి చేయి స్పృశించి బస్ కోసం రోడ్డుమీదకి వచ్చాడు.

"ఏమిటీ ఏదో లోకంలోనికి వెళ్లారు. నేను కవితని, ఇక్కడే మీ సమాధానంకోసం ఎదురుచూస్తూ ముసలిదానిని అయిపోయాను"

అంటూ చేతితో కుదిపింది కవిత.

జరిగినది వివరించాడు రమణయ్య.

"ఇంటరెస్టింగ్, తరువాత వారం వెళ్లారా? ఆ ప్రదేశం మద్రాసుకి ఎంతదూరంలో ఉంది? "

"మహా అయితే అరవైమైళ్ళ దూరం. తరువాత చాలాసార్లు దయానిధిని చూడడానికి వెళ్లాను" అంటూ తిరిగి గతంలోనికి చూశాడు రమణయ్య.

"దత్తత చేసుకుందామన్న ఆలోచన మీకు ఎప్పుడు వచ్చింది? " అనడిగింది కవిత.

"మొదట్లో అలాంటి ఊహే నాకు రాలేదు. నేను దయానిధిని కలవడానికి తరువాత వారం వెళ్లాను. దయానిధి ఆశ్రమం ఎలా నడుపుతున్నాడో తెలుసుకోవాలని వెళ్లాను. అతనిది తూర్పు గోదావరి జిల్లా. అక్కడ అతనికి పదెకరాల ఆస్తి ఉంది. డిగ్రీ కాలేజీ ఉంది. మామూలు వాతావరణంలో పెరిగినవాడే. ఆశ్రమం తన ఆస్తిమీద వచ్చే ఆదాయంతో ప్రజలు ఇచ్చే విరాళంతో పెరటిలో పండించే కూరగాయలతో నడిచేది. ఎలిమెంటరీ స్కూల్ వరకు చదువు చెప్పడానికి ఒక వాలంటీర్ వచ్చి సహాయం చేసేవాడు. నేను దయానిధిని కలిసినప్పటికి, అతని పది ఎకరాల భూమిలో నాలుగు ఎకరాలు అమ్మి దానితో నడిపే దశలో ఉన్నాడు. దయానిధికి రేపు గురించి ఆలోచన లేదు. ఈవేళ గడిస్తే చాలు అనేవాడు. నేను వెళ్ళినప్పుడల్లా రాజు నాకు ఏద్రైనా అవసరంవస్తే, ఆ పని చేసి పెట్టేవాడు. నేను అప్పుడప్పుడు రాజుని ప్రత్యేకంగా పరీక్షించడం చూసి.

"ఈ ఆశ్రమంలో అందరికంటే రాజు చురుకైనవాడు. అతనికి ప్రోత్సాహం ఇస్తే జీవితంలో బాగా రాణిస్తాడు" అన్నాడు ఒకసారి. అప్పుడప్పుడు విరాళం ఇచ్చేవాడిని. అది తీసుకున్నపుడు తెగ సంబరపడిపోవడం కాని, డబ్బుకి ఇబ్బంది అయినపుడు ఢీలా పడిపోవడం కానీ నే చూడలేదు. ఈవేళ నుంచి రేపటికి వెళ్తామన్న ధీమా ఆయనలో చూశాను.

"ఈ ఆశ్రమం నడపుదామన్న కోరిక ఎందుకు కలిగింది? " అనడిగాను. చిరునవ్వు నవ్వేడు దయానిధి.

ప్రశ్న మళ్ళీవేశాను. "ఒకరోజు చెబుతాను, ఈవేళ కాదు" అన్నాడు చెరగని చిరునవ్వుతో. దాదాపు ఆరేడుసార్లు ఆశ్రమం చూడడానికి వెళ్ళి, దయానిధి స్వార్థరహితంగా చేస్తున్న పని చూసి, అతనికి సహాయం చేయాలనిపించింది. విరాళం ఇవ్వవచ్చు కాని పదహారుగురు అనాథల్ని మోస్తున్న ఆ చేతులు, బరువుకి సాగి ఒంగిపోయిన చేతులమీద బరువు తగ్గిద్దామనిపించింది. అప్పటికే నేను పెళ్ళి చేసుకోకూడదన్న నిర్ణయానికి వచ్చాను. ఒంటరిగాడిని. డబ్బుకి ఇబ్బందిలేదు. రాజుకి తనపనులుతాను చేసుకోగల వయస్సు ఉంది. చురుకైనవాడు. ఒక చేయి అందిస్తే వృద్ధిలోనికి వస్తాడని దయానిధి అన్నది నిజమే అనిపించింది. ఆరోజు నాకు బాగా జ్ఞాపకం. నేను ఎప్పుడూ మరచిపోలేను. రాజుని నాతో తీసుకువెళ్ళి, పెంచుతానని చెప్పిన రోజు దయానిధి మొహంలో ఆనందం, కళ్లలో చిప్పిల్లిన ఆనంద భాష్పాలు నేను వర్ణించలేను.

"నిజంగా? " అని మాత్రం అనగలిగాడు గద్గదమైన గొంతుకతో.

దత్తత చేసుకోవడానికి పేపర్లు అవీ తయారుచేసి, రాజుని తీసుకెళ్ళడానికి చెప్పి వచ్చేశాను. రాజుని తీసుకెడతాననడానికి వచ్చిన రోజున, "ఇక మీరు ఇక్కడకి రావడం తక్కువవుతుంది" అన్నాడు దయానిధి. "లేదు, రాజుని తీసుకుని అప్పుడపుడు వస్తాను" అన్నాను నేను.

"రావద్దని నేను చెప్పడంలేదు కాని రాజుకి ఒక కొత్త ప్రపంచం కలిగించబోతున్నారు. మరీ ఎక్కువసార్లు తీసుకువస్తే అతను ఎలా రియాక్ట్ అవుతాడో చెప్పలేం"

అన్నాడు.

"ఈవేళ నా పాత ప్రశ్నకి సమాధానం చెప్పాలి" అన్నాను.

"ఏది? నేను ఈ ఆశ్రమం ఎందుకు నడపుతున్నాననా? దానికి మూల కారణం గురించేనా? "

"అవును"

"కొన్నాళ్ళక్రితం నేను కాకినాడలో ఒక రోజు నడిచి వెళ్తున్నాను. వీధిలో లారీల ట్రాఫిక్ ఎక్కువగా ఉంది. రోడ్డువారగా నడుస్తున్నాననుకున్నాను, కాని అది నిజం కాదని తరువాత తెలిసింది. వేగంగా వస్తున్న ఒక లారీ నన్ను గుద్దకుండా నన్ను పక్కకి తోసి తను ఆ లారీకింద పడి చనిపోయాడు ఒక పధ్నాలుగేళ్ళ అనాథ బాలుడు. అది నా జీవితాన్ని తారుమారు చేసింది. అంతే. అంతకన్నా ఏమీలేదు" అన్నాడు దయానిధి. అతనికి అప్పుడు తనకి జీవితాన్ని ఇచ్చిన పధ్నాలుగేళ్ళ కుర్రవాడు జ్ఞాపకానికి వచ్చాడు కాబోలు.

రాజుని దత్తత తీసుకువచ్చాక, కేవలం మూడుసార్లు మాత్రం దయానిధిని చూడడానికి వెళ్లాడు" అంటూ ఆపాడు రమణయ్య.

"ఇప్పుడు ఆశ్రమం ఇంకా అక్కడే ఉందా? " అనడిగింది కవిత.

"దయానిధి లేకపోతే ఆశ్రమం ఎలా ఉంటుంది? "

"ఏమయింది? "

"నేను రాజుని ఇంటికి తీసుకువచ్చిన ఐదేళ్లకి ఒకరోజు రాత్రి, దయానిధి ఆశ్రమంలో దొంగలుపడితే, దయానిధి వాళ్ళని అటకాయించబోతే, గునపంతో అతని తల పగలకొట్టి వెళ్ళిపోయారు. అక్కడికక్కడే చనిపోయాడు దయానిధి. దయానిధి లాంటి మరో దయానిధి లేకపోవడంతో ఆశ్రమం మూతపడింది. విచారించదగినది ఏమంటే, దయానిధి చనిపోయిన సంగతి నాకు అతను చనిపోయిన రెండు నెలలకి తెలిసింది" అంటూ ఆగాడు రమణయ్య. కాస్సేపు ఎవ్వరూ మాటలాడలేదు.

"మీ ప్రశ్నకి సమాధానం దొరికిందా? " అనడిగాడు రమణయ్య కవితని.

"ధనరాజ్ ని దత్తత తీసుకోవడం కేవలం అతనికి సహాయంచేయడానికే. ఆ వయసులో వార్ధక్యపు దశ గురించి ఆలోచించుకోవడానికి అవకాశం తక్కువ. ముసలికాలంలో 'సహకారం' గురించి ఆలోచన ఏభై ఏళ్ళ దగ్గరకి చేరుతుంటేనే మొదలవుతుంది" అంటూ మెచ్చుకోలుగా రమణయ్యవేపు చూసింది కవిత.

రమణయ్య ఏమీ మాటలాడలేదు.

"ఆరోజు మీరు చేసిన ఆ పని మంచిదని ఇప్పుడు కూడా అనిపిస్తోందా? ఆలోచించి చేసినా, ఆలోచించకుండా చేసినా, ధనరాజ్ ని పెంచి పెద్దచేసినందుకు, మీరు రిటైర్ అయ్యాక, మీ బాగోగులు చూడాలి. సంరక్షణ చేయాలి, ఏమంటారు? " అనడిగింది కవిత.

ధనరాజ్ గురించి సంభాషణ, రమణయ్యకి రవ్వంత ఇబ్బందికరంగా ఉంది. దానిని కవితకి ఎలా వ్యక్తపరచాలో తెలియడంలేదు. అది తనకి ఇష్టంలేదని చెబితే కవిత నొచ్చుకుంటుందేమో! అన్న అనుమానం వచ్చి సందేహిస్తుంటే,

"ధనరాజ్ గురించి మాటలాడడం మీకు ఇష్టంలేదేమో! అందుకే మౌనం వహిస్తున్నారు. చెప్పడానికి ఇష్టంలేకపోతే ఆ టాపిక్ వదిలేద్దాం" అంది కవిత. ఇలా తన ఆలోచనల్ని చదవగలిగే వ్యక్తి దగ్గర దాపరికం అనవసరం అని చెప్పడం మొదలుపెట్టాడు రమణయ్య.

"నిజమే కాని, మీతో మాటలాడడానికి నాకేమీ అయిష్టంలేదు. ప్రత్యేకంగా ఆలోచించకుండా చేసినా, అతనిని దత్తత చేసుకోవడం నే చేసిన మంచి పనులలో ఒకటి. నేను దత్తత చేసుకోకపోతే దయానిధి సహాయంతో అతనిని ఇంకెవరో దత్తత చేసుకు




నేవారేమో! నాకు ఆనందాన్నిచ్చే పని నే చేస్తే దానికి ప్రతిఫలం ఆశించకూడదు. అతనిపై నా సంరక్షణ బాధ్యత మోపడం మంచిదికాదు. ధనరాజ్‌కి జీవితం అంతా ముందరే ఉంది. నాకు నా జీవితం దాదాపు అంతా వెనకాలే ఉంది. నా గురించి అతను ఆగనవసరం లేదు. నాతో అతని జీవితపు పరుగు బహుశా ఇద్దరికీ ఇబ్బందులని కలిగించవచ్చు" అన్నాడు రమణయ్య.

"యు నో సంథింగ్? చాలామందికి, ఈ దేశం గురించి తెలియని వాళ్ళకి, ఇక్కడి పిల్లలు తమ తల్లితండ్రుల సంగతి పట్టించుకోరని, స్వార్థపరులని అనుకుంటారు. కాని అది నిజం కాదు. ఈనాటికీ నలభైనుంచి ఏభైశాతం వరకు, అదీ ముఖ్యంగా చిన్నపట్టణాలలో, పల్లెలలో ఉన్న పిల్లల దగ్గరే తమ ఆఖరి కాలం గడుపుతారు. అలాంటి కుటుంబాలు నాకు చాలా తెలుసు. వీలు లేని పరిస్థితులలో, వాస్తవికతని దృష్టిలో ఉంచుకుని, నర్సింగ్‌హోమ్‌లో చేర్పిస్తారు కొందరు. కాని అది మొదటి ఆలోచన కాదు. ఇంటిలో ఉంచుకుని, మానసికంగా హింసలు పెట్టేకన్న దూరంగా ఉంచడమే మంచిది" అంది కవిత.

రమణయ్య మళ్ళీ మౌనం వహించాడు.

"కేవలం అతని శ్రేయస్సు దృష్ట్యా దత్తత తెచ్చుకున్న ధనరాజ్ దగ్గరకి వచ్చి నాలుగు నెలలు ఉందామనుకున్నా, పెళ్ళయ్యాక అతనికి ఇబ్బంది కలుగుతుందని టెక్సాస్ వెళ్ళిపోతున్నారు. మిమ్మల్ని చూస్తే ఆనందంగా ఉంది" అంటూ రమణయ్య చేతిమీద తట్టింది కవిత.

'అవును నిజమే... కాని ముమ్ముందు ధనరాజ్‌కి సంతానం కలిగాక తన ఉనికి అతనికి ఇంకా ఎక్కువ ఇబ్బందిని కలిగిస్తుంది. మరి అప్పుడు మాటేమిటి? ' అనుకుంటూ,

"మీ సంగతేమిటి? " అనడిగాడు రమణయ్య.

"నాదా? ఏం చెప్పగలను? చూడాలి, ఏమౌతుందో!" అంటూ రమణయ్య వేసిన ప్రశ్నకి సరయిన సమాధానం ఇవ్వకుండా దాటవేసింది కవిత.

"నేనేమీ మీదగ్గర దాచడంలేదు. నా పరిస్థితి నాకే ఏమీ తెలియడంలేదు, అది పచ్చినిజం. మీ పరిస్థితి వేరు. నా పరిస్థితివేరు" అంటూ కళ్ళు మూసుకుంది కవిత.

నిజమే... కవిత పరిస్థితికి తన పరిస్థితికి పోలికేలేదు. కవిత తనకుతానే నిర్ణయం తీసుకుని చికాగో వెళ్ళి స్థిరపడ తలుచుకుంది. పనికట్టుకుని వచ్చి ఆహ్వానించి తీసుకువెళ్తున్న కవిత, కొత్త వాతావరణంలో త్వరగానే ఇమిడిపోయి హాయిగా ఉంటుంది అనుకుంటూ కవితవేపు చూశాడు.

కళ్ళు మూసుకుని పడుకున్న కవిత మొహంలో నీరసంతోపాటు కలవరపాటు కనిపిస్తోంది. దానికి నిదర్శనంగా మూసిన రెప్పలకింద కనుపాపలు తీవ్రంగా కదులుతున్నాయి. అరగంట గడిచాక, అలజడి తగ్గి, కవిత నిద్రపోవడం గమనించి, శబ్దం చేయకుండా తలుపువేసి బైటకి వచ్చాడు రమణయ్య.

అమావాస్య దరిదాపు రోజులు కాబోలు, చీకటి ఆనందంగా అన్నింటినీ తనలో ఇముడ్చుకుంది.

ఇంట్లో కొత్తవాళ్ళ ప్రవేశంతో కవిత గురించి వాకబుచేయకుండానే రెండురోజులు గడిచిపోయాయి. మూడవరోజు ఉదయమే అందరూ వెళ్ళిపోవడంతో కవితని చూడాలని వెళ్లబోతుంటే, "హడావుడి తగ్గిందా? " అంటూ తనే తలుపు తోసుకుని లోపలికి వచ్చింది కవిత.

బైట వాతావరణం చల్లగా ఉంది. వాన పడే సూచనలు కనిపిస్తున్నాయి. వద్దన్నా వినకుండా మాల్ దగ్గర ఆగి రెండు కాఫీలు, క్రొసాంట్లతో వచ్చి "ఈవేళ ఇంత బాగున్న రోజు ఇంటిలో ముగ్గిపోవడమే



మిటి? ఇక్కడకి దగ్గరగా ఉన్న లేక్ దగ్గరకి వెళ్దాం" అంటూ రమణయ్య మాటల్ని విన కుండా కారుని లేక్‌వేపు మళ్ళించింది.

"ఎలా ఉంది లేక్?" అనడిగింది కవిత ఆశ్చర్యంతో నిండిపోయిన రమణయ్యని చూస్తూ.

"ఇంతదగ్గరగా, ఇంతమంచి లేక్ ఇంకొకటి ఉందని నాకు తెలియదు. థాంక్స్" అంటూ సరస్సుకి ఒడ్డున ఉన్న కుర్చీలో చతికిలపడ్డాడు రమణయ్య. పక్కనే కూర్చుంది కవిత. "ఇది ఇంకొక లేక్ కాదు, దానినే ఇంకోవైపునుంచి చూస్తున్నాం" అంది కవిత. నిరంతరంగా ఒడ్డుకు కొట్టుకు వస్తూ, అడ్డుగా నిలిచిన రాళ్లని తాకి అలలు ఓడిపోయి వెనక్కి వెళ్తున్నాయి. ఒకసారి బలంగా, ఇంకోసారి నీరసంగా రాళ్ళని తాకి దానిని తోసేయాలని అలలు చేసే ప్రయత్నం చూసి జాలివేసింది రమణయ్యకి. బలహీనమైన నీళ్ళు 'బలమైన రాళ్ళ' మధ్య రాపిడి, సంఘర్షణ!

"కొండలకి, ప్రవాహానికి జరిగే సంఘర్షణలో చివరి విజయం ప్రవాహానిదే. నీళ్ళ పట్టుదల ముందు కొండ ఓడిపోయింది" అన్నాడు రమణయ్య.

"ప్రకృతిలో మీరు చెప్పినది నిజమే కావచ్చు, కాని కేవలం పట్టుదలవల్ల, చిన్న జీవితకాలంలో ఏమీ సాధ్యపడదు" అంది కవిత అలలవేపు చూస్తూ.

"ధనరాజ్ హనీమూన్ నుంచి తిరిగి రావడానికి ఇంకా ఏడెనిమిది రోజులున్నాయి. ఈ కాసిన్ని రోజులు మీరు ఆఫీసు నుంచి వచ్చాక ఈలేక్ దగ్గరకి నన్ను తీసుకురాగలరా?" అనడిగాడు రమణయ్య.

"ష్యూర్, అదెంతపని. నాకూ ఈ నిశ్చలమైన పెద్ద సరస్సులో ఉన్న నీళ్ళు అంటే చాలా ఇష్టం. ఇది మీకూ ఇష్టమని తెలిస్తే, నే వచ్చినపుడల్లా మిమ్మల్ని తోడు తీసుకువచ్చేదాన్ని" అంది సరస్సువేపు కవిత మొహం తిప్పి. సరస్సు నుంచి వస్తున్న చల్లని గాలి ఆమె మొహాన్ని తాకుతుంటే బలంగా ఊపిరి పీల్చడంవలన, గుండెలనిండా నిండిన గాలి ఆమె ఉపరిభాగాల్ని కదిలిస్తుంటే, ఆహ్లాదంతో నిండిన కవితని చూస్తూ మాటలాడకుండా ఉండి పోయాడు రమణయ్య. కవితని చూసి ఆనందపడ్డా, ఈ వ్యక్తితో పరిచయం ఇంకో నాలుగైదురోజులే! అన్నది జ్ఞాపకానివచ్చి గుండెల్లో సన్నని మంట ఆరంభమయింది రమణయ్యకి. సరస్సువేపు తిరిగి ఉన్న కవిత మొహంలో ఉన్న భావాలని చదవడం వీలు కాలేదు రమణయ్యకి. మౌనంగా ఒక గంట కూర్చున్నాక "ఇహవెళ్దామా?" అంటూ నిలబడింది కవిత. వెలుగుని మింగిన చీకటి, సరస్సులో నీళ్ళ రంగుని గాఢంచేసింది. మౌనంగా లేచి కవితని అనుసరించాడు రమణయ్య.



అదేవిధంగా గడిచాయి తరువాత మూడు రోజులు. ఆఖరి రోజు సరస్సు దగ్గరకి ఉదయమే వచ్చారు.

"మీరు ఇక్కడే కూర్చోండి, ఇప్పుడే వస్తాను" అంటూ ఏమీ వివరించకుండా కారులో తుర్రుమంది మూడవ రోజు సరస్సు దగ్గర రమణయ్య చతికిలపడగానే.

ఎక్కడికి బైటకి వెళ్లినా చేతిలో నవల ఒకటి ఉంచుకోవడం రమణయ్యకి అలవాటు. గతంలో చదివిన పేజీ ఆనవాలుగా కాగితం మడత పెట్టిన పుటతిప్పి నవల చదవడం మొదలుపెట్టాడు. ఐదారు నిమిషాలు గడి చాయి. దగ్గరగా అడుగుల చప్పుడు వినిపిం చగానే కవిత వచ్చిందేమోనని శబ్దం వచ్చిన దిశగా చూశాడు రమణయ్య. ఇద్దరు యువ కులు దగ్గరగా నిలబడి 'హలో' అన్నారు, 'హలో' అని సమాధానమిచ్చాడు రమ ణయ్య. ఆ ఇద్దరూ తెలుగువాళ్లని, కంప్యూ టర్ విభాగంలో పని చేస్తున్నారని తెలి సింది రమణయ్యకి. కుశల ప్రశ్నలయేక ధనరాజ్ గురించి వివరిస్తుంటే

"మీరేమీ అనుకోకపోతే నా రెస్యూమే ఇస్తాను. మీ అబ్బాయికి ఇవ్వగలరా? ఆయనకి తెలిసిన చోట్ల ఖాళీలు ఉంటే పనికి వస్తుంది" అన్నాడు ఆ ఇద్దరిలో ఒక తను. "అదేమిటి కంప్యూటర్స్‌లో ఎక్కడప డితే అక్కడ ఉద్యోగాలు ఉన్నాయిటండీ. మీరేమిటి ఏమీ తెలియని నన్ను సహాయం కోరుతున్నారు? " అనడిగేడు ఆశ్చర్యప డుతూ.

"దూరం నుంచి అలాగే అనిపిస్తుంది. నేను స్వంత డబ్బుతో ఎమ్.ఎస్. పూర్తిచే శాను. పదహారువేల డాలర్లు ఖర్చు అయేయి. ఇప్పుడు ఒక కంపెనీలో ఇంటర్న్ కింద ఉన్నాను. ఆ కంపెనీలో ఖాళీలు ఉంటే నాకు అవకాశం వచ్చేదేమో కానీ ఖాళీలు లేవు. నా ఇంటర్న్‌షిప్ ఇంకో రెండు నెలలలో పూర్తవుతుంది. అది పూర్త యేలోగా నాకు ఉద్యోగం రాకపోతే నేను ఇండియా వెళ్లిపోవాలి. మా నాన్న నా మీద ఏడు లక్షల రూపాయలు ఖర్చుపె ట్టేడు. నేపని చేసే కంపెనీ తమ ఉద్యోగు లని సెలవుతీసుకుని ఇంటిపట్టునే ఉండ మంటోంది" అన్నాడు ఒకతను.

"మరి ఈయన సంగతీ అంతేనా? " అన డిగాడు రమణయ్య. కవిత జాడలేదు.

"ఈయన నాకంటే ఒక సంవత్సరం ముందర ఈ దేశం వచ్చాడు. ఆయన పని చేసే కంపెనీ వ్యవహారం బాగులేదు. కానీ నా కంపెనీ అంత ఘోరం కాదు. కానీ వ్యవధి ఉంది. జార్జియాలో ఖాళీలు ఉన్నా యిట. అక్కడికి వెళ్దామనుకుంటున్నాను. మీ అబ్బాయికి నా రెస్యూమ్ ఇవ్వడం మర చిపోకండి" అంటూ రెస్యూమ్ కాపీ ఒకటి ఇచ్చి కదలివెళ్లారు ఆ యువకులు ఇద్దరూ.

"ఏది నిజం? ఉద్యోగాలు లేకపోవ డమా? లేక ఈ కుర్రవానికి చొరవలేక ఉద్యోగం సంపాదించలేకపోతున్నాడా? " అనుకుంటుంటే 'హలో' అంటూ అందమైన కవిత మొహం కనిపించింది. జరిగిన సంభాషణ వివరించేడు రమణయ్య.

"నా అనుమానం నిజం ఈ రెండింటికీ మధ్యన ఉంది. అనుభవం ఉన్నవాళ్లకే ఉద్యోగ అవకాశాలు వస్తున్నాయి. కానీ అనుభవం లేనివాళ్లకి కష్టమే" అంది కవిత.

కాస్సేపాగి "మీరు చదువుతున్న నవల ఒకసారి ఇలా ఇవ్వండి" అంటూ రమ ణయ్య దగ్గర నవల లాగుకుంది. కాగితం మడతపెట్టడం చూసి

"చ! ఇలాంటి పనులు చిన్నపిల్లలే చేస్తారు. మడతలు పెడుతుంటే పుస్తకాలు పాడవుతాయి. ఈ బుక్‌మార్కర్ మీ నవ లలో ఉంచితే జ్ఞాపకం ఉంటుంది" అంటూ తను తెచ్చిన బుక్ మార్కర్‌ని నవలలో మడతపెట్టి ఉంచిన పేజీ దగ్గర ఉంచింది.

"థాంక్స్" అంటూ అందంగా ఉన్న బుక్ మార్కర్‌ని, అంతకన్నా అందంగా ఉన్న కవిత వేపూ చూశాడు రమణయ్య. కవిత తెచ్చి ఇచ్చిన బుక్‌మార్కర్‌ని సుతారంగా స్పృశిస్తూ నవలని మూసి "మూడు రోజులే ఉంది నా టెక్సాస్ ప్రయాణం" అన్నాడు.

"నాకు తెలుసు" అంది సన్నని కంఠంతో. ఆమె నోటినుంచి వెలువడిన మాటలు బైటకి రాగానే సరస్సుమీదనుంచి వస్తున్న గాలి హోరులో కలిసిపోయాయి. అప్ప

ష్టంగా గొణిగినట్లు వినిపించిన ఆమె మాటలు విని, ఆమెవేపు చూస్తే చాలా ఆలోచనల్లో మునిగి పరధ్యానంగా ఉన్న కవిత కనిపించింది. మేఘాల మధ్యనుంచి సూర్యుడు తీక్షణంగా బైటకి రావడంతో ఎండగా అనిపించి ఇద్దరూ లేచి కారువేపు నడిచారు.

"కాలం ఎవరి గురించీ ఆగదు" అంటూ కారుని స్టార్ట్ చేసింది కవిత.

★ ★ ★

ఆరేడేళ్ల కాలంలో గోపాల్‌లో పెద్ద మార్పు ఏమీ కనపడలేదు. ట్రాలీలో సామాన్లు తోసుకువస్తున్న రమణయ్య వేపు ఉత్సాహంగా నడిచి హుందాగా చాచిన రమణయ్య చేతిని అందుకున్నాడు.

"ప్రయాణం బాగా జరిగిందా? పార్కింగ్ అనవసరమని బైట మా ఆవిడని కారులో కూర్చోపెట్టేను పద" అంటూ ట్రాలీలో ఉన్న ఒక చేతిసంచీని అందుకున్నాడు గోపాల్.

"అనవసరంగా ఆవిడకి కూడా శ్రమ కలిగించేవు" అంటూ రెండవ చేతి సంచీతో గోపాల్ వెనకాలే నడిచాడు రమణయ్య.

ఒక గంటన్నర ప్రయాణం చేసేక ఇంటికి చేర్చి "ఇది నీ గది, ఎటాచ్‌డ్ బాత్రూం. నీకు వసతిగానే ఉంటుందని ఆశిస్తున్నాను. బేగ్‌లు అలా వదిలేయ్. మొహం కడుక్కుంటావా? లేక భోజనం మొదలు పెడదామా?" అనడిగేడు గోపాల్.

"చేతులు కడుక్కుని వస్తాను" అంటూ రెండు నిమిషాల తరువాత డైనింగ్ టేబిల్ దగ్గరకి వచ్చాడు రమణయ్య.

గోపాల్ భార్య శారద పదార్థాలన్నింటినీ డైనింగ్ టేబిల్‌మీద అమర్చి ఎదురు చూస్తోంది. టేబిల్ దగ్గర ఒక కుర్చీలో కూర్చున్న పదిహేను పదహారేళ్ల ఆడపిల్ల వీళ్లు రాగానే లేచి నిలుచుంది. "మా అమ్మాయి స్మిత, నా చిన్ననాటి నుంచీ స్నేహితుడు రమణ" అంటూ పరిచయం చేశాడు.

"నమస్కారం" అంది స్మిత.

స్మితని, శారదని కలిపి చూశాడు రమణయ్య. "బహుశా చాలాకాలం క్రితం మీ అమ్మ నీలాగే ఉండేదేమో" అన్నాడు రమణయ్య సంభాషణ మొదలుపెడుతూ.

"మా అమ్మ పాత ఫొటోలు చూస్తే మీరన్నది నిజమేననిపిస్తుంది" అంది స్మిత.

రమణయ్య పళ్లెంలో ఉన్న అన్నం కలుపుకోవడం మొదలుపెట్టాక మిగతా ముగ్గురూ పదార్థాలని కలుపుకున్నారు. అతిథికోసం ఆగడం ఇంటికి వచ్చిన వ్యక్తిని సాదరంగా పలకరించడంలాంటివి చిన్నవే అయినా ఎదుటి మనిషి విలువ పెంచి అతిథికి బెరుకుతనం తగ్గించి ఆహ్లాదాన్ని కలిగిస్తాయి.

"గోపాల్ ఇది మీకు ఇష్టమని చెప్పేరు" అంటూ శారద బలవంతంగా పొట్లకాయ పెరుగుపచ్చడి కాస్త ఎక్కువ వడ్డించింది. రమణయ్య తబ్బిబ్బయేడు.

ఆతిథ్యం ఇవ్వడం ఒకకళ! మనకి ఇష్టమైనది చేసి అతిథి మొహాన పడేయడం ఒక రకం. అతిథికి ఏం నచ్చుతుందో ఎలా నచ్చుతుందో గృహస్తుకి, గృహిణికి తెలిస్తే అలా చేయడం రెండవరకం. శారద అంత ఆప్యాయంగా వడ్డిస్తుంటే గొంతు గద్గదమైంది. "నిజం చెప్పాలంటే పీజాలు, దుకాణం నుంచి తెచ్చుకున్న చపాతీలు, కూరలు తిని విసుగేసిందనుకో, వంటకాలు చాలా రుచికరంగా ఉన్నాయి" అంటూ మెచ్చుకున్నాడు రమణయ్య.

"నాకు వంట తనే నేర్పేనని గోపాల్ అప్పుడప్పుడు అంటూంటారు" అంది శారద.

"అది మాత్రం నిజం" అన్నాడు గోపాల్.

అందరూ నవ్వుకున్నారు. తిండి ఎక్కువగా పట్టించడంతో నిద్రకమ్ముకురాగా గుడ్‌నైట్ చెప్పి తొందరగా పరుపుమీదకి




చేరాడు రమణయ్య. న్యూజెర్సీనుంచి కవిత ఇంటిలోంచి ఫోన్ చేసినపుడు గోపాల్‌తో తను చూడడానికి వస్తున్నానని, నాలుగైదు వారాలుంటానని గోపాల్‌కి చెప్పాడు కాని వివరాలు తెలియపరచలేదు. రేపు స్పష్టంగా చెప్పాలి అనుకుంటూ నిద్రలోకి ఒరగపోతుంటే ఆఖరి రెండు రోజులలో ఒక్కసారి అయినా కవితని కలవలేదన్నది జ్ఞాపకానికి వచ్చింది.

ఉదయమే లేచి గోపాల్ శారదలతో నడక, గోపాల్ ఆఫీసుకు వెళ్లే సమయానికి తనూ తయారయి అతనితో బ్రేక్‌ఫాస్ట్ చేసి కాస్సేపు చదువుకోడం, టెలివిజన్ చూడడం, శారద పనిలేకుండా ఉంటే ఆమెతో చదరంగం ఆడడం, లంచ్, నిద్ర అయేసరికి గోపాల్ ఆఫీసునుంచి తిరిగి వస్తాడు. కూర్చుని కబుర్లు చెప్పుకోవడం, భోజనంచేసి టెలివిజన్ చూసి నిద్రపోవడం దినచర్యతో హాయిగా ఏడు వారాలు గడిచి పోయాయి. ఒక రోజు సాయంకాలం మాల్‌కి గోపాల్, రమణయ్య వెళ్లి తిరిగి వచ్చేక "మీకు కవితగారు ఫోన్ చేశారు" అంది శారద.

"నేను తరువాత ఫోన్ చేస్తాను" అంటూ ఇంట్లోకి నడిచాడు రమణయ్య.

కవితకి ఫోన్ చేద్దామని రెండుసార్లు ప్రయత్నించినా ఎవ్వరూ ఫోన్ ఎత్తలేదు. కవిత ఎందుకు ఫోన్ చేసింది? ఆమె కష్టాలలో ఉండి ఫోన్ చేసిందా? లేక తను ఎలాగున్నానని వాకబు చేయడానికి ఫోన్ చేసిందా? ఆమె కష్టాలలో ఉంటే మాత్రం తనేమి సహాయం అందివ్వగలడు? అనుకుని మథనపడుతూ రెండు రోజులు గడిచేక తను న్యూయార్క్ వెళ్తానని గోపాల్‌కి చెప్పడానికి నిశ్చయించుకున్నాడు. మర్నాడు ఆదివారం, కాస్త ఆలస్యంగా లేచి కాఫీ తాగుతూ కబుర్లలో పడ్డారు రమణయ్య, గోపాల్.

"మీ అబ్బాయి ఈ దేశం వచ్చి ఆరేళ్లయిందేమో కదూ? ఈపాటికి గ్రీన్‌కార్డు వచ్చి ఉండాలి" అంటూ హెర్బల్ టీబేగ్‌ని వేడినీటిలో ముంచాడు గోపాల్. ఘుమ ఘుమలాడుతున్న కాఫీ డికాక్షన్‌లో పంచదార కలపసాగాడు రమణయ్య.

"మావాడు హెచ్‌వీసా ఇప్పించిన కంపెనీని వదిలి తరువాత రెండో మూడో కంపెనీలు మారేడు. ప్రస్తుత కంపెనీలో కన్సల్టెంట్‌గా పని చేస్తూ రెండేళ్లయింది. వాళ్లు ఇమ్మిగ్రేషన్‌కి ప్రయత్నిస్తున్నారో లేదో తెలియదు. ఏం ఎందుకు అడిగేవు ఈ వివరాలు?" అంటూ తిరిగి ప్రశ్నించాడు రమణయ్య.

"ఈ రోజుల్లో అన్ని కంపెనీల స్టాక్స్ ప్రతీరోజూ దారుణంగా పడిపోవడంతో కంపెనీలు ఖర్చు తగ్గించే మార్గాలు వెతుకుతున్నాయి. దానిలో కాంట్రాక్ట్ ఉద్యోగాలు కేన్సిల్ చేయడం, మరీ ముఖ్యమైతే తప్పనిసరి అయి ఇంకే మార్గంలేకపోతేకాని గ్రీన్‌కార్డుకి రికమెండ్ చేయడంలేదు. ఒక పక్క ఉద్యోగంలోంచి మనుష్యులని తీసేస్తుంటే మరోవైపు ఉద్యోగంలోకి తీసుకోవాలని ఏ మేనేజరూ అడగలేడు. హెచ్‌వీసా సాధారణంగా ఆరేళ్లకే పరిమితం! ఆ తరువాత ఎవరైనా ఉద్యోగం ఇస్తే కొత్త వీసా సంపాదించడానికి స్వదేశానికి వెళ్లితీరాల్సిందే. హెచ్‌వీసా ఉన్నపుడు ఏదో ఒక ఉద్యోగంలో ఉండాలి. ఒక ఉద్యోగం నుంచి ఇంకో ఉద్యోగంలోకి మారడానికి కేవలం రెండు వారాలు మాత్రమే వ్యవధి ఉంటుంది. ఉద్యోగం ఊడినా అంతే. ఆ రెండు వారాల గడువులో ఉద్యోగం రాక పోతే ఆ వ్యక్తి ఈ దేశంలో తన స్టేటస్ కోల్పోయినట్లు పరిగణిస్తారు. అంటే ఆ వ్యక్తి ఈ దేశంలో సరైన వీసాలేకుండా ఉంటున్నాడని అర్థం. అయితే ఈ కాంట్రాక్ట్ ఉద్యోగాలు ఒక ఏజెంట్ ద్వారా జరిగితే కంపెనీలో ఉద్యోగం పోయినా ఆ ఏజెంట్ దగ్గర పని చేస్తున్నట్లు ఆ ఏజెంట్ జీతం

ఇస్తున్నట్లు లెఖ్ఖ. ఇండియా నుంచి అయిన వాళ్లని కానివాళ్లని సరిగ్గా క్వాలిఫికేషన్లు లేని వ్యక్తులని, చాలామందిని ఏజెంట్లు డబ్బులు గుంజో, ఇంకేరకంగానో వాళ్ల దగ్గర డబ్బు రాబట్టేరు. రెండు వేల సంవత్సరంలో కంప్యూటర్ ప్రోబ్లెమ్ భయంవలన చాలా ఉద్యోగాలు తాత్కాలికంగా ఏర్పడ్డాయి. ఇది చూసి ఎడాపెడా ప్రజలని తీసుకువచ్చి డబ్బు సంపాదించారు. ప్రస్తుత పరిస్థితులలో అలాంటి అవకాశాలు మాయమవగా అలాంటి ఉద్యోగాలుపోయాయి. వాళ్లని తెచ్చిన ఏజెంట్లు, వాళ్లకి కనీసవేతనం లాంటిది ఇచ్చి వాళ్లని ఏదైనా ఉద్యోగంలో ఇరికించడానికి ప్రయత్నం చేసి విఫలులయ్యేక "బాబూ ఇహ నీకు నేను ఏమీ చేయలేను. నీ సంగతి నువ్వే చూసుకో. నాకూ నీకూ ఏమీ సంబంధం లేదు. ఇండియాకి టిక్కట్టు ఇదిగో" అంటూ చేతులు దులుపుకుంటున్నారుట. చెట్లు కాయలు కాసి పండే రోజుల్లో ప్రతీ ఏజెంట్ పదిహేను ఇరవైమందిని, కొంతమంది ముప్ఫయిమందిని తెచ్చిన ఏజెంట్లు ఇప్పుడు వాళ్లకి మనిషికి వెయ్యి చొప్పున ఇవ్వాలి. వట్టిపోయిన ఆవులు, తిరిగి జతకట్టి దూడని కని పాలిస్తాయన్న నమ్మకం లేని చోట ఇరవై వేలు నెలకి ఎవరు ఖర్చుపెడతారు?" అంటూ గోపాల్ ఆగాడు.

"మరయితే వాళ్ల సంగతేమిటి?" అనడిగాడు రమణయ్య ఆదుర్దాగా.

"కొంతమంది స్వంత డబ్బు వాడి యూనివర్శిటీలో చేరడానికి ప్రయత్నం చేస్తున్నారు. అది అంత త్వరగా చేయగలిగే పనికాదు. జీఆర్ఇ పరీక్ష తీసుకోవాలి. తరువాత చాలా తతంగం ఉంటుంది. కొందరు సంపాదించినది చాలని, పరిస్థితులు బాగుపడితే తిరిగి రావచ్చని ఇండియాకి వెళ్లేరు. ఏజెంట్ దగ్గర జీతం అఖ్ఖరలేదని వీసా కోసం అతని కింద ఇంకా పని చేస్తున్నట్లు బేరం కుదుర్చుకుని దాచుకున్న డబ్బుని ఖర్చుచేస్తూ ఇక్కడ ఇళ్లు ఉన్నవాళ్లు ఎవరైనా సెలవులకి ఇండియాకి వెళ్తుంటే వాళ్లింట్లో కొన్నాళ్లు తలదాచుకుని ఉంటున్నారు. పరిస్థితి బాగుపడుతుందని మరికొన్నాళ్లకి ప్రయత్నం అన్నమాట. కొంతమంది ఏమైతే అది అయిందని తెగించి ఉండిపోతున్నారు" అంటూ ఒకప్పుడు మతాబాలా వెలిగిన సాఫ్ట్‌వేర్ ఇంజనీర్ల గురించి గోపాల్ చెబుతుంటే రమణయ్యకి భయం, ఆశ్చర్యం వేశాయి. "మరి సరిగ్గా వీసా లేనివాళ్లని ప్రభుత్వం పట్టుకోదా?" అనడిగాడు రమణయ్య.

"సరైన వీసాలేకుండా ఈ దేశంలో ఆరు నెలలు ఉండిపోతే మళ్లీ ఎప్పుడైనా ఈ దేశం రావడానికి ప్రయత్నిస్తే మూడేళ్ల వరకు వీసా ఇవ్వరు. అదే ఒక సంవత్సరం ఉండిపోతే పదేళ్లురానివ్వరు. ప్రభుత్వం పని కట్టుకుని వీళ్లని వెంటాడి పట్టుకోదు. ఏదైనా విపత్కాల పరిస్థితులలో పోలీసులు చెక్ చేసి మీకు సరైన వీసా లేదని కనుక్కుంటే వెంటనే అక్కడనుంచి అక్కడే అలాగే తిన్నగా ఎయిర్‌పోర్ట్‌కి తీసుకెళ్లి డిపోర్ట్ చేసేస్తారు. వాళ్లు మనదేశంలో ఢిల్లీ, బొంబాయి, మద్రాసులాంటి విమానాశ్రయంలో దిగాక ఎవరైనా వచ్చి విమాన ఖర్చు చెల్లించి వాళ్లని విడిపించాలి. ఇక్కడ కొన్ని రాష్ట్రాలలో ఈ చెక్ చేయడం తక్కువ. మెక్సికోని ఆనుకుని ఉన్న రాష్ట్రాలలో ముఖ్యంగా కాలిఫోర్నియాలో చెక్ చేయడం ఎక్కువ. దీనికి కారణం ఆ రాష్ట్రానికి దొంగతనంగా మెక్సికోనుంచి తెగ వలస వచ్చేయడమే. కాలిఫోర్నియా రాష్ట్రంలో ప్రజలకి హక్కులు, ఫ్రీడమ్ ఎక్కువైనా ఏదైనా తప్పు చేస్తే దండన కూడా ఎక్కువే" అన్నాడు గోపాల్.

"అవునవును" అంటూ శాన్‌ఫ్రాన్సిస్కోలో తను చూసిన ఉదంతం చెప్పాడు రమణయ్య.

"రెండు వందల అరవై డాలర్ల ఫైన్




చిన్న ఫైన్. ఇది విను. మనిద్దరమూ కారులో ప్రయాణం చేస్తుంటే నువ్వు బీర్ కేన్ తెరచి ఒక గుక్కతాగి దానిని పక్కకి పెట్టేవు. తరువాత ఐదు నిమిషాలకి నువ్వు ఆ బీర్‌కేన్‌ని మరచిపోయి కారు దిగిపోయావు. ఏదో ఇతర కారణాలవలన నా కారుని పోలీసు నిలుపుచేసి తనిఖీ చేసినపుడు తెరచి ఉన్న ఆ బీర్ కేన్ కాని వాడి కంటపడితే యునో వాటీజ్‌ది ఫైన్? పదహారు వందల డాలర్లు. ఇలాగే ఉంటాయి ఫైన్లు ఆ రాష్ట్రంలో" అంటూ వివరించాడు గోపాల్.

"మీరందరూ రొమ్ములు విరుచుకుని ఫ్రీడమ్, ప్రాథమిక హక్కులు అంటూ ఇతరులకి నీతులు చెబుతారే మరి తనిఖీలు ఏమిటి? కమ్యూనిస్ట్ దేశం కాదుకదా?" అన్నాడు రమణయ్య నవ్వుతూ.

"అది క్లిష్టమైన టాపిక్. అనవసరంగా మనం ఘర్షణకి పాల్పడతాం. అందుచేత దాని జోలికిపోవద్దు. తనిఖీలు గురించి మాత్రం చెబుతాను. పోలీసులకి నల్లరంగు హోండా ఎక్కార్డ్‌లో మత్తుమందు సరఫరా అవుతోంది. ఈ కారు హైవే నెంబర్ నూట ఒకటి మీద నడుస్తున్నట్లు వార్తవస్తుంది అనుకో. హైవే మీద వెంటనే తనిఖీ మొదలవుతుంది. యాదృచ్ఛికంగా నువ్వు అదే దారంబట హోండా అకార్డ్ కారులో ప్రయాణం చేస్తున్నావు. నీ కారు తనిఖీకి గురవవచ్చు మరొక ఉదాహరణ: నువ్వు రోడ్డుమీద నడిచి వెళ్తుంటే స్పీడ్‌గా పరిగెడ్తున్న కారు ఒక వ్యక్తిని పడకొట్టి వెళ్తుంటే ఆ దారంబటే వస్తున్న పోలీసు మిమ్మల్ని ఆ ఏక్సిడెంట్ గురించి ప్రశ్నిస్తున్నపుడు నీ పేరు ఇతర విషయాలు నమోదు చేసుకుంటాడు. అప్పుడు నీ స్టేటస్ బైటపడవచ్చు ఈ రోజుల్లో కంప్యూటర్ల ధర్మమా అని వాళ్లకి అన్నీ ఇట్టే తెలిసిపోతాయి. ఇందాక బీర్ కేన్ గురించి చెబుతున్నపుడు డ్రగ్స్ గురించి చెప్పడం మరచిపోయాను. నువ్వు పార్క్ చేసిన కారుని ఎవరో దొంగిలించి దానిని మత్తు పదార్థాల రవాణాకి ఉపయోగిస్తూ పోలీసులకి పట్టుపడితే ఆ కారుని ప్రభుత్వం జప్తు చేసేసుకుంటుంది. సాధారణంగా దానికి నీళ్లు ఒదులుకోవడమే. ఇలా జప్తు చేసుకున్న కార్లని వేలం వేసి వచ్చిన డబ్బుని ప్రభుత్వ ఖజానాకి జమచేస్తారు. సర్లే మనం ఎక్కడో బయలుదేరి ఎక్కడికో వచ్చేం. ఇంతకీ మీ వాడికి గ్రీన్‌కార్డు లేదంటావ్?" అంటూ మొదటికి వచ్చాడు గోపాల్.

అడ్డంగా తల ఊపాడు రమణయ్య. కాసేపు ఇద్దరూ మాటలాడలేదు.

"నేను నీ దగ్గరికి వచ్చి హాయిగా రోజులు వెళ్లదీస్తూ ఏడు వారాలు పైనే అయింది. ఈకాలంలో నా గురించి ఖర్చు శ్రమ చాలా తీసుకున్నావు థాంక్స్. నా ఇండియా టిక్కట్ నాలుగు నెలలకే పరిమితం. ఒకసారి ధనరాజ్ దగ్గరకి వెళ్లాలి. ప్రతీ రోజూ రవళి న్యూయార్క్‌కి వెళ్లిరావడం కష్టంగా ఉందని, సమయం రైళ్ల ప్రయాణాలలో వృధా అవుతోందని న్యూజెర్సీ ఇంటిని అద్దెకి ఇచ్చి వాళ్లు న్యూయార్క్‌లో ఎపార్ట్‌మెంట్‌లో ఉంటున్నారు. వచ్చేవారం నేను న్యూయార్క్ వెళతాను" అన్నాడు రమణయ్య.

"ఈ ఇల్లు పెద్దది, దానిలో నువ్వు ఉంటున్నందుకు ఎక్స్‌ట్రా ఖర్చు సున్నా. ఎక్కడికైనా నేవెళ్తుంటే నాతో నిన్ను తీసుకెళ్తున్నాను. దానికి అదనపు ఖర్చు మరో సున్నా డాలర్లు. నువ్వు తినే తిండికి ఈ రెండు నెలల్లో ఎక్స్‌ట్రాగా నేఖర్చుపెట్టినది మహా అయితే ఒక వంద డాలర్లు ఉండవచ్చు మన నలభై రెండేళ్ల స్నేహానికి విలువ కేవలం నూరు డాలర్లేనా ఉండదా? గత రెండు నెలలలో మనం హాయిగా మాటలాడుకుంటూ గడిపి నాకు నువ్వు మంచి రిలీఫే ఇచ్చావు. మా అబ్బాయి ఫ్లోరిడాలో ఉద్యోగం చేస్తూ అక్కడే

ఉన్నాడు. మరో రెండేళ్ళలో స్మిత కాలేజీకి, తరువాత రెక్కలు వచ్చిన పక్షి అవుతుంది. నేను, శారద ఇంత పెద్ద ఇంట్లో మిగులుతాం. పాత స్నేహితులతో గడపడంలో ఉన్న మాధుర్యం స్నేహానికి విలువ ఇచ్చే మనుష్యులకే తెలుస్తుంది. ఎంతసేపూ నేను, నేను అనుకోకుండా మనం మనం అనే స్నేహితులు కావాలంటే దొరకరు. అది మంచి స్నేహితులు తటస్థపడితేకాని తెలియదు. నువ్వు ఎప్పుడు ఈ దేశం వచ్చినా మా ఇంటి ద్వారాలు నీకు స్వాగతం పలుకుతాయి. నువ్వు నాకు కంపెనీ ఇచ్చినందుకు కృతజ్ఞతలు నేను చెప్పాలి" అంటూ రమణయ్య చెయ్యి నొక్కాడు గోపాల్. లోపలినుంచి అంతా వింటున్న శారద కళ్లు చెమర్చాయి.

"పద అలా రెండడుగులు వేద్దాం" అన్న రమణయ్య ప్రతిపాదనకి "అలాగే" అంటూ లేచాడు గోపాల్.

"నాకు నిన్న సన్యాసిరావు దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది" అంటూ మొదలుపెట్టాడు రమణయ్య.

"ఎవరు? విజయనగరం కానుకుర్తివారి వీధిలో ఎత్తు అరుగుల ఇంటిలో పీలగా ఉండేవాడు అతనేనా?" అనడిగేడు గోపాల్.

"అతను సత్యారావు. ఇతను ఉల్లి వీధిలో కటకం డాక్టర్‌గారి ఇంటికి దగ్గరగా ఉండేవాడు ఆ రోజుల్లో. అతనూ నేనూ మునిసిపల్ హైస్కూల్లో చదువుకున్నాం. నేను ఇంజనీరింగ్‌కి వస్తే అతను బి.ఇడి పూర్తి చేసి మాస్టరయేడు. చివరికి హెడ్‌మాస్టర్‌గా రిటైర్ అవడానికి సిద్ధంగా ఉన్నాడు. అతనికి ఇద్దరు ఆడపిల్లలు, ఒక కొడుకు. ఆడపిల్లల పెళ్లిళ్లు చేశాడు. కొడుకు ఒక ప్రైవేట్ ఇంజనీరింగ్ కాలేజీలో కంప్యూటర్ సైన్స్ డిగ్రీ మూడవ సంవత్సరం చదువుతున్నాడు. ఇప్పటికి ఒక లక్ష రూపాయలు అతని మీద ఖర్చు అయ్యాయి. నేను గతంలో ఐఐటీలో పాఠం చెప్పిన విద్యార్థులు చాలామంది ఇక్కడ పని చేస్తుంటారని తన కొడుకు గురించి ముందస్తుగా నలుగురికి చెప్పమంటాడు. డిగ్రీ పూర్తవగానే ఇక్కడ ఉద్యోగం వస్తుందని ప్లేన్ ఎక్కించేసి నిశ్చింతగా ఉందామని అతని ఉద్దేశ్యం" అన్నాడు రమణయ్య.

"రికమెండేషన్లతో ఇక్కడ ఉద్యోగాలు రావడం జరగదనికాదు కానీ మనిషికి కొంత చొరవ, చాకచక్యం, ప్రావీణ్యత ఉండాలి. ఇండియాలో ఉన్న నీకే అపరిచితమైన వ్యక్తిని అదీ చదువు పూర్తికాని వ్యక్తి గురించి ఎప్పుడో నీ దగ్గర చదువుకున్న వాళ్లని పట్టుకుని అతని సంగతి జ్ఞాపకం ఉంచుకుని ఉద్యోగం ఇప్పించమని చెప్పడం ఎంత సబబు?" అనడిగాడు గోపాల్.

"సన్యాసిరావు మంచివాడే. తండ్రిగా అతని ఆరాటం నేను అర్థం చేసుకోగలను. నాకు చేతనయితే నేను సహాయం చేయడానికి సిద్ధమే. ఈ పెద్ద దేశంలో ఇక్కడ నేగడిపిన రోజుల్లో ఒకే ఒక పాత స్టూడెంట్ నాకు కనిపించేడు. నాతో అరనిమిషం మాటలాడేడు. అతని పేరు కూడా నాకు గుర్తులేదు. సన్యాసిరావుకి ఏం జవాబు రాయాలి?" అంటూ తననితాను ప్రశ్నించుకున్నాడు రమణయ్య.

"ఉద్యోగం ఇప్పించగల దక్షత ఉన్న పాత విద్యార్థులు కనిపిస్తే వాళ్ల కంపెనీలలో అవకాశాలున్నాయని తెలిస్తే అతని కొడుకు గురించి ఒక ముక్క చెవిని వేసి ఉంచుతానని రాయి" అన్నాడు గోపాల్.

"ఇందాక మనం ఉద్యోగాలు పోవడం, వీసా ఇబ్బందులు మాటలాడుతుంటే ఒకటి అడుగుదామని మరచిపోయేను. ఈ దేశంలో ఉద్యోగం పోతే ఉద్యోగం పోయిన వాళ్లకి ఇన్సూరెన్స్ కంపెనీలనుంచి చెక్కులు, ప్రభుత్వం నుంచి వెల్‌ఫేర్ చెక్కులు ఇచ్చి సహాయం చేస్తుందంటారు? మరి అలాంటిది ఈ హెచ్‌వీసా ప్రజలకి




లభించదా?" అనడిగాడు రమణయ్య.

"నేను ఈ విషయాలన్నీ నీకు చెప్పి అనవసరంగా నీకు మనఃశాంతి కరువు చేసినట్లు ఉన్నాను. నువ్వు అప్పుడే ధనరాజ్ ఏమౌతాడా? అని ఆలోచిస్తున్నావు. ఉద్యోగాలు పోయినమాట, పోతున్నమాట, పోబోయేమాట నిజం. కానీ ఈ విభాగంలో నాలుగైదేళ్లుగా పని చేస్తున్న వాళ్లకి ఉద్యోగాలు పోయినా తిరిగి వాళ్లు ఇంకో ఉద్యోగంలో ఇరకగలుగుతున్నారు. కంప్యూటర్ విభాగంలో పురోగమనం ఇంకో ఆరు, తొమ్మిది నెలలు పోయాక ఉంటుందంటున్నారు. ఇహ నిరుద్యోగభీమా నుంచి సహాయం గురించి నువ్వు ఒక కంపెనీకి పని చేస్తున్నావనుకో అప్పుడు నువ్వు ఇన్సూరెన్స్ కంపెనీకి డబ్బు కట్టి ఇన్సూరెన్స్ తీసుకుంటావు. చాలాకాలం పని చేసేక ఉద్యోగం ఊడితే తప్ప ఇది ఉపకరించదు. వెల్ఫేర్ స్కీములు సాధారణంగా చట్టరీత్యా ఈ దేశంలో ఉన్న ప్రజలకోసం. ముఖ్యంగా అమెరికన్‌పౌరులకే. హెచ్‌వీసా ప్రజలు కేవలం పరిమితకాలానికే ఉద్యోగం కోసం వచ్చినవాళ్లు. ఉద్యోగం ఊడితే వాళ్ల దగ్గరకి సహాయానికి వెళ్తే "నువ్వు ఈ దేశంలోనే ఉండకూడదు, ఇంకా ఇక్కడ ఎందుకున్నావు?" అన్న ప్రశ్నకి సమాధానం లేనపుడు వాళ్లకి ప్రభుత్వం ధన సహాయం చేయడమేమిటి? నాకు అంతకన్నా ఎక్కువ వివరాలు తెలియవు. రేపు నిన్ను సోషల్ సెక్యూరిటీ ఆఫీసు దగ్గర వదిలి వెళ్తాను. అన్ని వివరాలూ కనుక్కో. నా ఉద్యోగం ఊడితే నేను ఎలాంటి సహాయం ఆశించవచ్చో కనుక్కో" అన్నాడు గోపాల్.

ధనరాజ్ ఎలాంటి క్లిష్ట పరిస్థితులలో ఇరుకుతాడోనని రమణయ్య, రమణయ్యని అనవసరంగా నిజంచెప్పి కలవరపెట్టేనే అని గోపాల్ ఆలోచించుకుంటూ నడక కొనసాగించారు.

"ఇక్కడే రూమ్ నెంబర్ నూట ఒకటిలో సోషల్ సెక్యూరిటీ ఆఫీసు ఉంది. నీకు పది గంటలకి ఎపాయింట్‌మెంట్ తీసుకున్నాను. నువ్వు ఆ గదిలో కూర్చుంటే నీ ఇంటిపేరు పెట్టి పిలుస్తారు. నీ అనుమానాలు అన్నీ తీర్చుకో. ఆ పని అయాక అదిగో ఆ బస్‌స్టాప్‌లో నిలబడితే ముప్ఫయి నాలుగు నెంబర్ బస్ ఎక్కి ఒక డాలర్ వేస్తే మన ఇంటి దగ్గర నేను నీకు చూపించిన బస్‌స్టాప్ దగ్గర దింపేస్తాడు డ్రైవరు. నిశ్చయంగా నీకు తెలియకపోతే ముందరే డ్రైవర్‌కి చెప్పు ఆ సంగతి. మరినే వెళ్తాను" అంటూ గోపాల్ రమణయ్యని సోషల్‌సెక్యూరిటీ ఆఫీసు దగ్గర ఉదయం తొమ్మిది గంటల ముప్ఫయి నిమిషాలకి వదిలి వెళ్లాడు.

రమణయ్య ఫెడరల్ బిల్డింగ్‌లో ప్రవేశించబోతుంటే ఓ ఆజానుబాహువు నీలాంబరిధారి "సర్ ఆ మెటల్ డిటెక్టర్‌లోంచి ప్రవేశించండి" అన్నాడు. తను మెటల్‌డిటెక్టర్ లోంచి నడిచి వెళ్తుంటే మెషీన్ శబ్దం చేయగా "ప్లీజ్! పక్కకిరండి, మీ జేబులో ఉన్న నాణేలు, తాళాలగుత్తి వగైరా అన్నీ తీసి ఈ ప్లేటులో పడేసి మళ్లీ డిటెక్టర్ లోంచి నడవండి" అన్నాడు. అతను చెప్పినట్టే చేసి డిటెక్టర్ వాతపడకుండా రూమ్ నెంబర్ నూటఒకటి లోకి ప్రవేశించాడు రమణయ్య.

"ప్లీజ్ టేకే నెంబర్" అంటూ గేటు దగ్గర నిలబడి అందర్నీ హెచ్చరిస్తున్నాడు మరో నీలాంబరధారి.

"నాకు పది గంటలకి ఎప్పాయింట్‌మెంట్ ఉంది, నేనూ నెంబర్ తీసుకోవాలా?" అనడిగాడు అతనిని రమణయ్య.

"అక్కరలేదు, ఒక సీటులో కూర్చోండి, మీ పేరు పిలుస్తారు" అని సమాధానమిచ్చి "ప్లీజ్ టేక్ ఎ నెంబర్" అంటూ తిరిగి ఊపు అందుకున్నాడు.

హాలంతా జనంతో కిటకిటలాడుతోంది.

తెలుపులు, నలుపులు, హిస్పానిక్స్, పాలిపోయిన తెలుపుతో, పండిపోయిన జాంపండు రంగులో ఉన్న చైనీయులు, వియత్నాం నుంచి వచ్చినవాళ్లు కలగాపులగంగా ఉంది లోపల. అందరూ కుర్చీలలో కూర్చుని గుస గుసగా మాటలాడుకుంటున్నారు. గదిలో ఉన్న మనుష్యుల వయస్సు పద్దెనిమిది, పంథొమ్మిది నుంచి డెబ్బయి ఐదు వరకు ఉండవచ్చు ఒక ఖాళీ కుర్చీ చూసి దానిలో కూర్చున్నాడు రమణయ్య. ఒక అంధ వ్యక్తి లోపలికి వస్తుంటే నీలాంబరధారి తన హెచ్చరికని నిలుపు చేసి అంధ వ్యక్తిని కుర్చీలో కూర్చోవడానికి సహాయం చేశాడు. తోపుడు బండీలో లోపలికి వచ్చింది ఒక అరవై ఏళ్ల స్త్రీ. హాలు శుభ్రంగా ఉంది. ప్రజలకి ఉపయోగపడే ఫారమ్‌లు ఒక మూలగా బల్లమీద అమర్చి ఉన్నాయి. హాలులో ఏభై అరవై మధ్య జనాభా ఉండ వచ్చని రమణయ్య అంచనా వేశాడు. నాలుగు కౌంటర్లు పని చేస్తుంటే నెంబర్లవారీగా కౌంటర్‌ని సమీపించి ప్రశ్నలు వేసి సమాధానాలు పొంది, ఫారమ్స్ నింపి వెనక్కి వెళుతున్నారు.

అక్కడక్కడ ఒకరిద్దరు పని అవక కాబోలు "నోమేన్! వాట్ ఎ షిట్!" అని అసహనంగా గొణుగుకుంటూ బైటకి వెళ్తున్నా అంత రద్దీగా ఉన్నా గదిలో పని చేసే తీరులో ఒక పద్ధతి కనిపించింది రమణయ్యకి. విసుగుకోకుండా పనులు చేస్తున్నారు కౌంటర్‌లో ఉన్న పనివాళ్లు. వీలవకపోతే చాలా మర్యాదగా "సార్! మేడమ్! సారీ, ఇది జరగని పని, రూల్స్ అనుమతించవు" అంటూ మర్యాదగా దృఢంగా చెబుతున్నారు..

"శంకర ఉన్నారా ఇక్కడ?" అంటూ ఒక కనకాంబర రంగు డ్రెస్ ధారిణి, రమణయ్య పేరు పిలిచింది.

రమణయ్య చేయిమీదకి లేపి ఆమె వెంట ఇంకో గదిలోకి నడిచాడు.

"ప్లీజ్ సిట్ డౌన్. వాట్ కెన్ ఐ డు ఫర్‌యు? వాటీజ్ యువర్ సోషల్ సెక్యూరిటీ నెంబర్?" అనడిగింది.

"నాకు సోషల్ సెక్యూరిటీ నెంబర్ లేదు. నేను ఈ దేశం మా అబ్బాయిని చూడడానికి వచ్చాను. మీ దగ్గరనుంచి నాకేమీ ఆర్థిక సహాయం అవసరంలేదు. నాకు మీ ఐదు నిమిషాలు కావాలి. ఇష్టమైతే మీకు అభ్యంతరం లేకపోతే నాకు కొన్ని అనుమానాలు ఉన్నాయి. వాటికి సమాధానాలు ఇవ్వండి. ఇండియానుంచి సాఫ్ట్‌వేర్ పనికి ఈమధ్య చాలామంది ఇండియన్లు అమెరికాకి వచ్చారు. ఇండియాలో ఈ దేశం వచ్చి పని చేద్దామన్న కోరిక, ఉత్సాహం చాలా మందికి ఉంది. అయితే ఈమధ్య అమెరికన్ ఎకానమీ మందగించడంతో ఉద్యోగాలు కరువయ్యి ఇండియా ప్రజలు తిరిగి వచ్చేస్తున్నారు. వాళ్లు ఈ దేశం వచ్చి పని చేయడం మొదలుపెట్టగానే అందరికీ ఒక సోషల్ సెక్యూరిటీ నెంబర్ ఇస్తారు. జీతంలో సోషల్ సెక్యూరిటీకంటూ కొంత పైకం కత్తిరిస్తారు. ఈ సోషల్ సెక్యూరిటీ డబ్బు కట్టినవాళ్లకి ఉద్యోగం పోతే ప్రభుత్వం ఏమీ సహాయం చేయదా? చేస్తుందని ఒకరు చేయదని ఒకరు అంటే నిజానిజాలు తెలుసుకుందామని మీ ఆఫీసుకి వచ్చాను. మా దేశంలో ఉన్న ప్రజలకి ముఖ్యంగా ఈ దేశం రావడానికి తయారవుతున్న వాళ్లకి ఉన్న అపోహలు కొందరికైనా నేను తొలగించడానికి ఉపయోగపడుతుంది మీ సమాధానం వల్ల" అంటూ ఆగాడు రమణయ్య.

"మీరు కోరినది ఐదు నిమిషాలేగా నా దగ్గర ఉన్నాయి. సోషల్ సెక్యూరిటీకి ఉద్యోగం ఊడితే సహాయానికి ఏమీ సంబంధంలేదు. ప్రతీ ఉద్యోగి దగ్గరనుంచి ఇప్పుడు దాదాపు ఏడున్నర శాతం సోషల్ సెక్యూరిటీ టేక్స్‌గా తీసుకుని దానిని ఒక ప్రత్యేకమైన ట్రస్ట్‌లో పెట్టి ప్రభుత్వ




బాండ్లలో మ్యూచువల్ ఫండ్స్‌లో నిలవ చేసి ఆ డబ్బుని వృద్ధి పరుస్తున్నారు. ఉద్యోగి అరవయి ఐదేళ్లు వచ్చేక రిటైర్ అయితే తను పని చేసిన కాలంలో పది సంవత్సరాలు ఈ ట్రస్ట్‌కి డబ్బులు కడితే అతను ట్రస్ట్‌కి కట్టిన డబ్బుబట్టి కొంతడబ్బు ప్రతినెలా ఇస్తారు. ఎంత ఆలస్యంగా సోషల్ సెక్యూరిటీ డబ్బు తీసుకుంటే అంత ఎక్కువ డబ్బు ఇస్తారు. ఒక్క ఈ సోషల్ సెక్యూరిటీ చెక్ మీద ఆధారపడి బతకడం కష్టం. ఏ పనీ చేయకపోయినా చేసిన పనిలో ఆదాయం స్వల్పమైనా సోషల్ సెక్యూరిటీ నుంచి వచ్చే చెక్ చాలా తక్కువ మొత్తానికి ఉంటుంది. నెలకి దాదాపు రెండు వందల నలభై డాలర్లు మాత్రమే. ఈ సోషల్ సెక్యూరిటీ కేవలం అమెరికన్ పౌరులకి, గ్రీన్ కార్డు ఉన్న వాళ్లకి మాత్రమే వర్తిస్తుంది" అంది కనకాంబర డ్రెస్ ధారిణి.

"పది సంవత్సరాలు ట్రస్ట్‌కి టాక్స్ కట్టి అరవై ఐదేళ్లు వచ్చేక పై దేశంలో సెటిల యితే సోషల్ సెక్యూరిటీ చెక్ ఆ దేశానికి వస్తుందా? " అనడిగాడు రమణయ్య.

"ష్యూర్. కానీ రెండుమూడు దేశాలలో అది వీలవదు" అంది కనకాంబర ధారిణి.

"హెచ్ వీసాలమీద ఇతర వీసాలమీద ఈ దేశం వచ్చిన వాళ్ల దగ్గర నుంచి సోషల్ సెక్యూరిటీ టాక్స్ తీసుకుంటు న్నారు. వాళ్లు ఇక్కడ పదేళ్లు ఉండలేరు. అందుచేత వాళ్లు సోషల్ సెక్యూరిటీ చెక్‌లు అందుకోవడానికి అనర్హులు. మరి వాళ్లు అనవసరంగా డబ్బు కడుతున్నారు కదా? " అన్నాడు రమణయ్య.

కనకాంబర డ్రెస్ ధారిణి వెంటనే ఏమీ సమాధానమీయలేదు.

"అంతేసి డబ్బు తీసుకోవడం అన్యాయం కదూ? పోనీ ఆ డబ్బు ఈ దేశం వదిలి వెళ్లిపోతున్నప్పుడు తిరిగి ఇచ్చేస్తారా? " అన డిగాడు రమణయ్య.

"హెచ్ వీసా ఉన్నవాళ్లు ఈ దేశంలో ఆరేళ్లు ఉండవచ్చు ఈలోగా వాళ్లకి గ్రీన్ కార్డు రావచ్చు ముందుగా టాక్స్ డబ్బు కట్టకపోతే గ్రీన్‌కార్డు వచ్చాకే ఆ డబ్బు తీసుకోవడం మొదలవుతుంది. హెచ్ వీసా మీద డబ్బు కట్టినవాళ్లు మళ్లీ కొత్త హెచ్‌వీసాతో వచ్చి మరో నాలుగేళ్లు కడితే వాళ్లకీ సోషల్ సెక్యూరిటీ చెక్ వస్తుంది. ఈ సిస్టమ్ పెర్‌ఫెక్ట్‌కాదు. కాంగ్రెసు అన్ని అంశాలని పరిశీలిస్తోంది. థాంక్ యు ఫర్ యువర్ ఇంట్రెస్ట్" అంటూ ఇంటర్వ్యూ ముగిసిందని చెబుతూ నిలబడింది.

"థాంక్యూ వెరీమచ్" అంటూ ఆమెతో కరచాలనం చేసి ఫెడరల్ బిల్డింగ్ నుంచి బైటపడి బస్‌స్టాప్ వేపు నడక ప్రారంభిం చాడు రమణయ్య.

బస్‌లో ప్రయాణం చేస్తూ సోషల్ సెక్యూరిటీ ఆఫీసులో తెలుసుకున్న విషయా లని నెమరువేసుకోనారంభించాడు రమ ణయ్య. తనలాంటివాళ్లకి సోషల్ సెక్యూ రిటీ నుంచి సహాయం రావాలంటే తను ఇక్కడ పది సంవత్సరాలు పనిచేసి ట్రస్ట్‌లో డబ్బు జమచేయాలి. ధనరాజ్ అమెరికన్ పౌరుడయేక తనకి గ్రీన్‌కార్డు వస్తే కానీ తను పని చేయలేడు. ఇది జరిగే పని కాదు. ధనరాజ్ అమెరికన్ పౌరుడుగా మారి తనకి గ్రీన్‌కార్డు వస్తే అప్పటికి తన వయస్సు అరవై ఐదు దాటుతుంది కాబట్టి నెలకి మహా అయితే రెండు వందల నలభై డాలర్లు వస్తాయి. అది ఏ మూలకి సరిపో తాయి? ఇండియాలో ప్రజలు చాలామంది అమెరికాలో ఏళ్లుపైపడితే నర్సింగ్‌హోమ్ లలో ఎంచక్కా చేరిపోవచ్చు లేదా ప్రభుత్వం ఇచ్చే సోషల్ సెక్యూరిటీ డబ్బుతో హాయిగా బతికేయవచ్చు అనుకుం టారు. వాళ్లు అనుకున్న దానికి ఇక్కడ నెల కొన్న వాస్తవానికి ఎంతతేడా! బహుశా అది తెలిసి వస్తుందనే కాబోలు గోపాల్ తనని సోషల్ సెక్యూరిటీ ఆఫీసుకి పంపేడు. అనుకుంటుంటే రమణయ్య దిగవలసిన

స్టాప్ వచ్చిందని డ్రైవర్ చెప్పగా వెనకాల ఉన్న తలుపుతోసి బస్ నుంచి బైటపడ్డాడు రమణయ్య.

బైట ఎండ తీవ్రంగా ఉంది. బస్ స్టాప్ నుంచి గోపాల్ ఇల్లు మహా అయితే అర మైలు దూరమే ఉన్నా ఎందుకో ఆ కాస్త దూరం నడక కష్టమనిపించింది రమణయ్యకి. బహుశా తనకి జ్వరం వస్తుందేమో! అనుకుంటూ గోపాల్ ఇల్లు చేరాడు. సోఫాలో కూర్చుంటే కళ్లు మూతలుపడ్డాయి.

"అదేమిటి, ఎప్పుడూ లేనిది మీరు ఈవేళ ఇప్పుడు నిద్రపోతున్నారు? రండి లంచ్ తిందాం" అంటూ శారద లంచ్‌కి పిలిచింది. చేతి వాచీవేపు చూస్తే తను గంటన్నర పాటు నిద్రపోయానని గ్రహించాడు. రమణయ్యకి లంచ్ హితవుగా అనిపించలేదు, ఏదో కాస్త తిని నిద్రవస్తోందని శారదకి చెప్పి

పరుపుమీదకి చేరాడు. చేరిన పదినిమిషాలకే నిద్రలోనికి ఒరిగాడు రమణయ్య.



"భలేవాడివే, ఈ దేశంలో ఉన్న మోసాలు కోకొల్లలు. మనదేశంలో ఉన్నవాటికి ఏమీ తీసిపోవు" అంటున్న గోపాల్ మాటలు రమణయ్యని లేపాయి. గడియారం సాయంకాలం ఐదు చూపిస్తోంది. మెల్లిగా బయటకి వచ్చాడు.

"మంచి నిద్ర తీసేశావ్. అందులో కలలు కూడాను. నీకు కూడా టీ తెస్తాను" అని సోఫాలో కూర్చున్న కొత్త వ్యక్తితో "నీ కారు కథ రమణయ్యకి చెప్పు. అతను ఇక్కడ మోసాలు తక్కువని అప్పుడప్పుడు అనడం విన్నాను" అంటూ టీ తీసుకురావడానికి కిచెన్‌లోనికి వెళ్ళాడు గోపాల్.

"నేను అన్నది వేరు. మోసాలు లేవని నేను అనలేదు, నన్ను ఎవ్వరూ మోసం చేయలేదన్నాను" అంటూ గోపాల్ మాటల్ని కరెక్ట్ చేశాడు రమణయ్య.

"నా పేరు రమేష్. ఇప్పుడే ఎమ్.ఎస్. కోర్స్ వర్క్ పూర్తిచేశాను. టెక్నికల్ ట్రెయినింగ్ ఒక సంవత్సరంలో చేయాలి. ఈ దేశంలో ఇప్పుడు నెలకొన్న పరిస్థితి మనందరికీ తెలిసినదే. హెచ్ వీసా ఇచ్చే నాథులు కరువయ్యారు. ఒక ఉద్యోగానికి పిలుపు వచ్చింది, కాని ఆ ఉద్యోగం చేయడానికి కారు ఉండడం ముఖ్యం. నా దగ్గర కారు లేదు, డబ్బు కూడా అట్టేలేదు. ఎలాగ ఈ చిక్కుముడిని విప్పడం? అని ఆలోచిస్తుంటే ఒక స్నేహితుడు, "గురూ ఈ కారుని పదిహేనువందల డాలర్లకి కొని దానిమీద ఐదువందలు ఖర్చుపెట్టి మరమ్మతులు చేయించాను, చూడు ఎలా వుందో?" అంటూ తను నడుపుతున్న కారుని చూపించాడు. బాగానే ఉంది.

"ఇది ఎలా సంపాదించావో నాకూ అలాంటి కారు ఒకటి కావాలి" అన్నాను నేను.

"డ్రగ్స్ వాడినందుకు ప్రభుత్వం జప్తు చేసుకున్న కార్లని, టాక్స్ మిగులుతుందని ధర్మం చేసిన కార్లని, ఆఖరిదశ వచ్చేస్తోందని అనుమానపడి ఇహ దానిమీద డబ్బు పెట్టి బాగుచేయించడం అనవసరం అని

ధర్మంగా ఇచ్చేసిన కార్లని ఒక వేలంకంపెనీ ప్రభుత్వానికి వేలం వేస్తుంది. వందలకార్లు ఉంటాయి. నీకు కావలసినదానిని సత్యనారాయణవ్రతం కథలోలా 'నీ తాహతును బట్టి' అంటే నీ దగ్గర ఉన్న డబ్బు పెట్టి కొనుక్కోవచ్చు" అని వేలంసంగతి చెప్పాడు.

"సరే, ఈవేళ వెళ్ళి కొందాం" అన్నాను నేను.

"ఉండు ఉండు, లేడికి లేచిందే పరుగులా ఎప్పుడు పడితే అప్పుడు జరగదు ఈ వేలం. నెలకి రెండుసార్లు శనివారాలలో వేలం వేస్తారు"

"అంటే ఇంకో రెండురోజులు ఆగాలన్న మాట" అన్నాను నేను.

"అయితే ఈ కార్ల గురించి నీకు కొంత చెప్పాలి. కార్లని వెళ్ళి మనం పరిశీలించవచ్చు కాని స్టార్ట్ చేసి చూడడానికి అనుమతించరు. కార్లు మంచివా? కావా? అన్న దాని గురించి గ్యారంటీ ఏమీ ఇవ్వరు. కాని ఆ కారుని పార్కింగ్ ప్రదేశంనుంచి నడిపి తీసుకువస్తారు. అంటే అది నడిచే కారు. రిస్క్ తీసుకుని, మరమ్మతులు చేయించుకుంటే చవకగానే లభ్యమవుతుంది. ఒక కారుని వేలం వేయడానికి మహా అయితే ఒక నిమిషం పడుతుంది" అంటూ ఆ చవకమార్గాన్ని సూచించాడు ఆ స్నేహితుడు.

నేను ఆలోచనలో పడ్డాను. చవకగా కారు లభ్యమవబోతోందన్న ఉత్సాహం పెల్లుబికింది. కాని నాలోని సివిక్ బయటకి వచ్చి "గురూ మనం మునిగిపోంకదా?" అన్నాను.

"అది ఒకరకమైన జూదం అనుకో. నాకు తెలిసిన ఒక మెకానిక్ ఉన్నాడు. అతనిని మనతో తీసుకెళ్దాం" అన్న అభయం ఇవ్వగానే నా ఆనందానికి పట్టపగ్గాలు లేవు" అంటూ గోపాల్ ట్రేలో టీ తీసుకొస్తే ఆగాడు.

నేను టీ అందుకున్నాను. రమేష్ చెప్పడం మొదలుపెట్టాడు మళ్ళీ

"నేనూ, నా స్నేహితుడు, అతనికి తెలిసిన మెకానిక్ ఒకరోజు ముందర వేలం వేయబోతున్న కార్లని తనిఖీచేసి, వాటిలో మంచివి అనిపించిన వాటి గురించి కాగితం మీద రాసుకుని, మర్నాడు వేలంలో రెండు వేలు పెట్టి కారుని కొన్నాను. శనివారం కారు కొన్నా. సోమవారం మంచిరోజు అని నా స్నేహితుడు అనడంతో సోమవారం దానిని తీసుకువస్తున్నాం. స్నేహితునికి తెలిసిన మెకానిక్ కారు నడుపుతున్నాడు. కారు హైవేమీద పరిగెడుతుంటే మొదట కొంచెం కొంచెం, తరువాత కాస్త ఎక్కువగా వణకడంతో నాకు వణుకు పుట్టుకువచ్చింది. కారు నడుపుతున్న మెకానిక్,

"ఒక సిలెండర్ మిస్ అవుతోంది. రేపు మెకానిక్ దగ్గరికి తీసుకువెళ్ళండి" అని చెప్పి వెళ్ళిపోయాడు. అతని ఇల్లు నే ఉన్న ప్రదేశానికి నలభైమైళ్ళ దూరంలో ఉంది. మర్నాడు మెకానిక్ దగ్గరకి తీసుకెళ్ళి పరీక్షించమన్నాను. అతను మనదేశస్థుడే. ఇంజన్‌లో ఉన్న నాలుగు సిలెండర్లలో ఒక సిలెండర్ చచ్చుపడిపోయిందని, అది సరిచేయడానికి, ఇతర మరమ్మతులు చేయడానికి తయారుగా ఉన్నాడు.

"ఇలాంటి కండిషన్‌లో ఉన్న కారు అమ్మకూడదు. ఇది ఎమిషన్ టెస్ట్‌లో ఫెయిలవుతుంది. అతనితో చెప్పి మరమ్మతులు చేయడానికి అయిన ఖర్చు కొంతైనా భరించమనండి" అన్నాడు.

"అయితే మొత్తం మరమ్మతులకి ఎంత అవుతుంది? " అనడిగాడు.

"అబ్బో ఇంజన్ రిపేర్ అంటే పెద్దపనే. ఇంజన్ పని చేస్తున్నాం కాబట్టి ఇతర ఇంజన్ పనులు కూడా చేయించేస్తే ఖర్చు కలిసివస్తుంది" అన్నాడు. కాగితంమీద సుమారుగా లెఖ్ఖలు వేసి కనీసం పదిహేను వందలు, మహా అయితే రెండువేల డాలర్లు అవుతాయి" అన్నాడు.

నా గుండె గుభేల్‌మంది. రెండువేల

డాలర్లు!

"ఈ రెండువేలలో కొంత వేలం వేసిన వ్యక్తి దగ్గరనుంచి రాబట్టవచ్చు" అని అతను అనడంతో,

"సరే చెయ్యి" అంటూ అతనికి కారుతాళాలు ఇచ్చాను. వాడు పనిమొదలుపెట్టాక గోపాల్‌గారితో జరిగిన విషయం చెప్పాను.

"వాడు అనవసరంగా అడ్డకిపడ్డా, కావలసినది అఖ్ఖరలేనిది మార్చి, లేబర్ ఖరీదుగా రమేష్‌కి వడ్డించేశాడు. అదీకాక అతను ఇంజన్ బాగుచేసేకంటే ఒకసారి వాడిన ఇంజన్‌ని వాడితే చవుకగా అయ్యేది. బజారులో అవి దొరుకుతాయి. వెంటనే వెళ్ళి పని నిలుపుచేయమను అని చెబితే, రమేష్ వెళ్ళి ఆ మాట మెకానిక్‌తో అంటే పని అప్పటికే మొదలయ్యిందని వెనక్కి వెళ్ళడానికి నాలుగువందలు ఇవ్వాల్సిఉంటుందనడంతో రమేష్ దిగాలుగా ఇంటికి వచ్చాడు" అని గోపాల్ వివరించి,

"మిగతా కథ నువ్వు ముగించేయ్" అన్నాడు.

"రిపేరయి కారు నా చేతికి వచ్చింది. ఆ మెకానిక్ మొత్తం పందొమ్మిదివందలు ఛార్జి చేశాడు. అతను ఏయే రిపేర్లు చేశాడో రాసి ఇచ్చిన దానిని బట్టి వేలం వేసిన వ్యక్తికి డబ్బుకి రాయమన్నాడు. దీని సిగతరగ, ఆ కారు రిపేర్ అయ్యాక ఏభైమైళ్ల వేగంకి వెళ్ళేసరికి మలేరియా జ్వరం వచ్చినట్టు కుదిపేయడం, క్షణక్షణానికీ ఆగిపోతుంటే నా గుండె బేజారయింది. మళ్ళీ మెకానిక్ దగ్గరకి వెళ్ళాను. భావి హీరోయిన్‌కి డైరెక్టర్ స్క్రీన్ టెస్ట్ ఇచ్చినట్లు కారుని శల్యపరీక్ష చేసి పెదవి విరిచి,

"సిలెండర్ పైభాగం అదే నే రిపేర్ చేసింది బాగానే ఉంది, కాని కిందభాగమే బాగాలేదు. రిపేర్ చెయ్యాలి" అన్నాడు పాతాళభైరవిలో ఎస్.వి. రంగారావు గడ్డం మీద చేయివేసుకున్నట్లు గడ్డాన్ని నిమురుతూ.

నాకు నోటంట మాట రాలేదు.

"ఈ పరిస్థితులలో ఈ కారుని అమ్మేయగలనా? " అనడిగాను.

"ఎలా అమ్మగలరు? ఇది ఎమిషన్ టెస్ట్ పాసవదు. అలాంటి కారు అమ్మడం నేరం" అన్నాడు ఆ మాంత్రికుడు.

గోపాల్ తాగుతున్న టీ కింద ఉంచి బిగ్గరగా నవ్వాడు.

"మీకు అలాగే ఉంటుందండి" అన్నాడు రమేష్ ఆయనతో జతకలుపుతూ.

"వాడిని మాంత్రికుడు అన్నందుకు నవ్వు వచ్చింది అంతే కానీ" అన్నాడు గోపాల్.

కారుని వాడి దగ్గర వుంచి గోపాల్‌గారి దగ్గరకి సలహాకి వచ్చాను" అంటూ ఆగాడు రమేష్.

"రమణా ఈ దేశంలో కారు మెకానిక్‌లు ప్రజలని మోసం ఎక్కువగా చేస్తున్నారని వాళ్ళమీద రిపోర్ట్ చేయడానికి రెండు సంస్థలు స్థాపించారు. ఒకటి బెటర్ బిజినెస్ బ్యూరో. వీళ్ళతో ఫలానా కంపెనీ మోసం చేసిందని వాడిమీద కంప్లయింట్ చేయడం. రెండవది బ్యూరో ఆఫ్ ఆటోమేటిక్ రిపేర్స్. ఇవి రెండూ ప్రభుత్వ సంస్థలు కావు. ప్రజల దగ్గరనుంచి వచ్చిన విరాళాలతో నడుపుతున్నవి. మనం కంప్లయింట్ ఈ రెండింటికీ చేస్తే వాళ్లు విచారణ చేసి ఒక రిపోర్ట్ తయారుచేస్తారు. మోసం చేసిన వ్యక్తులకి ఫోన్ చేసో, గ్యారేజీల యజమానులని కలిసో, 'అబ్బీ! నువ్వు మోసం చేశావు, ఈ సంగతి రిపోర్టులో ఉంటుంది. కస్టమర్‌తో మాట్లాడి అతనికి సహాయం చెయ్యి' అని ఉపదేశిస్తారు" అన్నాడు గోపాల్.

"వాళ్లు ఆ ఉపదేశాన్ని పాటించకపోతే? "

"అప్పుడు మన దగ్గరున్న వజ్రాయుధం వాడతాం. వాళ్ళని స్మాల్ క్లెయిమ్స్ కోర్టుకి ఈడుస్తాం. ఒక జడ్జ్ పది హేను, ఇరవైనిమిషాలలో ఈ బ్యూరోలు పంపించిన రిపోర్టులు చదివి ప్రశ్నలు వేసి వెంటనే తీర్పు




చెబుతాడు. కస్టమర్‌కి డబ్బు చెల్లించమని తీర్పు ఇస్తే అది వాడి రికార్డ్‌లోనికి వెళ్తుంది. అలా జరిగిందని ప్రజలకి తెలియగానే వాడి బిజినెస్ క్షీణిస్తుంది. అథవా తీర్పు పూర్తిగా వాడికి ఇష్టం లేనట్టు వచ్చినా ప్రజలు అతనిని కోర్టుకి ఈడ్చారు అన్న చెడ్డపేరు ప్రబలిపోతుంది. నాలుగైదు సార్లు అలా జరిగితే ఆ మెకానిక్ లైసెన్స్ ఊడుతుంది. ముందు రమేష్‌చేత వేలం వాడికి ఉత్తరం రాయించి, రెండు బ్యూరోలకి కాపీలు పంపించే ఏర్పాటుచేశాను. నేనూ, రమేష్ వెళ్ళి మెకానిక్‌ని కలిశాం.

"నేను చెయ్యవలసినదంతా చేశాను. ఇటీజ్ టూ బ్యాడ్. ఆ కారు మంచిదికాదు" అన్నాడు.

"నువ్వు పంధొమ్మిదివందల డాలర్లు తీసుకుని కారు రిపేర్ చేస్తానన్నావు. ఆ కారు అప్పటికన్నా, ఇప్పుడు ఘోరంగా ఉంది. అంటే నీకు ఆ డబ్బు ఎందుకు ఇచ్చినట్టు? "

"అది రిపేర్‌చేసి తిరిగి ఇవ్వకపోతే నిన్ను కోర్టుకు ఈడుస్తాం" అన్నాడు.

"నాకేం భయంలేదు. కావాలంటే కోర్టు అడ్రసులు ఇస్తాను" అన్నాడు వాడు గంభీరంగా. ఇంటికి వచ్చి కోర్టు ఫారం తెప్పించి అన్నీ నింపి ఎందుకైనా మంచిది, మరోసారి వాడిని కలిసి కదిపిచూడు అని రమేష్‌ని పంపాను. రమేష్ ఆ ఫారమ్స్ వగైరా చూపించి,

"పోస్టాఫీసుకి వెళ్తూ ఇలా వచ్చాను. కోర్ట్ ఫారమ్స్ పంపేదా? " అనడిగితే, వాడు దిగి వచ్చి కాణీ ఖర్చులేకుండా కారును పూర్తిగా రిపేర్‌చేసి ఇవ్వడమే కాకుండా, గ్యారంటీ కూడా ఇవ్వడానికి ఒప్పుకున్నాడు" అంటూ కథ ముగించాడు గోపాల్.

"నేవెళ్తానండి" అంటూ రమేష్ లేచాడు.

"బెస్ట్ ఆఫ్ లక్, కారు రిపేర్ అయివచ్చాక నాకు ఫోన్ చెయ్యి" అంటూ అతనిని సాగనంపాడు గోపాల్.

"ఈ దేశంలో మోసం చెప్పి చేస్తారు. 'అశ్వద్ధామ...' అని ఆఖరిముక్క మెల్లగా అన్నట్లు, ఇక్కడ మోసం అంతా చిన్న ప్రింట్‌లో ఉంటుంది. మనకి దాని గురించి తెలియకపోతే అది చదవం. అక్కడే మనకి ఎలా క్షవరం చేస్తారో రాసివుంటుంది. ముఖ్యంగా ఇన్సూరెన్స్ కంపెనీలు! ఇది నీకు తెలుసా ఈ దేశంలో అన్నింటికన్నా పెద్ద భవంతులు అన్నీ ఇన్సూరెన్స్ కంపెనీలవే. ఆశ్చర్యంగా ఉందికదూ? " అనడిగాడు గోపాల్. రమణయ్య తల ఊపాడు.

"అర్ధణా ఇస్తే ముక్కానిస్తా అని మోసం చేసినట్లు అబ్బా! ఈ దేశంలో మోసాలు గురించి ఎంత రాసినా తరగదు. ఒక పని ముట్టు లేదా మెషీన్ కొనేటప్పుడు ఇరవై సంవత్సరాలు గ్యారంటీ అంటాడు, అయిదేళ్ళ తరువాత ఆ కంపెనీ ఉండిచావదు. రమేష్ సంగతి నేచూస్తాను. మరీ నష్టపోడులే" అని "అన్నం తిందామా? " అనడిగాడు గోపాల్.

"నేను వచ్చే ఆదివారం న్యూయార్క్ వెళదామనుకుంటున్నాను. ఒకసారి రైలు ప్రయాణం చేద్దామన్న నీ సలహా పాటించ దలచుకున్నాను. ముప్ఫయి ఆరుగంటలు పట్టినా ఆ అనుభవం కూడా అవుతుంది. ఇంకోవ్యక్తి కూడా ఆ సలహా ఇచ్చాడు" అన్నాడు రమణయ్య.

"కవితగారు ఆ సలహా ఇచ్చారేవిటి? " అనడిగాడు గోపాల్. ఒక్కసారి ఆశ్చర్యపోయాడు రమణయ్య.

"నువ్వు ఎలా ఊహించావు? " అనడిగాడు తెప్పరిల్లి.

"ఇందాక నువ్వు నిద్రపోతుంటే కలవరిస్తూ 'కవిత' పేరు రెండుసార్లు ఉచ్ఛరించావు. శారదా, నేనూ ఇద్దరమూ విన్నాం ఎవరామె? " అనడిగాడు గోపాల్.

"న్యూజెర్సీలో ధనరాజ్ ఇంటిపక్క ఇల్లు ఆమెది. ఇప్పుడు ఇల్లు అమ్మేసి భర్త దగ్గరకి వెళ్ళింది. గార్డెనింగ్ ఆమెకి బాగా తెలుసు. ధనరాజ్ ఇంటితోట సంర

క్షణప్పుడు అప్పుడప్పుడు సలహాలు ఇచ్చేది. ఒక మంచి వ్యక్తి" అన్నాడు రమణయ్య.

"రైలుప్రయాణం చెయ్యమని సలహా ఇచ్చి నిన్ను అనవసరమైన ఇబ్బందులలో ఇరికిస్తున్నానేమో. రైలుప్రయాణం బాగానే ఉంటుందికాని తిండికే కాస్త ఇబ్బంది. అది ఆగే స్టేషన్లు ఊరికి దూరంగా ఉంటాయి. ప్లాట్ ఫారం మీద ఏమీ దొరకవు. శారదని శాండ్ విచెస్, పళ్లు దండిగా కట్టి ఇమ్మంటాను" అన్నాడు గోపాల్.

"చూద్దాంలే" అంటూ టాపిక్ మార్చాడు రమణయ్య.

★ ★ ★

సూట్ కేస్ కంటే పెద్ద సంచిలో తినుబండారాలతో రైలు ఎక్కాడు రమణయ్య. రైలు స్టేషన్‌కి గోపాల్, శారద వచ్చి ఆఖరిక్షణంలో గోపాల్ కరచాలనం చేసినప్పుడు ఎంతో హాయి అనుభవించినా మంచి మిత్రులని వదిలి వెళ్తున్నందుకు విచారమేసింది. సామాన్లని మీదనున్న ఖాళీ జాగాలో అమర్చి సీట్లో కూర్చున్నాడు. మైక్రోఫోన్‌లో, రైలు ఎక్కడెక్కడ ఆగబోతోందీ, రైలులో ఉన్న సౌకర్యాల గురించి, నిబంధనల గురించి చెబుతుంటే రైలు కదిలింది. పక్క సీటు ఖాళీచూసి, 'ఫరవాలేదు' నిద్రవస్తే నిద్రపోవచ్చు' అనుకున్నాడు రమణయ్య.

సాయంకాలం సంధ్య ఆకాశాన్ని అలుముకోవడానికి చేస్తున్న ప్రయత్నం మొదలయింది. కిందికి దిగుతున్న సూర్యుడు శాంతంగా, తీక్షణ రహితంగా ఉండడం చూసి ముచ్చటేసింది రమణయ్యకి. వరి పైరు, జొన్నమొక్కలని దాటి రైలు పరిగెడుతోంది. అందంగా ఉన్న సూర్యుడిని ముద్దు పెట్టుకుందామన్న వరిపైరు గింజలు, జొన్న కంకులు మీదకి లేస్తున్నాయి. అన్నీ అలా చుంబించడానికి ఎగపడుతుంటే సిగ్గుపడి కాబోలు సూర్యుడు కందిపోతున్న మొహాన్ని కప్పుకోవడానికి వీలవక దూరంగా ఉన్న కొండల వెనక్కి వెళ్ళి తత్తరపాటుని దాచుకున్నాడు. వెలుగుని కోల్పోయింది ఆకాశం. అంతగా కాంక్షించిన వ్యక్తి మాయమవడం గమనించి ధాన్యపుగింజలు, జొన్నకంకులు తలవాల్చేసుకుంటున్నాయి. ఆహ్లాదంగా కనిపించిన వాతావరణంలో అరగంట గడిచేసరికి ఆవేదన చోటుచేసుకుంది. తిరిగి సూర్యుడు ఉదయిస్తాడు. ఏమో! ఏదో ఒకరోజు వరి పైరు ఆతనిని అద్దుకుంటుందేమో! అనుకుంటూ రైలుపట్టాలవేపు చూశాడు. ఏదో జంక్షన్ కాబోలు. రమణయ్య ప్రయాణం చేస్తున్న రైలుకి దూరంగా రవ్వంత సమాంతరంగా ఇంకో రైలు పరిగెడుతోంది. సమాంతరంగా పరిగెత్తే రైళ్లు చూడడం అరుదు. బొంబాయిలాటి పట్టణాలలో కనిపిస్తాయేమో! సమాంతరంగా పయనించే రైళ్లు కాస్సేపు ఒకేదిశలో పరిగెత్తవచ్చు కాని ఎక్కడ గమనించినా, రెండు రైళ్లు చివరివరకు సమాంతరంగా పరిగెత్తడం చూడం. రెండు రైళ్లు సమాంతరంగా ఒకేవేగంతో, ఒకేదిశలో పయనిస్తుంటే, ఎదురెదురుగా రైలు పెట్టెలలో కూర్చున్న వ్యక్తులు కనపడుతూ, కలిసి ప్రయాణం చేస్తున్నట్లనిపిస్తుంది. అది తాత్కాలికమే. అయినా అది మనలో ఒక ఉత్సాహాన్ని, ఉత్తేజాన్ని జనింపచేస్తుంది. ప్రపంచమే స్తంభించిన ఊహ కదలాడినా, రైలు మారగానే అది భ్రమ అని చటుక్కున తెలియవస్తుంది. మనస్సు కకావికలమవుతుంది. ఏదో కోల్పోయినట్లు ఫీలవుతాం. ఎదుటి బండిలో ప్రయాణం చేస్తున్న వ్యక్తులు మనతో ప్రయాణం చేయలేదన్న నిజంలాంటిదే కవితతో పరిచయం. కవిత తనకి తెలిసినట్లనిపించినా, ఆమె గురించి తనకి తెలిసినది చాలా తక్కువే. తన గురించి చర్చించడానికి జంకేది, తను చొరవ చేయబోతే సంభాషణ ఇంకో దిశవైపు మళ్లించేది, అది ఆమె ప్రత్యేకత. ఎదురుగా పరిగెత్తి మాయమయిన




రైలులాగే కవితతో పరిచయం మాయ మైంది.

కవిత న్యూజెర్సీ రాష్ట్రంలో ఇల్లు అమ్మి, చికాగో వెళ్ళిపోయిందా? ఆమె గురించి తెలుసుకునే ఆస్కారం లేకుండా తను ఇప్పుడు న్యూయార్క్ వెళ్ళబోతున్నాడు. ఎక్కడుందో కవిత ఎలా ఉందో? మరోసారి కవిత తనకి కనిపిస్తుందా? అనుకుంటూ చీకటిలోనికి చూడసాగాడు రమణయ్య. టెక్సాస్ రావడానికి ముందర రెండురోజులు ఆమెని చూడడానికి వీలుపడలేదు. మంచి కంపెనీ ఇచ్చి అటూ ఇటూ తిప్పి రోజులు ఆహ్లాదంగా గడిచినందుకు తోడ్పడిన కవితకి కనీసం సరిఅయిన కృతజ్ఞత అయినా చెప్పకుండా ఊరు వదిలి టెక్సాస్ వచ్చాడు. ఛ! ఏమనుకుందో! నిర్ణీత సమయానికి ఊర్లని దాటుకుంటూ రైలు ఒకేవేగంతో పరిగెడుతోంది. అడవి ప్రదేశం కాబోలు, రైలుపట్టాలకి దగ్గరగా లైట్ల వెలుతురు కనిపించడంలేదు. ఒక్కసారి రైలు శబ్దం చేసుకుంటూ గుహలోనికి ప్రవేశించింది. రెండు వరుసల ముందర కూర్చున్న ఇద్దరు కుర్రాళ్లు ఆనందంగా చప్పట్లు కొట్టి సంబరపడుతున్నారు. రైలు ప్రయాణం జీవితంలాంటిది కాదు... జీవితం రైలుప్రయాణం లాంటిది. ఏదైతేనేం జీవితం, రైలు ప్రయాణం ఒక్కలాంటివే అన్నది చాలా మంది ఒప్పుకుంటారు. నచ్చిన వ్యక్తులు పక్కపక్కని కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ ప్రయాణం చేయడంలో ఎంత మాధుర్యం ఉందో, మనస్సుకి నచ్చిన వ్యక్తితో జీవితంలో ప్రయాణంలో కూడా అంతే మాధుర్యం ఉంది. కాని ఆ అనుభవం తనకి కలగలేదు. మొదటిసారి అమెరికా వచ్చినప్పుడు మూడు నెలలు, రెండవసారి వచ్చినప్పుడు కవితతో గడిపిన రోజులు ఆహ్లాదంగా గడిచాయి. అంతే అంతకన్నా ఏమీలేదు' అనుకుంటూ కళ్లు మూసుకున్నాడు రమణయ్య.

★ ★ ★

"ఈ రైలు రెండు గంటలు ఆలస్యంగా నడుస్తోంది తెలుసా?" అనడిగాడు ముందర వరసలో కూర్చున్న వ్యక్తి పక్కని ఉన్న స్త్రీతో.

"మనకి రైలు విషయం కొత్తేం కాదు. చాలా రైళ్ళు నిర్ణీత కాలానికి గమ్యం చేరవన్న అపవాదు ఉంది. ఆలస్యం పావు గంట, అరగంట అయితే ఫరవాలేదు. కాని రెండు గంటలు టూమచ్. దీనికి కారణం ఏమిటో? " అంటూ ఆ స్త్రీ పురుషుడిని చుంబించింది.

"రైలుపట్టాలకి దగ్గరగా ఉన్న చెట్లకి నిప్పు అంటుకుందిట. రైలు దానికి సమీపంగా వెళ్ళడం క్షేమకరం కాదని, మంటలు తగ్గుముఖం పట్టేంతవరకు ఆగారుట నిన్న రాత్రి. మనకి తెలియలేదు"

"ఆc ప్రతీదానికి వీళ్ళు అనవసరంగా కంగారుపడతారు"

"అలా అనకు. గత సంవత్సరంలో జరిగిన యాక్సిడెంట్లలో దెబ్బలు తగిలినవాళ్ళకి ఇచ్చిన పరిహారం చాలా ఎక్కువవగా, దేశంలో నడుస్తున్న ఒకేఒక రైలు కంపెనీ నష్టంలో నడుస్తోంది. ప్రభుత్వం సబ్సిడీ ఇస్తోంది కాబట్టి రైళ్లు నడుపుతున్నారు. లేకపోతే అది ఎప్పుడో మూతపడేది. ఏ అవాంతరమూ జరగకుండా మన ఊరు చేరితే అంతే చాలు" ముందర వరసలో జరుగుతున్న సంభాషణ రమణయ్య చెవులకి స్పష్టంగా వినిపిస్తోంది. ఈ లెఖ్ఖని తను న్యూయార్క్ చేరడానికి ఎంత ఆలస్యం అవుతుందో! అనుకుంటూ బయట వెనక్కి పరిగెడుతున్న భూమిని గమనించసాగాడు. అక్టోబర్ మాసం, ఉత్తరంగా ప్రయాణిస్తున్న రైలు వివిధ రకాలైన పొలాలని, కాలవలని, అడవులని దాటి పరిగెడుతోంది. రైలుప్రయాణం అంటే తనకి చాలా ఇష్టం. కొత్త వ్యక్తులతో పరిచయాలు పెంచుకోవడానికి వీలవుతుంది. మనకి నిత్యమూ కనిపించే వ్యక్తులతో వాళ్ళు మనకి తిరిగి కనిపించరని కాబోలు, స్వవిషయాలు చర్చిస్తాం. ఎదురు

బెర్తుమీద ప్రయాణం చేస్తున్న వ్యక్తితో పరిచయం అయ్యాక తినుబండారాలు, పేపర్లు, మేగజైన్లు చేతులు మారతాయి. గత చరిత్ర లేదు కాబట్టి కావేషాలు, కక్షలు లేకపోవడంతో మనస్సులో ఉన్నది బైటకి చెప్పేస్తాం ఇండియాలో. కాని ఈ దేశంలో దాదాపు ఒకరోజు కలిసి ప్రయాణం చేసినా ఎదుటి మనిషి పేరు కూడా సరిగ్గా గుర్తుండి చావదు. నిజానికి ఎదుటిమనిషి అనకూడదు, ముందర వరుసలో కూర్చున్న వ్యక్తులు అనాలి.

రైలు ఏదో స్టేషన్‌లో ఆగింది. ఫ్లాట్‌ఫారంమీద స్టేషన్ పేరు కూడా ప్రస్ఫుటంగా కనిపించడంలేదు. ఆ చిన్న స్టేషన్‌లో వెండింగ్ మెషీన్‌లు తప్ప ఇంకేమీలేవు.

రైలు మోతాదుకి మించి ఆగితే, ఏమయిందోనని ప్రయాణీకులు ఆదుర్దాపడడం మొదలవుతుంటే, రైలు నడవబోతున్న దిశలో వాతావరణం బాగులేదని, అందు చేత పూర్తిగా వాకబుచేసి నిర్ధారణగా ఏమీ ప్రాబ్లెమ్ లేదని తెలిస్తే తప్ప రైలు కదలదన్న ఎనౌన్స్‌మెంట్ వచ్చింది. ప్రయాణీకులు బిలబిలా రైలు పెట్టెలలోంచి కిందకి దిగి ఫ్లాట్‌ఫారంమీద అటూ ఇటూ పచార్లు చేస్తున్నారు.

అరగంట తరువాత ఫ్లాట్‌ఫారంమీద ఉన్న ప్రయాణీకులని పెట్టెలలోనికి ఎక్కమన్న ప్రకటన వచ్చిన ఐదునిమిషాలకి రైలు తిరిగి కదిలింది.

★ ★ ★

"డాడీ! రైలు ప్రయాణం బాగా ఇబ్బందికరంగా జరిగిందా? అనవసరంగా రెండు రోజులు రైలులో ఉన్నారు" అన్నాడు రైలు స్టేషన్‌లో నిలుచుని నిరీక్షిస్తున్న ధనరాజ్.

"నీకు ఎలా తెలుసు. ఈ రైలులోనే వస్తున్నానని? " అనడిగాడు రమణయ్య.

"రైలు కంపెనీవాళ్ళు టెలిఫోన్ చేసి వరదలలో ఇరుక్కుపోయిన ప్రయాణీకుల్ని ఎలా వాళ్ళ గమ్యానికి చేరుస్తున్నారో తెలియపరిచారు. రండి. రైలు కంపెనీవాళ్ళు స్టేషన్‌లో మీ అందరికోసం కాఫీ, టిఫిన్, పళ్లు అమర్చివుంచారు" అన్నాడు ధనరాజ్.

రైలుస్టేషన్‌లో రెండు బ్రెడ్‌ముక్కలు, అరటిపండు తిని కాఫీ తాగాక కారు సీటులో కూర్చుని కారు బెల్ట్ సరిచేసుకోబోతుంటే సీట్‌బెల్ట్ సరిగ్గా ఊడిరావడంలేదు.

"చూడండి డాడీ, బెల్ట్‌ని ఒక్కసారి లాగాలి" అన్నాడు ధనరాజ్ కారుని స్టార్ట్ చేస్తూ. ఆ వాక్యం వినగానే కవిత ఒక్కసారి గుర్తుకు వచ్చింది. బెల్ట్ మెలిక తిరిగి ఉండడంవలన ఊడి రావడంలేదని గ్రహించి దానిని సరిచేసుకున్నాడు రమణయ్య.

"రైలు కంపెనీ వివరాలు చెప్పలేదు. కాని వానలు, మంటలు అంటూ ఏదో వివరించి ఆలస్యమవుతుందన్నారు. కాని నాకు పూర్తిగా అర్థమవలేదు, ఏమైంది డాడీ? " అనడిగాడు ధనరాజ్.

"కొంత దూరంవరకు బాగానే వచ్చాం. మందమైన రైలు కుదుపుకి మంచి నిద్ర పట్టింది. తెల్లవారాక రాత్రి రైలుపట్టాలకి ఇరువైపులా మంటలు చెలరేగుతుంటే నీళ్ళు పోసి వాటిని ఆర్పాక రైలును దాటించారని తెలిసింది. తరువాత వాతావరణం బాగులేదు, బాగులేదు అంటూనే రైలుని ముందరకి నెట్టుకువచ్చారు. కాని ఒకచోట పట్టాల పక్కని ఉన్న కొండలమీదనుంచి బురద జారి పట్టాలమీదకి వచ్చింది. రైలులో దాదాపు నలభైమంది రైల్వే సిబ్బంది పారలతో ఆ బురదని పక్కకితోసి రైలుని నడిపించారు. అక్కడ రెండు గంటలు ఆలస్యమైంది. ఫిలడెల్ఫియాకి దాదాపు రెండువందల యాభైమైళ్లదూరంలో ఉండగా, రైలు వెళ్ళే పట్టాలమీద నీళ్లు పారుతున్నాయని పరిసర ప్రాంతాలలో దట్టంగా వర్షం కురవడంవలన పట్టాలమీద ఉన్న నీటిమట్టం పెరుగుతుందే కాని తగ్గదన్న నిర్ధారణకి వచ్చారు. బిలబిలా అందరమూ రైళ్లలోంచి




దిగాం. ఎయిర్‌కండిషన్ బస్‌లు, వాటిలో టాయిలెట్ సౌకర్యం ఉన్న బస్‌లని తెప్పించి, మమ్మల్ని ఫిలడెల్ఫియా వరకు తీసుకువచ్చారు. తరువాత మరో రైలుకి మారాం. చాలా జాగ్రత్తగా జరిగాయి ఈ పనులన్నీ

నాకు బస్ ప్రయాణం పడదు. రైలులోనే ప్రయాణం చేయగలను అంది ఒకావిడ.

ఆమెని దగ్గరగా ఉన్న హోటల్‌లో తమ ఖర్చులతో ఉంచారు" అన్నాడు రమణయ్య.

"ఎందుకు చెయ్యరు? లేకపోతే వాళ్లమీద దావాలు వచ్చిపడతాయి. టిక్కెట్ అమ్మేట ప్పుడు నూట ఎనభైడాలర్లు పుచ్చుకుని మిమ్మల్ని టెక్సాస్‌నుంచి న్యూయార్క్ సురక్షి తంగా చేర్పిస్తానని ఒప్పందం. అది చేయక పోతే ఇక్కడ లాయర్లు తాట ఒలిచేస్తారు" అన్నాడు ధనరాజ్.

ధనరాజ్‌కి అమెరికా ధోరణి బాగా ఒంట పట్టింది అనుకున్నాడు రమణయ్య మరో సారి.

★ ★ ★

రవళి, ధనరాజ్ ఆఫీసునుంచి తిరిగి వచ్చేవేళయింది. గడియారం ఆరుగంటలు చూపిస్తుంటే ఫ్లాట్ బజర్ మ్రోగగా రమ ణయ్య తలుపుతెరిచాడు. ఎదురుగా ఎవరో ఆగంతకుడు నిలుచున్నాడు. "నా పేరు అవతారం, ధనరాజ్ ఆఫీసునుంచి వచ్చాడా? " అనడిగాడు.

"లేదు, వచ్చేవేళయింది"

"నేను ధనరాజ్ ఆఫీసుకి ఫోన్ చేసిన పుడు, నన్ను ఆరుగంటలకి ఇక్కడకి రమ్మ న్నాడు" అంటూ తన రాకకి కారణాన్ని వివ రించాడు అవతారం.

"రండి... కూర్చోండి" అంటూ దారి తొలి గాడు రమణయ్య. అవతారం బూట్లతో తివాసీమీద నడిచి సోఫాలో కూర్చున్నాడు. తివాసీమీద బయట వాడిన జోళ్లతో నడవ. డమంటే రవళికి సరిపడదు. జోళ్ళు విడిచి రమ్మనమని ఇప్పుడు చెప్పడంలో అర్థంప మిటి? అదీకాక అవతారం ఏమనుకుం టాడో అని సందేహించాడు రమణయ్య.

"మీరు మంచి నీళ్లు తీసుకుంటారా? లేక ఆరంజి జ్యూస్ తాగుతారా!" అనడి గాడు రమణయ్య.

"చల్లని నీళ్ళు"

ఫ్రిజ్‌లోంచి వస్తున్న నీళ్ళని గ్లాసునిండా నింపి అవతారంకి అందిచ్చాడు. తెలియని వ్యక్తితో ఎలా సంభాషణ మొదలుపెట్టాలో స్ఫురించక అవతారంవేపు చూస్తూ రెండు నిమిషాలు గడిపేసరికి, తలుపు తోసుకుని లోపలికి వచ్చిన ధనరాజ్, అవతారంని చూసి, "సారీ కాస్త ఆలస్యమైంది" అంటూ క్షమార్పణ చెప్పాడు "దానిదేముంది? నేను ఇప్పుడే వచ్చాను" అన్నాడు అవతారం.

"ఈయన మా నాన్నగారు, పేరు రమ ణయ్య. ఈయన అవతారంగారు" అంటూ పరిచయం చేసి సోఫాలో అవతారం ఎదు రుగా కూర్చున్నాడు ధనరాజ్. ధనరాజ్ ఏం చెబుతాడా? అని ఎదురుచూస్తున్నాడు అవతారం.

"మా ఆఫీసులో మీ రెస్యూమ్ ఇచ్చాను. పరిశీలిస్తామన్నారు. మీరు మార్కెట్ ఎలా ఉందో చూస్తున్నారుగా. ఒక ఖాళీ ఉందని ప్రకటన వెలువడితే, దానికి సమాధానంగా ఒక్కరోజులో నూరు అప్లికేషన్లు వచ్చిపడు తున్నాయి. అందులో నూటికి తొంభై మన దేశస్తుల దగ్గరనుంచే. విజువల్ బేసిక్, సింపుల్ జావా, ఎ.ఎస్.పిలకి గిరాకీ బాగా పడిపోయింది. వెబ్, ఇంటర్‌నెట్‌కి సంబంధించిన విభాగం పుంజుకోవడానికి ఇంకా ఎంతకాలం పడుతుంది? తిరిగి అది తన పాత దశకి వెళ్తుందా? అన్నదాని గురించి ఎవ్వరూ చెప్పలేరు. ఎడ్వాన్స్‌డ్ జావా చేసి దానిలో చాలా అనుభవం ఉంది కాబట్టి నా ఉద్యోగం నిలిచి ఉంది ప్రస్తుతానికి. రేపటి సంగతి ఏమో! మా ఆఫీసులో కనిపించిన స్పందన బట్టి చూస్తే, మీకు ఈ కంపెనీలో ఉద్యోగం వచ్చే అవ

కాశం తక్కువ. ఏ సంగతీ రెండుమూడు రోజులలో నికరంగా తెలుస్తుంది" అన్నాడు ధనరాజ్.

"నాకు తెలుసు ఈ రాస్కెల్స్‌కి మన మంటే చిన్నచూపు. ప్రాంతీయులనే తీసుకుంటారు. ఇక్కడ జాతి, మత, లింగ వయోవిచక్షణ లేదని పెద్దపెద్ద డాంబికాలు పలుకుతారు కాని నిజం వేరు. మొన్న ఒక కంపెనీకి ఇంటర్వ్యూకి వెళ్లాను. లంచ్ కలిసి చేస్తున్నాం. నన్ను ఇంటర్వ్యూ చేస్తున్న వ్యక్తి, 'మా ప్రోజెక్ట్ చాలా తొందరలో ముగించేయాలి. వారానికి దాదాపు డెబ్భైయి గంటలు పని ఉంటుంది. మీకు కుటుంబం, ఇతర బాధ్యతలు ఉంటాయి. అంతకాలం ఆఫీసులో ఏకాగ్రతతో పనిచేయడం వీలవుతుందా?' అన్నాడు. "ఫరవాలేదు, నే చేస్తాను" అన్నాను. ఐనప్పటికీ అతనికి నమ్మకం కుదరలేదు. అతని ఉద్దేశ్యంలో ఏ బాదరబందీ లేని బ్రహ్మచారులు, ఆఫీసులో పడికాపులు కాస్తారని, నాలాంటి వ్యక్తికి అది అసంభవమని, యువకులని వేసుకుంటే మంచిదని అభిప్రాయం. ఇది విచక్షణ అని వాళ్ళని కోర్టుకు ఈడ్చేవాడినే కాని దానికి డబ్బు కావాలి. అదీకాక నా వీసా కాలపరిమితి అయిపోవచ్చింది. అదొక అదనపు ఇబ్బంది. అందుకే ఊరుకున్నాను. రాస్కెల్స్" అంటూ అవతారం మండిపడ్డాడు. అవతారం వయస్సు బహుశా నలభై ఐదు నలభై ఎనిమిది మధ్య ఉండవచ్చు బలంగా దారుఢ్యంగా ఉన్నా, మొహంలో దీనత్వం ప్రదర్శితమవుతోంది. "నేను రెండురోజుల తరువాత ఫోన్‌చేస్తాను. ఒక వేళ నే మరచిపోతే మీరు ఫోన్ చేయండి. అప్పటికి పరిస్థితి పూర్తిగా అర్థమవుతుంది. నాకు తెలిసిన ఇతరులకి మీ రెస్యూమ్ పంపిస్తాను" అని ధనరాజ్ అంటే, "అలాగే" అంటూ అవతారం బైటకి వెళ్ళబోతుంటే, రవళి లోపలికి వచ్చి అవతారం బూట్లతో తివాసీమీద నడవడం చూసింది. అతను వెళ్లాక, "బూట్లువేసుకుని కార్పెట్ మీద నడిచి వెళ్ళడం నాకు ఇష్టంలేదని నీకు తెలుసుగా, మరి అతనికి ఎందుకు చెప్పలేదు, ఐ హేటిట్" అంది రవళి.

"నే వచ్చినప్పటికే అతను సోఫాలో కూర్చుని ఉన్నాడు. నేను గమనించలేదు" అన్నాడు ధనరాజ్.

"ఎవరతను?"

"అవతారం అని ఒక ఎలక్ట్రికల్ ఇంజనీర్. ఇండియానుంచి ఈమధ్యనే ఈ దేశం వచ్చాడు. మా కంపెనీలో ఒక ఖాళీ ఉందని తెలిసి తన రెస్యూమ్ పంపాడు. ఉద్యోగ అవకాశాలు ఏమైనా ఉన్నాయా? అని నన్ను కనుక్కోమన్నాడు" అంటూ అవతారం గురించి క్లుప్తంగా వివరించాడు.

"ఈవయస్సులో ఈ దేశం వలసరావడమేమిటి? స్టుపిడిటీ. అతనికి ఎవరు ఉద్యోగం ఇస్తారు?"

"ఏమో! ఎవరి అదృష్టం ఎలా ఉందో ఎవరు చెప్పగలరు? అతనిని ఈ దేశం రావడానికి ప్రోద్భలపరిచే కారణాల గురించి తెలియకుండా మనం ఊహించకూడదు. మనకి తెలిసినా, అవి అల్పంగా తోచవచ్చు ఈదేశం రావడమో, మానివేయడమో అది అతని నిర్ణయం" అంటూ ధనరాజ్ అవతారంని సమర్థించాడు.

"నేను రాత్రి సుష్మా ఇంటికి డిన్నర్‌కి వస్తానని చెప్పాను. స్నానంచేసి బయలుదేరి వెళ్ళాలి" అంటూ రవళి తయారవడానికి లోపలికి వెళ్ళింది. అరగంటలో తయారయి బైటకి వెళ్ళబోతుంటే,

"మరి మా మాటేమిటీ" అనడిగాడు ధనరాజ్.

"మీకు ఇష్టమైనది చేయవచ్చు. బైటకి వెళ్ళి తినవచ్చు పీజా ఆర్డర్ చేయవచ్చు లేదా వంట వండితే రేపటికి ఆఫీసులో లంచ్‌కి పనికివస్తుంది" అంటూ బైటకి వెళ్ళింది.

ధనరాజ్, రమణయ్యలు ఒకరిమొహాలు ఇంకొకరు చూసుకున్నారు.

"డాడీ, రిఫ్రిజిరేటర్‌లో కూరలు, అన్నం వగైరా ఉన్నాయి. నీకు ఎప్పుడు ఆకలయితే అప్పుడు చెప్పు, మైక్రోవేవ్‌లో వేడిచేసుకుని తినేద్దాం, ఏమంటావ్? లేక బైటకి వెళ్దామంటావా? " అనడిగాడు ధనరాజ్.

"బైటకి వెళ్ళడం ఎందుకు, నువ్వు చెప్పినట్లే చేద్దాం. ఇప్పుడు ఆకలిగా లేదు. రవళితో అవతారం గురించి నువ్వు చెప్పిన దానికన్నా నీకు ఇతర విషయాలు బాగా తెలుసు. అతని గురించి చెప్పాక మనం అన్నం తిందాం" అన్నాడు రమణయ్య.

"నేను కన్సల్టెంట్‌గా తిరుగుతున్నపుడు అవతారంతో పరిచయం అయింది. అయింది అనేకంటే నేనే చేసుకున్నాను అనడం కరక్ట్. అది దాదాపు ఎనిమిది తొమ్మిది నెలలక్రితం. సేన్‌హోస్‌లో ఒక కంపెనీలో పనికి వెళ్ళినపుడు అతనిని కేఫ టీరియాలో చూసేను. ఎవరితోనూ కలవకుండా ఒక్కడే కూర్చుని లంచ్ తింటుంటే, అతనికి ఎదురుగా ఉన్న ఖాళీలో కూర్చున్నాను లంచ్‌ట్రేతో. నన్ను నేను పరిచయం చేసుకున్నాను. మా ఇద్దరి మధ్య ఉన్న వయోబేధం వలన కాబోలు, లేక ఇంకే ఇతర కారణాలవలనో, అతనితో సంభాషణ అంతా పొడిపొడి మాటలలో జరిగింది. మర్నాడు, మూడవనాడు అదే ప్రదేశంలో ఒంటరిగా కూర్చుని లంచ్ చేయడం చూసి ఆశ్చర్యపడుతూనే అతనికి ఎదురుగా కూర్చుని ప్రశ్నలు వేస్తూ లంచ్ తిన్నాను. మెల్లిగా అతని మాటల ధోరణిమారినా, అతనిలో స్వతహాగా గడ్డకట్టి పేరుకుపోయి ఉన్న అహం మాత్రం తరచూ ప్రదర్శితమయేది.

"మా ఇంజనీరింగ్ కాలేజీలో నాది ఫస్ట్ రాంక్. నేను ఇండియాలో, హైదరాబాదు హెవీ ఎలక్ట్రికల్స్ ఆర్గనైజేషన్‌లో పనిచేశాను. చాలా సీనియర్ పొజిషన్‌లో పదేళ్లు ఉన్నాను. నా కింద వందమంది ఉద్యోగులు పనిచేసేవారు. ఆ పదేళ్లలో ఒక్కడంటే ఒక్కడు, ధైర్యంగా నా ఎదుట నిలబడి నా టెక్నికల్ నాలెడ్జ్‌ని ప్రశ్నించలేదు. ఎవడైనా ప్రశ్నిస్తే, వాడికి ఏమీరాదన్న సంగతి నిరూపించి, అందరికీ అది తెలియ చెప్పే వాడిని. అలాంటి నన్ను పిలిచి, ఈ వెధవ నే రాసిన కోడ్ సరిగ్గా లేదంటాడా? " అన్నాడు మూడవరోజున లంచ్ తింటున్న సమయంలో.

నేనేమీ మాటలాడకుండా అతను చెప్పినది వింటున్నాను.

"వీడు ఒక బచ్చాగాడు. కేవలం కంప్యూటర్ సైన్స్ ఉన్నంత మాత్రాన వాడికే ఎక్కువ తెలియనవసరంలేదు. బోడి కంప్యూటర్ సైన్స్ డిగ్రీ కావాలంటే రెండు మూడు సెమిస్టర్లలో పూర్తిచేయగలను. అసలు వాడికి నేనంటే భయం. నే వాడికన్నా ప్రతిభ ఉన్న వాడినని అతనిపై మేనేజర్లకి తెలిస్తే, అతని ఉద్యోగానికి ఎసరు పుడుతుందని నన్ను అణచిపెట్టి, నాకు రాదన్నట్లు ప్రదర్శిస్తాడు పుండాకోర్! ఉండండి, వీడి పనిపడతాను"అన్నాడు అవతారం. అతని మాటలు భయంకరంగా ఉన్నా పై అధికారితో అందరి ఎదుటా బాహాటంగా దెబ్బలాటకి దిగేలా ఉన్నాడనిపించింది.

"మీరు అనవసరంగా మిమ్మల్ని ఇబ్బందులలో పెట్టుకుంటున్నారు. మీరు మీ ప్రతిభని చేతలలో చూపించండి. అంతేకాని డైరక్ట్‌గా అతనితో దెబ్బలాటకి దిగకండి. తన కన్నా ప్రతిభ ఎక్కువ ఉన్న వ్యక్తి, తనకింద పనిచేయడం ఎవ్వరూ ఇక్కడ ఇష్టపడరు. కాని మీరు ఘర్షణకి దిగితే, మీరే నష్టపోతారు. ప్రతీ మూడునెలలకీ, మీ ప్రోగ్రెస్ గురించి అతను అంతరంగిక రిపోర్ట్ రాసి ఉంచుతాడు జాగ్రత్త" అన్నాను ఊరుకోలేక.

"నేను అంతా కనిపెడుతూనే ఉన్నాను. వాడు ఆఫీసుకి వచ్చి తన గర్ల్‌ఫ్రెండ్‌తో



గంటలతరపడి మాటలాడడం అదీ నేను రికార్డ్ చేస్తున్నాను. అతను ఆఫీసు కాలాన్ని సరిగ్గా వినియోగించడంలేదన్న సంగతి నేను ఘంటాపథంగా నిరూపించగలను. ఒకసారి ఇండియాలో ఏమైంది తెలుసా? హైదరాబాదులో ఇలాగే నా బాస్ నన్ను దెబ్బతీయబోతే, అతనిదే తప్పని రుజువు చేసి అతని ఉద్యోగం పోయేంత పనిచేశాను. తోకముడుచుకుని వెళ్లాడు. ఆఫ్టరాల్ వీడెంత?" అన్నాడు అవతారం తన సహజ దర్పంతో.

నాకు ఏం చెప్పాలో తెలియలేదు. హైదరాబాదులో స్థిరమైన ప్రభుత్వ ఉద్యోగాలకి, హెచ్ వీసామీద ఉంటూ, కంపెనీలో మేనేజర్ దయాదాక్షిణ్యాలపైన ఆధారపడిన టెంపరరీ ఉద్యోగ పరిస్థితికీ చాలా తేడా ఉందని చూచాయగా చెప్పినా అవతారం వినిపించుకోలేదు. సరికదా "ఈ దేశంలో క్వాలిఫికేషన్ పనిచేసేతీరు అని, దానికే విలువ ఇస్తారని, ఇతర వాటికి ప్రాధాన్యత చాలా తక్కువని మీరందరూ అంటుంటారు కదా? " అంటూ లంచ్‌ప్లేట్‌ని గిరవాటేయడానికి లేచాడు అవతారం.

అవతారం మాటల్ని అమాయకత్వం అనుకుని జాలిపడాలా? తనకే అన్నీ తెలుసు నన్న అహం భావాన్ని చూసి గర్హించాలా?

ఏ అవాంతరమూ జరగకుండా ఆ వారం గడిచి శుక్రవారం వచ్చింది.

"మీరు హాలీడే ఇన్‌లో ఉంటున్నారుట కదా? రాత్రికి మా ఇంటికి డిన్నర్‌కి రండి"

అంటూ తన ఎడ్రస్ అందిచ్చాడు అవతారం.

నిర్ణీత సమయం సాయంకాలం ఏడు గంటలకి, అతని ఎపార్ట్‌మెంట్ తలుపు తట్టేను. లోపల ఏదో వాగ్వాదం జరుగుతోంది. డోర్ బెల్ శబ్దం విని కాబోలు, లోపల వాగ్వాదం సద్దుమణిగింది. అవతారం తలుపు తెరచి, "రండి" అంటూ లోపలికి ఆహ్వానించాడు. జోళ్ళని తలుపు దగ్గరే వదిలి సోఫాలో సర్దుకున్నాను. వాళ్ళు ఉంటున్నది రెండు బెడ్రూంలున్న అపార్ట్‌మెంట్. శుభ్రంగా ఉంది అపార్ట్‌మెంట్. పరదాల హుక్స్ ఊడిపోకుండా కిటికీలని పూర్తిగా కప్పి ఉంచేయి. దుమ్ము, చిత్తుకాగితాలు లేకుండా, మరకలు కనిపించని కాఫీ రంగు తివాసీ నీట్‌గా ఉంది.

"నా భార్య సరళ" అంటూ అవతారం భార్యని పరిచయం చేశాడు.

"నమస్కారం" అంది సరళ.

"నమస్కారం, మీ అపార్ట్‌మెంట్‌ని మీరు చాలా నీట్‌గా ఉంచారు" అన్నాను నేను సంభాషణ మొదలుపెడుతూ.

"గత ఇరవై ఏళ్ళలో ఆ మాట ఆయన చేత ఒక్కసారీ నేను అనిపించలేకపోయాను" అంది సరళ నవ్వుతూ. అవతారం ఏదో అనబోయి విరమించుకుని,

"సాఫ్ట్ డ్రింకే తాగుతారా? లేక లిక్కర్ ఇచ్చేదా? " అనడిగాడు అవతారం.

"ఆరెంజ్ జ్యూస్ ఇవ్వండి" అన్నాను నేను. సరళవేపు చూశాడు అవతారం. సరళ లేచి రిఫ్రిజిరేటర్‌లోంచి ఆరెంజ్ జ్యూస్ రెండు గ్లాసులతో తీసుకువచ్చి టేబుల్‌మీద ట్రేలో ఉంచి ఒకటి నాకు అందించింది. రెండవది ఎవరికోసమో అర్థమవలేదు. అవతారం లేచి రిఫ్రిజిరేటర్‌వేపు వెళ్తుంటే, "నిన్ననే పుచ్చుకున్నారు. ఈ వేళ పుచ్చుకోనని మాటిచ్చారు. దానిజోలికి వెళ్ళకండి" అంది సరళ. ఆమె మాటల్ని చెవికెక్కించుకోకుండా, రిఫ్రిజిరేటర్ తెరచి బీర్ కేన్ తెచ్చుకుని, "వెధవ బీర్‌కే ఇంత రాద్ధాంతం చేస్తున్నావేమిటి? అసలు బీర్ ఒంటికి మంచిదంటారు తెలుసా? " అంటూ నావేపు తిరిగాడు.

నాకంటే దాదాపు ఇరవై ఏళ్ళు ఎక్కువ ఉన్న వ్యక్తికి నేను ఏం సలహా ఇవ్వగలను? అలా అని అతని భార్య ఆక్రోశాన్ని ఎలా ఉపేక్షించగలను. కుడితిలో పడిన




# ఏరిన ముత్యాలు

★ స్ఫటికం తనకు చేరువలో వున్న వస్తువు రంగును పొందినట్లే మన హృదయంలో రేకెత్తే భావాలకు మన ముఖం అద్దం పడుతుంది.

–తిరువళ్ళువర్

★ మనతో ఎల్లప్పుడు తన లోగొంతుకతో మాట్లాడే అంతర్వాణిని వినడంలోనే నిశ్శబ్దం యొక్క రహస్యం దాగిఉంది.

–గాంధీజీ

★ ప్రకృతిలో బహుమతులు లేవు. దండనలూ లేవు. ఉన్నవన్నీ ఫలితాలే.

–ఆర్.జి. ఇంగర్‌సాల్

★ నీరు తానున్న పాత్ర ఆకారాన్ని పొందినట్లే బుద్ధిమంతుడు పరిస్థితులకు అనుగుణంగా నడుచుకుంటాడు.

–చైనా సామెత

★ మనందరిలో అశాంతి గూడుకట్టుకుని వున్నందువల్ల బయట కూడా ఈ అశాంతి తాండవిస్తోంది.

–జె. కృష్ణమూర్తి

★ ప్రపంచంలో శాంతి విరజిల్లాలి. అది నాతోనే ప్రారంభం కావాలి.

–నిక్సన్

★ కొత్త మనిషితో పరిచయం చేసుకోని ప్రతి రోజును నేను వృధాగా గడిపిన రోజుగా భావిస్తాను.

–శామ్యూల్ జాన్సన్

★ దేశసంపదకంటే కూడా దేశప్రజల ఆరోగ్యం ఎంతో ముఖ్యమైనది.

–విల్. డ్యూరాంట్

★ ఆశ, భయం, కోపం ఈ మూడింటినీ త్యజించినవాడే స్వతంత్రుడు.

–భగవద్గీత

★ తాము అతిముఖ్యమైన వ్యక్తులుగా ఉండాలని చాలామంది అనుకోవడంవల్లనే ఈ ప్రపంచం ఎన్నో సమస్యలను ఎదుర్కొంటోంది.

–టి.ఎస్. ఎలియట్

★ మనది అతితక్కువ తెలివితో కూడి ఉన్న యుగం. మనకు ఎంతో తెలుసు. కానీ మన స్పందన అతిస్వల్పం.

–డి. హెచ్.లారెన్స్

★ పొగిడేవాడు తెగడడు అనుకోకు.

–మీరా వలిబాబా

సేకరణ: పి.వి.రమణకుమార్

ఎలకలా ఉంది నా పరిస్థితి. అదృష్టవ శాత్తూ నేను నోరు విప్పేలోగా, సరళ సంభాషణ కొనసాగించింది.

"ఇక్కడ మీరు ఒక్కరే కాబట్టి ఫరవా లేదు. ఈయన బీరు తాగుతున్నందుకు కాదు నా బాధ మోతాదుకిమించి ఈయన తాగితే, మత్తులో అందర్నీ తిట్టడం మొద లుపెడతారు, అది నా భయం" అంది సరళ.

"నేనా? తాగేక తిట్టడమా? నాటెటాల్" అన్నాడు అవతారం వెంటనే. కాని ఆ వాక్యాలలో బలంలేదని స్పష్టంగా తెలు స్తోంది.

"మీరు నాకు తమ్ముడు లాంటివారు. అబద్ధం చెప్పవలసిన అవసరంలేదు. ఒక సారి పార్టీలో బాగా పట్టించేక అందర్నీ తిట్టి ఏకరువులు పెడుతుంటూనే ఆయన ఉద్యోగం ఊడినంత పనయింది. మనకి ఉన్న తాహతు, పరిధి మనకి తెలియకపోతే అనర్థాలు జరుగుతాయి. ఇలాంటి చిక్కులు తప్పవు, అది ఆయన ఒప్పుకోరు" అంది సరళ.

"ఆ ఆడంగి వెధవ నన్ను ఎదుర్కోలేక వెన్నుపోటు పొడిచేడు. కంపెనీలో అంద రికీ తెలుసు ఎవరు ఎలాంటి వాళ్లో. ఎందరో నా దగ్గరకి వచ్చి మంచి పని చేసే నని నన్నభినందించేరు తెలుసా? మరి దాని సంగతి చెప్పవేం?" అనడిగాడు అవ తారం.

"అవును, వాళ్ళదేంపోయె? వాళ్ళకి తెలుసు మీకు ముఖప్రీతి మాటలు ఇష్ట మని. మిమ్మల్ని ఇంద్రుడు, చంద్రుడు అని పొగడగానే మీరు నిజంగా ఇంద్రుడనని, చంద్రుడనని అనేలా ప్రవర్తిస్తారు. నిజం చెప్పిన వాళ్ళని తిడతారు. దూరంగా నిల బడి, మిమ్మల్ని ఉసిగొలిపి వాళ్ళు వింత చూస్తారు" అంది సరళ.

"ఇంక ఆపు నీసోది" అంటూ కసిరేడు అవతారం. ఆ వాగ్వాదం అక్కడితో ఆగింది.

"ఎన్నాళ్లయింది మీరు ఈదేశం వచ్చి? మీ పిల్లలు ఇండియాలో ఎక్కడ చదువుకుం టున్నారు?" అనడిగాను.

"ఈ దేశం వచ్చి దాదాపు ఏడు నెలల యింది. రావడం తిన్నగా చికాగోకి వచ్చాను. అక్కడ రెండు నెలల కాంట్రాక్ట్ పని ముగిసాక, ఇక్కడ ఆరునెలల కాంట్రాక్ట్. మీకు తెలియనిదేముంది ఈ భాగోతం. కంపెనీవాడి దగ్గర ఏజెంట్ రూపాయి గుంజి మనకి పావలా చేతిలో పెడతాడు. కాని మనకి అంతకన్నా గత్యం తరంలేదు. చూస్తున్నాను, ఈ ఏజెంట్ దగ్గ రనుంచి ఇంకో ఏజెంట్ దగ్గరకి మారిపోదా మని, లేదా తిన్నగా కంపెనీలకే పనిచేద్దా మని. నాకు తెలుసు, ప్రస్తుతం నేను పని చేస్తున్న ఏజెంట్ నన్ను అంత సులభంగా వదలడని" అన్నాడు అవతారం.

"నాకు తెలుసు, నాకు తెలుసు" అన్న నమ్మకం ఉన్నవాళ్ళకి మనం చెప్పగలిగేదే ముంది? అందులో ఇది అమెరికా దేశం. తల్లితండ్రులే తమ పిల్లలకి సలహాలు ఇవ్వరు, అతనికి నేను సలహా ఇవ్వడం ఏమిటి? అనుకుని ఆ ప్రయత్నం విరమిం చాను.

సరళగారు చేసిన వంటకాలు బాగా రుచి కరంగా ఉండడంతో, కడుపు బరువు అని పించి, తొందరగా లేచి హోటల్‌కి వచ్చే శాను. తరువాత మరికొన్ని వివరాలు అవ తారం గురించి తెలిశాయి" అంటూ ఆగాడు ధనరాజ్.

"ఇందాక రవళి అన్నట్లు యవ్వనం దాటాక ఈ దేశం వలస రావడంలో చాలా ఇబ్బందులు ఉన్నట్లున్నాయి" అన్నాడు రమ ణయ్య.

"మధ్యవయస్సులో వస్తే అటుకీ చెందరు, ఇటుకీ చెందరు కాబోలు" అన్నాడు రమ ణయ్య మళ్లీ. ధనరాజ్ తిరిగి అందుకు న్నాడు.





"అవతారం దాదాపు ఇరవైఏళ్ళు కంపెనీలో పనిచేసి వాలంటరీ రిటైర్‌మెంట్ తీసుకున్నాడు. కంపెనీలో అతనికి స్నేహితులులేరు. బయటా అంతే. అడపాతడపా కంప్యూటర్‌కి సంబంధించిన కోర్సులు చదివాడు. ఇండియాలో ఇద్దరు పిల్లలు. ఒక మగపిల్లవాడు, ఒక ఆడపిల్ల. కొడుకు ఇంజనీరింగ్ చదువుతున్నాడు. ఆడపిల్ల పదకొండవ తరగతిలో ఉంది. అక్కడ అతనికి వచ్చే పెన్షన్, ప్రావిడెంట్‌ఫండ్‌లో ఉన్న డబ్బుతో పిల్లల చదువులు వెళ్తున్నాయి. రిటైర్ అయేక హైదరాబాద్‌లో చేరిన ఆరు నెలల కోర్సులకి, ఇతర ఖర్చులకి, ఈదేశం రావడానికి ఏజెంట్‌కి ఇచ్చిన లక్షన్నర, టిక్కట్ వగైరా ఖర్చులకి మొత్తం నాలుగున్నర లక్షలు ఖర్చు అయిపోయాయి. ఇక్కడ కంపెనీలకి కాంట్రాక్ట్ వర్కర్స్‌ని పెట్టుకోవడంలో చాలా సౌఖ్యం ఉంది. వాళ్లని ఉపయోగించుకోవడానికి ఎక్కువ ఖర్చుఅయినా, అఖ్ఖర్లేనపుడు కాంట్రాక్ట్ వర్కర్లని ఇంటికి పంపించేయవచ్చు. వాళ్లతో ఇతర లావాదేవీలు ఏమీ ఉండవు. అవతారం కాంట్రాక్ట్ ఉద్యోగం ముగిసి నాలుగు వారాలయింది. కాస్సేపు మాటలాడితే ఎవరికైనా అవతారం మనస్తత్వం ఇట్టే తెలుస్తుంది. ఇక్కడ ఉన్న ఏజెంట్ తన గురించి ఉద్యోగప్రయత్నం సరిగ్గా చేయడం లేదని అతనిమీద విరుచుకుపడడంతో, ఏజెంట్‌కి అవతారం అంటే సద్భావంలేదు. అదీకాక అవతారం క్వాలిఫికేషన్లు అంతంతమాత్రమే. ఉద్యోగాలు పోయినవాళ్ళు మార్కెట్‌లో పుష్కలంగా ఉండడంవలన ప్రతీ ఉద్యోగానికీ చెప్పలేనంత కాంపిటీషన్. మాటామాటా పెరిగి, నువ్వెంత? అంటే నువ్వెంత? అని ఏజెంట్, అవతారం ఘర్షణపడడంతో, ఆ ఏజెంట్ అవతారం విషయంలో చేతులు దులుపుకున్నాడు. అవతారంకి త్వరలో ఉద్యోగం రాకపోతే, చిక్కులలో పడతాడు. నే చేస్తున్న కంపెనీలో అతనికి ఉద్యోగం రాదు. ఇప్పటివరకు ఆర్జించి నిలవచేసుకున్న దాదాపు ఇరవైవేల డాలర్లు పట్టుకుని అతను ఇండియా వెళ్ళడం శ్రేయస్కరం. కాని అది అతనికి ఏమాత్రం ఇష్టంలేదు. అది తన పరువుకి గొడ్డలిపెట్టు అన్నాడు. ఇదివరలో ఏజెంట్లు, "నాకు పని చేస్తావా?" "నాకు పనిచేస్తావా?" అంటూ ఇండియానుంచి వచ్చిన కుర్రవాళ్ళమీద పడేవారు. ఇప్పుడు ఉద్యోగం ఊడిన హెచ్ వీసా ఉన్న వాళ్ళు, హెచ్ వీసా నిలుపుకోవడంకోసం ఈ ఏజెంట్లవెంబడి తిరుగుతున్నారు. రోజులు మారాయి, ఓడలు బండ్లు అయ్యాయి.

"నాకు నువ్వు డబ్బు ఇవ్వనఖ్ఖరలేదు. నీ కంపెనీలో పనిచేస్తున్నానని, నువ్వు డబ్బు ఇస్తున్నానని రాసి ఇస్తే చాలు. నువ్వు ఇస్తున్నానన్న డబ్బు నీ దగ్గరే ఉంచుకో" అన్నారు కొన్నాళ్ళు. ఇప్పుడిప్పుడు అలా కాగితం రాసి ఇవ్వడానికీ గిరాకీ పెరగడంతో, దిక్కుతోచక అయోమయంగా తిరుగుతున్న వాళ్ళు తిరిగి డబ్బు ఇస్తే కాని, "ఉద్యోగంలో ఉన్నావన్న" కాగితాన్ని ఇవ్వడంలేదు. ఇది బైటకి పొక్కదు. పొక్కితే ఇమ్మిగ్రేషన్ వాళ్ళు, ఇది మోసం అని నిర్ణయించి జైలులో పెట్టేస్తారు లేదా డిపోర్ట్ చేస్తారు. కొందరు ఏజెంట్లు నెలకి రెండు వందల ఏభై అని, మరికొందరు నాలుగు వందల డాలర్లు అడుగుతున్నారని వింటున్నాం. "డిమాండ్" అండ్ "సప్లయ్" ఈ దేశం అంతే" అంటూ 'అవతారం' కథ ముగించాడు ధనరాజ్.

"అతని భార్య సరళకి చిన్న ఉద్యోగం దొరుకుతుందేమో" అన్నాడు రమణయ్య.

"ఆమె పనిచేయడానికి వీసా అనుమతించదు, అవతారం భార్యని ఇండియా తిరిగి పంపించే ఆలోచనలో ఉన్నాడు. దానివలన ఇక్కడ ఖర్చు తగ్గుతుందని అతని నమ్మకం" అన్నాడు ధనరాజ్.

"పేపర్లలో ఇక్కడ మార్కెట్ తిరిగి

పుంజుకోవడానికి చాలాకాలం పడ్తుందని రాశారు. అవతారంకి ఆ సంగతి తెలియదా? ఇక్కడ ఉద్యోగం లేకుండా కూర్చుని తింటే ఉన్నది కాస్తా కర్పూరహారతి అయిపోదూ?" అనడిగాడు రమణయ్య.

"ఆ సంగతి ఆయనకి తెలియకేం, కాని తను దానికి అతీతుడనని కొంత, ఇండియా వెళ్తే తనని చూసి అందరూ చెవులు కొరుక్కుంటారని, ప్రెస్టేజ్ పోతుందన్న భయం వలన మరికొంత కలిసి, ఆయన కళ్ళకి గంతలు కట్టేశాయి. ఉద్యోగం లేకపోతే ఇన్సూరెన్స్ ఉండదు. ఏజెంట్ ఇన్సూరెన్స్ విషయంలో ఏమీ సహాయం చేయడు. అతను కాని, సరళకాని జబ్బుపడితే స్వంత డబ్బుతో వైద్యం చేయించుకోవాల్సిందే. అన్నం, కూరలు వేడి చేస్తాను" అంటూ ధనరాజ్ లేచాడు. రమణయ్య ఒంటరిగా మిగలడంతో యధాప్రకారం మెదడు ఆలోచించడం మొదలుపెట్టింది.

అవతారం ఎలాగూ ఊబిలో ఇరుక్కుపోయాడు కాని తనతోపాటు భార్య, పిల్లల్ని దానిలోనికి లాక్కెళ్ళకుండా ఉంటే బాగుండును.

రమణయ్యకి పాత వేమన పద్యం "అనువు కానిచోట..." జ్ఞాపకానికి వచ్చింది. ఇండియాలో అవతారం డబాయించుకుంటూ అక్కడ పరిస్థితులతో మొరటుగా నెగ్గుకువచ్చినా, క్వాలిఫికేషన్లు లేనిచోట, అహం ప్రదర్శిస్తే, అది బెడిసికొట్టడం ఖాయం, మంచి ఫలితాలని ఇవ్వదు. ధనరాజ్‌లాంటి వాళ్ళు నలుగురైదుగురు నచ్చచెప్పి, అవతారంని ఇండియా పంపగలిగితే బాగుండును" అనిపించింది.

"నాన్నా, అన్నం తిందాం రండి" అన్న ధనరాజ్ పిలుపు వినపడింది. వంటింటిలోకి దారి తీశాడు రమణయ్య.

ధనరాజ్ అపార్ట్‌మెంట్ క్వీన్స్‌లో మధ్యగా ఉండడంతో అప్పుడప్పుడు పిచ్చాపాటీకి కొందరు అక్కడకి చేరుకుంటారు. వచ్చేటప్పుడు సమోసాలు లేక మిక్శ్చర్ తెస్తారు. అవి తింటూ కబుర్లలో పడితే గంటలు గడిచిపోతాయి. ధనరాజ్, రవళి లకి ఇలాంటి కలవడం అంటే ఇష్టం. యధాప్రకారం శనివారం మధ్యాహ్నం కూటమి సమావేశమయింది.

"ఒకసారి ఉద్యోగంలో చేరితే, మరోచోటుకి మారడం అంటూ జరిగేది కాదు, అనేవారు మా డేడీ" అన్నాడు దాదాపు ఒక ముప్ఫయిమూడేళ్ళున్నవ్యక్తి రిమ్‌లెస్ కళ్లద్దాలని తీసి కళ్ళని రుమాలుతో ఒత్తుకుంటూ. ఒకప్పుడు శుభ్రంగా ఉండేదనిపించే అతని జుత్తు సంస్కారంలేక చిందరవందరగా నలిగి ఉంది. పలచపడిన జుత్తు కింద తెల్లని మాడు అకాలంలో రాబోతున్న బట్టతలని ప్రదర్శిస్తోంది. జీన్స్‌పేంట్ మీద వేసుకున్న చారల టీషర్ట్, పేంట్ లోపలికి దోపినా, ఒక వరుస లేకుండా ఎగుడుదిగుడుగా ఉంది. రమణయ్యకి కొత్త వ్యక్తుల పేర్లు ఒకంతట గుర్తుండి చావవు. అతని పేరు రామమూర్తి కాబోలు, ఎదుట వ్యక్తి అదే పేరుతో సంభోదించినట్లు జ్ఞాపకం. రామమూర్తికి ఎదురుగా కూర్చున్న వ్యక్తి వాలకం అదే దశలో ఉన్నా అతని మొహంలో దీనత్వం, రామమూర్తి మొహం లోలా ప్రస్ఫుటంగా కానరావడంలేదు. ఆ వ్యక్తికి యవ్వనపు ఛాయలు కదలివెళ్ళి చాలాకాలం గడిచి, జీవితంలో ఒడిదుడుకులని తట్టుకున్నాక ఒకరకమైన గంభీరత్వాన్ని ఆపాదించుకోవడంవలన విషాద ఛాయలు అలుముకున్నా, బైటకి ప్రదర్శనమవడం లేదు. దాదాపు ఏభైఏడేళ్ళు ఉంటాయేమో, అనిపించింది రమణయ్యకి. ఆ వ్యక్తిని అందరూ రావ్ అని సంభోదిస్తున్నారు.

"అవును ఆ రోజుల్లో ఏదో ఒక ఉద్యోగంలో చేరి దానినే నాబొందో అని అంటిపెట్టుకుని జీవితాన్ని నెట్టేవారు. అవకాశాలు తక్కువ కావడం అందుకు ముఖ్యకారణం.




ఈ రోజుల్లో అక్కడా పరిస్థితులు మారేయి. పుట్టిపెరిగిన ఊర్లనుంచి, తల్లితండ్రులకి దూరంగా, ఎక్కడ జీవితం, సౌకర్యాలు లభిస్తే అక్కడకి వలసవెళ్ళడం సామాన్య మౌతోంది" అన్నాడు రావ్.

"రావుగారూ, మీరన్నది నిజమే. కాని మనుష్యులు ఒకచోట నుంచి ఇంకోచోటకి మారడం, తమకితామే నిర్ణయించుకుని, బేరీజువేసుకుని చేస్తున్నారు. బలవంతంవలన కాదు, ఈ దగుల్బాజీ దేశంలో ఏ ఉద్యోగమూ శాశ్వతం కాదు" అన్నాడు రామమూర్తి.

"నువ్వు పొరపడ్డావు. సుప్రీంకోర్టు ఉద్యోగాలు జీవితాంతం ఖాయం. ప్రొఫెసర్లుగా ఆరేళ్ళు యూనివర్సిటీలో పనిచేశాక, వాళ్ళకి నచ్చి ఇన్స్యూర్ ఇస్తే, తరువాత జీవితాంతం వాళ్ళు ఎన్నాళ్ళు కావాలంటే అన్నాళ్ళు పని చేయవచ్చు"

"నిజం?"

"నిజం"

"వాళ్ళ మాటకేం కాని మన సంగతి ఏమిటి? శుక్రవారం వస్తోందంటే ఒళ్ళంతా చలిజ్వరం వచ్చినట్లు వణుకు. ఎవరిమొహాలలోకి చూడాలన్నా భయమే" అంటూ జుత్తులోనికి వేళ్ళని జొనిపి తలని రుద్దుకున్నాడు రామమూర్తి.

"మా కంపెనీలో మొత్తం ఇరవైమూడు-వేల మంది ఉద్యోగులు ఉండేవారు. దాదాపు రెండువేల మందికి క్రితం నెలలో ఉద్యోగాలు పోయాయి. ఈ నెలలో ఇంకెంతమందికి ఉద్వాసన చెబుతారో! ఈ మారు నాలుగువేలని పుకారు మొదలైంది"

"మీరు ఈ కంపెనీలో చేరి ఎన్నాళ్ళయింది?"

"పదకొండేళ్ళు"

"నే అనవసరంగా న్యూయార్క్‌నుంచి రెండేళ్ళక్రితం ఇక్కడకి వచ్చాను"

"అవసరం, అనవసరం అన్నది ఇప్పుడు ఉద్భవించింది కాని చేరేటప్పుడు లాభదాయకం, అంటే అవసరం అనిపించేగా చేరావు?"

"చేరినందుకు ఐదువేల డాలర్లు బోనస్, ఒక్కొక్క సంవత్సరం గడుస్తుంటే రెండువేలు స్టాక్ ఆప్షన్ చూసి బాగుంది అనిపించింది. ఆ రోజుల్లో కంపెనీ స్టాక్ విలువ ఏభై డాలర్లు" అని రామమూర్తి గునుస్తుంటే,

"ఏమిటి సార్, మీ కంపెనీ స్టాక్ ఎనిమిది నుంచి తొమ్మిదికి ప్రాకింది. అది శుభశూచకం" అంటూ గదిలోనికి ప్రవేశించిన మధ్యవయస్కుడు చర్చలోనికి దిగాడు. రోజూ ఏపిల్ జ్యూస్ తాగితాగి కాబోలు, ఏపిల్ రంగు ఛాయతో ఆకుపచ్చ పోలో షర్ట్ వేసుకున్న కొత్త వ్యక్తిని చూడగానే ముచ్చటేసింది రమణయ్యకి. సోఫాలో కూర్చున్న ధనరాజ్ లేచి "కమాన్ రాజా" అంటూ అతనితో కరచాలనం చేసి పరిచయాలు కానిచ్చాడు.

"మీరు ఇండియానుంచి ఈదేశం వచ్చి ఎన్నాళ్ళయింది? అక్కడ ప్రజలు ఏమనుకుంటున్నారు?" అనడిగాడు రాజు రమణయ్యని. నలుగురిలో మాటలాడాలంటే బెరుకు, అందులో అపరిచిత వ్యక్తుల ముందర నోరు పెగలదు. అతికష్టంమీద గొంతు పెగల్చుకుని, "ఈ దేశం వచ్చి దాదాపు మూడు నెలలయింది. హిందూ న్యూస్‌పేపరులో, దాదాపు లక్షమంది సాఫ్ట్‌వేర్ ఉద్యోగస్థులు ఉద్యోగాలు లేక బెంచ్ మీద కూర్చున్నారని, వాళ్ళలో ముప్ఫయివేలమందికి వీసాలు పొడిగించలేదని, అందుచేత వాళ్ళందరూ త్వరలో ఇండియా వచ్చేస్తారని ప్రచురించారు. ఈ ముప్ఫయివేల జనాభాలో కొందరు స్టూడెంట్లకింద నమోదు అవడానికి ప్రయత్నం చేస్తున్నారని చదివేను. దానిలో ఎంత నిజముందో ఇక్కడివాళ్ళకే తెలియాలి" అంటూ ఊపిరి పీల్చుకున్నాడు రమణయ్య.

"అది ఎంత నిజం? అన్నది కష్టమైన ప్రశ్నే, అయినప్పటికీ ఉద్యోగాలు పోయిన వాళ్ళ సంఖ్య ప్రతిరోజూ పెరుగుతున్న మాట నిజం. నాకు తెలిసిన ఐదారుగురి ఉద్యోగాలు పోయాయి" అన్నాడు రాజు.

"నీకేం బాబూ గ్రీన్‌కార్డ్ వచ్చేసింది. మాలాంటివాళ్ళకే దినదినగండం. అవును కానీ గత పదేళ్ళుగా మీ కంపెనీలో పనిచేస్తున్న పరమశివంకి ఉద్యోగం ఊడిందట నిజమా? " అనడిగాడు రామ్మూర్తి.

"బాబూ! కంపెనీలోంచి ఉద్వాసన ఒక వ్యక్తికి రావడానికీ, అతను ఎన్నాళ్లనుంచి ఆ కంపెనీలో పనిచేస్తున్నాడన్నదానికీ సంబంధం లేదు. లేదంటే లేదని కాదు, కాని ఒక్కోసారి అలా జరుగుతుంది" అన్నారు రావ్‌గారు.

కాస్సేపు నిశ్శబ్దంగా ఉన్న హాలులో రావుగారు, "చిన్న చిన్న కంపెనీలలో ఇలాంటి పరిస్థితులలో ఆఖర్న చేరిన వ్యక్తికి ముందర ఉద్వాసన జరుగుతుంది సాధారణంగా. అయితే ఉద్వాసన ఇలాగే జరుగుతుంది అని నిర్ధారణగా చెప్పలేం. వాటిలో వెరైటీ ఉంది. ఉదాహరణకి మా కంపెనీ లాభాలు లేకపోవడంతో షేర్ల విలువ డౌన్ అయితే ఖర్చు తగ్గించడానికి ఒక విభాగాన్ని మొత్తంగా మూసివేయవచ్చు ఆ విభాగంలో పనిచేస్తున్న వ్యక్తులందరికీ ఉద్యోగాలు హుష్‌కాకి అయిపోతాయి. ఇంకో విభాగంలో తక్కువ అనుభవం ఉన్న వ్యక్తులకి ఉద్యోగం ఊడకపోవచ్చు" అంటూ ఆగారు రావ్‌గారు.

"అవునుకాని పరమశివాన్ని కారు వరకు తీసుకువచ్చి సాగనంపారుటకదూ? ఎలాగైనా మీ కంపెనీ గొప్ప కంపెనీలే గురువుగారూ" అన్నాడు రామ్మూర్తి.

"గొప్పా? చట్టుబండలా? "

"అదేమిటి అలా తీసేశారు? "

"మీరన్నట్లు చాలామంచి కంపెనీలకంటే మా స్టాక్ ధర అంత పడనిమాట వాస్తవం. ఉద్యోగులని తీసేస్తున్నామని చెప్పకుండా గుంభనంగా క్షవరం చేస్తారు. కొంతమందికి వలంటరీగా కంపెనీ వదిలేయడానికి అవకాశమిస్తారు. ఒకటి రెండు నెలల జీతం ఇచ్చి "వెళ్లిరా గురూ" అంటారు. వాళ్ళకి కావలసినంతమంది దానిని వాడుతున్నారా సరే, లేకపోతే ఉద్వాసనలు మొదలవుతాయి. రెండువేలమంది ఉద్యోగులని తీసే ఉద్దేశం ఉన్నా ఎవర్ని ఎప్పుడు తీసేస్తారు అన్నదాని గురించి మనకి కాస్తయినా క్లూ ఉండదు. ఆరునెలలకి ఒకసారి ప్రతీ మేనేజరు, తనకింద పనిచేసే ఉద్యోగుల ప్రాముఖ్యత, అవసరం బట్టి ఒక పట్టిక తయారుచేసి ఉంచుతారు. ఉదాహరణకి పదిశాతం ఉద్యోగులని తీసేస్తాం అన్న నిర్ణయం అవగానే, పట్టికలో ఉన్న ఆఖరి పదిశాతం ఉద్యోగుల ఉద్యోగం ఊడుతుంది. ఉద్యోగాలు తీసేయడం చాలా పకడ్బందీగా ఒకరోజులో అయిపోతాయి. మేనేజరు ఎవర్నైతే ఉద్యోగంలోంచి తీసివేయాలో ఆ వ్యక్తిని పిలిచి అశుభవార్త చెబుతాడు. మేనేజరుకాని, వేతనాలు/సౌకర్యాలు చూసే మనిషికాని, ఉద్యోగం ఊడిన వ్యక్తితో అతని సీటు దగ్గరకి వెళ్ళి నిలబడి, ఉద్యోగి తన సామాన్లు సర్దుకునే వరకు అక్కడే నిలుచుంటారు. ఉద్యోగం ఊడిన ఉద్యోగి తన సామాన్లన్నింటిని ఒక పేపర్ కార్టన్ (బాక్స్)లో ఉంచుకోగానే సదరు ఉద్యోగి దగ్గర బాడ్జ్ అడిగి తీసుకుని గేటువరకు తోడుకెళ్ళి ఉద్యోగి బయటికి వెళ్ళగానే తలుపులు మూసుకునేంతవరకు ఉంటాడు అక్కడ. కొండొకచో, పార్కింగ్ ప్రదేశంలో ఉన్న ఉద్యోగి కారువరకు వెళ్తాడు. ఎవరైనా ఉద్యోగి గలాభాచేసే అవకాశం ఉంటుందేమోనని, ఆరోజు సెక్యూరిటీ మామూలు కన్నా ఎక్కువ ఉంచుతారు. ఈ తతంగమంతా అంటే కంపెనీలో ఉద్యోగం పోయిన వ్యక్తులందరికీ ఉద్వాసన చెప్పడా





నికి ఒకగంట పట్టవచ్చు. అప్పుడప్పుడు ఒక మేనేజర్ తనకింద ఉద్యోగం ఊడిన వ్యక్తు లని సాగనంపాక అతనిని అతని పైమేనే జర్ వచ్చి ఆ మేనేజర్ ఉద్యోగం ఊడిందని తెలియపరిచి అతనిని పార్కింగ్ ప్రదేశానికి తీసుకెళ్తాడు అదేరోజు. ఉద్వాసన పర్వం మొదలైందని తెలిశాక, తమకూ ఆ గతి పడుతుందా? అమ్మో! మేనేజర్ దగ్గర నుంచి పిలుపు రాకూడదు అనుకుంటూ అరచేతిలో ప్రాణాలు పెట్టుకుని ఉంటారు ఉద్యోగులు. ఒకటే టెన్షన్! ఉదయం మొద లైన ఈ ఘాతుకం పదిగంటల ముప్ఫయి నిమిషాలు పదకొండు గంటలకల్లా ముగు స్తుంది. ఉద్వాసనకి గురి అయిన వ్యక్తి కంపెనీ పనిమీద పైఊరు వెళ్ళినా అతనికి ఫోన్, ఫాక్స్ల సహాయంతో ఉద్వాసన చెప్పబడుతుంది. అంతేకాని మర్నాటికి వాయిదాపడదు. మీరు నేషనల్ జియోగ్రా ఫిక్ చూస్తుంటారు. దానిలో మొసలి నీళ్లలో కనిపించకుండా ఈదుకుంటూ వచ్చి జీబ్రాలని కసుక్కున కొరికి చంపినట్లే ఈ కంపెనీలు మహాదారుణం బాబూ. మా కంపెనీలో ఒకతను ఇరవైఐదేళ్లు ఆ కంపె నీకి పనిచేసిన సందర్భంగా అతనిని లంచ్‌కి తీసుకెళ్ళి మంచి వర్కర్ అని ఒక మొమెంటో, బ్రేస్‌లెట్ చైన్ ఇచ్చి అవి అందుకుని పనిచేసే సీటు దగ్గరకి వచ్చేస రికి ఉద్యోగం ఊడిందని ఉత్తరం ఉంది. సాయంకాలం అయ్యేసరికి భయంతో ఒడ్డు కుచేరిన జీబ్రాల్లా ఉద్యోగం నిలుపుకున్న వ్యక్తులు మనోవ్యధ తగ్గి ఇళ్ళకి వెళ్తారు. ఉద్యోగం ఊడిందో/ఉందో భార్య, పిల్లలకి తెలిసిపోతుంది. శని, ఆదివారాలు గడు స్తాయి. సోమవారం ఉదయం ఆఫీసులో మీటింగ్ పెట్టి, "మీ అందరి ఉద్యోగాలు సురక్షితం కంగారుపడకండి" అని సముదా యింపు మాటలు చెబుతారు. అందరికీ, అప్పటికి మాత్రమే ఉద్యోగాలు నిలిచేయని కొత్త కోత అవసరమైతే తమ ఉద్యోగాలు పోయే అవకాశం ఉందని తెలుసు. కొత్త కోత అవసరమా? కాదా? అన్న అంశం మీద ప్రతీ మూడు నెలలకి కంపెనీ పెద్దలు చర్చించుకుంటారు. పరమశివంకి, అతని భార్యకి ఒకేరోజు ఉద్యోగాలు పోయాయి తెలుసా? ఈమధ్యనే ఐదు లక్షల డాలర్లు పెట్టి ఇల్లు కొన్నాడు. అంటే ఎంత లేదన్నా బ్యాంక్‌కి నెలకి అయిదు ఆరు వేలు వాయిదా కట్టాలి. ఇల్లు గడవడానికి, కార్లు అప్పుతెచ్చి కొన్నందుకు బ్యాంక్‌కి, ప్రైవేట్ స్కూళ్లలో చదువుతున్న పిల్లలకి ఫీజు మొత్తం అంతా కలిపి తొమ్మిది-పదివేల డాలర్లు నెలకి కావాలి. ఈ దేశంలో అంతా అరువు/అప్పు బాపతుకదా! నిల్వవుండదు. రెండు మూడు నెలల్లో ఉద్యోగంలో చేరక పోతే బ్యాంక్‌వాడు ఇంటిని, కార్లని జప్తు చేస్తాడు. ఇవి ఇక్కడ ఉన్న పౌరులకి. గ్రీన్ కార్డ్ ఉన్నవాళ్ళకి హెచ్ వీసామీద వచ్చి ఈ పరిస్థితి వస్తే ఏమవుతుందో ఊహించలేం. అగనంపూడిలోనో, అమలాపురంలోనో కూర్చుని తమ పిల్లల డాలర్ల జీతాలని నల భైఏడుచేత హెచ్చించి మురిసేవాళ్ళకి ఇది చెప్పినా అర్థం కాదు. ఈ దేశంలో ఉన్న వాళ్ళందరూ శుంఠలని, ఆలోచనారహితు లని, తమకే చాలా జ్ఞానం ఉందని, తాము తెగ పొడిచేస్తామని, తమ వెన్నును తామే తట్టుకుంటారు. వాళ్ళకి కందిపప్పు కిలో ముప్ఫయినుంచి ముప్ఫయిరెండు అవ డంతో వాపోవడం తెలుసు. తమ జీతం పెరిగిందన్న సత్యంకాని, ఇక్కడ ఇతరుల సాధక బాధకాలు కాని చాలా అల్పంగా కని పిస్తాయి" అంటూ ఆగాడు రావ్.

"ఎంత చెట్టుకి అంత గాలి, ఈ దేశంలో అవకాశాలు ఎక్కువ. డబ్బు వచ్చేటప్పుడు, జీతం పెరిగేటప్పుడు ధన్‌ధన్‌మని మీదకి వెళ్తాయి. ఉద్యోగాలు ఊడితే దిగడమూ అంతే వేగంతో జరుగుతుంది. ఇదొక హైస్పీడ్ ఆట. ఈ ఒడిదుడుకులకి తట్టుకో లేనివాళ్ళు పి. హెచ్. డి. చేసి ప్రొఫెసర్లుగా

యూనివర్సిటీ ఉద్యోగాలు ఎన్నుకోవచ్చు లేదా కొన్ని పెద్ద కంపెనీలలో రీసెర్చ్ విభాగంలో ఉంటే టెన్షన్ తక్కువ. జీతాలు తక్కువే" అన్నాడు రాజు.

"ఈమారు పాముపాత పడకుండా బైటపడ్డాడుకదా. రాబోయే ప్రమాదపు రోజుకి ఇంకా మూడు నెలల వ్యవధి ఉంది. ఈలోగా రెజ్యూమ్ అప్‌డేట్ చేసి చాలాచోట్లకి పంపాలి. ఎందుకైనా మంచిది. కాపుదలగా మరో ఉద్యోగం కోసం వెతకడం మంచిదేమో" అంటూ రామ్మూర్తి లేచాడు.

"నువ్వెళ్లు, మేం ఉండేది ఇక్కడకి దగ్గరే కాబట్టి మరొక అరగంట ఉంటాం" అన్నారు రాజు, రావ్‌లు.

ధనరాజ్, రామ్మూర్తిని సాగనంపడానికి లిఫ్ట్ దగ్గరకి అతనితో వెళ్లి తిరిగి వచ్చి గదిలో అలుముకున్న విచారాన్ని చూసి, "రవళీ, మరొక రౌండ్ కాఫీ అందరికీ ఇయ్యి. ఛీరప్... న్యూయార్క్, న్యూజెర్సీలలో, కాలిఫోర్నియాలో ఉన్న పరిస్థితికంటే బాగా మేలు. అక్కడ పోయిన ఉద్యోగాలు ఇంకే ప్రాంతంలో పోలేదు. టెలికామ్ విభాగంలో లక్ష ఉద్యోగాలు పోయాయని యు. యస్. న్యూస్‌లో చదివాను. వీటిలో చాలామట్టుకి కాలిఫోర్నియాలోనే పోయాయి" అన్నాడు.

రవళి కొత్తప్యాక్ కాఫీ వేయసాగింది.

"మనం రాజశేఖర్, హరిణి గారింటికి వెళ్ళాం. అక్కడ నలుగురైదుగురు వచ్చారు. వాళ్ళ పరిస్థితి ఏమైనా నీకు తెలుసునా?" అనడిగాడు రమణయ్య ధనరాజ్‌ని.

"రాజశేఖర్, హరిణిలు ఊహించినట్లుగా వాళ్లు పనిచేసే కంపెనీని పెద్ద కంపెనీ కొనుక్కోవడంతో వాళ్ల పరిస్థితి బాగుంది ఇప్పటికి. వాళ్ళ ఉద్యోగాలకి ఢోకాలేదు. గంగాధరంగారి పరిస్థితే ఏమీ బాగులేదు. ఒక షేర్ విలువ నూటఅరవైనుంచి పది హేనుకి పడడంతో, ఆయన బ్యాంక్ దగ్గర కుదువపెట్టి తీసుకున్న డబ్బు కుంచించుకుంది. బ్యాంక్ డబ్బు కట్టమని ఒత్తిడి తెస్తోందిట. చాలా ఇబ్బందులలో ఉన్నాడు. కేల్కర్ స్టాక్‌మీదకి వెళ్ళినప్పుడు అమ్మేసి డబ్బు చేసుకున్నాడు. రెండువేల షేర్లు, ఇరవైఅయిదు ఉన్నప్పుడు యాభైవేల డాలర్లు పెట్టి కొన్నాడు. వాటి ధర ఎనభైకి పెరగగానే అమ్మాలి. ఒక లక్షా అరవైవేలే అయ్యాయి. స్టాక్ పడడం మొదలయింది. స్టాక్ ధర నలభైకి పడగానే ఇంకా ఏంపడ్తుందని అనుకుని లక్షా అరవైవేల డాలర్లు పెట్టి నాలుగువేల షేర్లు కొన్నాడు. ఈవేళ ఆ స్టాక్ ధర పది. అంటే ఆయన మొదటి కంటే పదివేలడాలర్ల తక్కువలో ఉన్నాడు. ఇతరుల సంగతి నాకు తెలియదు" అన్నాడు ధనరాజ్.

రవళి ట్రేలో అందరికీ కాఫీలు తెచ్చింది.

అందరి మొహాల్లో భయం. రేపు ఏమవుతుందో అన్న ఆరాటం కానవస్తోంది. కాస్సేపటికి రాజు, రావ్‌లు లేచి వెళ్ళారు.



రవళి ఉద్యోగరీత్యా మూడు రోజులకి చికాగో వెళ్ళింది. ఉదయమే వచ్చిన పేపరు చూస్తూ,

"ఆరువారాల్లో షేర్ల విలువ ఇంత దారుణంగా పడుతుందంటే నమ్మశక్యంగా లేదు.

ఎక్కడ చూసినా డాట్ కామ్ కంపెనీలు దివాలా తీసి మూసివేసేశారని, ఆ కంపెనీలో ఉన్న కంప్యూటర్లు, ఫర్నిచర్, కాఫీ తయారుచేసే మెషీన్లు, టెలిఫోన్లు, పేజర్ల వేలం గురించే. సంవత్సరానికి నూటపది హేనువేలమందికి హెచ్ వీసా కోటా ఉంటే, అది చాలదని అందరూ గొడవ పెట్టేవారు. గత రెండు మూడేళ్లలో వచ్చిన మూడుల క్షల మంది ఉన్న మార్కెట్ ఒక్కసారి ఇలా మొదలంటా నరికిన చెట్టులా కూలి పోతుందని రెండు నెలలకిత్రం ఎవ్వరైనా చూచాయగా అన్నా అతనిని పిచ్చాసుపత్రిలో పెట్టేవారు. పేపరు చదివినా, టెలివిజన్ ఆన్ చేసినా ఇవే కథలు, మార్కెట్ గురించి చర్చ "నాన్నా, మనం మధ్యాహ్నం సినిమాకి వెళ్దాం. కాస్సేపైనా వీటి సంగతి మరచిపోవచ్చు" అన్నాడు ధనరాజ్ పేపరు మడత పెడుతూ. రమణయ్య తల ఊపాడు. రమణయ్య మదిలో ధనరాజ్ పరిస్థితి గురించి తెగ ఆందోళనగా ఉన్నా బయటికి ఏమీ ప్రదర్శించలేదు.

మధ్యాహ్నం నాలుగు గంటలకి మొదలైన సినిమా ఆరున్నర గంటలకి ముగిసింది. సినిమా థియేటర్లోంచి రమణయ్య, ధనరాజ్ బయటికి వస్తుంటే, "హలో రాజ్ బాగున్నావా? " అంటూ ఒకవ్యక్తి పలకరించాడు.

"హలో సాగర్ ఎలా ఉన్నావు? " అని తిరుగుప్రశ్న వేశాడు ధనరాజ్. హాలు బయటకి వచ్చి ఇద్దరూ కబుర్లలో పడ్డారు.

"ఇది నీకు తెలుసా? రెండు నెలలుగా బెంచ్ మీదున్న రామన్, నటేశన్ లు ఎల్లుండి ఇండియా వెళ్ళిపోతున్నారు. వాళ్ళకి బెంగుళూరులో ఉద్యోగాలు దొరికాయి. వాళ్లు నీకు బాగా తెలుసటకదూ? ఇక్కడకి రెండడుగుల దూరంలోనే నా ఫ్లాట్. వాళ్ళు నా ఫ్లాట్ కి ఏడుగంటలకి వస్తారు. ఫేర్ వెల్ పార్టీ. నీకు ఇంకేమీ ఇతర ముఖ్యమైన పని లేకపోతే రా వాళ్ళకి బై చెబుదాం" అన్నాడు సాగర్

"ఏం నాన్నా, మనం ఇంటికి వెళ్ళి చేసే పని ఏముంది? నీకభ్యంతరం లేకపోతే కాస్సేపు కూర్చుని వెళదాం" అన్నాడు ధనరాజ్.

"నాకెందుకు అభ్యంతరం? " అంటూ సాగర్, ధనరాజ్ లతో అడుగులు వేశాడు రమణయ్య.

★ ★ ★

రాత్రి ఏడుగంటలయింది. సాగర్ అపార్ట్మెంట్ అంతా చిందర వందరగా ఉంది. అక్కడ కూడిన వారందరూ బ్రహ్మచారులవడంతో పీజాలకి ఆర్డరిచ్చి కబుర్లలో పడ్డారు. రాబోయే పీజాలు సరిపోతాయో, లేదోనని మరి రెండు పీజాలకి ఆర్డరిస్తూ, తమ దగ్గర పీజా కంపెనీ కూపన్లు ఉన్నాయని మరొక్కసారి జ్ఞాపకం చేసి, పీజా ధర తగ్గించగలిగారు. ఇరవైనాలుగు కేన్లు ఉన్న బీర్ కేస్ రిఫ్రిజిరేటర్లో ఉంది. అయినప్పటికీ బీరుతాగుదామన్న బలీయమైన కోర్కె ఎవరికీ లేక ఎవరికివారే ఊరుకున్నారు. హాలులో రమణయ్య, ధనరాజ్, సాగర్, నటేశన్, రాఘవన్ ఉన్నారు. రామన్, నటేశన్ లలో ఇండియా వెళ్ళాల్సి వస్తోందన్న దిగులు వదిలేస్తే బెంగుళూరులో మంచి ఉద్యోగం వచ్చినందుకు నీరస పడలేదు. ధనరాజ్, సాగర్ లు పీజాల కోసం ఎదురుచూస్తున్నారు. ఫ్లాట్ తలుపు తట్టేరెవరో. సాగర్ వెళ్ళి తలుపు తీశాడు.

"ఏమిటి, ఇది ఫేర్ వెల్ పార్టీలా లేదే" అనడిగాడు లోపలికి వచ్చిన వ్యక్తి. కొత్త వ్యక్తి చేతిలో భుజాన ఉన్న కంప్యూటర్ భుజాన్ని లాగేస్తోంది. ఉస్సురంటూ చేతి సంచీని ఒక వారగా ఉంచి, టీ షర్ట్ ని సరి చేసుకుని, సోఫాలో చతికిలబడి, "వాటీజ్ దిస్? రేపు బాగుండదని ఇప్పుడే నీళ్ళు వదిలేస్తామా ఛీరప్" అంటూ లేచి రిఫ్రిజిరేటర్ లోంచి బీర్ కేన్ లు తీసి అందరికీ అందిచ్చాడు, ఒక్క రమణయ్యకి తప్ప.

శంకర్‌కి ఇక్కడ ఉద్యోగం పోతే హాయిగా హైదరాబాద్ వెళ్ళి మామ కంపెనీలో చేరుతాడు అతనికేం" అన్నాడు రామన్. శంకర్ బీర్‌కేన్‌ని విప్పి మీదకి ఉబుకుతున్న నురగని ఎగపీల్చి చిరునవ్వు నవ్వాడు.

"అదేమిటి గురూ! నీ షేర్ విలువ మార్కెట్‌లో చూశావేమిటి?" అనడిగాడు ధనరాజ్.

"అంతా అసత్యం అయిపోయింది బాబూ నూట ఇరవైనుంచి కిందకి దిగుతుంటే ముప్ఫయికి వచ్చాక ఇంకా కిందకి ఏం పడుతుందిలే, మన రొట్టె విరిగి నేతిలో పడిందని, అటూ ఇటూ అప్పులుచేసి బ్యాంక్‌లో క్విక్‌కేష్ లోన్ తీసుకుని వెయ్యి షేర్లు కొన్నాను. ముప్ఫయివేలు పెట్టాను. శ్రీమద్రమారమణ గోవిందో, హరి! దీని సిగతరగ షేర్ రెండున్నర. కేవలం రెండు రూపాయల యాభైసెంట్లకి అంత చక్కగా దిగుతుందని ఎవరు ఊహించగలరు బ్రదర్. అంటే పాతికవేలు క్షవరం. మా నాన్నకి అయిదువేల డాలర్లు పంపుతానన్నాను. ఎలాగో ఎరేంజ్ చేయాలి" అన్నాడు శంకర్.

"శంకర్ నేను మొదటినుంచీ చెబుతూనే ఉన్నాను. నాయనా పి/ఇ అంకె చూసుకోవాలి. వాళ్ళు అలాంటి అంకె ఏమీ ప్రకటించలేదురా అంటే నా మాట వినలేదు. ఇప్పుడు అఘోరించినా ఏం ప్రయోజనం? మరీ అంత దిగులుపడకు. ఒక సంవత్సరంలో నీ షేర్ల ధర మీదకి వెళ్తుంది. ఆటల్లో జయాపజయాలు దైవాధీనాలు కదా?" అంటూ మెడలో వేసుకున్న వెంకటేశ్వరస్వామి బంగారుబిళ్ళని ముద్దుపెట్టుకుని, బీరు కళ్ళకద్దుకుని నోటికి వైన్‌ని అందిచ్చాడు నటేశన్.

"పోదూ బడాయి! పి/ఇ అంకె బాగా ఉన్న సిస్కోమాట ఏమిటి? ఎనభైనుంచి పదిహేనుకి పడలేదా? అంతా పెరుమాళ్ మహిమ" అన్నాడు రామన్ మీదకి చూసి, బీర్‌ని ఆస్వాదిస్తూ.

"నిన్న యూ.ఎస్. న్యూస్‌లో టెక్నాలజీ స్టాక్ ఇప్పటిలో మీదకి లేవదని, అది పూర్తి వైభవానికి చేరడానికి పెద్ద పెద్ద కంపెనీలకి పదిహేనేళ్లు, చిన్న కంపెనీలకి ఇంకా ఎక్కువకాలం పడుతుందని రాశారు" అన్నాడు సాగర్.

తలుపు తెరుచుకుని లోపలికి వచ్చాడు ఒకవ్యక్తి. అతని మొహంలో హుషారు అన్నది ఎక్కడా కనపడడంలేదు.

"అదిగో ప్రసాద్ నీలాగే షేర్లుకొని లక్షాధికారి అవుదామనుకున్న మరో శలభం" అన్నాడు నటేశన్. లోపలికి వచ్చిన వ్యక్తికి అట్టే చలనంలేదు. కళ్లు శూన్యంలోనికి పరధ్యానంగా చూస్తున్నాయి.

"ఏం ప్రసాద్, కంప్యూటర్ల స్టాక్ విలువ ఇంటర్‌నెట్ మీద చూశావేం? అంత విచారంగా ఉన్నావేమిటి?" అని సాగర్ ప్రశ్నించాడు.

"నా విచారానికి ముఖ్య కారణం నా షేర్స్ ధర ఒక్కటే కాదు. మా ఊరినుంచి వచ్చిన ఒకవ్యక్తి అకాలమృత్యుపాలయ్యాడని తెలిసింది ఈవేళ" అంటూ బీరు డబ్బాని అందుకున్నాడు ప్రసాద్.

గదిలో ఎవ్వరూ తను అక్కడ ఉన్నానని కాని, ఇతర విషయాలు గురించి పట్టించుకోవడం చర్చించడం కాని లేకుండా బీరుతాగడం, షేర్ల ధర పడిపోయిందని గుండెలు బాదేసుకోవడం చూసి ఆశ్చర్యపోయాడు. ఈ ఇరవై అయిదు, ముప్ఫయిఏళ్ళ యువకులకి అమెరికాలో బతుకు డబ్బంటే పరుగు, తాగుడంటే మోజు అనేలా ఇంత త్వరగా అలవాటు చేసిందా? అని ఆశ్చర్యపడ్డాడు. వీళ్లలో తన కొడుకు ధనరాజ్, అందునా తను జీవితంలో తృప్తి, నిదానం ఉండాలని ఇరవైఏళ్లపాటు నేర్పించిన జయరాం కూడా ఉండడం చూసి విచారమేసింది. తన పెంపకంలో లోపం ఉండిఉం





టుంది. తను ధనరాజ్ మెదడులో బలంగా నాటేలా కొన్ని విలువలని ఆపాదించలేకపోయాడు. వీళ్ళందరూ ఉత్సాహం ఉన్న యువకులు. ఏ దేశంలోనైనా కష్టపడి రాణించగల స్థోమత, అర్హతలు ఉన్నవాళ్లు. మళ్ళీ వీళ్లు పైకి వస్తారు. కాని వీళ్ళు ఇలా పాకుడురాళ్లమీద పరుగులు పెడితే జీవితపు విలువలని విస్మరించినట్లే అని రమణయ్య అనుకుంటుంటే "ఏమయిందేమిటి? " అనడిగాడు సాగర్.

"నారాయణ నాకు రెండేళ్ళ జూనియర్" అంటూ ప్రసాద్ మొదలెట్టాడు. బీరు తాగడం ఆపి ప్రసాద్ చెప్పింది విననారంభించారు అందరూ.

"మధ్యతరగతి కుటుంబంలోంచి వచ్చినవాడు. కోచింగ్ సెంటర్లకి వెళ్ళి చదువు చెప్పించుకునే దక్షత లేనివాడు. ఎమ్‌సెట్‌లో రాంక్ దిగువుగా ఉండడంవలన మెరిట్ సీటు రాలేదు. సివిల్ ఇంజనీరింగ్ చదువుతానంటే సీటు వచ్చేదేమో, కాని ఈ కంప్యూటర్ సైన్స్, ఎలక్ట్రానిక్ కమ్యూనికేషన్ జంఝామారుతం మొదలవడంతో అతను ఇంజనీరింగ్‌లో చేరకుండా బి.కామ్‌లో చేరాడు. ఆర్ట్స్, కామర్స్‌లలో చదువులు పాఠాలు చెప్పే నాథులు, వినేనాథులు తక్కువేకదా విద్యా గైడో, ఏ రామనాథం గైడో చదివి పరీక్షలు పాసవడం, మూడేళ్ల చదువు పూర్తయ్యేసరికి ప్రసాద్‌కి చదువు అంటే విరక్తి కలిగింది. మనిషి సెన్సిటివ్. బి.కాం మనిషికి ఉద్యోగం ఎక్కడ దొరుకుతుంది? ఎంతమంది బికాం.లు ఆంధ్రప్రదేశ్‌లో ఉన్నారో ఎవరికీ తెలియదు. నారాయణ తండ్రికి కొడుకుని చూస్తే భయం వేస్తోంది. కొడుకు ఉద్యోగం కోసం ఏదైనా చేయడానికి తయారుగా ఉన్నాడు అతను. ఆఖరికి కట్నం అక్కర లేదు, ఉద్యోగం వేయిస్తే పిల్లని పెళ్లి చేసుకుంటాడన్న పుకారు వ్యాపింపచేసినా, కంప్యూటర్ సైన్స్ డిగ్రీ ఉంటేకాని అతను పెళ్లికి అర్హుడు కాడని సమాజం నిర్ణయించింది. గత్యంతరంలేక మరీ ఖర్చుకాని 'సి' విజువల్ బేసిక్ కోర్సులు చేశాడు. మెడికల్ ట్రాన్స్క్రిప్షన్స్‌లో ఉద్యోగాలు ఉన్నాయంటే తండ్రి అటూ ఇటూ తిరిగి అది పదివేలు పెట్టి చదివించాడు. అదంతా మిథ్య అని కోర్సు పూర్తయిన ఆరునెలలకి ఖరారుగా తెలిసింది. ఆ పరిస్థితులలో స్నేహితుని కూతురి పెళ్లిపందిరిలో నారాయణ తండ్రికి వెంకటేశ్వర్లుతో పరిచయం అయింది. వెంకటేశ్వర్లు శరీరాలని అమెరికాకి ఎగుమతి చేసే బోడిలింగాల్లో ఒకడు. అతనికి ఎంత పలుకుబడి ఉందో అతని కుడిచేతికి ఉన్న మూడు ఉంగరాలు, వెంకటేశ్వరస్వామి, సాయిబాబా, నీలంపొడి ఉన్న ఉంగరాలు చెబుతున్నాయి. అవి బంగారు ఉంగరాలో కాదో చెప్పలేం కాని ధగధగ మెరిసిపోతుంటాయి. నారాయణ తండ్రి తన కొడుకు విషయం వెంకటేశ్వర్లుకి మనవి చేశాడు. అని ఎందుకన్నానంటే ధనవంతునికి బీదవాడు అంటే లోకువ. సమానస్థాయిలో మాట వాడకుండా కొడుకు భవిష్యత్తు వెంకటేశ్వర్లుమీద ఆధారపడుందన్నట్లు 'అయ్యా మీరు చెయ్యాలి' అన్న ధోరణిలో మాట్లాడాడు. ధనవంతులంతా ఎలాంటి సమాధానాలు ఇస్తారు.

"అబ్బే! లాభంలేదండీ, మీవాడి క్వాలిఫికేషన్లు అక్కడికి పంపడానికి చాలవనో, అవకాశం వస్తే నే కబురంపుతాను" అంటారు అంటే,

"నాయనా నీకు సహాయం చేసినందుకు నాకు ఏంలాభం? " అన్నమాట.

నారాయణ తండ్రి పదేపదే వెంకటేశ్వర్లుని కలిస్తే, నారాయణకి ట్రెయినింగ్ ఇచ్చి అమెరికాకి ఎగుమతి చేయడానికి లక్షన్నర ఖర్చు అందులో ఇరవైవేలు వెంటనే కట్టేయాలి. అందరూ చేస్తున్నట్లు అమెరికాకి వీసా తెప్పించేందుకు సహాయం చేస్తాడు. విమానం ఖర్చు నారాయణదే.

నెలకి వందకి తొమ్మిది రూపాయల వడ్డీతో ఇరవైవేలు సంపాదించి నారాయణకి పూర్తి వివరాలు చెప్పకుండా ట్రెయినింగ్‌కి హైదరాబాదు పంపించాడు నారాయణ తండ్రి. అంటే నెలకి వడ్డీ పద్దెనిమిది వందల రూపాయలు. అదే సమయంలో ఎవరో బాబాగారు విశాఖపట్నం వస్తే, ఆయనకి మొక్కి విభూతి అందుకున్నారు. దగ్గరగా ఉన్న నరసింహస్వామివారికి, దూరంగా ఉన్న వెంకటేశ్వరస్వామివారికి ముడుపులు కట్టారు. కొడుకు అమెరికా వెళ్తే వెంకటేశ్వరస్వామివారికి వీలుంటే రోజుకు నాలుగుసార్లు శ్రీవారికి కల్యాణం చేయించుకోవడం ప్రీతికరం అని తెలిసి ఆ మొక్కూ మొక్కారు.

రెండు నెలల తరువాత నారాయణకి హెచ్ వీసా వచ్చింది. అది వచ్చిన నాలుగు నెలలలో అమెరికా వెళ్ళాలి.

నారాయణ తండ్రి ఆనందానికి పట్టపగ్గాలు లేవు. బాబాగారిని అనుమానించిన ప్రతీ వ్యక్తి దగ్గరకి వెళ్లి ఛాతీ విరుచుకుని బాబాగారు చేసిన ప్రతాపం గురించి వివరించారు. వెంకటేశ్వరస్వామి అనుగ్రహం గురించి పొగుడుతూ, తిరుపతి బాలాజీగారి మీద నమ్మకం లేనివాళ్లందర్నీ, 'పాషండులు' అన్నారు.

కాని కథ అక్కడే మొదలయింది. అమెరికా నారాయణ వెళ్లడానికి లక్షా ముప్ఫయి వేలు వెంకటేశ్వర్లుకి, నలభైవేలు ప్లేన్ టిక్కట్టుకి వెరశి మొత్తం లక్షాడెబ్భయి వేలు కావాలి. కాని నారాయణ తండ్రికి బాబా గారిమీద, వెంకటేశ్వరస్వామి మీద అచంచలమైన విశ్వాసం. 'ఫరవాలేదు' ఇంకా నాలుగు నెలల వ్యవధి ఉందికదా అనుకున్నారు. నారాయణకి హెచ్ వీసా అమెరికాకి వచ్చిందన్న వార్త విశాఖపట్నంలో దావానలంలా వ్యాపించింది. విశాఖపట్నం ఏమిటి తుని పొలిమేర్లకు ఈ వార్త వెళ్ళింది. హెచ్ వీసా ఉంటే చాలు, కుర్రవాడు తెలిసినా తెలియక పోయినా ఫరవాలేదు అంటూ పిల్లలకి పెళ్లిచేసేస్తున్న తరుణంలో, ఎదురుగా పెరిగిన నారాయణ అతని హెచ్ వీసా సంగతి తెలియగానే బంధువర్గాల్లో, స్నేహితుల పరివారాల్లో కలకలం రేగి, నారాయణ ధర రెండున్నర లక్షలకి పెరిగింది. బేరం కుదిరిన పిల్ల పేరు రుక్మిణి. చక్కని చుక్క. మొదట తెచ్చిన అప్పు, దానిమీద పెరిగిన వడ్డీ, వెంకటేశ్వర్లుకి ఇవ్వవలసిన పైకం, నారాయణ, రుక్మిణిలు అమెరికా వెళ్ళడానికి కావలసిన విమానఖర్చులకి సరిపడేలా బేరం కుదిర్చారు మధ్యవర్తులు. నారాయణ తండ్రి అత్యాశపరుడు కాదు. రుక్మిణికి, 'పతియే ప్రత్యక్ష దైవం', 'పతిమాట జవదాట కూడదు'లాంటి సూక్తులు ఒంటపట్టిన సాంప్రదాయపు పిల్ల. 'అమ్మో! పదివేలమైళ్ల దూరంలో ఉన్న అమెరికాకి వెళ్ళిపోవడమే?' అంటూ తల్లిని వాటేసుకుని బావురుమంది ఆ బేలపిల్ల! నారాయణ, రుక్మిణి కలిసి అమెరికా వచ్చారు. వెంకటేశ్వర్లు ధర్మమా అని ఎగుమతి అయిన ముగ్గురితోపాటు, న్యూజెర్సీలో ఒక అపార్ట్‌మెంట్‌లో కాపురం మొదలుపెట్టారు నారాయణ, రుక్మిణి. వెంకటేశ్వర్లుకి అమెరికాలో పార్ట్‌నర్. అక్కడ తినడానికి కావలసిన సరుకులు అన్నీ తెచ్చిపడేసేవాడు. నారాయణ పంథొమ్మిది వందల తొంభైతొమ్మిది సెప్టెంబర్‌లో ఈ దేశం వచ్చాడు. అప్పుడే రెండువేల సంవత్సరం ప్రాబ్లెమ్ ఉంటుందేమోనని అందరూ గంగ వెర్రులెత్తిపోతున్న సమయం అది. మూడు నెలలకి, నెలకి నాలుగువేలు చొప్పున కాంట్రాక్ట్‌పని దొరికింది నారాయణకి.

నారాయణ చేసేపని ప్రత్యేకమైన అర్హత అవసరంలేని బండపని. మూడునెలలు ఏ అవాంతరాలు లేకుండా గడిచాక ఆ కాంట్రాక్ట్ పని ముగిశాక నారాయణకి ఉన్నవి, లేనివి క్వాలిఫికేషన్లు రాసి, నారాయణ రెజ్యూమ్ చాలా చోట్లకి పంపాడు బ్రోకర్. ఆ లేని అర్హతలు చూసి రెండు




మూడు ఇంటర్వ్యూలకి వెళ్తే నిజం గ్రహించిన కంపెనీవాళ్లు ఉద్యోగం ఇవ్వలేదు. రోజులు గడుస్తుంటే నారాయణకి ఉద్యోగం రాదని గ్రహించి బ్రోకర్ ఇంటి అద్దె మాత్రం కట్టి, తిండికి నారాయణనే ఖర్చు పెట్టుకోమన్నాడు. నారాయణ దగ్గర ఉన్న పైకం క్రమేణా మరో నాలుగు నెలలలో హరించిపోయింది. తను ఉద్యోగం ఇప్పించానని, ఉద్యోగం రావడానికి చాలా ప్రయత్నం చేశానని, ఇక తను ఏమీ చేయలేనని చెప్పడంతో నారాయణ పరిస్థితి విషమించింది. కంట్రాక్టర్ తన కింద పనిచేస్తున్నానని రాతపూర్వకంగా రాసి ఇస్తే తప్ప, ఉద్యోగంతో లింక్ ఉన్న వీసా మునిగిపోతుంది. ఏంచేయాలో తెలియని పరిస్థితి. ఇండియా వెళ్తే తీరని అవమానం. అదీకాక ఎంత లేదన్నా పదహారు-పదిహేడువందల డాలర్లు టిక్కట్టుకి కావాలి" అంటూ ఆగాడు ప్రసాద్.

ఎవ్వరూ మాట్లాడలేదు. గదిలో అలుముకున్న నిశ్శబ్దం ప్రసాద్ చెప్పబోయే ఘాతుకానికి నాందిగా గడ్డకట్టి ఉంది.

"ఒకరోజు రాత్రి నారాయణ, రుక్మిణి మెడకి రాళ్లు కట్టుకుని, వాళ్ళు ఉంటున్న కాంప్లెక్స్‌లో ఉన్న స్విమ్మింగ్ పూల్ లో మునిగి ఆత్మహత్య చేసుకున్నారు" అంటూ చల్లని బీరు సీసాని చెంపకి ఆన్చుకున్నాడు ప్రసాద్.

"మనదేశంలో ఇలాంటి కథలు చాలా తక్కువమందికి తెలుస్తాయి. ఓడిపోయామని ఎవ్వరూ చెప్పుకోరు. అథవా ఇలాంటి కథలు విన్నా, 'ఫలానా వాడు, ఇతనికన్నా తక్కువ అర్హతలున్న వ్యక్తి రాణించాడు. మీరు ఎప్పుడూ ఇలాంటివి చెప్పి మమ్మల్ని నీరసపరుస్తారు' అని తమ ధోరణిని విడనాడరు. ఇలా అందరికీ ముగింపు అవుతుందని కాదు, ఇలాంటివి కూడా విషాదకథలు ఉన్నాయని ప్రజలకి తెలియాలి"

"ఈ ఉదంతంలో విలన్ ఎవరు? అన్నది ఒకపక్కకి నెడితే రుక్మిణిని చంపేయడం చాలా ఘాతుకం"

"ఎవరో చంపేశారని ఎందుకనుకోవాలి? ఆమె అంతట ఆమే ఆ నిర్ణయానికి వచ్చి ఉండవచ్చుగా? " రమణయ్యకి ఎవరు ఏం మాట్లాడుతున్నారో తెలియడంలేదు. కలగా పులగంగా వాక్యాలు దొర్లుతున్నాయి.

"అంతా అవుపేడ! అతను ఆత్మహత్య చేసుకుంటానని ముందరే ప్రకటించి, ఆమెని ఆ దారుణానికి పాల్పడమని చెప్పకపోయినా సమస్యకి ఇంకే పరిష్కారమార్గం లేదంటే, ఆమెకి గత్యంతరంలేక ఆ నిర్ణయానికి వచ్చి ఉండవచ్చు"

"నే చస్తున్నాను. తరువాత నీ సంగతి నువ్వే చూసుకో" అంటే దేశంకాని దేశంలో ఆవిడకి వేరే మార్గం ఏముంది? "

"యు ఆర్ ఎ సినిక్! నీ ఆలోచన ఎప్పుడూ విపరీతంగా ఉంటుంది"

"చనిపోయినవాళ్ళ గురించి సానుభూతి చూపించడం తప్పిస్తే మనం ఏం చేయగలం? వీసాలు సరిగ్గా లేని మనకి ఈ దేశం ఎప్పుడైనా వెళ్ళిపోమని చెప్పవచ్చు. ఇంకో బీరు అందుకో. మనకి ఎలా రాసిపెట్టి ఉందో"

"వాళ్ల వ్రతాలు సరిగ్గా చేసివుండరు"

రమణయ్య గుండె ఆ విషాదకరమైన కథ విన్నాక బాధతో బరువెక్కింది, కలచిన మనసుతో ఆలోచనలోనికి ఒరిగాడు.

రుక్మిణికి, నారాయణకి అలా చావు రాసిపెట్టివుందా?

నారాయణ తల్లిదండ్రులు ముడుపులు కట్టిన ఫలితంగా ఈ దేశం వచ్చారా? పెళ్ళప్పుడు గృహప్రవేశానికి ఏ ఆటంకమూ కలగకుండా విఘ్నేశ్వరస్వామి పూజ, అప్పుడు వీలున్న నాలుగో-ఐదో అధ్యాయాలున్న సత్యనారాయణవ్రతం కథ విని, కళ్లకద్దుకుని ప్రసాదం తింటే జీవితం అంతా సవ్యంగా వెళుతుందని పురోహితుడు వివ

రించి చెబుతాడే. మరి అదంతా రుక్మిణి, నారాయణల విషయంలో ఏమైనట్లు? అలాంటిదానిని వీటో చేసే పవర్ 'రాసిపెట్టడానికి' ఉంటే చేసినందువల్ల ఏమీ ఫలితం లేకపోతే చేయడమెందుకు? ఒక వ్యక్తి వ్రతం గురించి ఏమీ తెలియకుండా పురోహితుడు చెప్పినట్లు యాంత్రికంగా చేస్తే దాని ప్రభావం ఉండదనుకోవాలా? అలా అయితే ఈ వ్రతం చేయించే వ్యక్తికి అన్నీ తెలుసుననుకోవాలా? అనుకుంటుంటే చిన్ననాటి సంఘటన ఒకటి జ్ఞాపకానికి వచ్చింది.

తనకి అప్పుడు ఎనిమిదేళ్లు కాబోలు.

"అమ్మా! ఒక రూపాయి ఇస్తే మీకు బంగారం చేసే మంత్రం చెబుతా" అంటూ వీధిలోనికి అరుస్తూ వచ్చిన వ్యక్తిని పిలిచి అమ్మమ్మ ఒక రూపాయి ఇచ్చింది. అమ్మమ్మ చాలా సత్తెకాలపు మనిషని బంధువులు అందరూ చెప్పుకొనేవారు. రూపాయి, ఇతర సామాన్లు పట్టుకెళ్తూ, ఒక చిటికెడు పొడరు ఒక కాగితంలో చుట్టి, అమ్మమ్మకి ఏదో చెప్పివెళ్లాడు. మర్నాడు ఉదయం తడిచీరలో ఒణికిపోతున్న అమ్మమ్మ "ఏమీ అవలేదు. దొంగ చచ్చినోడు మోసం చేశాడు" అంటూ అరుస్తోంది.

"బంగారం చేసే విధానం నీకు తెలియ చెప్పే జ్ఞానం అతనికి ఉంటే అలా రోడ్లంబట ఎందుకు తిరుగుతాడే!" అన్నానని అమ్మమ్మ చీపురుతో ఒకటి చరిచింది నన్ను.

"బాబాలని నమ్మడం, కల్యాణం చేయిస్తే ఏదైనా జరుగుతుందని నమ్మడం మూర్ఖత్వం" అన్నారు ఎవరో.

"ఆగాగు. మనలో సత్తా ఏమీలేకుండా బరువంతా బాబామీద, పెరుమాళ్లమీద మోపేస్తే ఆయన ఏంచేస్తాడు? " అన్నాడు నటేశన్, తెలుగు అరవయాసతో.

అంత విషాదంలోనూ రమణయ్యకి నవ్వు వచ్చింది. నటేశన్ తిరుపతి వాస్తవ్యుడని, బాలాజీ అంటే తెగభక్తి అని అందరికీ తెలియదు. నటేశన్ ఉద్దేశంలో 'బాబాలు', 'పెరుమాళ్లు' సత్తా ఉన్నవాళ్ళకే సహాయం చేస్తారన్నమాట! నారాయణ, అతని తండ్రి రుక్మిణి తల్లిదండ్రులు, వెంకటేశ్వర్లు అందరూ రుక్మిణి చావుకు కారణభూతులే! అనుకుని వాచీవేపు చూసి, "పదిన్నరయింది వెళదామా? " అనడిగాడు రమణయ్య కొడుకుని.

రామన్, నటేశన్‌లకి వీడ్కోలు చెప్పి ఇంటిముఖం పట్టారు ధనరాజ్, రమణయ్య.



ధనరాజ్ ఉదయమే ఆఫీసుకి వెళ్తాడు. అతనికంటే పదినిమిషాలు ముందరే పరిగెడుతుంది రవళి. నిద్రలేచి, కాఫీ కాచుకోవడానికి కిచెన్‌లోనికి వచ్చేసరికి వాళ్లు వెళ్ళిపోవడమో లేక వెళ్తూ, "ఆలస్యమైపోయింది డాడీ" అంటూ తొందరపడడమో చూస్తాడు రమణయ్య. ప్రతీ ఉదయంలాగే ఆవేళా సూర్యుడు తన ఉద్యోగధర్మం నిర్వర్తించడం మొదలుపెట్టాడు. రాత్రంతా కురిసిన వాన చెట్లని, ఇళ్లని రోడ్లని పూర్తిగా తడిపి, తన ఆనవాళ్లని వదిలి మాయమైంది. కాఫీ తాగి, జోళ్లు వేసుకుని ఉద

యపు నడకకి, తలుపులు వేసి బైటకి వచ్చాడు రమణయ్య. వరుణుడు ముందర రోజు రాత్రి చూపిన ప్రతాపానికి తోడు, ప్లాస్టిక్ సంచీలు వాడి, వాటిని ఎక్కడ పడితే అక్కడ పారవేయడంతో రోడ్డుమీద నీరు కొన్ని ప్రదేశాలలో నిలిచివుంది. నీటి ధారవేగం, ప్లాస్టిక్ కప్పులని ఖాళీ బీర్, కోకోకోలా కేన్‌లని కూడా తనతో తీసుక వచ్చి పూడ్చుకుపోయిన డ్రైయిన్‌కన్నాల దగ్గర వదిలింది. రోడ్డుమీద చెత్తా, నిలిచి పోయిన నీళ్లూ చూస్తుంటే ఇది అమెరికా యేనా అనిపించింది ఒక్కక్షణం. ఎండ యినా, వానయినా, మంచు కురిసినా, పిడు గులు పడినా ఏమైనా సరే న్యూయార్క్ ప్రజ తమ పరుగుని ఆపరు. రంయిమని కార్లు, ఇతర పెద్ద పెద్ద వాహనాలు, ఏంబు లెన్స్‌లు రోడ్డుమీద దూసుకుపోతూ నీరు నిలిచిన ప్రదేశాల దగ్గరకి వచ్చేసరికి నీళ్లని కాలిబాటవరకు అప్పుడప్పుడు కాలిబాటమీ దకి చిందిస్తున్నాయి. సూర్యుడు ఉదయించి గంటపైనే అయినా న్యూయార్క్ సిటీలో ముప్పయి నలభై అంతస్తుల భవనాలు సూర్యకిరణాలని అడ్డుకుంటున్నాయి. వాన ప్రభావంవలన తక్కువలో ఉన్న ఉష్ణోగ్రత గాలి వీచగానే ఇంకా తగ్గినట్లనిపించి చలిని పుట్టిస్తోంది.

చలిగాలి శరీరాన్ని తాకుతుంటే చెవులని మూసుకుంటూ నడక కొనసాగించాడు రమ ణయ్య. ఎవరూ ఎవరి గురించీ పట్టించుకో కుండా తమతమ కార్యకలాపాలలో మునిగి ఉన్నారు. కుక్కల్ని వాహ్యాళికి తీసుకువెళ్త న్నారు కొందరు, రోడ్లపక్కని ట్రక్స్‌ని నిలు పుచేసి సామాన్లని దుకాణంలోకి చేరుస్తు న్నారు కొందరు. కాలిబాటమీద కొందరు కూర్చుని "ఒక క్వార్టర్ ఇస్తావా బ్రదర్, కాఫీ తాగుతాను" అని చేతులు చాచకుండా మర్యాదగా ముష్టి అడుక్కుంటున్నారు. బిజీగా ఉంది కాలిబాట. జాగింగ్ డ్రెస్ వేసుకుని, అల్సేషియన్ కుక్కలాంటి పెద్ద కుక్కని తీసుకువస్తోంది ఒక స్త్రీ. స్త్రీ కుక్కని తీసుకువస్తోందనేకంటే కుక్కే స్త్రీని లాక్కొని తోందనడం వాస్తవాన్ని చెబుతుంది. స్త్రీ, ఆమెకి ముందర కుక్క రమణయ్యకి పది పన్నెండు అడుగుల దూరంలో ఉండగా ఒక పెద్ద వేన్ నీళ్లని కాలిబాటమీదకి చిమ్ము తుంటే కాలిబాటకి కుడివైపు రోడ్డుకి దగ్గ రగా ఉన్న వైపు నీళ్లు చిందబోతుంటే ఆ మురికినీళ్లని తప్పించుకోవడానికి ఎడమ పక్కకి సడెన్‌గా అసంకల్పితంగా జరిగాడు. స్త్రీని లాగుతున్న భయంకరమైన కుక్క మూడు నాలుగు అడుగులు దగ్గరగా కని పించేసరికి నోరు వెళ్లబెట్టి నాలికబైటకి చాచేసరికి దాని వాడి పళ్లు చూడగానే భయపడి తిరిగిరోడ్డు వైపు మళ్లడం జరిగి కాలు తొట్రుపడి రోడ్డుమీద వెల్లికిలాప డ్డాడు. సగం శరీరం రోడ్డుమీద, సగభాగం పేవ్‌మెంట్ మీద ఉంటే వీపు, నడుము పేవ్ మెంట్ అంచుని తాకాయి. పరిగెడుతున్న జాగింగ్ జవ్వని తన పరుగుని ఆపి కుక్కని అదిలించి దగ్గరగా వచ్చి అమెరికాలో అడిగే అతిసాధారణ ప్రశ్నలలో ఒకటైన "ఆర్ యు ఆల్ రైట్?" అనడిగింది. రమణయ్య లేవప్రయత్నించి సాధ్యపడక 'ఐయామ్ నాట్' అన్నాడు. జాగింగ్ జవ్వని సెల్ టెలిఫోన్ తీసి 911 నెంబర్‌కి ఫోన్ చేసి ఏక్సిడెంట్ అయిన ప్రదేశం, తన వివరాలు, టెలిఫోన్ నెంబర్ చెప్పి "అంబులెన్స్ వస్తుంది. కదలకండి. కుక్కని తిప్పి ఇంటి దగ్గర వదలి ఆఫీసుకి వెళ్లాలి, బెస్ట్ ఆఫ్ లక్" అంటూ కుక్కతో పరుగు కొనసాగిం చింది.

పది నిమిషాలలో అంబులెన్స్ వచ్చి రమ ణయ్యని దగ్గరగా ఉన్న హాస్పిటల్‌కి రవాణా చేసినా రమణయ్యకి ఉన్న ఇన్సూ రెన్స్ నాసిరకం ఇన్సూరెన్స్ అని తెలుసు కుని నొప్పి తగ్గడానికి మందు ఇచ్చి ధనరా జ్‌కి ఫోన్ చేసి అతని రాకకోసం ఎదురు చూశారు. ధనరాజ్ వచ్చి కాగితాలు మీద



సంతకం చేశాక నడుముకి ఎక్స్‌రే తీసి డిస్క్ కదిలిందని దానికి ప్రత్యేకమైన చికిత్స అంటూ లేదని, అనవసరమని, పదిహేను రోజులలో దానంతట అదే సర్దుకుపోతుందని, బెడ్ రెస్ట్ అవసరమని, నొప్పి ఎక్కువగా ఉంటే ఉపశమనానికి మాత్రలు వేసుకొమ్మని రమణయ్యని డిస్చార్జ్ చేసేశారు.



నిద్రమాత్రలు, నొప్పి ఉపశమనానికి మందులు వేసుకున్నా నొప్పి తీవ్రత కాస్త తగ్గినా నిద్రపట్టక అటూ ఇటూ ఒత్తిగిల్లలేక అవస్థ పడుతుంటే

"రాజ్ రేపటి సంగతేమిటి? మీ నాన్న గారిని చూడడానికి మార్గం ఏమిటి?" అని రవళి ధనరాజ్‌ని అడగడం స్పష్టంగా వినిపించింది రమణయ్యకి.

"నేను రేపు, ఎల్లుండి సెలవు పెడ్తున్నాను. తర్వాత శని, ఆది వారాలు వస్తున్నాయి" అంటూ ధనరాజ్ సమాధానం విన్న రవళి నుంచి ఏమీ రియాక్షన్ రాలేదు. ధనరాజ్ సహాయంతో నాలుగు రోజులు గడిచేక ఆదివారంనాడు సమస్య తిరిగి ఎదురుగా నిలుచుంది.

"రవీ నువ్వు రెండు రోజులు సెలవు తీసుకుని నాకు రిలీఫ్ ఇస్తే తరువాత రెండు రోజులు నాకు సెలవు ఇస్తారేమో అడిగి చూస్తాను" అంటూ ధనరాజ్ రవళిని అర్థించేడు.

"వీలవదు రాజ్! ఆలస్యమైన ప్రోజెక్ట్ ఇప్పుడే పూర్తయేదశలో ఉంది. నే సెలవు పెడితే తిరిగి అందర్నీ సమన్వయపరచడం కష్టం" అంది రవళి.

"మా బాస్ నన్ను చికాగోలో ఉన్న క్లయింట్ దగ్గరకి వెళ్లమన్నాడు. రెండు రోజులు వెనక్కి తోసేను. ఇంక తాత్సారం చేయడం వీలవదు. నేను రేపు బయలుదేరి వెళ్లాలి, ఫ్లైట్ రిజర్వ్ అయింది" అంటూ తన పరిస్థితి వివరించాడు ధనరాజ్.

కాస్సేపు ఇద్దరూ మాటలాడలేదు.

"నీకూనాకూ ఇద్దరికీ వీలవని పరిస్థితి కాబట్టి ఎవరైనా నర్స్ దొరుకుతుందేమో చూస్తాను" అన్నాడు ధనరాజ్.

"నర్స్‌ని ఇంటికి పిలిపించడం చాలా వ్యయంతో కూడినపని. ఆ ఖర్చుని మీ డాడీ ఇన్సూరెన్స్ కంపెనీ ఇస్తుందేమో అడిగిచూడు" అంటూ ఆ ప్రతిపాదనకి అడ్డు తగిలింది రవళి.

"ఆయన పరిస్థితి ప్రమాదకరం కాదుకాబట్టి అన్నీ అమర్చి ఇంటికి తాళం వేసుకొని వెళ్లిపోదాం, సాయంకాలం తొందరగా రావడానికి ప్రయత్నిస్తాను" అంది రవళి.

"వద్దు ఈ వారం నర్స్‌ని పిలుస్తాను. శుక్రవారం నేవచ్చేక తీరికగా ఆలోచిద్దాం" అన్నాడు ధనరాజ్ అదే ఆఖరి నిర్ణయం అన్నట్లుగా.

"రాజ్ దటీజ్ అన్‌నెససరీ" అంటున్న రవళి మాటలని ధనరాజ్ పట్టించుకోలేదు. ఇద్దరి మధ్యా భేదాభిప్రాయం వచ్చిందని, దానికి కారణం తన ఏక్సిడెంట్ అని అర్థమైంది రమణయ్యకి. శుక్రవారం నాడు ధనరాజ్ వచ్చేంతవరకూ చిరుబురులాడుతూ కనిపించిన రవళిని పలకరించడానికే

# ఏరినముత్యాలు

★ పిల్లల్ని కనేవారికంటే పిల్లలకు చదువు చెప్పేవారినే ఎక్కువగా గౌరవించాలి.

-అరిస్టాటిల్

★ చదువు రహస్యం విద్యార్థులను గౌరవించడంలోనే ఉంది.

-ఎమర్సన్

★ మనం అభ్యుదయాన్ని పొందాలంటే చరిత్ర తిరిగి రానివ్వకుండా కొత్త చరిత్రను సృష్టించాలి.

-గాంధీజీ

★ మూగవాడు మాట్లాడగల భాష, చెవిటివాడు వినగల భాషే దయ.

-సి.ఎస్.బోవీ

★ మోహం సింహాసనాన్ని అధిష్టించితే బుద్ధి తప్పుకుంటుంది.

-ఎం. హెన్రీ

★ మనమే ముఖ్యం అని ఆలోచించడం మానగలిగితే మనం ఇతరులకు ముఖ్యులం అవుతాం.

-రాధాకృష్ణన్

★ మనసును భగవంతుడికి అప్పగించి హస్తాలను పనికి అప్పగించు.

-స్వామి ఓంకార్

★ జీవితపు గొప్ప ముగింపు తెలుసుకోవడంలో లేదు. చేయడంలోనే ఉంది.

-థామస్ హెన్రీ హక్స్లే

★ మేధావులు తాము నిర్ణయించుకున్న కార్యాన్ని వదిలిపెట్టరు.

-అబ్రహాంలింకన్

★ మీపని సక్రమంగా పూర్తి కావాలంటే తీరికలేని వ్యక్తిని ఎన్నుకోండి.

-ఎల్బర్ట్ హబ్బర్ట్

★ నా వరకు మంచి వార్తాపత్రిక అన్నది జాతి స్వగతమే.

-ఆర్థర్‌మిల్లర్

★ చిటికెడు ఉల్లాసం గంపెడు దుంఖంకన్నా విలువైనది.

-రిచర్డ్ బాక్స్టర్

★ మతం అన్నది ఆచరణే కానీ నమ్మకం కాదు.

-రాధాకృష్ణన్

★ బుద్ధిమంతుడి నాలుక కవచమే కానీ కత్తికాదు.

-విన్సెంట్ పీలె

★ చీకటిలో మీరు వ్యవహరించే తీరే మీ గుణం.

-డి.ఎల్.మూడి

సేకరణ: వి.వి.రమణకుమార్

భయంవేసింది రమణయ్యకి. శనివారం ఉదయం, "నా నడుము నొప్పి బాగా తగ్గింది. నా పనులు నేను చేసుకోగలను. వచ్చే వారం నర్స్ అవసరం లేదని ముందరే ఆవిడకి చెప్పు" అన్నాడు రమణయ్య.

రవళి మొహం కాస్త వికసించడం చూసి ధనరాజ్ ఏమీ అభ్యంతరం చెప్పలేదు. పగలంతా ఒంటరిగా పరుపు మీద కదల కుండా పడుకున్న రమణయ్య మెదడుని ఆలోచనలు మోతాదుకి మించి కొరకడం మొదలుపెట్టాయి. అనాథాశ్రమం నుంచి తెచ్చుకుని దత్తత చేసుకుని పెంచి పెద్ద చేసిన ధనరాజ్‌తో వెలిసిన బంధుత్వం బలమైనదే అయినా గత ఆరేళ్లలో ధన రాజ్ అమెరికా వచ్చి పది వేల మైళ్ల దూరంలో ఉంటున్న దగ్గరనుంచి పటిష్టమ నుకున్న ఆ బంధం మెల్లిగా మెత్తపడింది. పదవీ విరమణకి ముందర ఒకసారి, పదవీ విరమణ చేయబోయే ముందు రెండవసారి నాలుగు నెలలకి వచ్చి ధనరాజ్ దగ్గర ఉన్నా కొత్తదేశం కొత్త ప్రాంతీయ వాతావ రణం, ఆ పాత బంధుత్వాన్ని, ఆప్యాయతని చిగురింపచేయలేదు. ఆరేళ్లలో సడలిన బంధం, నాలుగేసి నెలలకి ఒకసారి వచ్చి ఉండడంతో పాత స్థితికి రాదు. దీనికి కారణం ఎవరిదీకాదు. సర్కస్ ఫీట్లులా అన్నింటిని బేలెన్స్ చేయడం అమెరికాలో అంత సులభంకాదు. ధనరాజ్ ఈదేశ ప్రవాహంలో మనిషి. అతనికి ఇండియా ప్రవాహం గురించి ఆలోచనేరాదు. అథవా వచ్చినా ఆ వాతావరణంలో ఇమడలేడు. అతను ఇక్కడ ఉండిపోయే మనిషి.

ఇహ మిగిలింది తను. జంతువులు తమ తరువాత తమ తరం నిలపాలని తెగ అవ స్థపడతాయంటారు. మనిషి ఈ విష యంలో జంతువులకన్నా ముందరే ఉంటాడు. రక్త సంబంధం, తన జీన్స్ ఉన్న వారసుని వదలాలన్న కోరిక తనకి ఎప్పుడూ లేదు. ఉంటే వివాహమే చేసుకునేవాడు. ధనరాజ్ తనకి దత్తపుత్రుడు కాబట్టి తన జీన్స్ తనలోనే అంతరిస్తాయి. ఐన్‌స్టీన్ లాంటి మేధావుల జీన్స్‌వలన, పికాసో, మైకె ల్ ఏంజెలో వంటి కళాకారుల జీన్స్ వలన ప్రపంచానికి ఏదైనా ఉపయోగం ఉండవ చ్చేమో కానీ తనలాంటి సామాన్యమానవుని జీన్స్ సంక్రమించకపోయినంత మాత్రాన ప్రపంచానికి ఏమీ నష్టంలేదు. మేధావులమ నుకుని తమ జీన్స్ వదలాలన్న తహ తహతో జీన్స్ వదిలినా ప్రపంచానికి ఒరిగిం దేమీ ఉండదు. అదీకాక ఈ రోజుల్లో జీన్స్ బదలాయింపు శాస్త్రం బాగా పురోగమించి ఏ జీన్స్ కావాలంటే ఆ జీన్స్ సమకూర్చుకునే రోజులు దగ్గరపడ్డాయి.

తన జీవితం పయనిస్తూ పయనిస్తూ కొంతకాలం దత్తత తెచ్చుకున్న ధనరాజ్ పోషణ బాధ్యతలో పరిగెత్తి అది ముగిసేక ఇప్పుడు ఒక కూడలి దగ్గరికి వచ్చింది. ఉదయం పరుపుమీదనుంచి లేవగానే రోజంతా గడవడానికి ఒక ప్రేరణ అవ సరం. తనకి ఆధ్యాత్మిక చింతనలేదు. ఈ దేశంలో నివాసం ఏర్పరచుకుని రాబోయే ధనరాజ్ పిల్లలతో ఆడుకుంటూ గడపడం ఒక మార్గం అయినప్పటికీ దానిలో తనకి నచ్చని ఇబ్బందులు చాలా ఉన్నాయి. పిల్లలు ఆర్థికంగా మెరుగవుతూ ఇబ్బందు లలో పడకుండా హాయిగా ఉండుంటే వాళ్లని చూసి తల్లితండ్రులు ఆనందిస్తారు. అంతేకానీ, జీవితపు పరుగులలో టెన్షన్‌కి గురి అవుతుంటే అది చూస్తూ తల్లితం డ్రులు హాయిగా ఉండలేరు. పిల్లలు వాళ్లు కల్పించుకున్న ఆనందహర్మ్యాలలో నివశి స్తుంటే. అది నచ్చని తనలాంటి వాళ్లకి గుండె కోత తప్పదు. దేశంకాని దేశంలో తరంతరంకి మధ్యని ఉన్న అగాథం, అంచుకి అంచుకి మధ్యని ఉన్న ఖాళీ చాలా పెద్దదని తనకి అవగాహన అయింది. వీసా నిబంధనల దృష్ట్యా, అమెరికాలో తను ఒక సారి ఆరు నెలలకంటే ఎక్కువ రోజులు





ఉండలేదు. ధనరాజ్ దగ్గర ఉండాలంటే ఇండియాకి ఆరు నెలల తరువాత తిరిగి వెళ్లి యాత్రీకునిగా వస్తూపోతూ ఉండాలి. అది వ్యయంతో కూడిన పని. తను ఇక్కడ ఉన్నపుడు రోగగ్రస్తుడయితే ఇన్సూరెన్స్ లేని తన హాస్పిటల్ మందుల ఖర్చు ధన రాజ్ భరించలేడు. అది తనకి అనుభవ పూర్వకంగా తెలిసింది. ఇదివరలో ధన రాజ్ ఒంటరిమనిషి, నిర్ణయాలు అతని ఒక్కడివే. కాని ఇప్పుడు నిర్ణయం ధనరాజ్, రవళిల ఇద్దరిమీదా ఆధారపడి ఉంటుంది. ఎండాకాలంలో దాహంతో పిట్టలు బడలి పోయి పడిపోయినట్లు ఇప్పుడు అమెరికాలో ఉద్యోగాలు పోతున్నాయి. ఇది ఎవర్కైనా జరగవచ్చు. హెచ్‌వీసామీద దాదాపు ఐదేళ్లు పూర్తవుతున్న ధనరాజ్ పరిస్థితి ఏమిటో ఏం జరుగుతుందో అతను చెప్పలేడు. కానీ తను ఊహించగలడు. దాని గురించి ఆలోచన తనకి అనవసరం, ధనరాజ్ తన సంగతి తను చూసుకోగలడు.

ప్రశ్న మళ్లీ మొదటికి వచ్చింది. తన మాటేమిటి? మద్రాసు ఐఐటీలో పని చేసే టప్పుడు చాలాకాలం క్రితం చవకరోజుల్లో తోటి ఉద్యోగుల బలవంతంతో వాళ్లతో పాటు వాళ్లు ఉన్న వీధిలో తనూ ఒక ప్లాట్ కొనుక్కుని చిన్న ఇల్లు కట్టుకున్నాడు. ఇల్లు చిన్నదే అయినా వసతి యోగ్యంగా ఉంటుంది. దగ్గరగా ఉన్న స్నేహితుల పిల్లలు కూడా అమెరికాకి వలస వచ్చేయగా స్నేహితులు కూడా పిల్లలకి దూరంగా ఒంటరిగా రోజులు వెళ్లదీస్తున్నవాళ్లే. ఒక ప్పుడు వృద్ధాప్యంలో తల్లితండ్రులు పిల్లల దగ్గర గడిపేవారు. అది ఆనాటి ఆనవా యితీ. రోజులు, ఆనవాయితీలు మారాయి. అవకాశం వచ్చినపుడు తాము వాటిని వదు లుకుంటే అవకాశాలు తిరిగిరావని అన్నివి ధాలా బాగుంటుందని పిల్లలు దూరతీరాలకి వెళ్లడంతో తల్లితండ్రులు ఒంటరివారవడం అనివార్యం. దీనిలో గుండెలు బాదేసుకోవ డానికి అంటూ ఏమీలేదు. ఇపుడు ఇదే ప్రకృతి ధర్మం.

"రెక్కలు వచ్చిన పిల్లలు ఇంటినుంచి వెళ్లాకే అసలైన జీవితం ఆరంభమవుతుంది" అంటారు అమెరికన్లు. జీవితంలో తాము చేద్దామనుకుని గతంలో చేయలేని పనులు చేస్తూ జీవితాన్ని కొత్తపుట తిప్పుతుంటారు. భార్యాభర్తలు లేదా ఒకే ఊహలున్న వ్యక్తులు జంటగా కలిసి ప్రయాణం చేస్తారు. కొత్త ప్రదేశాలు సందర్శిస్తారు. జీవితాన్ని ఇంకో వ్యక్తితో పంచుకుంటే కాని దానిలో మాధుర్యంలేదు. ఉప్పూకారంలే కుండా ఉన్న కూర తినడం లాంటిది. చంద్రుడిని చూసి విసిరిన రాయి తగిలి చంద్రుడు నేలకూలితే అది ఎవ్వరూ గమ నించకపోతే ఆ సాధించిన ఫీట్ విలువ సున్నా! ప్రపంచంలో మనం ఒక్కళ్లమే ఉంటే మనం ఏ కొత్త విషయాలు కను క్కున్నా ఏం సాధించినా అది ఉపయోగిం చడానికి ఎవ్వరూ లేకపోతే అది సాధించిన దానికి ఫలితం శూన్యం. అది సాధిస్తుంటే దానిని చూసి ఆనందించే వ్యక్తి ఎవరైనా కనీసం ఒక వ్యక్తి అయినా ఉంటే పరవా లేదు. చిన్నప్పుడు విజయనగరంలో చదువు కునేటప్పుడు జలజ అంటే తను ఆసక్తి కన పరిచేవాడు. కానీ కాస్త పరిచయం పెరిగి ఆమె ధోరణి, తన ఊహలు ఒక్కలాంటి వేనా? అని ఆలోచించేలోగా ఆమెకి పెళ్ల యింది.

పిహెచ్‌డి చేసే రోజుల్లో రీసెర్చ్ పేపర్ల గురించి తనతో తరచూ కలిసే విశాలికి తనంటే ఇష్టం అన్నది అడపా తడపా ఆమె ప్రదర్శించినా ఆమెకి వెంటనే విదేశాలు వెళ్లి పోదామన్న గాఢమైన కోరిక ఉండేది. దానితో తను ఏకీభవించకపోవడంతో విశాలి ఆస్ట్రేలియా వెళ్లిపోయింది. అప్పటినుంచి స్త్రీలతో ప్రమేయం ఉంచుకోకుండా చదువు, రీసెర్చ్, ఉద్యోగంలో నిమగ్నుడయేడు.

రోజులు వెళ్తుంటే తను ఒంటరిగా బతు

కుతానన్న పేరు వ్యాపించింది. దీనికి కారణం ఏమిటి? అన్నది చాలామంది చర్చకి మంచి టాపిక్‌గా ఉపయోగపడింది. తన దగ్గర ఏమీ సమాధానం లేకపోవ డంతో ఎవరైనా తనని ప్రశ్నిస్తే చిరునవ్వే శరణ్యమయేది. అందర్నీ ఆశ్చర్యంలో ముంచుతూ తను ధనరాజ్‌ని దత్తత తీసు కున్నాడు. తరువాత జీవితంలో ధనరాజ్, అతని భవిష్యత్తుమీద కృషి జీవితంలో భాగమైంది. ధనరాజ్‌ని తను ఇంటికి తీసుకు వచ్చినపుడు అతని వయస్సు ఐదు. జ్ఞానం పూర్తిగాలేకపోయినా రమణయ్య తన తండ్రి కాదని అతనికి తెలుసు. ఒకే ఒకసారి తనూ ధనరాజ్ ఏదో ఇంగ్లీషు సినిమా చూసి తిరిగి వస్తుంటే "అమెరి కాలో దత్తత పిల్లలు తమ తల్లితండ్రులని కనుక్కోగలిగారు. కానీ ఈ దేశంలో సంభ వమా?" అనడిగాడు. ఆ ప్రశ్న తనని కంగారు పెట్టింది. తమాయించుకుని "ఆ దేశాలలో రికార్డ్స్ వగైరా జాగ్రత్తగా ఉంచు తారు. కానీ మనదేశంలో నమోదు అవవు సరిగ్గా. హత్యలు ఎన్ని జరిగాయో? లాంటి వాటికే రికార్డ్సు సరిగ్గా లేనిచోట దత్తత గురించి రికార్డ్సు ఉంటాయా?" అని సమా ధానమిచ్చేడు తను. అది విని ధనరాజ్ తృప్తిపడ్డాడనే అనిపించింది తనకి. మళ్లీ ఎప్పుడూ అలాంటి టాపిక్ చర్చలోకి రాలేదు. చదువుకి మైసూరు వెళ్లడం, అమెరి కాకి వలస వచ్చిన సంవత్సరాలు మినహా యిస్తే ధనరాజ్ తన దగ్గర దాదాపు పధ్నా లుగేళ్లు పెరిగాడు.

"ఎలా ఉన్నారు డాడీ?" అంటూ ఆప్యా యంగా పలకరించాడు ధనరాజ్. తలుపు తోసుకుని ధనరాజ్ లోపలికి రాగానే రమ ణయ్య ఆలోచనలు ఆగాయి.

ధనరాజ్ పెంపకంలో తనేమీ పొర పాటు చేయలేదని అతని ఆప్యాయత చూసి అనిపించింది.

"నువ్వు అనవసరంగా కంగారు పడుతు న్నావు. బాగానే ఉన్నాను" అన్నాడు రమ ణయ్య పెరిగిన ఉత్సాహంతో. ధనరాజ్ పేపర్‌లో వార్తల గురించి సినిమా గురించి చర్చిస్తుంటే పక్కని కూర్చున్న ధనరాజ్‌ని చూస్తుంటే వీపు నొప్పి తగ్గినట్లనిపించింది రమణయ్యకి.



ధనరాజ్, రవళి ఆఫీసుకి వెళ్లి రెండు గంటలయింది. మగ్‌లో పోసుకున్న కాఫీ చల్లారినా లేచి దాన్ని మైక్రోవేవ్‌లో వేడిచే సుకునే ఓపిక లేక చల్లని కాఫీ తాగడం మొదలుపెట్టాడు రమణయ్య. మొదటిసారి చల్లగా ఉన్న కాఫీ తాగితే అదోలా అనిపిం చింది కాని రోజూ తాగుతుంటే క్రమేణా అది అలవాటయింది రమణయ్యకి. అలాగే శరీరం నొప్పి భరించడానికి అలవాటుప డింది. టెలిఫోన్ మ్రోగితే దగ్గరగా ఉన్న టెలిఫోన్ రిసీవర్ ఎత్తాడు.

"హలో రమణా! ఏమిటి నీకు ఏదో ఏక్సి డెంటయి డిస్క్ జరిగిందటకదా? నాకు ఈవేళ ఉదయం ధనరాజ్ ఫోన్ చేసిన పుడు చెప్పాడు. ఎలా ఉన్నావు ఇప్పుడు?" అనడిగాడు గోపాల్ ఫోన్‌లో ఆదుర్దాగా.

"నొప్పి బాగా తగ్గుముఖం పట్టింది. ఇప్పుడు కులాసాగానే తిరుగుతున్నాను"

అని సమాధానమిచ్చేడు రమణయ్య.

"దానికి బాగా రెస్ట్ అవసరం. నేమళ్లీ ఫోన్ చేస్తాను" అంటూ ఫోన్‌లో సంభాషణ నిలుపు చేసేడు గోపాల్. గోపాల్ ఆదుర్దా గమనించి గొంతు రుద్ధమైంది. స్నేహమంటే చాలా ఇష్టం గోపాల్‌కి. తనని ఎంతబాగా చూసేడో జ్ఞాపకానికి వచ్చింది. ఫోన్‌లో మళ్లీ అతని ఆరాటం, ఆతృత విన్నాక రమణయ్యకి కళ్లు చెమర్చాయి. తనంటే గోపాల్‌కి ఎందుకంత అభిమానం? ఇంజనీరింగ్ చదివేటప్పుడు అతనిని తను చాలాసార్లు తన సైకిల్ మీద తిప్పడం మినహా అతనికి తను ఏమీ చేయలేదు. కానీ అతనికి తనంటే కొండంత అభిమానం.

ప్రకృతిలో కొన్నింటిని వివరించడం అసంభవం!

పురుగు వెలుతురుని చూసి ఎందుకు ఉత్సాహపడుతుంది? దాని చుట్టూ ఎందుకు పరిభ్రమిస్తుంది? దీపం చుట్టూ అది ఎందుకు తిరుగుతుంది. వేడికా వెలుతురుకా? రెక్కలు కాలుతున్నా అలాగే ఎందుకు ముట్టుకుంటూ మంటల్లో పడి ఆహుతి అవుతుంది? ఈ విలక్షణకి ఏవేవో సంజాయిషీలు ఇస్తారు కానీ వాటిలో నిజం ఎంత? ఎవరితోనూ ఆప్యాయత పెంచుకోకుండా జీవితాన్ని నెట్ట ప్రయత్నిస్తారు కొందరు. కానీ వాళ్లకి ఒకసారి ఎవరితోనైనా అనుబంధం ఏర్పడితే వాళ్లని వదిలిపెట్టరు, వదిలిపెట్టలేరు. తను అలాంటి కోవకి చెందిన మనిషా? పక్కపక్క ఇళ్లలో ఉన్నపుడు కవిత కనిపిస్తే కులాసాగా కబుర్లు చెప్పుకోవడం మినహాయిస్తే కవిత గురించి తనకి ఏమీ తెలియదు, తెలుసుకో ప్రయత్నించలేదు ఎప్పుడూ. నిన్న మొన్నటి వరకూ ఆమె జీవితం గురించి తనకి ఎప్పుడూ ఆమె వివరించలేదు. హాయిగా కాలం గడపడానికి, కలిసి నవ్వుకోవడానికి ఆమె గురించి వివరాలు అనవసరం అనిపించే కాబోలు తనూ ఎప్పుడూ ఆమె విషయాలు ఆరా తీయడానికి ప్రయత్నించలేదు. ఆమె ఇల్లు అమ్మేసి ధనరాజ్ ఉంటున్న ఇంటికి దూరంగా తన భర్త దగ్గరకి వెళ్లిపోతానన్న వార్త తనలో తీవ్ర సంచలనాన్ని కలిగించింది. ఏ విషయంమీదనైనా ఆఖరికి తన వ్యక్తిగత విషయాలని కలుపుకుని నిర్భయంగా సంకోచంలేకుండా మనస్సులోని ఉద్దేశ్యం చెప్పి అపార్థం చేసుకోకుండా అర్థం చేసుకునే ఒక తోడు దూరంగా వెళ్లిపోతుంటే విషాదంకాక ఇంకేమిటి కలుగుతుంది?

ఒక చెడు చరిత్ర లాంటిది లేకపోతే "నేను మారిపోయాను. నా దగ్గరకి వచ్చేయ్" అని ఎవ్వరూ అనరు. దానిలో ఏమీ సందేహంలేదు. ఆ వ్యక్తి నిజంగా మారితే ఫరవాలేదు, కానీ అలాంటి వ్యక్తితో వెళ్లిపోయి అతను నిజంగా మారకుండా కవితను స్వప్రయోజనంకోసం ఉపయోగించుకుంటే కవిత కష్టాలపాలవుతుంది.

కవిత తనకి మళ్లీ తటస్థపడదు. కవిత ఎలా బతుకుతోందన్న ఆలోచన తనని చాలాకాలం వెంటాడకమానదు, కానీ తను ఏం చేయగలడు? అనుకుంటూ గింజుకున్నాడు రమణయ్య.

హుషారుగా చలాకీగా కనిపిస్తూ బాధల్ని దిగమింగి ఆహ్లాదాన్ని ప్రదర్శించిన కవిత ఆనందంగా ఉందా? అన్న ఆలోచన మళ్లీ రమణయ్యని విచారంలోకి తోసింది.

ప్రతీరోజూ "కవిత ఎలా ఉందో?" అన్న ఆలోచనతో సతమతమయ్యాడు రమణయ్య. నడుమునొప్పి దాదాపు అంతరించినట్లే అనిపించాక "రాజ్ నాకు వచ్చే వారానికి లేదా ఎంత త్వరగా సాధ్యపడితే అప్పటికి రిజర్వేషన్ చేయించగలవా?" అన్నాడు రమణయ్య ఒక సాయంకాలం, ప్రదేశం మారితే కవిత గురించి వ్యాకులత తగ్గుతుందని పించి.

"నీకు ఇక్కడ ఇబ్బందిగా ఉందా నాన్నా! నీకు రిజర్వేషన్ వచ్చే నెల ఇరవై తారీకుకి ఉంది. దానిని ఇప్పుడు అనవసరంగా మార్చడమెందుకు? " అన్నాడు ధనరాజ్.

"ఏమిటో రాజ్ మన దేశంమీదకి గాలి మళ్లింది" అన్నాడు రమణయ్య.

"నీకు ఇంకా రెస్ట్ అవసరం. అలాంటప్పుడు పదిహేడు గంటలు ప్లేన్‌లో కూర్చోవడం కష్టం నాన్నా!" అన్నాడు రాజ్.

"ఆయనకి ఏది నచ్చితే అది మనం చేయాలికాని ఆయనకి ఇబ్బంది కలిగించకూడదుకదా? " అంది రవళి.

"ప్రయత్నించు. రిజర్వేషన్ దొరికితే వెళ్తాను, లేకపోతే వచ్చే నెల ఇరవై వరకు ఆగుతాను" అంటూ కాఫీ కప్పు కడగడానికి లేచాడు రమణయ్య.



గవర్నమెంట్‌కి బుద్ధిలేదు. ప్రతీ వ్యవహారంలో తలదూర్చి దానిని కంపు చేస్తే కాని వదలదు. ఒకసారి ప్రభుత్వపు ఇనుప సంకెళ్లలో దాస్యశృంఖలాలు విడవవు" అన్నాడు ముందర వరుసలో కూర్చున్న వ్యక్తి పేపరుపేజీ తిరగేస్తూ.

"గవర్నమెంట్ ప్రతీ దానిలోకీ కల్పించుకోవడం నాకూ ఇష్టంలేదు. కానీ గవర్నమెంట్ ఒకవిధంగా మన వీపు వెనకాల నిలబడి భయపెట్టకపోతే సంఘంలో ఉన్న బలహీనవర్గాలకి అప్పుడప్పుడు అన్యాయం జరుగుతుంది. అయితే గవర్నమెంట్ ఎంత కల్పించుకోవాలి? ఆ సరిహద్దు గీత ఎక్కడ గీయాలి? అన్నదే ముఖ్యమైన ప్రశ్న. ఉదాహరణకి ఒక వ్యక్తి కేన్సర్‌తో బాధపడుతూ బాధపడుతూ బతికేకన్నా చావే మంచిదనుకుని డాక్టర్లని కాని దగ్గర బంధువులని కానీ చనిపోయేందుకు సహాయం కోరితే, ప్రభుత్వం నేరం నేరం అంటూ దండిస్తుంది. దానికి కారణం లేకపోలేదు. ప్రభుత్వం భయం ఏమిటంటే అది నేరం కాదు అంటూ కళ్లు మూసుకున్న తక్షణం, రోగంతో ఉన్న మనకిష్టంలేని వాళ్లని ఖర్చు తగ్గించుకోవడానికో, లేక కక్ష తీర్చుకోవడానికో, రోగిని సాకే ఓపిక నశించో బాగానే ఉన్నవాళ్లని కూడా చంపేస్తారని భయం. హత్యలు చేసినా ఆ చట్టం ముసుగులో హంతకులు తప్పించుకుంటారు" అంది అతని పక్కని కూర్చున్న యువతి.

ముందర వరుసలో కూర్చున్న వ్యక్తులు ఏ అంశం మీద చర్చిస్తున్నారో తెలియకపోయినా దాని తాత్పర్యం అర్థమవుతోంది రమణయ్యకి. అమెరికాలో ఏ వ్యక్తినయినా ఆపి ఒక కాగితం ఇచ్చి "ప్రాణం మినహా నీకు అత్యంత ముఖ్యమైన పది అంశాలు ఏమిటి దీనిమీద రాయి" అనడిగితే వరుస క్రమంలో ప్రాముఖ్యమైనవి స్వతంత్రం, స్వతంత్రం... అంటూ పది సార్లు రాస్తారు కాబోలు. తమకు తామే ఆలోచించుకోగలమని తాము ఏ రకమైన నిర్ణయం తీసుకున్నా దాని పర్యవసానం ఏమైనా దానికి బాధ్యత పూర్తిగా తామే అని నమ్ముతారు. ఇతరుల సలహాలు, అందులో ముఖ్యంగా ప్రభుత్వం ప్రతిపాదించిన సలహాలు అంటే ప్రజలకి ఒళ్లుమంట. కొన్నాళ్లక్రితం ఇదే సంగతి ఉదాహరణలతో కవిత అమెరికా జీవన విధానంలో మెలకువలను తెలియచెప్పింది ఒకసారి. తనకి అది పూర్తిగా అర్థమవలేదు.

కవిత మరోసారి జ్ఞాపకంలోకి వచ్చి ఆలోచనల్లో విషాదాన్ని నింపింది. ధనరాజ్ ఆమె న్యూజెర్సీ వదిలి వెళ్లిందని చెప్పినపుడు తను ప్రత్యేకంగా ఆశ్చర్యపడలేదు. ఆమె తీసుకున్న ఆ నిర్ణయం సమంజసమైనదా? ఎవరికి సమంజసం? ఆమెకా? తనకా? తనకి ఎందుకు సమంజసమవాలి? అందరికీ సమంజసమెందుకవాలి? అనుకుంటుంటే సెయింట్ లూయిస్‌లో విమానం ఇంకో పదిహేను నిమిషాలలో దిగబోతోందని సీట్ బెల్ట్ సరిచేసికొమ్మని




ఎనౌన్స్‌మెంట్ వినపడింది. ఆలోచనల్ని కట్టిపెట్టి సీట్ బెల్ట్ హుక్ తగిలించుకున్నాడు రమణయ్య.

గేట్ నెంబర్ నలభై నాలుగునుంచి బైట పడి రెండడుగులు వేసి తను ఎక్కబోయే విమానం ఏ గేట్‌లోంచి బయలేరుతుందో తెలుసుకోవడానికి ఎదురుగా వేలాడదీసిన వీడియో స్క్రీన్‌వేపు చూశాడు రమణయ్య. చేతి సంచీ బరువుగా ఉంటే దానిని కింద ఉంచి మీదకి దృష్టి సారించాడు. రమణయ్యకి ముందర నాలుగైదు వరుసల మనుష్యులు నిలబడి అందరూ తమతమ విమానాల గురించి పరీక్షిస్తున్నారు. తను వెళ్లవలసిన గేటు ఎనభై ఎనిమిది.

"అనవసరమైన ఖర్చు నువ్వు వెళ్లకపోతే ఏం? ఆవిడ ఎలాగూ చనిపోయింది. దహనం కూడా చేసేరుట. నువ్వు వెళ్లి ఏం చేస్తావు? ఇక్కడ ఆఫీసులో ఒక నెల్లాళ్లు ఇంకెవరినో వేసుకోవాలి, డబ్బు దండుగ. టిక్కట్ డబ్బు దండుగ. ఇల్లు అంతా అస్తవ్యస్తం అవుతుంది. ఎంతో ఇబ్బంది నాకు" అంది ఒక మగ గొంతు. మెల్లిగా గొణుగుతూ మాటలాడినా రమణయ్యకి హిందీ బాగా రాకపోయినా ఆ మాటల్లో ఉన్న కర్కశత్వం రమణయ్యని ఇబ్బంది పెట్టింది. మాటలు వినిపించిన వేపు చూశాడు. లేత రంగు పేంట్ మీద నల్లని స్పోర్ట్స్ జాకెట్, సుమారు ఐదడుగుల పదంగుళాల పొడవు ఆజానుబాహువు ముందరకి వంగి ఎవరితోనో మాటలాడుతున్నాడు.

"ఇప్పటికైనా మించిపోయినదేమీలేదు. ట్రావెల్ ఏజెంట్ నాకు తెలిసిన వాడే. ఏదో మతలబుచేసి డబ్బు పోకుండా టిక్కట్టు వాపసు తీసుకునే ఏర్పాటు చేస్తాను. పదిహేను వందలు మిగులుతాయి. నామాట విను ప్రయాణం మానుకో" అంటూ సంభాషణ కొనసాగించాడు. అతను ఎవరితో మాటలాడుతున్నాడో రమణయ్యకి కనిపించడంలేదు. రమణయ్య వీడియో స్క్రీన్‌వేపు దృష్టిని మరలుస్తుంటే

"ఈ దేశం వచ్చి బిజినెస్‌లో పడి మానవతా విలువలు మీరు పూర్తిగా మరచిపోయారు. లాభం నష్టం ఇవే మీకు కావలసినవి. వాటితో ప్రతీ విషయానికీ లంకె పెట్టగలరు. అన్నదమ్ములతో, అక్కచెల్లెళ్లతో కలిసి ఆ బాధని పంచుకుంటే కానీ జీవితంలో ఉపశమనం రాదని, దానికి విలువ డాలర్లలో కట్టలేమని మీకు ఎంతచెప్పినా అర్థమవదు. అది నా దురదృష్టం. నా గేటు నెంబర్ డెబ్బయి నాలుగు, నే వెళ్తున్నాను" అంది ఒక స్త్రీ కంఠం. గుండెల నిండా కమ్మిన ఆవేదనతో ఆ మాటలు వెలువడినా ఆ గొంతుని అది ఎంత తక్కువ శబ్దంతో వినిపించినా తను ఇట్టే పోల్చగలడు. ఆ వ్యక్తి కవిత! అని గ్రహించాడు రమణయ్య.

వెనుక వరుసనుంచి ముందరకి వచ్చిన కవిత పైవరుసలో నిలుచున్న రమణయ్యని చూసి చటుక్కున ఆగింది. కవిత కంటిలో నీరు తిరుగుతోంది. ఆ నీటి పొరలలోంచి మసకమసకగా కనిపిస్తున్న రమణయ్యని ఆనవాలుకట్టి చిరునవ్వుతో చెక్కిళ్లు మీదకి లేవగానే కంటిరెప్పల్ని తాకుతున్న రెండు కన్నీళ్ల చుక్కలు జలజలా క్రిందకి జారాయి. కంటిలోంచి నీటిచుక్కలు జారగానే దృష్టి మామూలయి రమణయ్యని స్పష్టంగా ఎదురుగా నిలుచుండడం చూసి అది వాస్తవమని గ్రహించి "హలో బాగున్నారా?" అంటూ పలకరించింది. కవిత పరిస్థితి అవగాహన అయింది రమణయ్యకి. రమణయ్య మనసంతా దిగులుతో నిండిపోగా అనునయిద్దామన్నా సభ్యత అడ్డు తగిలింది. దానికి తోడు ఆమెతో ఉన్న అపరిచిత వ్యక్తి విసుగు మొహం. "హలో కవితగారూ" అన్నాడు రమణయ్య ఉత్సాహంగా. అంతవరకు దిగాలుగా ఉన్న





## సచిత్ర విచిత్రం

# తినుబండారాల కోసం కెమేరా

ఈ కెమేరా టి.వి. కార్యక్రమాల చిత్రీకరణలో వాడే బీటాకేమ్ కెమేరా. అయితే సీరియల్స్‌లాంటివి షూట్ చేయడానికి దీన్ని వాడరు. కేవలం భోజన పదార్థాలను చిత్రీకరించడానికి దీన్ని వాడతారు. వివిధ వాణిజ్య ప్రకటనల్లో చూపే తినుబండారాలు–ఐస్‌క్రీం, కేక్స్, చాక్‌లెట్స్, బిస్కెట్స్, కాఫీ, సాఫ్ట్ డ్రింక్స్‌లాంటివి కంటికి ఆకర్షణీయంగా కనిపించేలా చిత్రీకరించేందుకు ఓ ప్రత్యేక తరహా లెన్స్ ఈ కెమేరాకి అమర్చబడి వుంటాయి. మామూలు కెమేరాకి నాలుగింతలు ఖరీదైంది ఇది. కారణం దీని సేల్స్ తక్కువ. ప్రపంచం మొత్తంమీద నాలుగైదు వందలు మించిలేవివి.

కవిత మొహం రవ్వంత వికసించింది.

"ఈయన పేరు రమణయ్యగారు. న్యూజెర్సీలో నేను ఉండే ఇంటి పక్కని ఇంటిలో ఉండేవారు. వాళ్ల అబ్బాయిని చూడడానికి ఈ దేశం వచ్చారు. నా భర్త గోఖలే" అంటూ పరిచయం చేసింది కవిత.

"నమస్కారం" అన్నాడు రమణయ్య. "నమస్కారం" అని యాంత్రికంగా అంటూ విసుగుతో కవితవేపు దృష్టి మరల్చాడు గోఖలే.

"ఐ యామ్‌సారీ మీ అమ్మగారు పరమపదించేరని మీ మాటలు వలన తెలిసింది. ఎన్నాళ్లయింది? " అంటూ సంభాషణ మొదలుపెట్టబోయాడు రమణయ్య. గోఖలే మొహంలో రంగులుమారాయి. విసుగు చోటులో అసహ్యం చోటుచేసుకుంది. అది గమనించిన కవిత "నేవెళ్లాలి, ఫ్లైట్ టైమ్ అవుతోంది. గేటు నెంబర్ డెబ్బయి నాలుగు చాలాదూరం" అంటూ సంభాషణ తుంచి భర్తతో తన గేటు దిశగా నడిచింది. కవిత సంభాషణని అంత త్వరితంగా తుంచేస్తుందని ఊహించని రమణయ్య అవాక్కయాడు. బరువైన చేతి సంచీ మోస్తూ కాళ్లీడ్చుకుంటూ గేట్ నెంబర్ ఎనభై ఎనిమిది వేపు నడుస్తూ స్టార్‌బక్స్ కాఫీ స్టాల్ కనిపించగానే దానిలో ప్రవేశించి పెద్ద గ్లాసుతో వేడి కాఫీ అందుకున్నాడు. క్రీమ్ పంచదార మిళాయించి ఒక చేతిలో సంచీ ఇంకో చేతిలో కాఫీ గ్లాసుతో నడక పునఃప్రారంభించాడు. కవిత మరుగయి దాదాపు అరగంటయింది. బహుశా ఈపాటికి ప్లేన్ లోపలికి వెళ్లిపోయి ఉంటుందని, కవిత విమానం వెళ్లబోయే డెబ్బయి నాల్గవ నెంబర్ గేటువేపు చూశాడు. ఫ్లైట్ ఒక గంట ఆలస్యంగా బయలుదేరబోతోందన్న ప్రకటన చూశాక రమణయ్య కళ్లు కవితకోసం వెతికాయి. గోఖలే అసహ్యం జ్ఞాపకానికి వచ్చినా మనస్సుని అదుపులో ఉంచుకోలేక బెరుకుబెరుకుగా కూర్చున్న ప్రయాణీకుల వేపు చూస్తే ఒంటరిగా కూర్చున్న కవిత కనిపించింది.

గోఖలే జాడలేదు. ఆమె దగ్గరగా నిలబడి స్టార్ బక్స్ కాఫీ రెస్టారెంట్ వెయిటర్ కాఫీ వేడిగా ఉంటుందని ఇచ్చిన ఎక్స్‌ట్రా కప్ ఊడతీసి, కాఫీని సగంసగం చేసి ఒకటి కవిత మొహానికి దగ్గరగా ఉంచాడు. ఆలోచనల్లో మునిగి ఉన్న కవిత చక్రాల్లాంటి కళ్ళని పక్కకితిప్పి రమణయ్యని చూసి సంభ్రమంతో కాఫీకప్పు అందుకుంది. రెండుగుటకలు వేసి కెఫీన్ లోపలికి ప్రవేశించి ఉత్తేజం కలిగించాక మెల్లిగా తేరుకుంది.

"మీరు ఈవేళ ఇండియా వెళ్తున్నారా? మనం హాయిగా ఎంచక్కా ప్రయాణం చేయవచ్చు నాకు తోడుగా ఉంటారు, కంపెనీ ఇస్తారు. మీ సీట్ నెంబర్ ఎంత? నే వెళ్ళి వాళ్లని రిక్వెస్ట్‌చేసి మీ సీట్‌ని నా సీట్ పక్కకి మార్పిస్తాను" అంది ఉత్సాహంగా. పదినిమిషాలక్రితం దీనంగా, ఒంటరిగా కూర్చున్న కవితకి, ఇప్పుడు ఉత్తేజంగా మాటలాడుతున్న కవితకి తేడా గమనించి రమణయ్య ఆశ్చర్యపడ్డాడు.

"నా సీట్ నెంబర్ నలభైరెండు 'సి'. కానీ మన ఫ్లైట్స్ ఒకటి కావు. ఇండియాకి నా ఫ్లైట్ చికాగో ఎయిర్‌పోర్ట్ నుంచి. నేను చికాగోకి వెళ్లే ఫ్లైట్‌కోసం వచ్చాను. దారిలో మీరు కనిపించారు" అన్నాడు రమణయ్య. పాలలో కుంకుమపువ్వు వేశాక పాలరంగు మారినట్లు, మళ్ళీ కవిత మొహంమీద విషాదం చోటుచేసుకుంది. కాస్సేపు ఆలోచించి, మరి రెండు గుక్కల కాఫీ తాగి, "ఫ్లైట్ ఖాళీగా ఉన్నట్లుంది. మీరూ ఈ ఫ్లైట్‌లో రావడానికి వీలవుతుందేమో అడిగి చూడకూడదూ? " అంది కవిత అభ్యర్థిస్తున్నట్లు.

"నాకూ రావాలనే ఉంది, మీరు అడిగినా అడగకపోయినా అది వీలయితే ఆ పని చేసేవాడిని. నేను కొన్న టిక్కట్ అలాంటి

మార్పుకి అనుమతించదు. ఎయిర్ ఇండియా వాళ్ళ సంతకం తీసుకుని, మరో మూడు నాలుగు వందల డాలర్లు కడితే వీలవుతుందేమో. అంత డబ్బు నా దగ్గర లేదు. నా దగ్గర ఉన్నది కేవలం నూటపది డాలర్లు. అందుచేత మనం కలిసి ప్రయాణంచేసే అవకాశంలేదు" అని తన పరిస్థితి వివరించాడు రమణయ్య.

కవిత ఏమీ మాటలాడలేదు.

"ఒకసారి మిమ్మల్ని ఒక ప్రశ్న వేశాను, అదే కొంత వయస్సు వచ్చాక మనుష్యులు మారతారా? అని. దానికి మీరు, 'సాధారణంగా మారరు. మారినట్లు కనిపిస్తారేమో, లేదా నటిస్తారు' అన్నారు. జ్ఞాపకం ఉందా? " అనడిగింది కవిత కాఫీ గ్లాసులో మిగిలిన కాఫీని సొంతం ఖాళీ చేస్తూ. రమణయ్య తల ఊపేడు.

"మీరన్నది అక్షరాలా నిజం. ఒక రకమైన స్వతంత్ర ఒంటరి జీవితానికి అలవాటుపడిన నా దగ్గరకి గోఖలే వచ్చి తను మారేనని, ఉద్యోగానికి రాజీనామాచేసి, ఇల్లు అమ్మి చికాగోలో ఉన్న తన దగ్గరకు రమ్మంటే అతని దగ్గరకి వచ్చాను. ఇల్లు అమ్మగా వచ్చిన ఇరవై ఎనిమిదివేల డాలర్లు అంతా అతనికి సమర్పించాను. ఇంకోచోట ఎక్కువ జీతంతో వచ్చిన ఉద్యోగం కాదనుకుని గోఖలే నడుపుతున్న కంపెనీలో చేరాను. కాగితంమీద నా జీతం చాలా ఎక్కువే, కానీ నా చేతికి ఒక్క డాలరూ ఇంతవరకూ రాలేదు. కంపెనీ దివాళ తీసే దశలో ఉంది. ఎప్పుడు? అన్నదే చిన్న ప్రశ్న తప్ప, అది దివాలాతీయడం ఖచ్చితం. గోఖలే ఇలా కంపెనీలు పెట్టడం, దివాలాలు తీయడం గతంలో నాకు తెలిసినది రెండుసార్లు. ఈమధ్యన కొత్తగా ఎన్నిసార్లు జరిగిందో తెలియదు. నాకు జీతం ఇస్తున్నట్లు ప్రకటించి, ఆ జీతాన్ని తను వాడుకుంటున్నాడని నాకు తెలుసు. ఆర్థికంగా చాలా నష్టపోయాను నేను. గోఖలే మారతాడన్న నమ్మకం పూర్తిగా సడలిపోయింది. త్వరలో నే ఉద్యోగం చేస్తే కాని ఇల్లుగడవని పరిస్థితి వస్తుంది. అందుకే నే ఇండియా వెళ్ళడం అతనికి ఎంత మాత్రమూ ఇష్టంలేదు. "నువ్వు నన్ను వాడుకుంటున్నావు. ఎన్నాళ్ళిలా గోఖలే? " అని ఏదో ఒకరోజు అడిగేస్తాను, కాని గోఖలే..." అంటూ ఆగింది.

కవిత సందిగ్ధపరిస్థితి రమణయ్యకి అర్థమయింది. కానీ తను కవితకి ఎలాంటి సలహా ఇవ్వగలడు? అది గోఖలే కవితల మధ్య సమస్య. తనెలా తలదూర్చగలడు దానిలో? అనుకుని "నా ఫ్లైట్‌కి టైమ్ అవుతోంది. రేపు సాయంకాలం చికాగో ఎయిర్‌పోర్ట్‌నుంచి ఏడుగంటలకి నా. ఇండియా ఫ్లైట్. మద్రాసులో నా ఇంటి ఎడ్రసు, టెలిఫోన్ నెంబర్ ఇది. మీరు మద్రాసువస్తే, తీరుబడి ఉంటే నన్ను కలిస్తే చాలా సంతోషిస్తాను" అని, "వీలు చూసుకుని మద్రాసుకి రండి" అంటూ రెట్టిస్తూ చేతిసంచీ అందుకున్నాడు రమణయ్య.

"థాంక్స్ ఫర్‌ది కాఫీ ఎండ్ ఎవ్విరిథింగ్" అంది కవిత వీడ్కోలుగా.

"జీవితంలో మీరు పరిచయం అవడం నా అదృష్టం. మనం కలిసి గడిపిన రోజులు ఎప్పటికీ మరువలేనివి. బెస్ట్ ఆఫ్ లక్" అని కవిత కనిపించేంతవరకు వెనక్కి తిరిగి తిరిగి చూస్తూ, భారంగా అడుగులు వేసుకుంటూ గేట్ నెంబర్ ఎనభైఎనిమిది దిశగా నడిచాడు రమణయ్య. అంతవరకూ బరువు అనిపించని చేతి సంచీ భారమనిపిస్తోంది రమణయ్యకి. చేతిలో కాఫీ చల్లారిపోయింది. దగ్గరగా కనిపించిన చెత్తకుండీలో కాఫీకప్పుని పడేసి, చేతిసంచీని భుజానికి తగిలించుకున్నాడు రమణయ్య. గేటు నెంబర్ ఎనభైఎనిమిదికి చేరి, చేతి సంచీని పక్కన ఉంచి ఖాళీ కుర్చీలో సాగిలపడి బోర్డింగ్ ఎనౌన్స్‌మెంట్‌కోసం ఎదురుచూడసాగాడు.




చికాగోకి వెళ్ళే ఫ్లైట్ ఇంకో పదినిమిషా లలో బోర్డింగ్ మొదలుపెడతారన్న ప్రకటన విన్నాక, "కవిత ఎక్కడికి వెళ్తోంది? వివరాలు తెలియకుండా తనని ఆ ఫ్లైట్‌లోనికి మార్చుకొమ్మని అడగడం, కవిత సాధారణంగా చేసే రకం కాదు. అందుకు ఒక్కటే కారణం కనిపిస్తోంది. తల్లి పోయిన దుఃఖంనుంచి ఊరట కావాలి, అందుకు ఎవరితో ఒకరితో మనసువిప్పి మాటలాడాలి. గోఖలే తన ధోరణిలో కొట్టుకుపోతూ, కవితకి కావలసినట్లు ప్రవర్తించడంలేదు సరికదా కవిత తల్లి మరణానికి ఏమీ ప్రాముఖ్యత ఇవ్వకుండా, ఆమె ఇండియా వెళ్ళడాన్ని చాలా చులకన చేసి మాటలాడుతున్నాడు. ఫ్లైట్ మార్చుకుని తనతో రమ్మనమని అడగడంలోనే కవిత మెదడు ఎంత మొద్దుబారి పోయిందో తెలుస్తోంది. కవిత ఇండియాలో ఎక్కడికి వెళ్తోందో తెలిస్తే, మద్రాసు చేరేక ఆమెని ఒకసారి పరామర్శించవచ్చు అనుకుని కవిత కూర్చుని ఉన్న గేట్ డెబ్బయినాలుగువేపు పెద్ద అంగలువేస్తూ గబగబా నడిచాడు. డెబ్బయినాల్గవ గేట్ పోడియం దగ్గర చాలామంది సహాయం కోసం నిరీక్షిస్తున్నారు. కవిత జాడలేదు. గతంలో డెబ్బయినాల్గవ గేట్‌ని ఆనుకుని లోపలికి వెళ్ళడానికి తయారుగా ఉన్నవాళ్ళు చాలా తక్కువ మంది ఉన్నారు. అంటే, కవిత లోపలికి వెళ్ళిపోయి ఉండవచ్చు కవిత గమ్యం గురించి పోడియందగ్గర ఉన్న ఉద్యోగులని అడిగినా, వాళ్ళకి తెలిసే అవకాశం తక్కువని గ్రహించి, తిరిగి గేట్ నెంబర్ ఎనభై ఎనిమిదికి చేరాడు.

"విమానంలోనికి వెళ్ళేవాళ్ళందరూ వెళ్లారు. ఇంకో ఐదునిమిషాలు మీరు ఆలస్యంగా వస్తే, విమానం గేటు మూసేసేవాళ్లం, తొందరగా లోపలికి వెళ్ళండి" అంటూ హెచ్చరించాడు ఒక విమాన అధికారి.

అందరికన్నా ఆఖర్న లోపలకి ప్రవేశించడంవలన సామాన్లు ఉంచుకునే ఓవర్ హెడ్ కంపార్ట్‌మెంట్ ఇతరుల సామాన్లుతో నిండిపోయింది. ఇంకో దారి లేక చేతి సంచీని కాళ్ళదగ్గర ఉంచి సీట్ బెల్ట్ పెట్టుకున్నాడు. చేతిసంచీ కాలికి తగులుతూ కాళ్లని నొక్కేస్తుంటే బాధగా ఉంది రమణయ్యకి. అంతకన్నా కవితని ఆమె గమ్యస్థానం గురించి కనుక్కోలేదే అన్నది ఇంకా బాధపెడ్తోంది మానసికంగా.

ఆమెని ఇండియాలో కలిసే అవకాశం వస్తే తెలివితక్కువగా దానిని జారవిడిచాడు అనుకుని మథనపడుతూ కళ్ళు మూసుకున్నాడు.



"విమానంలోనికి వరుస నెంబర్ల ప్రకారం ప్రజలని లోపలికి ప్రవేశించమని ఆహ్వానిస్తున్నా," హాలులో ఉన్న జనంలో అసహనం ప్రదర్శనమవుతోంది. విమానంలో వెనకభాగంలో ఉన్న నలభైరెండవ వరుస ముందరగా రావడంతో, లోపలికి వచ్చిన రమణయ్య చేతిసంచీని ఖాళీగా మీద ఉన్న లగేజి కంపార్ట్‌మెంట్‌లోనికి నెట్టి, జాగ్రత్తగా సర్ది, సీటులో కూర్చుని

కళ్ళు మూసుకున్నాడు. పగలంతా గోపాల్ స్నేహితునితో తిరిగాక, ఆలస్యంగా ఎప్పుడూ తినేంతకన్నా ఎక్కువ తిండి పట్టించడంతో కడుపులో బరువు ఇంకా తగ్గ లేదు. ఎయిర్‌కండిషన్, దానితోపాటు మీదన అమర్చి ఉన్న కన్నాలలోంచి వస్తున్న ఆహ్లాదకరమైన చల్లని గాలి రమ ణయ్యని మగత నిద్రలోనికి తోసింది. నడిచే కారిడార్‌లో ప్రజలు సామాన్లని తీసు కువస్తూ శబ్దంచేస్తూ మాట్లాడుతున్నా రమ ణయ్య కళ్ళు తెరవలేదు. బహుశా అరగంట గడిచిందేమో, ప్రయాణీకుల ఆర్భాటం తగ్గి, సీట్లలో కూర్చుని, "మీరు లండన్ వరకా? లేక మద్రాసు వరకు వెళ్తున్నారా? " లాంటి ప్రశ్నలు, "అబ్బ! బైట హాలులో ఉక్కపెట్టి చచ్చేంబాబూ, ఇక్కడ హాయిగా ఉంది" అన్న తృప్తికరమైన వాక్యాలు రమణయ్య చెవులని తాకుతున్నా, చలించకుండా కళ్ళు మూసుకునే ఉన్నాడు.

"మిమ్మల్ని ఇబ్బంది పెడుతున్నందుకు క్షమించాలి. నా సీటు నలభై రెండు 'బి'. ఒకసారి మీరు లేచి నిలబడితే నేను లోప లికి వెళ్ళడం సుగమం అవుతుంది" అంది ఒక స్త్రీ గొంతు.

ఎలక్ట్రిక్ షాక్ తిన్నట్లు ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు రమణయ్య. ఎంతమందిలో ఉన్నా ఆ గొంతు తనకి చిరపరిచితమే. ఎదురుగా కవిత! "మీరు, మీరు..." అంటూ ఆనందంతో మాటలకి తడుముకుంటూ లేచి నిలబడ్డాడు రమణయ్య.

"అవును నేనే. నిన్న మీతో మాటలాడేక ఆ పాతటిక్కట్ కేన్సిల్ చేయించేను మొదట. ఈ ఫ్లైట్‌లో ఖాళీ ఉన్నాయని చెప్పగా మూడువందల డాలర్లు ఎక్కువ ఇస్తే దీనిలో సీటు దొరికింది. నాకు చేతి సంచీ తప్ప ఇంకేమీ లగేజి లేదు కాబట్టి అది సంభవమయింది" అంటూ తన చేతి సంచీని మీద లగేజి కంపార్ట్‌మెంట్ తెరిచి రమణయ్య చేతిసంచీ పక్కగా సర్ది, రమ ణయ్య పక్కసీట్‌లో నవ్వుతూ ఆసీనురాల యింది కవిత.

"థాంక్స్" అన్నాడు రమణయ్య.

"ఇటీజ్ మై ప్లెజర్ ఎంటైర్లీ" అంది కవిత.

మూడువందల డాలర్లు ఎక్స్ట్రా ఇవ్వా ల్సివచ్చిందంటే "ఐ డోంట్ కేర్, ఇటీజ్ వర్త్" అంటూ వివరించి, కబుర్లలోనికి దిగింది కవిత.



"రన్‌వే మీద ఎగరడానికి నిలుచున్న విమానాలలో మనది పదిహేనవది. ఈ సమయంలో ఎయిర్‌స్పేస్ చాలా రద్దీగా ఉంటుంది. అందుచేత మనం గాలిలోనికి ఎగరడానికి ఎంత సమయం పడుతుందో చెప్పలేం. బహుశా అరగంట పట్టవచ్చు గంట పట్టినా ఆశ్చర్యపడకూడదు. ఎయిర్‌కండిషన్ బాగానే పనిచేస్తోంది. రిలాక్స్ ఫోక్స్. త్వరలోనే ఎగురుతుందని ఆశిద్దాం. ఏదైనా ఎనౌన్స్‌మెంట్ ఉంటే మళ్ళీ చెబుతాను. విమానం గాలిలోనికి ఎగ రగానే, ముప్పయిమూడువేల అడుగులు ఎత్తుకి వెళ్ళాక, డ్రింక్స్ ముందర ఇచ్చి, తరు

వాత డిన్నర్ సప్లయి చేస్తాం" అన్నాడు విమానం నడిపే కెప్టెన్.

ఎండలో, వానలలో క్యూలో నిలబడడానికి అలవాటుపడిన ప్రజ, ఎయిర్‌కండిషన్డ్ విమానంలో కూర్చోవడానికి విసుగు ప్రదర్శించడం చూసి రవ్వంత ఆశ్చర్యపడ్డాడు రమణయ్య.

"ఇలాగే రన్‌వేమీద రెండుగంటలు ఉన్నాం. వెధవలకి ప్లానింగ్ సరిగ్గా రాదు" అన్నాడు ఒకడు.

"ఒకసారి నాలుగు గంటలు విమానంలో చాలినంత ఇంధనం లేకపోవడంతో టెర్మినల్‌లోనికి తిరిగి వెళ్ళాం. అంతా రాంభరోసా" అన్నారు ఇంకొకరు. నిమిషనిమిషానికీ రణగొణధ్వని ఎక్కువవుతోంది.

"ఎంత ఆలస్యమైనా ఐ డోంట్ కేర్, మీరు పక్కన ఉన్నారు కంపెనీ ఇవ్వడానికి" అన్నాడు రమణయ్య. చిరునవ్వు నవ్వింది కవిత.

"మద్రాసులో మీ దినచర్య ఏమిటి? " అంటూ ప్రశ్న వేసింది కవిత.

"నే ఉండే పరిసరాల్లో ముగ్గురు స్నేహితులు ఉన్నారు. వాళ్లు నా దగ్గరకి రావడమో,. వాళ్ళ దగ్గరకి నేను వెళ్ళడమో చేస్తాను. నిన్న నువ్వు వచ్చావు, అందుకు నేను ఈవేళ వచ్చాను. అంటూ పంతాలు పట్టింపులు లెఖ్ఖలు లేవు. కలుసుకున్నపుడు పిచ్చాపాటీ, ఏదైనా వాగ్వాదంవస్తే, ఆ టాపిక్ చర్చనీయాంశం కాదని మార్చుకుంటాం. అందుచేత తగువులు రావు. లంచ్, నిద్ర, టెలివిజన్, నడకకి వెళ్ళడంతో ప్రత్యేకమైన ఇబ్బంది కలగకుండా రోజు వెళ్ళిపోతుంది. మూడు చిన్న బెడ్రూంలు ఉన్న ఇల్లు నాది. ఒక బెడ్రూంలో గోడమీద పెయింటింగ్స్ వగైరా అమర్చి ఉంచాను. అది ప్రత్యేక అతిథులకి" అంటూ తన దినచర్య వివరించేడు రమణయ్య.

"మీ ఇల్లు ఎక్కడో కొంచెం వివరంగా చెప్పండి. రైల్వేస్టేషన్, మౌంట్‌రోడ్‌ల దగ్గరనుంచి ఏ దిశలో వెళ్తే మీరు ఉంటున్న ప్రదేశం వస్తుంది? " అనడిగింది కవిత.

రమణయ్య వీలయినంత వివరంగా తను ఉంటున్న ప్రదేశ పరిసరాలని, ఆనవాళ్ళని చెప్పాడు.

"నిజం? " అంది కవిత కళ్ళని పెద్దవి చేస్తూ

"నిజమే, ఏం ఎందుకు అంత ఆశ్చర్యం? "

"మీ ఇంటికి దగ్గరగా, అరకిలోమీటర్ దూరంలో మా చిన్నాన్న, అతని కుటుంబం ఉంటున్నారు. నేను ఇప్పుడు అక్కడికే వెళ్ళబోతున్నాను. నేను వచ్చి మిమ్మల్ని మీ ఇంటిదగ్గర కలుస్తానేమో. ఎవరు చెప్పగలరు? " అంది నవ్వుతూ.

ఆశ్చర్యంగా ఆమెవేపు చూస్తూ తన్మయుడయ్యేడు రమణయ్య.

రాత్రి ఎనిమిదన్నరయింది. పున్నమి వెన్నెల కాబోలు, బైట బంగారంలా మెరిసిపోతోంది వెన్నెల. షట్టర్స్ తెరచి ఉన్న కిటికీలోంచి వెన్నెల కవిత శరీరంమీదపడి, ఇహ నే ఎక్కడకీ వెళ్లనని మంకుపట్టి మొరాయించడంతో ఆమె మొహం, కంఠం ఛామనచాయరంగుని కోల్పోయి, నిమ్మకాయ రంగుని ఆపాదించుకున్నాయి. నీలంరంగు షల్వార్, కమీజ్ మీదున్న చవకరకం జరీలాంటిది కూడా ధగధగా మెరిసిపోతోంది. మీదని ఉన్న వెంటిలేటర్‌లోంచి వస్తున్న చల్లని పిల్లగాలి కవిత మొహాన్ని తాకి, ఉత్సాహంతో మీదకి లేచి, అల్లరిచిల్లరగా తిరుగుతున్న ముంగురులని మెల్లగా కదిలిస్తోంది.

పక్కన కూర్చున్న కవితవేపు చూసి తృప్తిగా ఊపిరిపీల్చేడు రమణయ్య.



# ఏరినముత్యాలు

## ప్రఖ్యాత తెలుగు రచయిత చలం రచనలనుండి

★ "మనం చరిత్రని బోధిస్తాం, కాని చరిత్రనుంచి ఏమీ నేర్చుకోం"
★ "సూర్యుడికి, కాంతికి వున్న సంబంధమే రచయితకి కళకి వుంటుంది"
★ "నువ్వు 'కళ'లో లీనం కావాలి. కళ నీలో లీనంకాదు"
★ "ప్రేమదానం తర్వాత స్త్రీ ఇవ్వగలది సౌందర్యదానం"
★ "ముందు తనని ప్రేమించుకోనివాడు లోకంలో ఎవరినీ ప్రేమించలేడు"
★ "చుట్టూ ప్రతిచోట ఆనందం వుంది. అనుభవించడమే చేతకాదు ప్రేమకు"
★ "తెలుగు నేలకి అందం వుంది. కాని తెలుగువాళ్ల చూసే దృష్టిలో అందంలేదు"
★ "మన ఆశయం అతి ఉన్నతమైతే దాన్ని అందుకోవడం కోసం జన్మంతా గడిపినా వ్యర్థంకాదు"
★ "వెయ్యి సాహసమైన ఆలోచనలకన్న ఒక సాహసకార్యం శక్తివంతమైంది"
★ "నిజం చెబితే కీర్తి రాదు. అబద్ధాలు తెలివిగా చెప్పేవాడికే నిజమాడిన కీర్తి"
★ "ప్రపంచాన్ని తన హృదయానికి దగ్గరగా తీసుకుంటే కవి అవుతాడు. ప్రవక్త అవుతాడు, కాని సంసారి కాడు"

## విఖ్యాత బెంగాలీ నవలా రచయిత శరత్ రచనలనుండి

★ "సంస్థ ప్రాచీనం, పవిత్రం, సనాతనం కావచ్చుగాని మనుష్యునికన్నా ఉచ్ఛమైనది కాదు"
★ "హర్తాల్" అనే పదం వుంది కాని శాంతియుత హర్తాల్ అంటూ ఎక్కడా లేదు. బాహుబలసంయుతం కాని హర్తాల్ ప్రపంచంలో ఎక్కడా ఫలించదు"
★ "ధనవంతుని ఆర్థిక నష్టం, బీదవాని లంఖనం రెండూ సమానం కావు"
★ "దేశమాత చరణాలముందు సర్వస్వం అర్పించి వేయటంకంటే మానవ జన్మకు సార్థకత మరొకటి లేదు"
★ "స్త్రీలు సత్యమైన మాటనే చెబుతూ సిగ్గుపడిపోతారు"
★ "పరాధీనదేశంలో పాలకుల పాలితుల ఇద్దరి నైతికబుద్ధి ఒకటే అయితే అంతకన్న దేశదౌర్భాగ్యం మరొకటి లేదు"
★ "ప్రతివాడు ప్రతిపని చేయటానికి యోగ్యుడై వుండడు"
★ "డబ్బుతో చాలా పనులవుతాయి. కనుకనే డబ్బును అపసవ్యంగా ఖర్చు చేయరాదు"

సేకరణ: *డి.శ్రీధరాచారి*

# చతురకతలు

## నమ్మకం

భీమారావుకి యాభై ఏళ్లుంటాయి. భార్యలేదు. పిల్లలు పెద్దవాళ్లవడంతో రెక్కలు వచ్చి తలో మూలకూ ఎగిరిపోయారు. అందువల్ల ఒంటరిగానే ఉంటున్నాడు. వంట చేయడానికీ, ఇంట్లో తోడుగా పడి ఉండడానికీ ఓ మనిషిని పెట్టుకున్నాడు.

ఆవిధంగా గత ఆర్నెల్లనుంచీ భీమారా




వింట్లో పని చేస్తున్నాడు కన్నారావు.

వంట బాగానే చేస్తున్నాడని మురిసిపోకు. పనివాళ్లనెప్పుడూ ఓకంట కనిపెట్టుకునుండాలి. అంటూ హెచ్చరించాడు కన్నారావుని పనికి కుదిర్చిన స్నేహితుడు.

కూరగాయలకనీ, సరుకులకనీ పంపిస్తే కన్నారావు ఖర్చు ఎక్కువ చూపిస్తున్నాడన్న అనుమానం కలిగింది భీమారావుకి.

ఏమన్నాఅంటే ఆ మాత్రపు మనిషయినా మళ్లీ దొరకడం కష్టం ఈరోజుల్లో. అందువల్ల వీలయినంతవరకూ బయటి పనులను పురమాయించడం మానుకున్నాడు. అలాగని తాను వాణ్ణి అనుమానిస్తున్నానన్న ఆలోచన వాడికి ఈషణ్మాత్రమయినా కలగకుండా జాగ్రత్తపడ్డాడు.

అయినా ఓసారి అడగనే అడిగాడు వాడు సూటిగా. "ఏంసారూ! నామీద మీకు అనుమానంగా ఉందా? సరుకులవీ నాకు పురమాయించడం మానేశారు" అని.

భీమారావు తత్తరపాటు కప్పిపుచ్చుకుంటూ "ఛ...ఛ... అదేంలేదోయ్! నమ్మకం లేకపోతే రోజంతా ఇంటిని నీకు అప్పగించి వెళ్లనుగా" అన్నాడు. అప్పటికి వాడు ఆ సమాధానంతో సంతృప్తి చెందినట్టే కనిపించాడు. అయినా ఎందుకయినా మంచిదని వాణ్ణి ఇంప్రెస్ చేసే ఉద్దేశ్యంతో తాళపుచెవుల గుత్తిని ఇంట్లో టేబిల్ పైన వదిలేసి ఆఫీసుకి వెళ్లడం ఆరంభించాడు రోజూ.

అయితే-

నెల్లాళ్ల తరవాత ఓరోజున ఆఫీసునుంచి వచ్చి న్యూస్‌పేపర్ చదువుకుంటున్న భీమారావు దగ్గరకు విసురుగా వచ్చాడు కన్నారావు.

కాఫీకప్పుకు బదులు సూట్ కేస్ ఉంది వాడి చేతిలో. అయోమయంగా చూసిన భీమారావుతో "నేనిక్కడ పని మానేస్తున్నాను." అన్నాడు.

భీమారావు ఆశ్చర్యపోయి "ఎంచేత?" అని అడిగాడు.

"మీకు నామీద ఏమాత్రమూ నమ్మకం లేదన్న సంగతి తేలిపోయింది. అందుకే!" అన్నాడు వాడు నిష్ఠూరంగా.

భీమారావు తెల్లబోతూ "అలాగని నేనెప్పుడన్నాను? అసలా సందేహం నీకెలా వచ్చిందీ?" అన్నాడు.

"ఇది ఉత్త సందేహం కాదు. మీరు నన్ను అనుమానిస్తున్నారనీ, నన్ను నమ్మడంలేదనీ ధృవపడిపోయింది" అన్నాడు వాడు పౌరుషంగా.

"అదేమిటోయ్! నీమీద నమ్మకం లేకపోతే రోజూ ఆఫీసుకెడుతూ తాళాలగుత్తిని ఇంట్లో ఎందుకు వదిలివెడతాను?" అన్నాడు భీమారావు నొచ్చుకుంటూ.

"అదేగదా సార్! నాబాధ. ఆ గుత్తిలోని ఒక్క తాళపుచెవీ బీరువాకిగానీ, పెట్టెలకిగానీ ఫిట్టయి చావడంలేదే. దాన్నిబట్టి తెలియడం లేదూ మీకు నామీద నమ్మకం లేదనీ?" అన్నాడు కన్నారావు.

– సత్యనారాయణ

---

## ర్యాగింగ్

జయంతి ఉన్న ఊర్లో ఇంటర్ మీడియట్ పూర్తిచేసి పట్నంలోని కాలేజీలో డిగ్రీకోర్సుకి అప్లయ్ చేసింది. ఈడొచ్చిన ఆడపిల్లను ఒంటరిగా హాస్టల్ లో వుంచి చదివించడానికి తల్లి ఇష్టపడలేదు. కాని జయంతి మౌనపోరాటం, నిరాహారదీక్ష వగైరా ఆయుధాలను సంధించి విజయం సాధించింది.

కాలేజీలోనూ, హాస్టల్ లోనూ అడ్మిషన్ లభించినందుకు సంతోషం కలిగినా కోఎడ్ కాలేజీ నూతన వాతావరణమూ ర్యాగింగ్ ని గూర్చిన బెంగా జయంతిని భయపెట్టకపోలేదు.

మొదటి రోజున భీతహరిణిలా కాలేజీలో అడుగుపెడుతోన్న జయంతి సీనియర్స్ దృష్టిలో పడనేపడింది. సీనియర్, బాయ్ సూ, గర్ల్ సూ ఆమెను చుట్టుముట్టి ఆమె వివరాల సేకరణలో ప్రశ్నల అమ్ములను గుప్పించారు. బెదురుగానే అందరికీ సమాధానాలు చెప్పిందామె.

ఆ తరువాత ఏవేవో పాటల పేర్లు చెప్పి ఆమెను పాడమని ఆదేశించారు. ఆ పాటలు తనకు రావంది.

"నీ అందం, అమాయకత్వాలకు బోనస్ గా కేవలం పాటలతోనే సరిపెడుతున్నాం. నువ్వు పాడి తీరాల్సిందే!" అంటూ డిమాండ్ చేశారంతా.

తనకసలు పాడడమే రాదన్నా వినిపించుకోలేదెవరూ. "పాట చాయిస్ నీకే ఇస్తున్నాం. నీకు వచ్చిన, నచ్చిన పాటే పాడు. అయితే ఆ కన్సెషన్ కి బదులుగా ఓ కండిషన్" అన్నారు బాయ్స్.

"ఏమిటది?" అనడిగింది భయంగా.

"నువ్వు పాడుతున్నంతసేపూ మేము ఏం చేసినా నువ్వు పాట ఆపకూడదు. పాట పూర్తయ్యాక మళ్లీ నీ జోలికి రాము" అన్నారు.

"ఎస్, ఇటీజ్ ఎ డీల్!" అంటూ వంతపాడారు గర్ల్స్.

తాను పాడుతూన్నంతసేపూ వాళ్లు తనయందు మిస్ బిహేవ్ చేస్తారేమోనని భయం కలిగింది జయంతికి. అలాగని మొండికేస్తే ఇంకేమి ముప్పు తలపెడతారో తెలీదు. ఆమె పల్లెటూరి పిల్లే అయినా తెలివైనది. ఎక్కువసేపు రెసిస్ట్ చేయకుండా సరేనంది.

ఉత్సాహంతో అరుస్తూ చప్పట్లు చరుస్తూ ఆమె చుట్టూ వలయాకారంలో చేరి డాన్సు ఆరంభించారు సీనియర్స్ అంతా.

జయంతి చేతిలోని పుస్తకాలను క్రిందపెట్టింది. తరువాత గళం విప్పింది.

అంతే!

హఠాత్తుగా అక్కడి వాతావరణంలో మార్పు వచ్చేసింది. అరుపులూ, చప్పట్లు ఆగి పోయాయి. గెంతులూ, డాన్సులూ ఆపి ఎక్కడివారక్కడే ఎటెన్షన్‌లో నిలుచుండిపోయారు. అందరి వదనాలలోనూ ఆశ్చర్యం దట్టంగా కొట్టిన టాల్కంపౌడర్‌లా అలుముకుంది.

జయంతి పాడుతున్నంతసేపూ పిన్‌డ్రాప్ సైలెన్స్ అలుముకుందక్కడ.




పాడడం పూర్తికాగానే పుస్తకాలు తీసుకుని సీనియర్స్‌కి థాంక్స్ చెప్పి కూల్‌గా అక్కణ్ణుంచి నడిచి వెళ్లిపోయింది జయంతి.

అప్పుడుగాని తేరుకోలేదెవరూను. సీనియర్స్ ముఖాలు అప్పుడే వెల్లవేసిన గోడలా తెల్లగా అయిపోయాయి.

కారణం

జయంతి పాడినది జాతీయగీతం!

– వి.వి.వి.యస్

---

## ద గ్రేట్ ట్రిక్

సాయంత్రం ఆఫీసునుంచి వస్తూనే దిగాలుగా కూర్చున్న భర్తను చూసి ఆశ్చర్యపోయింది కాత్యాయిని. అతని షర్ట్ గుండీలు విప్పుతూ "ఏం జరిగిందండీ? ఎందుకలా వున్నారు?" అనడిగింది.

"కాత్యా! నేనో విషయం అడుగుతాను చెబుతావా?" అన్నాడు రాజారావు మెల్లగా.

ఏమిటన్నట్లు విస్తుపోయి చూసిందామె.

"పిల్లల వివాహ బాధ్యత కన్నవారిదికాదా? తమ్ముళ్లూ, చెల్లెళ్లూ... ఇలా ఒకొక్కరి పెళ్లిళ్లూ తలపైన వేసుకుని మోస్తూపోతే మన స్వంత బాధ్యతలు తీర్చుకునేదెలా?" అన్నాడతను భార్య వదనంలోకి చూస్తూ.

ఎలర్ట్ అయిపోయింది కాత్యాయిని. రాజారావు చెల్లెలి పెళ్లి కోసం ప్రయత్నాలు జరుగుతున్నాయి ఆమధ్య. సంబంధం కుదిరివుంటుంది. చెల్లెలి పెళ్లికి డబ్బు సర్దమని రాసుంటాడు తండ్రి అతనికి. ఇప్పుడే గట్టిగా వుండాలి తాను. లేకుంటే ఈ మెతక మనిషి ఇల్లు గుల్ల చేసేస్తాడు అనుకుంది.

"పెళ్లిళ్లు కానివ్వండి, పురుళ్లు కానివ్వండి కడుపులు చేతపట్టుకుని బయటకు పోయి ఎవరి బతుకు తెరువుకు వాళ్లు పాట్లుపడుతున్న ఈ కాలంలో కూడా జ్యేష్ఠులంటూ పెద్దవాళ్లు పిల్లల్ని పీడిస్తే చివరికి వాళ్లు దెష్టలుగా మిగులుతారు. పెళ్లిళ్లయిపోయాక

ఎవరి బతుకులు వారివే" అంటూ ఓ చిన్న లెక్చరిచ్చింది.

"కానీ కాత్యా! ఆపద్ధర్మంగా తల్లిదండ్రులను అవసరంలో ఆదుకునే బాధ్యత మనకు లేదంటావా? " అన్నాడు రాజారావు.

"ఆపద్ధర్మమనుకుని ఉద్ధరించబోతే చివరికది వట్టి ధర్మంగానే మిగిలిపోతుందండీ" అందామె.

"మగపిల్లలైనా ఆడపిల్లలైనా అంతేనంటావా? "

"ఎవరైనా ఒక్కటే!" ఖచ్చితంగా అంది. తరువాత "ఇంటి దగ్గరనుంచి ఉత్తరమేదైనా




వచ్చిందా? " అనడిగింది అనుమానంగా.

తన అనుమానం నిజమయిందనుకుని "పెళ్లి కుదిరిందటనా? " అనడిగింది.

"ముహూర్తాలు కూడా పెట్టించారట"

"డబ్బు సర్దమని రాశారా? " ఆరా తీసింది.

"ఔను, పెద్దమనిషి అభిమానం చంపుకుని సాయంకోరితే మొండిచెయ్యి చూపడానికి నా మనసు అంగీకరించడంలేదు. అప్పోసప్పో చేసయినా ఆదుకోవాలనిపిస్తోంది" అన్నాడు.

"అంతటి మూర్ఖత్వం మరోటుండదు. మన దగ్గర పైసా లేదని రాసేయండి" అతని షూస్ విప్పి పక్కన పెడుతూ ఖచ్చితంగా చెప్పేసిందామె.

"అంతేనంటావా? "

"అంతే!" నిష్కర్షగా అంది.

చిన్నగా నిట్టూర్చి లేచాడతను. భర్త అంత సులభంగా తన సలహా విన్నందుకు ఆనందించిందామె.

జేబులోంచి కవరు తీసి భార్య చేతిలో పెట్టి బాత్‌రూంలోకి వెళ్లిపోయాడతను.

ఆ ఉత్తరాన్ని చదివిన కాత్యాయిని వదనం వెలిసిపోయిన చిత్తరువులా అయిపోయింది. దానిని రాసింది మామగారు కాదు, ఆడపడుచుకాదు, తన తండ్రే రాశాడు. తన చెల్లెలి పెళ్లి హఠాత్తుగా కుదిరిందట. ఎంత వీలయితే అంత డబ్బు సర్దమని రాశాడు.

అంతసేపూ అత్తవారి గురించే ఆలోచిస్తూ ఏవేవో సలహాలు ఇచ్చింది తాను భర్తకు. కానీ అది తన పుట్టింటి అవసరం.

అసలు విషయం దాచి తన చేత కమిట్ చేయించిన భర్త కన్నింగ్‌నెస్‌కి పీకదాకా కోపం వచ్చింది కాత్యాయినికి. విసురుగా భర్త దగ్గర కెళ్లి, "మీరు మాట్లాడుతున్నది మా చెల్లెలి పెళ్లి గురించని ముందే ఎందుకు చెప్పలేదు? " అంది విసురుగా.

రాజారావు నవ్వి, "ఆ విషయం నువ్వు అడ

గలేదుగా? " అన్నాడు.

"పాపం, మానాన్న... డబ్బు సమకూరక ఏమి అవస్థలు పడుతున్నాడో" అంటూ ఆమె ఇంకేదో అనబోతుంటే అందుకు అవకాశం ఇవ్వకుండా.

"సారీ డియర్! ఇంతక్రితమే సుప్రీంకోర్టు తీర్పు ఇచ్చేసింది. ఇక నో అప్పీల్" అంటూ టవల్ తీసుకుని బాత్‌రూంలో దూరేశాడ తను.

– తిరుమలశ్రీ

---

## కొత్త బట్టలు

ఆ రోజేదో హాలీడే కావడంతో తీరిగ్గా పేపరు చదువుకుంటూ కూర్చున్నాడు ప్రొఫెసర్ పరశురాం. లోపలి గదిలోంచి విసురుగా వచ్చింది ప్రొఫెసర్ భార్య అనంతం "అబ్బబ్బ ఈ మతిమరుపు మొగుడితో వేగలేక ఛస్తున్నా న్రాదేవుడా" అని విసుక్కుంటూ.

"ఏంటోయ్ ఆండాళ్లు... మరీ ఉదయాన్నే అలా చిర్రుబుర్రులాడుతున్నావ్" అలవాటు ప్రకారం అనంతాన్ని ఆండాళ్ళుగా మారుస్తూ అన్నాడు ప్రొఫెసర్ పరశురాం.

"బాగుంది. నేను విసుక్కోవడమే కన్పిస్తుంది కానీ తమరు చేసే పన్లు ఎవరికీ తెలియవు. పదిరోజులుగా పోరుతున్నానా పుట్టిన రోజు వస్తోంది కొత్తబట్టలు కుట్టించుకోవాలండీ బాబూ అని. ఎన్నిసార్లు మొత్తుకున్నా ఈ రోజుకి బట్టలు కొనలేదు. రేపటికల్లా ఏ టైలరు కుట్టిస్తాడండి..."

"ఇంతకీ పుట్టినరోజెవరిది కాంతం" పేపర్లోంచి తలెత్తి అడిగాడు ప్రొఫెసర్.

"సరిపోయింది. నేను కాంతాన్నికాదు అనంతాన్ని. ఎవరిదో అయితే నాకీ టెన్షన్ ఎందుకు. అక్షరాలా అయ్యావారిదే" అంది అనంతం.

"అయ్యావారా... ఆయనెవరోయ్" అమాయకంగా ముఖంపెట్టి అడిగాడు ప్రొఫెసరు పరశురాం.

"అయ్యో నా రాతా! ఆమాత్రం అర్థమయితే ఇంకేం. తమరిదే స్వామీ" విసుక్కుంటూ చెప్పింది అనంతం.

"స్వామీనా... అంటే... నా పేరు అది కాదనుకుంటానోయ్" బుర్రగోక్కుంటూ గొణిగాడు ప్రొఫెసరు పరశురాం.

"అమ్మగారూ... ఇయ్యాల్టికి ఈ వాదన తెగదుగాని, రేపు అయ్యగారి పుట్టిన రోజుకి కొత్తబట్టలు కావాలి. అంతే కదా! అయ్యగారి కొల్తలున్న చీటిని, డబ్బుల్ని నా ముఖాన కొట్టండి. రెడీమెడ్‌లో కొనుక్కొచ్చేస్తాను" అంటూ వంటగదిలోనుంచి చేతిలో గరిట ఊపుకుంటూ వచ్చాడు వంటవాడు బ్రహ్మానందం.

"సరే... నువ్వాపని చెయ్యరాబాబూ! ఉండు అయ్యగారి కొల్తలు ఆ డైరీలో ఎక్కడో ఉండాలి. కాగితంమీద రాసిస్తాను" అంటూ లోపలికి వెళ్ళి ఓ చీటిని, డబ్బులు తీసుకు వచ్చి బ్రహ్మానందానికి ఇచ్చింది అనంతం.

జోరుగా హుషారుగా ఈలవేసుకుంటూ బజారుకి పరిగెత్తాడు బ్రహ్మానందం జేబులో డబ్బులు కుక్కుకుంటూ.

బ్రహ్మానందం వెళ్లిన కాస్సేపటికి ఏదో అనుమానం వచ్చిన వాడిలా భార్యను పిలిచాడు "ఏమోయ్..." అంటూ.

"ఏమిటండీ. ఏం కావాలి" అంటూ వచ్చింది అనంతం.

"అవునోయ్... ఇంతకీ వీడికి బట్టలు సెలక్టుచెయ్యడం తెలుసునంటావా. లేక వంటలాగే తగలేస్తాడా..." తన మనసులోని అనుమానాన్ని వ్యక్తంచేశాడు ప్రొఫెసర్ పరశురాం.

"ఏమోమరి... మిమ్మల్ని తెచ్చుకోండీ అంటే విన్నారు కాదాయె. ఇప్పుడు వాడేం తెస్తాడో... ఏమో" అంటూ తనూ అనుమానంగానే సమాధానం ఇచ్చింది అనంతం.

"పోనీ ఓ పని చేస్తా. నేను వెళ్లి నా క్కావలసిన రంగులూ అవి చూసి ఓ మంచి సూటు తెచ్చుకుంటాను. వాడు తెచ్చిందాన్ని

రిటర్ను చేసేద్దాం" అన్నాడు ప్రొఫెసర్.

"ఈపని ముందే చేసివుంటే ఎంత బాగుం డేది. పోనిలెండి. ఇప్పటికయినా మించిపో యిందేంలేదు. వెళ్ళిరండి" అంటూ సాగనం పింది భర్తని అనంతం.

చీకటిపడుతున్నా వెళ్ళిన వాళ్ళలో ఏ ఒక్కరూ రాకపోవడంతో కంగారుపడుతూ ఎదురుచూస్తోంది అనంతం.

"ఈ మతిమరుపాయన ఇంటికి రాబోయి మరెవరింటికో పోయుంటారు. ఈ వంట వెధవకేమయింది యింకా రాకపోవడాన్కి. ఎప్పుడనగా వెళ్ళాడు. రానీ చెప్తాను వాడి

"బట్టలేవండీ" ఖాళీ చేతులూపుకుంటూ వచ్చిన భర్తని ప్రశ్నించింది అనంతం.

"బట్టలా... బట్టలేవిటీ?" వెర్రి ముఖం వేసుకొని అడిగాడు ప్రొఫెసర్.

"అయ్యో రాతా! అయిదు వేలూ పట్టుకెళ్ళా రుకదండి. సూటు కొనుక్కుంటానని..." ఆవే శపడుతూ అంది అనంతం.

"అవును కదూ. బజారులో దుకాణాలన్నీ వెతికానోయ్ బ్రహ్మానందంకోసం. ఏ షాపు లోనూ కన్పించలేదు వాడు. ఎక్కడికి పోయాడో ఏమిటో"

"వాణ్ణి వెతకడమెందుకండీ. నిక్షేపంలా ఓ




సంగతి" అనుకుంటూ రాత్రి వంటకి శ్రీకారం చుట్టడానికి వంట గదిలోకి వెళ్ళింది అనంతం.

ఎసట్లో బియ్యం పోస్తుండగా మోగింది కాలింగ్ బెల్. గబగబా వెళ్ళి వీధి తలుపు తెరిచింది అనంతం. దిగాలుపడిన ముఖంతో లోపలికొచ్చి సోఫాలో కూలబడ్డాడు ప్రొఫెసరు పరశురాం.

సూటు కొని తెచ్చుకొని రావచ్చుకదండీ!" అంది అనంతం.

"అందుకే కదోయ్ వాణ్ణి వెతికింది. నా కొలతలున్న కాగితం వాడికేకదా యిచ్చావ్ మరి" అన్నాడు ప్రొఫెసర్ పరశురాం విసుగ్గా.

"అయ్యో... నా మొగుడా!" దీర్ఘంతీస్తూ తల పట్టుకొంది అనంతం.

– సూరిపండు

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328. Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam:26060: Cuddapah:70011; Tadepalligudem:26881;Warangal:59933.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd. No. H/HD/965- RN1/32186/78

# పీతాంబరి స్వచ్ఛత ఎక్కడో భగవంతుడి నివాసం ఎప్పుడూ అక్కడే.








పరిపూర్ణ
ఉత్పాదన





మరవండి
అసంపూర్తి మాధ్యమాలను

# పీతాంబరి

షైనింగ్ పౌడర్

TRADE ENQUIRIES SOLICITED
FROM ALL OVER ANDHRA PRADESH

పీతాంబరి మార్కెంటిగ్ ప్రై.లి.
3వ ఫ్లోర్, హేమేంద్ర అపార్ట్‌మెంట్,
గోఖలే రోడ్, థాణే 400 602.
ఫోన్ : (022) 542 6646/5540
ఫేక్స్ : (022) 542 3846
Visit us at : www.pitambari.com